# ఉన్మేషము

నేటి మహబూబునగర మండలము (పాలమూరు) నందుఁ జేరినదియు, మహాపురాణప్రశస్తినిఁగని నవబ్రహ్మదేవాలయ విరాజితమై, శ్రీజోగుళాంబా బాల బ్రహ్మేశ్వర క్షేత్రదేవతలతోతుంగభద్రానదీతీరమున విరాజిల్లుచున్న అలంపురము (ఆలంపూర్, అల్పూర్, ఆలంపూర్‌గా వ్యవహరింపబడుచున్నది) రాజధానిగా కొంతకాలమును, అలంపురమునకు పశ్చిమదిశయందు రమారమి పదిమైళ్ళ దూరమునందున్న ప్రాగటూరు రాజధానిగా కొంతకాలమును క్రీ.శ. 16 వ శతాబ్ది ఆరంభమునుండి అలంపూరు పరగణాను, కొంతకాలము కర్నూలు ప్రాంతమును, అమరాబాద్ పరగణాయుక్తముగా పరిపాలించిన రెడ్డిరాజులు బిజ్జులవారు. గోలకొండ బిజాపూరు నవాబుల పక్షమున యుద్ధములలో పాల్గొని విజయములు సాధించిన బిజ్జుల పెద్దతిమ్మభూపాలునికి (గ్రంథకర్తకు పితామహుడు) "నాడగౌడు, దేశాయి, నాడకరణము" అధికారములను పైసీమలమీద నిచ్చి దేశముఖ్‌గా నవాబులు అంగీకరించిరి. అప్పటినుండి ఈ వంశమువారు ఆ ప్రాంతములకు ప్రభువులయిరి. అనర్ఘరాఘవకర్తయైన తిమ్మభూపాలుఁడు మహాదాతగా, మహాకవిగా ఖ్యాతినిసంపాదించెను. సంస్కృత రాజకవులయిన శ్రీహర్ష (హర్షవర్ధన), భోజ, శూద్రక, విశాఖదత్త, రాజానకరుయ్యక, కుంతక, వనపర్తి అష్టభాషాగోపాలరాయాదుల శ్రేణిలోను, ఆంధ్రరాజకవులయిన, నన్నెచోడ, భద్రభూపాల, గోకర్ణనృపాల, కృష్ణదేవరాయ, కట్టావరదరాజ రఘునాథరాయ, కదిరీపతి, రేచర్లమాధవరాయ, గద్వాలసోమభూపతి, మల్లారెడ్డి, శశువెపీరరాజాదుల వరుసలోను పరిగణింపఁదగినవాడు తిమ్మ భూపాలుఁడు.

తనవంశము వారి శౌర్యధైర్యములను వెల్లడించుటకై పీఠికాపద్యములందు వివర్ణింపఁబడిన వ్యక్తులకు ''గాయగోవాళ గేయాధిరాయ" ఖడ్గనారాయణ 'గండరాదిత్య' గండభేరుండ సంగరజయవిహారి' రాయవేశ్యాభుజంగ" మొదలయిన బిరుదములున్నట్లు తెలుపుచు, వారి గుణగణములను గ్గడించెను. తనవంశమువారును తానును మహాదాతయియుండుటను దెలుపుటకై

"బిజ్జులకృష్ణరాయధరణీవల్లభుకడనిల్చె దానలక్ష్మి, దాదనభూమిపాలుఁడు సధాతనరారెడు. నీవితీవకుం బాదన శ్రీకరఘన దానశాలి చెన్నక్షితిపున్ తనచూపు సుకవిసంతానంబుమీద సంతతము మాడలవసంతంబులాడ పాలితబుధాళి యాగ భూపాల మౌళి, తనధానదారయుదన్వంతునకు నిరంతరనూత్న కన్యా ప్రదాత్రిగాగ, అఖిలదేశ సమాగతయాచమాన వరమనోరథ సంపూర్తి వఱలఁజేసె" మొదలయిన రీతిగాఁబేర్కొని, తనకు "ఫాలనయనాస్తోకార్చనాలాలసా! దీపితాటోపబిజ్జుల తిమ్మభూప ధీరసల్లాప బిజ్జుల తిమ్మభూప మొదలయిన విశేషణములను, దాతృత్వమును వికిలిచెన్నభూపాలుని జయించుటయు, తురుష్క సేనాని సిద్దెంబరు గుఱ్ఱపు దళము నోడించుటయు మొదలగు శౌర్య ధైర్యదాతృత్వ భక్తివిశేషము లున్నట్లు చెప్పుకొనెను.

కృష్ణాతీరము నందున్న ప్రాగటూరు రాజధానిగాఁజేసికొని యున్న తిమ్మభూపాలుడు అచ్చటి రామేశ్వరస్వామికి భక్తుడై పూజించుచు, ప్రతి వర్షమునందును తిరుణాళ్లను, ఆజాతరసమయమున గొప్ప విద్వత్సభలను నిర్వహించుచు, కవి పండితులను సత్కరించుచుండెనని "నానా దేశ సమాగతుల్" అను పద్యము తెలుపుచున్నది. అంతేకాక అనర్ఘరాఘవరచనా కాలము నాటికి పుత్ర పౌత్రవిభవముగల్గి, శూరులైన కుమారులు గల్గి తీరిక గలవాడై యుండుటచేత నీప్రౌఢకావ్యమును రచింపగల్గుట తనకసాధ్యము కాదని తెలుపుకొనెను. తన పూర్వులు, తాను, తన కుమారులుసైతము వీరులై యుద్ధములందు పాల్గొని విజయములను సాధించిన వారగుట చేత తిమ్మభూపాలునికి "వీరరసము"నందెక్కువమక్కువయుండినట్లు "ఇష్టరసభవ్యంబైనకావ్యంబు నన్" మొదలయిన పద్యములు తెలుపుచున్నవి. కనుక జగదేకవీరుడైన శ్రీరామచంద్రుని యవక్ర పరాక్రమమును చిత్రించునట్టి మురారికవి యనర్ఘరాఘవ నాటకమును ఆంధ్రీకరించుటకు బూనెను. అడుగడుగునను వీరాద్భుత హాస్యరసముల నొలికించునట్లు ననువాదమును నిర్వహించెను. సత్కులీనుడై, సరసకవితా ధురంధరుడై వీరుడై, విద్వజ్జనారాధనమును బహుళభూదానాదుల చేత నిరంతరము గావించి, కలమును కత్తిని ఏకధాటిగా నడపిన బిజ్జుల తిమ్మభూపాలుని గురించియు, అతని కావ్యమును గురించియు విపులముగా నరయుదముగాక.

# సంస్కృత అనర్ఘరాఘవము
# మురారి మహాకవి

అనర్ఘః పూజ్యో రాఘవః యత్రవర్ణితః తత్ అనర్ఘరాఘవమ్

అను విగ్రహముచేత పూజ్యుఁడైన రాఘవుఁడు దేనియందు నాయకుఁడో అది అనర్ఘరాఘవం అని అర్థము.

"అమూల్యే దృశ్యతేఽనర్ఘస్తథా పూజ్యే సుదుర్లభే"

అని నిఘంటువు. ఇట్టి సమాస పదములు, "ప్రసన్నరాఘవమ్, ఉదాత్త రాఘవమ్, ఉన్మత్తరాఘవమ్'' అనునవి సంస్కృతమునఁగలవు.

సంస్కృత నాటక సాహిత్యమునందు మురారికవి రచించిన ఈ అనర్ఘ రాఘవ నాటకమునకు ఒక విశిష్టమైన స్థానము కలదు. ఇది మహాకవి వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణ కథ ఆధారముగా తీర్చి దిద్దబడిన ఏడంకముల సంస్కృత నాటకము. ఈ నాటకమునందలి రచనాపద్ధతిని, రసస్ఫూర్తిని, ప్రౌఢిని పురస్కరించుకొని గీర్వాణవాణియందు కృతపరిశ్రమమైన విద్వల్లోకము మురారికవికి "బాలవాల్మీకి'' యను బిరుదమును బహూకరించినది. దానిని మురారి అనర్ఘరాఘవనాటక ప్రస్తావనయందు నటవాక్యముగా "అస్యహిమౌద్గల్యానాం బ్రహ్మర్షిణా మన్వయమూర్ధన్యస్య మురారినామధేయస్య బాలవాల్మీకేః వాఙ్మయ మమృతబిందునిష్యంది కందలయతి కౌతుకం మే" అని నిబంధించెను. పరంపరాగతమై గ్రంథస్థమైయున్న యీ బిరుదమును విస్మరింపక, అనువాద కర్తయైన బిజ్జుల తిమ్మభూపాలుడు "బాలవాల్మీకి బిరుద శుంభన్మురారి నాటక మనర్ఘరాఘవనామకంబు దాని నాంధ్ర ప్రబంధంబుగా నొనర్చి, ఉదితసామగ్రి సమ్మదమూన్తు సభకు" అని యనర్ఘరాఘవ నాటక ప్రబంధమునందు పేర్కొనెను.

సంస్కృతానర్ఘరాఘవ నాటకమునందలి యుదారపదబంధ బంధురమైన భావ, పౌనఃపున్యముగా మనస్సునమెదలి సమ్మోదమును చేకూర్పఁగల భావ సమృద్ధి, నాటకీయ ప్రయోజనానుకూలముగ మలచుకోఁబడిన కథావస్తువు, ప్రౌఢ భావబంధురమైనను రసభావ భరితమైనశైలి మున్నగువాని యౌన్నత్యముచేత

సంస్కృత నాటకకర్తలలో మురారికి ఒక విశిష్టస్థానము లభించినది. మురారి, వేద, ధర్మశాస్త్ర, రాజనీతి, వ్యాకరణ, వైశేషిక, అలంకారాది శాస్త్రముల యందు సంపూర్ణ పాండిత్యముగల విద్వత్కవి.

ఉదాహరణముగా, వేదము : 1. "పరిణమయతి జ్యోతిర్వృత్త్యాయజూంషి" (అంకము 2) 2. గాయత్రీ ద్రుపదాదేవీ పాప్మానమపహంతుతే, పునంతు పావమాన్యస్త్వా మృధ్నోతు బ్రహ్మతే పరమ్" (అంకము 4)

శ్లో. "పరిణమయతి జ్యోతిర్వృత్త్యాయజూంషిరుచాంపతిః
కిమపి శమినఃసావిత్రాఖ్యం రహస్యముపాసతే,
గురు రయ మనుష్ఠాస్యన్మాధ్యందినీంసవనక్రియా
మిహమఖవిధౌ నేదీయాంసం భవంత మపేక్షతే"

(అనువాదము)

మ. "కమలాప్తుండు యజుర్వితాన మిపుడే కావించుఁదేజస్థితిన్
శమ సావిత్రమహోరహస్యము జపించం బూని రీ సంయముల్,
దమి మాధ్యందినమైన సత్సవనమున్ దాఁజేయు వాఁడై గురుం
డమరం గోరుచునున్నవాఁడు మిము నందాసన్నులై యుండగన్"

శ్లో. "గాయత్రీద్రుపదాదేవీ, పాప్మానమపహంతుతే,
పునంతుపావమాన్యస్త్వామృధ్నోతు బ్రహ్మతే పరమ్"

(అనువాదము)

కం. "ఓయనఘ! నీయఘంబున్
గాయత్రీదేవియడచు, నానామునిరా
డ్గేయములగు 'పవమానము'
లేయెడ నీ తపములకు సమృద్ధియొసంగున్"

(యాజ్ఞవల్క్యుడు పరశురాముని నాశీర్వదించుట యిది) ఇట్లే ధర్మశాస్త్రము వ్యాకరణము మొదలయిన విద్యలయందు మురారికవికిఁ గల పరిచయమును దెలుపు శ్లోకములున్నవి. వాని నన్నింటిని యథామూలముగా తిమ్మభూపాలుఁ డనువదించుట జరిగినది.

ఇతర భారతీయకవుల జీవితకాలము వలెనే మురారికవి జీవిత విశేష

కాలాది నిశ్చయము సంశయాత్మకమైయున్నది. అతడనర్ఘరాఘవ నాటకము నందుల్లేఖించిన వివరములను బట్టి మురారి మౌద్గల్యగోత్రుడనియు, తంతుమతీ వర్ధమానుల పుత్రుడనియుఁదెలియుచున్నది. భవభూతి నాటకముల ప్రభావ మీతని నాటకముపై విశేషముగాఁ గనఁబడును. కనుక మురారి భవభూతికి తరువాతివాడేయని చెప్పవచ్చును. క్రీ. శ. 855-884 లోనుండినవాడును, హరవిజయ కావ్యకర్తయునైన రత్నాకరకవి రచించిన ఒక శ్లోకమువలన మురారి రత్నాకరకవికంటే పూర్వుఁడై యుండెనని చెప్పవచ్చును. ఆ శ్లోకమిది. "అంకోత్థనాటక ఇవోత్తమ నాయకస్య నాశం కవిర్వ్యధితయస్య మురారి రిత్థమ్" మురారి లంకనుండి అయోధ్యకు తిరిగి వచ్చుచున్న రాముని వాక్కులుగా ఆయా నగర నదీ పర్వతముల వర్ణనలు చేయుచు, "మాహిష్మతీ" నగరమును పేర్కొనెను. "ఇయంచ కరచులి నరేంద్ర సాధారణాగ్రమహిషీ మాహిష్మతీ నామ చేది మండల ముండ మాలానగరీ.." మాహిష్మతిని పాలించిన కరచులివంశ రాజులు తొమ్మిదవశతాబ్ది మధ్యకాలమున మాహిష్మతిని విడిచి. 'త్రిపురీ', (రత్న పురా) అను నగరములను రాజధానులగా నేర్పరచుకొని యుండిరి. 'ఉదాత్తరాఘవ' రూపకకర్తయైన "అనంగహర్షుని"ను కరచులివంశ రాజునకు మురారి సమ కాలికుడై యుండినట్లు చరిత్రకారులు విశ్వసించుచున్నారు. అనంగహర్షుడు కుట్ట నీమత గ్రంథమునందు పేర్కొనఁబడియున్నాడు. పై విషయములన్నింటిని జక్కగాఁబరిశీలించినప్పుడు మహాకవి మురారి యెనిమిదవ శతాబ్ది చివరిభాగము నందును 9వ శతాబ్ది ప్రథమభాగమునందును (క్రీ. శ. 875-925) సజీవుఁడై యుండెనని యూహింపవలసి యున్నది. మురారి రచనలలో నతనికీర్తికి నుత్కృష్టమైన జయపతాకగా నిలిచినది ఒకేయొక యనర్ఘరాఘవనాటకము. ఇతర రచనలగురించి మనకేమియుఁదెలయదు. ఒక్క యనర్ఘరాఘవమువలననే మురారికిని, ఒక్క శిశుపాలవధ కావ్యమువలననే మాఘకవికిని, అసాధారణమైన లోకోత్తరకీర్తి లభించినది. మురారి కవిత్వము నర్థముచేసికొనఁగలుగుటకు మాఘకావ్యమును (మాఘకవి రచించిన శిశుపాలవధ కావ్యమును) చక్కగా నధ్యయనమును చేయవలసియుండునన్న సూక్తియొకటి బహుళప్రచారమున నున్నది.

శ్లో. "మురారి పదచింతా చేత్తదా మాఘే రతింకురు,
మురారి పదచింతా చేత్తదా మాఽఘే రతింకురు."

మురారికవి రచించిన అనర్ఘరాఘవనాటక మర్థము కావలయు నన్నచో మాఘకావ్యపఠమునందత్యంతాసక్తి కలిగి యుండవలయునని శ్లోకమునందలి పూర్వార్థమున కర్థము ("నవసర్గగతే మాఘే నవశబ్దో నవిద్యతే" మాఘ కావ్యమునందలి మొదటి తొమ్మిది సర్గలు చదివి కంఠస్థము చేసికొనినవానికి సంస్కృత వాఙ్మయమునందు క్రొత్తశబ్దముండదని మరియొక సూక్తి). విష్ణు పదమైన వైకుంఠప్రాప్తి కావలయునన్నచో, మాఘే(మా+అఘే) అఘమునందు అనగా పాపము నాచరించుటయందు రతిం=ప్రీతిని, మాకురు=చేయకుము. పాపములు చేయవలదని భావము లేదా మాఘే=స్నానదానాదులకు ముఖ్యమైన మాఘమాసమునందు "రతింకురు" ప్రీతిని పెంచుకొనుము. అని శ్లోకమునందలి యుత్తరార్థమున కర్థము. మహాకవిమురారి కవితావైభవమున కీ క్రిందిశ్లోకములు. దిక్ప్రదర్శనము కాఁగలుగును.

శ్లో. "క్రియాణాం రక్షాయై దశరథ ముపస్థాయ విముఖే
మునౌ విశ్వామిత్రే భగవతి గతే సంప్రతి గృహాన్
తపోలోకక్లేశా దుపశమిత విఘ్నప్రతిభయే
ప్రవృత్తే యజ్ఞేంవా రఘుకుల కథైవాస్తమయతే"

విశ్వామిత్రుడు వచ్చి తన యజ్ఞరక్షార్థమై శ్రీరాముని పంపవలసినదిగా కోరినప్పుడు రామచంద్రునిఁ బంపుటకు చిత్తమంగీకరింపకపోయినను రఘువంశ గౌరవమును, తమ దానశూరత్వమును విడువజాలని దశరథుఁడు వామదేవునితో నన్నవాక్య మిది, మహర్షి విశ్వామిత్రునియంతవాడు వచ్చి యాగరక్షార్థమై శ్రీరాముని బంపుమని కోరినప్పుడు నేను శ్రీరాముని బంపకుందునేని, విశ్వామిత్రుడు తిరిగివెళ్ళిపోయి, తన తపోరాశినుండి యొక అల్పాల్పమైన భాగముచేత యాగవిఘ్నములను దొలగింపజేసుకొని, యజ్ఞమును పూర్తి చేసుకొన్నచో నిక మా రఘుకుల కథయే, మా దానశూరతయే, మా కీర్తియే నశించును. అని తన యుదారతను వెల్లడించును. ఇందులో దశరథునిపాత్ర చక్కఁగా పోషింపఁ బడినది.

(దీనికి తిమ్మభూపాలుని యనువాదము)

మ. "క్రతురక్షార్థము గాధిసూనుఁడు ననున్ బ్రార్థించి, నాచే నుపే
క్షితుఁడై, క్రమ్మఱి, కించిదంచిత తపఃక్లేశ ప్రశాంతాధ్వర
ప్రతిరోధుండయి, తద్విధానమునకున్ బ్రారంభమున్ బూనినన్,
మతి నూహింపఁగ రాఘవాన్వయ కథానాశంబు సంధిల్లదే?"

శ్లో. "ఏక ద్వి ప్రభృతి క్రమేణ గణనా మేషామివాస్తం యతాం
కుర్వాణా సమకోచయ ద్దళశతా న్యంభోజ సంవర్తికా,
భూయోఽపి క్రమశః ప్రసారయతితాః సంప్రత్యమూనుద్యతః
సంఖ్యాతుం సకుతూహలేవ నలినీ భానోః సహస్రం కరాన్."

ఇది రెండవయంక ప్రారంభమున యజమాన శిష్యుఁడు నిద్రనుండి మేల్కాని చేసిన ప్రాతఃకాలవర్ణనము నందలిది. సహస్రదళ శోభితయైన కమలిని సూర్యాస్తమయ సమయమున అదృశ్యమగుచున్న సహస్రకిరణుని కిరణములను ఒకటి, రెండు, మూడు, అని లెక్కపెట్టుచున్నట్లు తన రేకులను వరుసగా ముడుచుకొని, మరల ప్రభాతమునం దుదయించు సూర్యకిరణములనదే క్రమమున లెక్కపెట్టుటకై తన రేకులను ఒకటి, రెండు, మూడు అనుచు విప్పి వికసించుచున్నట్లు కవి భావన. ఇది మనోహరమైన హేతుత్ప్రేక్షాలంకారము.

చం. "వననిధిఁ గ్రుంకు సౌరకరవర్గము నొక్కటి,రెండు,మూడు, నా
ల్గని, వరుసన్ గణించు క్రియ నబ్జదళంబులు వేయు మోడ్చి; త
త్పునరుదయక్రమంబుఁగనిపొంగుచుఁ గమ్మఁ బనెన్నఁబూనెనో
యన నవి విప్పుచున్నదపుడబ్జిని యారః! యథాక్రమంబునన్."

అని పైశ్లోకమునకనువాదము

శ్లో. "దాతవ్యేయ మవశ్య మేవ దుహితా కస్మైచిదేనామసౌ
దోర్లీలా మసృణీకృతత్రిభువనో లంకాపతి ర్యాచతే.
తత్కిం మూఢవదీక్షసే ? నను కథాగోష్ఠీషునః శాసతి
త్వద్వృత్తాని పరోక్షజాంసి మునయః ప్రాచ్యా మరీచ్యాదయః"

ఇది మూడవ యంకమునందలి 44 వ శ్లోకము. రావణాసురుని పక్షమున సీత నిమ్మని జనకుని వేడుటకై వచ్చిన రావణ. పురోహితుడగు శౌష్కలుని వచనము. జనకా ! ఈ కన్యను ఎవనికో యొకని కిచ్చుట నీకు తప్పనిదే యైనప్పుడు, రావణునితో సమానుడైన వీరుఁడెవడున్నాడు ? అతడు సీత నిమ్మని యాచించు చున్నాడు. మూఢుని వలె ఆలోచించెద వెందుకు ?

( తిమ్మ భూపాలుని అనువాదము )

ఉ. "ఈ వలయుం గుమారి నిపుడేవ్వరి కేనియు, నిట్టిచోఁ ద్రిలో
కీ విజయైకశాలుఁడడిగెం దశకంథరుఁ డందు కీయకో

కీవిధి నూరకుండఁదగవే ? తగవేది! భవచ్చరిత్ర ధా
త్రీవర ! సాత్త్వికంబని మరిచి ముఖుల్ వొగడన్ వినంబడున్"

రావణ పురోహితుడైన శౌష్కలునిదేయగు మరియొక వాక్యము,

శ్లో. "సమంతాదుత్తాలైః సురసహచరీ చామర మరు
త్తరంగై రుత్కీలద్భుజ పరిఘసౌరభ్యశుచినా,
స్వయం పౌలస్త్యేన త్రిభువనజితా చేతసికృతాం
అరేరామ ! త్వం మా జనకపతి పుత్రీ ముపయథాః"

బందీకృత సురసుందరీ చామరముల చేత దిశలకు వ్యాపింపఁజేయబడిన బాహు పరిమళముగల త్రిభువన విజేత రావణుఁడు, కోరి మనస్సులో పెట్టుకొన్న జనకరాజ పుత్రి సీతను, వివాహమాడుట నీకు శ్రేయోదర్కము కాదురా రామ! అన్నాడు శౌష్కలుఁడు.

( అనువాదము )

ఉ. "యామవతీచరాగణి, జితామర తామరసేక్షణామణీ
చామర వాతపోత వికసద్భుజమండల సార సౌరభో
ద్దామసుగంధ శేషలోక జయధాముఁ డెవంగదెయించు జానకీ
రామను, బెండ్లియాడకుమురా, మను నీతి మతిం దలంచినన్.'

మాల్యవంతుడు పంపిన సారణుడను రాక్షసుడు గూఢచారి వేషమున కిష్కింధకు వెళ్ళి, వానరరూపమును ధరించి, వానరుల రహస్యములను దెలిసికొనుచుండగా విభీషణుడు గ్రహించి, సారణుని బంధించి, శ్రీరాముని యొద్దికిఁ గొనిపోవును. శ్రీరాముఁడతనిని శిక్షించుటకు బదులుగా నితరవానర ప్రధానులకన్న నెక్కువగా గౌరవించి సత్కరించి పంపును. ఆ విషయమును లంకకుఁ దిరిగి వెళ్లి సారణుడు మాల్యవంతునితోఁ జెప్పినప్పుడు, మాల్యవంతుఁ డుత్తముల లక్షణములట్లే యుండును' అందును రాముడు విశిష్టవ్యక్తి యనుచు చేసిన ప్రశంస యిది.

శ్లో. అభేదేనోపాస్తే కుముద ముదరేవా స్థితవతో
విపక్షా దంభోజా దుపగతవతో వా మధులిహః
అపర్యాప్తః కోపి స్వపర పరిచర్యా పరిచయ
ప్రబంధః సాధూనా మయ మనభిసంధాన మధురః

(అంకము 6. శ్లోకము 6.)

( అనువాదము )

చం. "కుముద మభేదలీలఁ దన కుక్షిగతంబగు భృంగపంక్తులన్
విమతములైన పద్మముల పీడ్కొని వచ్చు శిలీముఖావళిన్,
సమముగఁ జూచువైఖరిని, సజ్జనుఁడున్ దనవారి, నన్యులన్
ప్రమదమునొందఁజేయు నిరుపాధిక సౌహృదవృత్తినెంతయున్'

ఈవిధముగా నెన్ని యుదాహరణములను చూపఁగలము! శ్లోకములందలి అర్థగౌరవము మాఘ భారవి కవుల వచో రీతులను స్ఫురింపఁజేయును. బంధగాఢతకు ప్రౌఢశైలికిని ఈ క్రింది శ్లోకమును మాత్రము తిలకింపుడు,

శ్లో. "కల్పాంతక్రూరసూరోత్థ రవికటముఖో మానుషద్వంద్వయుద్ధ
క్రీడా కండూయదూర్జస్వల సకలభుజాలోకభూయో విలక్షః
సంభూయోత్తిష్ఠమాన స్వపరబల మహో శస్త్రసంపాతభీమా
ముర్వీం గీర్వాణగోష్ఠీ గురుమదనికషో నైకషేయః పిధత్తే
( అంక. 6 శ్లో. 61 )

ఇది యుద్ధరంగమున పరాక్రమించుచున్న రావణుని వర్ణనము, దీనికి తిమ్మభూపాలుని అనువాదము,

మ. "ప్రళయార్క ప్రభ సన్నిభాస్యుఁడయిమర్త్యద్వంద్వయుద్ధకుతో
జ్జ్వలకండూతి భుజాగ్ర శేఖర భవద్దోలత్వ్యలక్ష్యాతుఁడై
యలఘుష్ఠామరగోష్ఠి గర్వనికషుం డాకైకసేయుండు భూ
స్థలి కాత్మారి బలాస్త్ర సంతతిఁ దిరోధానంబు! గల్పించెడిన్"
( నైకషేయుఁ డన్నను, కైకసేయుఁ నన్నను రావణుఁడే. )

ఇట్టి ప్రౌఢశైలితో రచింపఁబడిన సంస్కృతానర్ఘరాఘవనాటకమునందలి యితివృత్తము రామాయణగాథయే. వీరరస ప్రధానమగు నాటక మగుటచేతను, తత్ఘట్టములను రంగస్థలమునఁ బ్రదర్శించుటకు వీలులేకుండుటచేతను, నాటకీయ దృక్పథముతో కథాసంవిధానమునం దద్భుతరసము స్ఫురించి ముఖ్యరస

మగు వీరమునకు తోడ్పడునట్లు కొన్ని మార్పులను చేర్పులను సంతరించి, మూలకథకు విరుద్ధము కానియట్లు మహాకవి మురారి నాటకమునందుఁ గూర్చిన కథా సంవిధానము సంగ్రహముగా ఇది:

మహర్షి విశ్వామిత్రుని యాశ్రమమున యాగము జరుగవలసియున్నది. దానిని భగ్నపరుచుటకై ప్రయత్నించు రాక్షసులను భంజించి యాగమును గాపాడఁగలవాఁడు శ్రీరామచంద్రుఁడే యని యెఱిఁగిన విశ్వామిత్రుఁడు దశరథునివద్దికి వచ్చి రామలక్ష్మణులను యాగ సంరక్షణార్థమై తనవెంట పంపుమని కోరును. అట్లు కోరుటకు ముందు ఇక్ష్వాకువంశీయుల గొప్పఁదనమును, దశరథుని శౌర్యపరాక్రమాదులను విస్తారముగా ప్రశంసించును. దశరథుఁడు సైతము విశ్వామిత్రుని తపోమహత్వమును గొప్పగా ప్రశంసించును. దశరథునికి మనస్సున రామలక్ష్మణులను బంపుట కిష్టములేకున్నను, తమవంశ గౌరవమును, రఘువంశరాజుల దానశీలతను జ్ఞప్తికిఁ దెచ్చుకొని విశ్వామిత్రుని కోరికను త్రోసివేయలేక బాధపడుచునే రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంటఁ బంపును. వసిష్ఠమహర్షి తన శిష్యుఁడైన వామదేవుని ద్వారా రఘుకులకీర్తిని నిలువఁబెట్టుటకును, విశ్వామిత్రునియనుగ్రహమును వారు పొందుటకును రామలక్ష్మణులను బంపుటయే శ్రేయస్కరమని దశరథునికి జెప్పిపంపి, రామలక్ష్మణుల గమనమును సమర్థించును. (ఇది ప్రథమాంకకథ).

రామలక్ష్మణులు విశ్వామిత్రాశ్రమమును జేరి, యాశ్రమవాసులకు పరిచితులైరి. ఇచ్చటి అహల్యా శాపవిమోచన ఘట్టము హాస్యరసప్రధానము రాక్షసులను పారద్రోలి శ్రీరాముఁడు యాగసంరక్షణమును జేయును. ఒకనాటి సంధ్యాసమయమున రాక్షసులు మహోపద్రవమును గల్పింతురు. అప్పుడు మహర్షి విశ్వామిత్రుని యాజ్ఞచేత రాముడు ధనుష్పాణియై రాక్షసులను పారద్రోలి, వికటాట్టహాసముఁ జేయుచు, లోకాతీత వికృత రూపముతో నాశ్రమవాసులను భయపెట్టుచున్న తాటకను వధించును. కాని స్త్రీవధ చేసినందుకు చింతించును. విశ్వామిత్రుడు రాముని పరాక్రమమును, రఘువంశకీర్తిని విస్తారముగా కీర్తించును. (ఇదిద్వితీయాంక కథ).

ఆశ్రమము రాక్షసబాధా రహితమై యాగము నిర్విఘ్నముగా సమాప్తమైన పిమ్మట, రామలక్ష్మణులు తన మహోపదేశమును పొంది ధనుర్వేద రహస్యములందును. బలాతిబలాది విద్యలందును కృతశ్రములై యుండిరన్న

విషయమును గమనించి విశ్వామిత్రుడు వారిని మిథిలానగరమునకు దోడ్కొని పోవును. జనకుని యజ్ఞాదులకు రాక్షసులు గలిగించు విఘ్నములను రామ లక్ష్మణులద్వారా నివారింపఁజేయవలయునన్న భావముతో విశ్వామిత్రుఁడట్లు చేసెను.

అచ్చట జనకచక్రవర్తి సీతాస్వయంవరమును జరుపనిశ్చయించి దానికి కావలసిన ప్రయత్నములన్నిటినిఁ జేసియుండెను. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణ సహితుడై వచ్చిన వార్తను దెలిసికొని, వారినెదుర్కొని, సత్కరించి, రామలక్ష్మ ణులను జూచి మిక్కిలి సంతసించెను. జనక విశ్వామిత్రు లొకరినొకరు విశేష ముగా ప్రశంసించుకొందురు. ఆ సందర్భమున విశ్వామిత్రుఁడు జనకునికి రామ లక్ష్మణులను పరిచయము చేయును. జనకుడు రాముని సౌందర్య శౌర్యాదిగుణ ములచేత ముగ్ధుడైనను శివధనుర్భంగమును జేసినవానికే జానకి నీయనుంటినన్న తన ప్రతిజ్ఞను వివరించి విచారమును వెల్లడించును. విశ్వామిత్రుడు, "చింతింపక హరచాపమును జూపుము, రాముఁడు దానిని భగ్నము గావించు" నని జనకు నితో ననును. జనకుడట్లు చేయుటకు సిద్ధపడెను. ఇంతలో రావణపురోహితుఁ డైన శౌష్కలుఁడు అచ్చటికివచ్చి. రావణాసురుని గుణగణములను, పరాక్రమ విశేషములను విశేషముగా వర్ణించి, ''సీతను రావణాసురుని కిచ్చి పరిణయముఁ జేయుము. అతడు శివభక్తుఁడు గావున శివధనుస్సును విఱచుట కిష్టపడడు, అంతే కాని రావణుని బోలిన పరాక్రమవంతులు లేరు. ఆతనికి సీత నియ్యకపోవుట మూర్ఖతయే యని జనకునిఁ బ్రోత్సహించును. ఆతని రాయబారమును, రావణ ప్రశంసయు, ముగియకమునుపే శ్రీరాముఁడు చేసిన శివధనుర్భంగము, దాని ఫెళఫెళా ర్భటి దిగ్దిగంతములందు వ్యాపించును. అది చెవులారవిని, కన్నులార శివధనుర్భంగముఁ జూచిన రావణపురోహితుడగు శౌష్కలుఁడు మొగము చిన్న బుచ్చుకొని, వచ్చినదారిఁ బట్టి వెళ్ళిపోవును (ఇది తృతీయాంకకథ).

ఆ తరువాత సీతా కల్యాణ ప్రయత్నము మిథిలలో జరుగుచుండగా, దుష్టపరిపాలన సోదరపత్నీ గమనాదులను చేయుచు గర్వితుడై యున్న వాలిని వధింపఁ జేయుటకై శ్రీరామునిని కిష్కింధకు రప్పింపవలయు నన్న జాంబవంతుని ప్రయత్న మారంభమగును. లంకలో సీతాపహరణ ప్రయ త్నమునకు మార్గము వెదుకబడుచుండును. సీతాపహరణ ప్రయత్నమును గురించిన శూర్పణఖా మాల్యవంతుల కథోపకథనము ద్వారా కథనడచును. వాలి

వధార్థమై జాంబవంతుఁడు చేసిన తంత్రముద్వారా ఒక శబర స్త్రీ మంథరా వేషమును ధరించి మిథిలకు సమీపమునఁ బడిపోయి. రామవనవాసమునకుఁ దగిన పన్నుగడ పన్నుట జరిగిన సంగతిని, శూర్పణఖ మాల్యవంతునితోఁ జెప్పును. ఇంతలో శివధనుర్భంగవార్తను విన్న పరశురాముడు క్రుద్ధుఁడై మిథిలకు వచ్చును. రామ పరశురాముల సుదీర్ఘ వాదోపవాదములు జరిగిన పిమ్మట పరశురాముఁ డిచ్చిన వైష్ణవ ధనుస్సును "శ్రీరాముఁడెక్కు పెట్టగలుగుటవలన పరశురాముని సంశయము తీఱి రాము నాశీర్వదించి తనదారినిఁ దాను తపస్సు చేసికొనుటకై వెళ్ళిపోవును. సీతాకల్యాణ, పరశురామ విజయోత్సవములు వైభవముగా జరుపఁబడును. అప్పుడు అందరును విస్మయముఁ జెందునట్లు రామ వనవాస, భరత పట్టాభిషేకములను గోరుచు లిఖింపబడిన కైకేయిలేఖ మిథిలలో నున్న దశరథునికందును. ఈ లేఖ జాంబవంతుఁడు వాలివధార్థమై రాముని నరణ్యమునకు రప్పించు పన్నుగడ పన్నిన విషయమును రహస్యముగా గుర్తెఱిగిన మాల్యవంతుఁడు కల్పించినట్టిది. అందరును ఆ దుర్వార్తను విని చింతాక్రాంతు లగుదురు. లేఖార్థము నవగతముఁ జేసికొని పితృభక్తి పరాయణుఁడైన రాముఁడు దశరథాదులను ఓదార్చి దృఢనిశ్చయముతో సీతా లక్ష్మణ సమేతుఁడై యరణ్యమునకు వెళ్లును. (ఇది నాల్గవయంకకథ)

శ్రీరామ వనవాస సమయమున రావణాసురుఁడు భిక్షుక వేషమును ధరించి ఆశ్రమమునందు ప్రవేశించును. అప్పుడు రాముఁడాశ్రమమున లేడు. సీతాపహరణ, జటాయు మరణాదులు జరుగును. తరువాత రాముడావార్తనెఱిఁగి మిక్కిలి దుఃఖితుడై, సీతాన్వేషణ రూపమైన తనప్రయోజనము సిద్ధించుటకై వాలివధపూర్వకమైన సుగ్రీవ మైత్రిని సంపాదించును. గుహుడు రామలక్ష్మణులను వెంబడించియుండి సుగ్రీవ మైత్రికి తోడ్పడును (ఇది అయిదవ యంకము)

వాలి తనకుఁదగిన వీరుడు దొరికినందున యుద్ధముచేసి మరణించును. సుగ్రీవుఁడుసమాయత్తపరచిన వానర సేన సేతువును బంధించి లంకలో ప్రవేశించును. యుద్ధమునందు ఇంద్రజిత్తు, కుంభకర్ణుఁడును వధింపబడిన పిమ్మట క్రుద్ధుఁడైన రావణుఁడు స్వయముగా యుద్ధరంగమునఁ బ్రవేశించును. రామరావణ యుద్ధము మహాభీషణముగా జరుగును. ఈ యుద్ధమును రత్నచూడ, హేమాంగదులను విద్యాధరులు ఆకాశమునందుండి వర్ణింతురు. చివరికి శ్రీరామచంద్రుని చేతిలో రావణుడు నిహతుఁడై నేలపై గూలును. (ఇది యాఱవ యంకము)

అగ్నిపరీక్షానంతరము పవిత్రురాలైన సీతాదేవిని గ్రహించి పుష్పక విమానము నెక్కి శ్రీరాముఁడు సుగ్రీవుడు మొదలయిన వారందఱితో అయోధ్యకు బయలుదేరును. మార్గమునందలి యనేక నదీ పర్వత మహానగరములను గురించి ప్రసంగించుచు నయోధ్యకుఁజేరును. అయోధ్యలో వసిష్ఠాదులు ప్రతీక్షించుచుందురు శ్రీరాముఁడు చేరిన పిమ్మట రామునికి వైభవోపేతముగా పట్టాభిషేకము జరుగును. ఇట్లు అనర్ఘరాఘవము నందలి యితివృత్తము ప్రసిద్ధమైన రామాయణ కథమీదనే ఆధారపడియున్నది. కాని రంగస్థల ప్రయోగ యోగ్యములు కాని అహల్యాశాప విమోచన, సముద్రబంధన, వాలివధ, రామరావణయుద్ధ, పుష్పక విమానగమనాదులు, శూర్పణఖామాల్యవంతులు, విశ్వామిత్ర శిష్యులు, రత్నచూడ హేమాంగదులను గగనసంచార విద్యాధరులు, శుకసారణులను రావణానుచరులు భాషించు సంభాషణలవలనను, విష్కంభాదుల వలనను సూచింపఁబడినవి. భవభూతి మహాకవి విరచితమైన "మహావీరచరిత"మను నాటకమునందువలెనే రామవనవాస ప్రసక్తి మిథిలానగరమునందే తీసుకరాబడినది. మాల్యవంతుడును జాంబవంతుడును చేసిన మంత్రసమాలోచనమంతయు మురారి కల్పనయే. ఈ కల్పనమువలననే యితివృత్తము నాటకీయతను పొంది రసవత్తరమగుట జరిగినది. పరశురాముని సుదీర్ఘసంభాషణము కావ్య సౌష్ఠవమును, వీరరసపోషణమును గావించినది. ఇట్లు రామాయణగాథకు నాటకేతివృత్తత్వమును కల్పించి ప్రౌఢతమ రచనాశోభితముగాను, వీరరసప్రధానముగాను మహాకవి మురారి రచించెను. ఈ యనర్ఘరాఘవనాటకమును, మూలమునందలి ప్రౌఢిని, భావబంధురతను, చమత్కారమును చెడనీయక తెలుఁగునందు ప్రబంధనాటకముగా అనర్ఘరాఘవమహాకావ్యమును రచించి, యాంధ్రభాషాయోషను అపూర్వ రత్నాభరణముతో నలంకరించిన బిజ్జల తిమ్మ భూపాలుఁడు ప్రశంసనీయుఁడు.

# బిజ్జుల తిమ్మభూపాలుఁడు

ఈ రాజకవి క్రీ. శ. 17 వ శతాబ్దిలో ప్రాగటూరు రాజధానిగా అలంపూరు సీమను పాలించెను. ఈ వంశమువారికి "బిజ్జుల" యను పదము ఇంటి పేరుగా నేర్పడుటకుఁ దగిన కారణమును సూటిగాఁ జెప్పుట కష్టము అయినను ఈ క్రిందివిధముగా నూహించుటకు వీలున్నది. కాలచుర్య వంశీయుఁడైన బిజ్జల రాయఁడు పశ్చిమ చాళుక్యరాజైన తైలపదేవుని జయించి కళ్యాణి యందు తన విజయధ్వజమును స్థాపించెను. బసవేశ్వరుడు మంత్రిగా లభించిన పిమ్మట జైన మతమును వదలి తాను శైవమును స్వీకరించుటయే గాక దేశమునందంతటను బలాత్కారముగా శైవమతమును వ్యాపింపజేయుటకు ప్రయత్నించెను. బసవేశ్వరుడు లేవదీసిన యీ శైవమత విప్లవము వలన బిజ్జలుఁడు రాజధానియందు నిలువలేకపోయెను. అది కారణముగా కాలచుర్యులు పెక్కుస్థలములు తిరుగుటయే గాక అందినంతవరకు ప్రతి ప్రాంతమునందును శైవమును వ్యాపింపజేసి తమ యేలుబడి క్రిందికిఁ దీసుకొనుచుండిరి. అట్టి సందర్భమున అలంపూరు ప్రాంతమును వారి స్వాధీనమైనట్లు అచ్చటగల శాసనములు తెలుపుచున్నవి. అలంపూరు లోని సూర్యనారాయణస్వామి స్తంభముమీద బిజ్జలుని కుమారుడు భుజబల మల్లుని కాలమున ఒక వర్తకసంఘము చేసిన దానమును తెలుపునట్టి శాసన మున్నది. ఈ కారణమునుబట్టి బిజ్జలుని వంశీయిలే కాలక్రమముచేత బిజ్జులవారై యుందురు. లేదా బిజ్జలుఁడు వీరశైవ మతవ్యాప్తికి ముఖ్యుఁడగుటచేత కొందరు వీరశైవమునందలి భక్తిచేత అతనిపేరును తమ వంశ నామముగానే పెట్టుకొని యుందురు. మహాపురుషుల నామధేయములు వంశనామములుగా మారుట క్రొత్త విషయముగాదు. కనుక వీరశైవ మతాభిమానముతో అలంపూరు ప్రాంతములో నున్న రెడ్డి కులజులు 'బిజ్జల' పదమును గ్రహింపగా నది కాలక్రమమున 'బిజ్జుల' గా మారియుండవచ్చును. ఎట్లైనను ఈ వంశమువారికి కాలచుర్య సంబంధము దైహికముగాఁ గాకపోయినను. స్నేహ సంబంధముగానో భక్తి రూపముగానో ఉండియుండునని యూహింప వీలగుచున్నది.

కాలచుర్య చక్రవర్తి భుజబలమల్లుని కాలపు శాసనములు అలంపూరు ప్రాంతమున నున్నట్లు పరిశోధకులు తెలుపుటయు, బిజ్జులవారు పూర్వము శివ

భక్తులగుటయు, అలంపూరులో నున్న జంగమ మఠాధిపతులు బిజ్జలరాయని చిహ్నములుగల ఘంటా శంఖములను ధరించుచు, వాటికి సంస్కారముఁ జేయ వలసి వచ్చినప్పుడు ఈ వంశీయులచేతఁ జేయించుకొనుచుండుటయుఁ గారణ ములుగా 'బిజ్జుల' పదమును గురించి యిట్లు ఊహింపవలసి వచ్చినది.

ఈ వంశమునకు వన్నెలుదిద్ది వంశీయుల యౌదార్య శౌర్యములకు వెలుగును జూపినవాడు బిజ్జుల పెదతిమ్మభూపాలుడు. ఇతఁడు మన గ్రంథకర్తకు పితామ హుడు. తిమ్మభూపాలుఁడు తన వంశచరిత్రను జెప్పుకొనునప్పుడు వంశమునకు మూలపురుషుఁడుగా బేర్కొనబడినవాడు దాదభూపాలుడు. "ఈవి తీవకు పాదుగా వెలసిన దాదభూపాలునికి" త్యాగ పరాక్రమాది గుణములతో కోవిదుల మెప్పు గాంచిన కుప్పవిభుడు జనించెను. ఆ కుప్పభూపాలునికి మేరుసమానధీరుఁడైన యెఱగొండ నృపాలుడు, చెన్ననరపతియు జనించిరి. వారిలో ఆశ్రితాదరణశాలి యైన చెన్నభూపాల మౌళికి వెన్నూళ్ళ గోత్రమును బవిత్రము గావించిన చిన తిమ్మరాజుదయించెను. ఆ చినతిమ్మేంద్రునికి విష్ణుభుజములవలె సద్గుణాలంకారు లైన అప్పనృప, రంగనరేంద్ర, కొండభూపాల, కృష్ణనరపాలురను నలుగురు కుమారు లుదయించిరి. వీరిలో కొండభూపాలుఁడు మిక్కిలి పరాక్రమవంతుడు ఈ యంశమును "గాయగోవాళ గేయాధిరాయ బిరుద, మండనుండు భయంకర ఖండనుండు, భవ్యగుణశాలి కొండభూపాలమౌళి" అను అనర్ఘ రాఘవ పద్య భాగము వెల్లడించుచున్నది.

ఈ కొండభూపాలుఁడు అసమాన పరాక్రమవంతుడైనట్లు అనర్ఘ రాఘ వము పేర్కొన్న 'గండరాదిత్యుఁడు' 'గండభేరుండుఁడు' 'ఖడ్గనారాయణాంకన ధురీణుడు' 'గాయగోవాళ గేయాధిరాయఁడు' అను బిరుదములు తెలుపుచున్నవి. బిజాపుర నవాబుల యనుమతిచేత అలంపూరు కర్నూలు మండలములకు ఈ వంశము వారధిపతులుగా నుండుటచేత నేటికిని కర్నూలు నగరమునఁ గల 'కొండారెడ్డి బుఱుజు' ఈ కొండభూపాలునికి సంబంధించినదే యైయుండునని యూహింపబడుచున్నది.

ఈ కొండభూపాలునికి గోపమ్మ, బక్కమ్మ, రంగమ్మ యను ముగ్గురు భార్యలు. వారిలో గోపమ్మవలన అప్పనరపతి. రామనృపాలుఁడు జనించిరి. ఈ యిద్దరిలో సద్గుణ ధురీణుడైన బిజ్జుల రామవిభునికి యాగప్రభు వుదయిం

చెను. ఈ యాగభూపాలుడు నిరుపమాన శౌర్య ధైర్యాదిగుణములు గలిగియుండె. నని అనర్ఘ రాఘవము "విపుల జయపేటి యెవ్వాని విజయధాటి, యట్టి బలు మేటి సంభృతజ్యావధూటి, తతయశశ్శాటి యాగభూధవ కిరీటి, నెనయఁ జాలునె యీనాటి నృపతికోటి" అను పద్యమునఁ దెలుపుచున్నది. ఇతని పితామహుడైన పెదకొండ భూపాలునికి బక్కమయందు కృష్ణనృపాలుడును. రంగమాంబయందు తిమ్మన, వెంగన లుదయించిరి. వెంగనృపాలుడు లచ్చమాంబ వలన జగ్గనృపతిని తిమ్మాంబికవలన రామనృపతిని గాంచెను. ఇట్లు వెనుకటి కుప్పభూపాలుని రెండవ కుమారుడైన చెన్నభూపతి వంశము తామరతంపముగా విస్తరిల్లెను.

ఇక కుప్ప నరపతి పెద్దకుమారుడైన ఎఱగొండ భూపాలుఁడు సంగర జయవిహారియై అసమానమైన కీర్తినిఁబడసెను. ఆయెఱగొండ భూపాలుఁడు పెదమాచమాంబికయందు విబుధగణ్యుడు, విస్ఫురితపుణ్యుఁడునగు పెదతిమ్మ నృపవరేణ్యునిగాంచెను. ఈ వంశీయులలో ఈ పెదతిమ్మనృపాలుడు చారిత్రిక పురుషుడుగాఁ జెప్పఁదగినవాఁడు ఇతనికి బిజాపుర నవాబు మన్నన యధికముగా నుండెను. హిజిరీ 1073 వ సంవత్సరంలో (క్రీ. శ. 1658) బిజాపూరుకు సంబంధించిన హైదర్ అలీ అనువానిచేత అలంపూరు పరగణాలోని శేరీలు తిమ్మారెడ్డి జమీందారుకు ఇయ్యబడినట్లు ఈ వంశము వారివద్దనున్న రికార్డ్సు వలన తెలియుచున్నది. ఇట్లు తిమ్మారెడ్డికి లభించుటకు కారణము "As Inam on account of his Services in the war with the Bedurs in which he lost his brothers" అని, ఆంగ్ల పరిపాలనము వచ్చినపిమ్మట రాయచూరు జిల్లా డిప్యూటీ కమీషనర్ E.D.R.D. శ్రీ G.F. Hampton, Major 14-11-1854 వ తేదీన యిచ్చిన రిపోర్టులో ధృవీకరింపబడినది, ఇతడలంపూరు రాజధానిగా కొంత భూభాగమును పరిపాలించినట్లును అనర్ఘరాఘవములోని ఈ క్రింది పద్యము తెలుపుచున్నది.

సీ. "కమనీయ దక్షిణ కాశికా క్షేత్రంబు
రహిమించ నెవ్వని రాజధాని
తుంగాఖ్యగంగా తరంగ రంగన్మౌళి
బ్రహ్మేశుఁడెవ్వని పాలివేల్పు

పాదుశాదత్త కుంభద్దంతి హయముఖ్య
వస్తులెవ్వనియింట విస్తరిల్లు
ధరవంతుకెక్కు కందనవోలి దేశంబు
గణుతింప నెవ్వని కాణయాచి
సీ॥ సిరులనొప్పు నలంపూరి సీమకెల్ల
"నాడగౌడును దేశాయి నాడకరణ"
మనెడు విఖ్యాతి యెవ్వానికలరె నతఁడు
వొల్చె బిజ్జల పెదతిమ్మ భూవిభుండు."

ఇతనికి "గండభేరుండ, రాయవేశ్యాభుజంగ" బిరుదములు నయితముగలవు. విజయనగరసామ్రాజ్య పతనము జరిగిన తదుపరి బీజాపురపాదుషా కర్నూలు, బళ్లారి జిల్లాలోని కొన్ని ముఖ్యప్రాంతములు ఆక్రమించి పరిపాలించుచుండెను. ఆదండయాత్రలలో బిజాపురనవాబు అభిమానమును సంపాదించియుండుటచేత బిజ్జల పెదతిమ్మభూపాలుడు అలంపూరు, కందనోలి (కర్నూలు సీమలకు సర్‌నాడగౌడు, సర్‌దేశాయి పదవులను సంపాదించి, పాలకుడుగా నుండెను. బిజాపురరాజ్యము క్రీ.శ. 1686 లో మొగలాయి చక్రవర్తుల శౌర్యప్రవాహములో కలసిపోవునంతవరకును వీరు పాలకులుగానే యుండిరి. మొగలాయి చక్రవర్తి పంపిన గయాసుద్దీన్‌ఖాన్ కర్నూలును ఆక్రమించిన పిమ్మటగూడ వీరికి కర్నూలు అలంపూరుపరగణాలపై సర్‌నాడగౌడు, సర్‌దేశాయి బిరుదములతో అధికారముండెను. పెదతిమ్మ భూపాలుని తరువాత ఐదుతరములవరకును ఈ బిరుదములుండినవి. ఇట్లు బిజ్జలవంశమున కసమానకీర్తిని చేకూర్చిన వారిలో పెద్దతిమ్మభూపాలుడు అగ్రగణ్యుఁడని చెప్పదగియున్నది.

పెద తిమ్మభూపాలుడు కామమాంబయను ధర్మపత్నియందు కృష్ణభూపాలుఁడను కుమారునిఁగనెను. ఆబిజ్జల కృష్ణనృపతి అసమానయశశ్శాలియై అవక్రపరాక్రముఁడై నిరంతరదానధురీణుఁడై వెలసెను. అనఘుఁడైన యాబిజ్జల కృష్ణరాయఁడు జనుపల్లి వెంకటరాజు కూతురైన బచ్చమాంబను వరించెను. ఈ జనుపల్లి వెంకటరాజు వనపర్తి సంస్థానరాజులలో గ్రంథకర్తగా ప్రసిద్ధిని గాంచిన అష్టభాషా గోపాలరాయని జనకుఁడు. సత్కులీనులు సద్గుణవంతులు నైన కృష్ణరాయ బచ్చమాంబలకు అనర్ఘరాఘవకర్తయైన తిమ్మభూపాలుడు ఉదయించెను.

ఆంధ్రవాఙ్మయమునకు అపారమైన సేవఁజేసియు, అసాధారణమైన అనర్ఘరాఘవమును రచించియు, అనేక కవిపండితులకగ్రహారాది దానము లొసగియు శత్రువిజయములు గావించియు నీ బిజ్జుల తిమ్మక్షితిపాలుడు కూర్చిన యశస్సంపద యీవంశమున కపారముగా లభించినది. ఇతఁడు వికిలి చెన్న భూపాలుని జయించినట్లు అనర్ఘరాఘవము చెప్పుచున్నది. ఈ వికిలి చెన్నక్షమాపాలుఁడు విజయనగరరాజుల పక్షమున బిజాపూర్ నవాబులతో పోరాటము సల్పినవారిలో నొకడై యుండును. తిమ్మభూపాలుఁడు చింతకుంట ధర్మరాజేంద్రుకూతురైన అక్కమాంబను మొదట వరించెను. పౌరమాంబను ద్వితీయ కళత్రమునుగా స్వీకరించెను. ఈ చింతకుంట ధర్మరాజెవ్వరో సరిగా తెలియుట లేదు. జనుపల్లివారైన గోపాలుపేట సంస్థానపతుల పాలనముక్రింద నొక చింతకుంట కలదు. రాజా దేవరావు అనునతఁడు పానుగల్లు ఖిల్లామీద నుండినట్లు ఆకాలపు దానపత్రములు తెలుపుచున్నవి. అతని బంధువులలో నెవ్వరైన యీ చింతకుంటలో నుండిరేమో! చింతకుంటకు పానుగల్లు నాలుగైదుమైళ్ళ దూరము మాత్రమే. చింతకుంటలో ఒక శిథిలమైన బురుజు, కోట, పేట యను విభాగములు ఉండుటచేత తిమ్మభూపాలునికి సమకాలికుడై జనుపల్లి వారికి దగ్గరిబంధువై ధర్మరాజను పేరుగల ఒకచిన్న భూపతియుండెనేమో! ఇంతకన్నను ఈ చింతకుంట ధర్మరాజును గురించి తెలియవచ్చుటలేదు. అతని కూతురైన అక్కమాంబను గురించి మాత్రము అనర్ఘరాఘవము గొప్పగాచెప్పుచున్నది. పతివ్రతారత్నమైన ఆ యక్కమాంబయందుఁగన్న జ్యేష్ఠపుత్రునికి ధర్మభూవరుడనియే నామకరణము చేయుటచేత తిమ్మభూపాలునికి అక్కమాంబయందును ఆమె తండ్రియందునుగల యాదరగౌరవములు వెల్లడియగుచున్నవి. అక్కాంబయందుగన్న రెండవ కుమారునికి తన వంశీయులలో నుత్కృష్టనామమైన కోదన్నృపాలుడను పేరును బెట్టెను.

తిమ్మభూపాలుని ప్రథమపుత్రుడైన యీ ధర్మభూపాలుఁడు విద్యావిక్రమ దానకళా ధురంధరుడై యుండెననియు నతనికీర్తి దిగంతముల వ్యాపించెననియు నీ క్రింది పద్యము తెలుపుచున్నది.

సీ. "సింధుదేశమున కే శ్రీఘను దానాంబు
　　　తతి బహుజీవనస్థితి యొనర్చు
కాశ్మీరమున కే జగత్పతి భాషాళి
　　　ముఖ్యంబు మేదురామోద మొసగు

సౌరాష్ట్రమునకు నే సవరసూత్రప్రౌఢి
యరయ శోభాస్పదస్ఫురణ గూర్చు
కరహాటమునకునే వరరుచి తేజంబు
మేలిమిదులకించు డాలు నిల్పు

గీ. మత్స్యమున కేరసాధీశు మహితధామ
మమల కమలాప్తి ఘటియించి యలరఁజేయు
నతఁడు సామాన్యుఁడే బిజ్జలాన్వయాబ్ధి
పూర్ణిమాజ్జారి శ్రీధర్మభూపశౌరి."

ఇట్లు వర్ణించుటకు కారణము ఈ రాజు దక్కన్ సుల్తానుల పక్షమున మొగలాయిచక్రవర్తుల దండయాత్రల నెదుర్కొన్నవారితోఁ జేరియుండుటయే కానోపును. ధర్మభూపాలుఁడు సద్గుణ కదంబమైన శేషమాంబను వివాహ మాడెను. ఆ యనన్యపతిభక్తి విరాజితయైన శేషమాంబ వలన ధర్మభూపాలునికి వేంకటరమణుఁడను కుమారు డుదయించెను.

ధర్మనరపతి తమ్ముడైన యిమ్మడికొండ భూపాలుడును అసమానశౌర్య దురంధరుఁడే. అతఁడు సీతమాంబ, కృష్ణమాంబ యను కన్యారత్నములను వివాహమాడెను.

ఇక తిమ్మభూపాలుని రెండవభార్యయైన పౌరమాంబయందు నరసింహ నరపతి, కృష్ణభూవిభుడు, బచ్చభూపతి ఉదయించిరి. వీరుముగ్గురును సహసౌదార్య శౌర్యోపేతులే. నరసింహనరపతి పెక్కు యుద్ధములలో పాల్గొన్నట్లును, పెక్కండ్రకు ఆశ్రయ మిచ్చినట్లును అనర్ఘరాఘవములోని యీక్రింది పద్యము తెలుపుచున్నది.

సీ॥ "గడగడవడకి నల్గడలఁబాఱు తురుష్క
వాహినీచ్ఛట డాఁగ వనధియయ్యె
పోఁగాళ్లు లేక బల్ బుసకొట్టి పడు పార
సీకాహితతికి వల్మీకమయ్యె
వెఱ నిజపక్షంబు లఱఁబోవు పాశ్చాత్య
కౌశికాళికి నంధకార మయ్యె

భువి దిగంబరు లైన యవనయోగుల కాయ
ములు నిండగా భూతిపూఁత యయ్యె
గీ॥ ననుచు నానావజీరు లెవ్వని మహోగ్ర
చటుల ధాటీ నిరాఘాట పటు తురంగ
ఖుర సముద్ధూత ధూళిఁ జేర్కొనుచు నుందు
రతఁడు సామాన్యుఁడే నృసింహప్రభుండు"

ఇది విజయనగరమువారికిని దక్కను సుల్తానులకును, మోగలాయిసేనలతో దక్కన్ వారికిని జరుగుచుండిన యుద్ధములలో నాయా దేశపు భటులకు శరణమైయుండి ఈ నరసింహారెడ్డి వజీరుల మెప్పునఁ బొందయుండుటను సూచించుచున్నది.

ఆ నరస భూపాలుఁడు మానవతీలలామయైన చెన్నమ్మను వరించెను. అతని తమ్ముఁడయిన కృష్ణనృపతియు అవక్ర పరాక్రముఁడే. అతఁడు లక్కమాంబ తిమ్మాంబ లనువారిలను సతీమణులనుగా స్వీకరించెను. మూడవవాడైన ఐచ్చభూపాలుఁడు అన్నలకు దీసిపోని సన్నుత గుణబంధురుఁడు. ఈ విధముగా బిజ్జుల తిమ్మభూపాలుని పుత్ర పంచకము అసమానతేజోవిరాజితమై విలసిల్లెను. కనుక అనర్ఘరాఘవమును విరచించు నాటికి తిమ్మభూపాలుడు వృద్ధుడై పుత్రపౌత్ర విభవముతో గూడి భాషాసేవయందు దినములు గడుపుటకు అవకాశము చిక్కెను.

ఇక ఈ వంశమువారు క్రిందటి నళ సంవత్సర చైత్రశుద్ధ షష్ఠీనాడు అనగా ఇంచుమించు క్రీ. శ. 1౮౫౬ మార్చి మాసమున వ్రాయించిన కైఫీయతు వలన కొన్ని యంశములు తెలియుచున్నవి. ఈ కైఫీయతు బిజ్జుల నారసింహారెడ్డి నందుకొని వ్రాయుటకు ప్రారంభించినది. ఈ నారసింహారెడ్డి అనర్ఘరాఘకర్త యగు తిమ్మభూపాలుని కుమారుడైన నరసభూపాలుడుకాడు. ఇతడు తిమ్మభూపాలుని కైదవతరము తరువాతివాడైనట్లు మిత్రులు శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు తమ "అలంపూరు శిథిలములు" అనుగ్రంథమున బేర్కొన్నారు. ఈ నరసింహారెడ్డి కుమారుడైన కొండారెడ్డికి అలంపూరు వతన్, అమరాబాదు వతన్‌లు అనుభవములో నుండెను. కొండారెడ్డి గతించిన పిమ్మట నితనిభార్యయగు లక్ష్మీదేవమ్మకును నరసింహారెడ్డి భార్యయగు వెంకమ్మకును (ఈ వెంకమ్మ లక్ష్మీదేవమ్మకు అత్తగారు). మనస్పర్థలు కలిగి కలహము జరిగెను. తత్ఫలితముగా సర్కారువారి యాజ్ఞచొప్పున వచ్చిన జాఫరాబాద్ మహమ్మద్‌ఖాను నరసింహా

రెడ్డి భార్యయైన వెంకమ్మకు అలంపూరు శేరీభూములు, కరోగ్గికిసుంకం, క్యాతూరుశేరీ, మారా మునగాలజాగీరు మాత్రమిచ్చి మిగిలిన జాగీర్లు, దేశము ఖీరుసుంపగైరాలు ఋణము క్రిందికని తానే స్వీకరించెను. అతని పాలనములోనే తాలూకా జాగీరు జరుగుచుండెను. పిమ్మట సర్కారువారు జోక్యము చేసుకొన్న ఫలితముగా అమీనుసాహెబు అరబ్ జమాదారుగార్లు లక్ష్మీదేవమ్మను వెంట బెట్టుకొనివచ్చి వెంకమ్మగారి యనుభవములోనున్నదికాక పల్లెపాడు జాగీరును భీమవరం శేరీని కలిపి వెంకమ్మ లక్ష్మిదేవమ్మగార్లకు చెరిసగముగా పంచి యిచ్చిరి. వెంకమ్మగారు మారామునగాలలోను, లక్ష్మిదేవమ్మగారు ప్రాగటూరులోను ఉండి తమ భాగముల ననుభవించుచుండిరి. లక్ష్మిదేవమ్మగారు గోపాలుపేట జమీందారుడైన రాజా దేపరావు సమక్షంలో జ్ఞాతియైన రామారెడ్డి కుమారుని దత్తునిగాఁ దెచ్చుకొని ఆ పిల్లవానికి తమ యావదాస్తిని అరబ్ జమేదారుసాహెబ్‌తో సనదు చేయించియిచ్చెను. నరసింహారెడ్డి అనుపేరుగల ఆ దత్త పుత్రుఁడు ఆస్తి యంతటికిని అధిపతియై లక్ష్మిదేవమ్మగారి పోషణలో నుండెను. లక్ష్మిదేవమ్మ జ్ఞాతివైరాదుల వలన, టోఅవెల్లికి చేరి మరణించిన పిమ్మట మారంరంగయ్య తన పెద్దకూతురు చిన్నమ్మనిచ్చి నరసింహారెడ్డికి వివాహమును జేసి సంస్థానమునకు సంబంధించిన సర్వవిషయములను విచారించుచుండెను.

జ్ఞాతివైరము, కలహములు, అనారోగ్యము కారణములుగా బిజ్జల నరసింహారెడ్డి మరణించెను.

తరువాత ఖర్చులు మొదలయినవి అధికమగుటవల్ల మారం రంగయ్య సిబ్బందిని తగ్గించెను. రాణీ చిన్నమ్మ రుద్రమదేవి, ఝాన్సీలక్ష్మిబాయివంటి సాహసవంతురాలు జ్ఞాతులు, జ్ఞాతుల పక్షమును వహించిన ఇతర సంస్థానాధిపతులు, ఆసఫ్‌జాహీల సనదులను మోసముతో పొందిన మహమ్మదీయ జాగీర్‌దారులు పెట్టిన కష్టములకు తట్టుకొని, చివరికి ప్రాణహాని కలుగునన్న భయమున పఠాన్‌స్త్రీ వేషమును ధరించి ప్రాగటూరు నుండి అప్పటి కర్నూలునవాబు వద్దకి పారిపోయెను. అతడు మీ వతన్ మీకు సాధించి యిచ్చెదనని అభయమిచ్చి కర్నూలుకు సమీపమున తుంగభద్రానది యుత్తరపుటొడ్డునగల తాండ్రపాడు గ్రామమున సపరివారముగా చిన్నమ్మను నివసింపుమని చెప్పెను.

సహాయము చేయనున్న కర్నూలునవాబును దురదృష్టవశమున ఇంగ్లీషువారి పోలీసులు పట్టుకొని పోయి కర్నూలు పరగణాను వారి స్వాధీనము చేసికొనిరి. తరువాత చిన్నమ్మగారు శత్రువులిచ్చట నున్నచో చంపుదురని భయపడి

గద్వాల సంస్థానములో చేరిన అయిజసోంపురం అను గ్రామముచే రి అగ్రహారీకులైన గోపాలకృష్ణాచార్యుల వారి ఆదరణలో నుండెను. గోపాలకృష్ణాచార్యులవారు రాజాచందూలాల్ బహద్దరు గారి గురువు లగుటచేత చందూలాల్ గారి దగ్గర వ్యవహారమును నడిపించిరి.

చందూలాల్ విచారణ చేయించి ముఖ్యవారసులని తెలుసుకొని సన్ 1245 వ హిజిరీలో చిన్నమ్మగారి పేరున అలంపూరు తాలూకా దేశముఖీవతను, మరియు అమరాబాద తాలూకా దేశముఖీవతన్ మొత్తము కలిపి సనదునిచ్చెను. దీనిని ఆంగ్ల పాలకులు ధ్రువీకరించినారు. అప్పటికి చిన్నమ్మగారికి తమవతన్‌తో సంబంధములేక పండ్రెండుసంవత్సరములు గడచియుండెను.

ఈ మధ్యకాలమున అలంపూరు తాలూకా జహగీరుదార్లనుండి విడుదలయై సర్కారుస్వాధీనమైపోయినది. చందూలాల్ దగ్గరినుండి సనదును సంపాదించి యిచ్చిన గోపాలకృష్ణాచార్యులవారు చిన్నమ్మకు వతను స్వాధీనము కాకముందే దురదృష్టవశమున స్వర్గస్థులైరి. ఫలితముగా చిన్నమ్మకు పల్లెపాడు గ్రామము మరికొన్ని శేరీభూములు మాత్రమే దక్కెను.

తరువాత జటప్రోలు సంస్థానములోని చిన్నమరూరు గ్రామమునుండి సగోత్రుడైన ఒక పిల్లవానిని రాజాలక్ష్మారావు గారి ద్వారా తీసుకొని, గద్వాల యిలాకా బోరవెల్లిగ్రామమున దత్తస్వీకారము చేసుకొని ఆ పిల్లవానికి వెంకట ధర్మారెడ్డి అని నామకరణము చేసెను.

తరువాత ప్రభుత్వములో వచ్చిన మార్పులు వీరి ప్రయత్నదౌర్బల్యము కారణములుకాగా పోయిన సంస్థానము మళ్ళీ లభించలేదు. చిన్నమ్మ దత్తపుత్రుని స్వీకరించినపిమ్మటకూడ జ్ఞాతుల బాధకు తట్టుకొనలేక జటప్రోలు సంస్థానమువారి రక్షణలో పదునైదు వత్సరములుండ వలసివచ్చెను. చిన్నమ్మ రాణి పల్లెపాడు గ్రామమునందు మంచి గృహమును నిర్మించి వెంకట ధర్మారెడ్డికి వివాహముజేసి యంతటితో తృప్తిని పొందెను. వెంకట ధర్మారెడ్డి మిక్కిలి ధర్మాత్ముడు. పల్లెపాడు జాగీరును క్యాతూరు మారామునగాల గ్రామములందలి శేరీలను అనుభవించుచుండెను.

శ్రీ వెంకట ధర్మారెడ్డి కిద్దఱు పుత్రులు. నరసింహారెడ్డి, అనంతారెడ్డి. నరసింహారెడ్డి విద్యావినయ సౌశీల్యములు గల గొప్ప గుణవంతుడు.

నరసింహారెడ్డిగారికి ప్రథమ వివాహము బాబాసాహెబుపేట చెన్నకృష్ణారెడ్డిగారి పుత్రిక సీతమ్మతో జరిగెను. (ఈ చెన్నకృష్ణారెడ్డి వనపర్తి రాణి శంకరమ్మ గారికి సోదరుడు. ప్రస్తుతం హైదరాబాదు నగరమున నున్న ఎన్. ఎన్. రెడ్డి గారికి జనకులు.) నరసింహారెడ్డిగారు పల్లెపాడు గ్రామమున చెరువులు వేయించియు, ఉద్యానవనముల నిర్మించియు, ఫలవృక్షాదులను పెంచియు, దేవస్థానము, నిర్మించియు వంశీయులకు గౌరవమును, ప్రజలకు సౌకర్యమును జేకూర్చెను, దానధర్మములుచేసి కీర్తిని గడించెను. బ్రాహ్మణ కుటుంబముల నాదరించెను. సాధు సజ్జనులకు సత్కారములను జేసెను. నరసింహారెడ్డికి సీతమ్మ గర్భఫలముగా శ్రీ చంద్రశేఖరరెడ్డిగారుదయించిరి.

చంద్రశేఖరరెడ్డిగారు ఆంధ్రము, ఆంగ్లము, ఉర్దునునేర్చి న్యాయశాస్త్రము నెఱిగిన విద్యావంతులు. హైదరాబాదు మున్నగు ప్రదేశములలో వీరి విద్యాకృషి జరిగెను. వనపర్తి సంస్థానములో బహుకాలము మునిసిఫ్‌గానున్న లక్ష్మీకాంత రెడ్డిగారి కూతురైన సరస్వతమ్మగారిని ధర్మపత్నిగా స్వీకరించిరి. చంద్రశేఖర రెడ్డిగారు ఉదారులు. నరసింహారెడ్డిగారి యనంతరమున వారు జాగీరుకు మంచి ప్రఖ్యాతిని కూర్చిరి. ఇప్పుడు జరుగుచున్న చెన్నకేశవస్వామి తిరుణాల వీరి కృషి ఫలితమే. తిమ్మభూపాలుని యనర్ఘరాఘవము నచ్చొత్తించి ప్రకటించిన వారు వీరే. హైదరాబాదునందలి రెడ్డి విద్యార్థి వసతిగృహము (రెడ్డిహాస్టల్) నకు విరాళమిచ్చిరి. మదనపల్లి థియసాఫికల్ కళాశాలకు విరాళమొసగిరి. కొందరు బ్రాహ్మణులకు భూదానములు చేసిరి. మంచి దేశభక్తికలవారు నిగూఢముగా కాంగ్రెసుకు సహాయమును జేసిరి. అనేక పుణ్యస్థలములను సందర్శించిరి.

ఈ యనర్ఘరాఘవ కావ్యమును క్రీ. శ. 1931లో మొదటిసారిగా ముద్రింపించిన యీచంద్రశేఖరరెడ్డిగారు ఇటీవల స్వర్గస్థులైరి. వీరిసంతానములో ప్రస్తుతమిద్దరు కుమారులు (శ్రీ గోవర్ధనరెడ్డి, శ్రీ జనార్ధనరెడ్డి), ఒక కుమార్తె (శ్రీమతి ఇందిరమ్మ) కలరు. వీరి తండ్రి నరసింహారెడ్డిగారికి ద్వితీయ కళత్రమునందు జనించిన కుమారుడు శ్రీ బిజ్జుల రామేశ్వరరెడ్డిగారు స్వగ్రామమైన పల్లెపాటిలో నున్నారు. స్వదేశ సంస్థానములు భారత ప్రభుత్వమునందు కలియువఱకును వీరు జాగీర్‌దారులుగాను, దేశముఖులుగాను నుండిరి. ప్రస్తుతమీకుటుంబమునకు జెందినవారందరును విద్యావంతులై ఉన్నతోద్యోగములు జేయుచు గౌరవపాత్రులై యున్నారు. సంఘసేవా పరాయణులై యున్నారు. ఈ విధముగా అనర్ఘరాఘవ మహాప్రబంధనాటక కర్తయైన బిజ్జుల తిమ్మభూపాలుని వంశము తామరతంపముగా వర్ధిల్లుచుండుట సాహితీప్రియులకును, చరిత్ర పరిశోధకులకును ముదావహమైన విషయము.

# కృష్ణకవి

అనర్ఘరాఘవ మహాకావ్యమును రచించుటలో బిజ్జుల తిమ్మభూపాలునికి విశేషముగా తోడ్పడినవాఁడు ఈ కృష్ణకవి. అతిసమర్థుఁడుగా కనపడుచున్న ఈ కృష్ణకవి కులగోత్ర నివాసాదులను గురించి యనర్ఘరాఘవము నందేమియు చెప్పఁబడలేదు. తిమ్మభూపాలుని కాలమున అలంపూరు బోరవెల్లి సంస్థానములు కవులకు కాణాచులుగా నుండినట్లు కాణాదపెద్దన, బోర్వెల్లి నరసింహకవి, కృష్ణప్ప, మొదలయిన వారి రచనలవలనను, ఇతర కవులు వారిని పేర్కొనుట వలనను దెలియుచున్నది. పానుగంటి పురాధిపతియైన బోయినపల్లి కుమార వేంకటరాయలు (వెలమరాజు) రచించిన ద్రౌపదీకల్యాణ కావ్యమునందు తన గురువైన బోరవెల్లి నరసింహకవి వంశమును వర్ణించుచు, నరసింహకవి సౌపర్ణ కాఖ్యానమును రచించి ఆలంపూర్ నరసింహస్వామికి అంకితము చేసినట్లు పేర్కొనెను. ఇతఁడు తరిగొప్పుల మల్లన్న వంశమువాఁడని యొకయూహ మల్లన్న కుమారుని పేరు తెలియదు. దత్తప్ప మనుమఁడట, అతడు శబ్ద శాస్త్రపారంగతుఁడు. దత్తప్ప కుమారుఁడు కృష్ణప్ప, కృష్ణప్ప కుమారుఁడే నరసింహకవి. ఈ యాధారములవలన తరిగొప్పుల మల్లన్న మునిమనుమడైన నరసింహకవి తండ్రి కృష్ణప్పయే అనర్ఘరాఘవము పేర్కొనుచున్న "కృష్ణ సత్కవి" కావచ్చునని కొంద రూహించుచున్నారు. కాని కృష్ణప్ప రచించిన 'యయాతి చరిత్ర' గాని, నృసింహకవి రచించిన 'సౌపర్ణకాఖ్యానము' గాని దురదృష్టవశమున లభింపకపోవుటచేత వారి యూహను స్థిరపరచుటకు వీలు కనపడుటలేదు.

అనర్ఘరాఘవము ననుసరించి కృష్ణకవి పితామహుఁడైన పేరమహాకవి సమకాలికులలో గొప్ప ప్రసిద్ధిగలవాఁడు. ధవళశంఖములు, పగడాల పావు కోళ్లు, పగటి దివిటీలు వెలుగుచుండఁగా సాహిత్యకవిత్వ విద్యలలో తనవంత వాడులేడు అను ప్రఖ్యాతినిఁ గాంచిన నిస్సమ సారస్వత మహాసముద్రుఁడు. ఇతఁ డార్వేల నియోగిశాఖకుఁ జెందిన తరిగొప్పుల వంశీయుఁడే యై యుండినచో కుమార వేంకటరాయల రచనలోఁగాని మరి ఇతరుల కావ్యములలోఁగాని పేర్కొనబడి యుండెడివాడు. అట్లు జరుగ లేదు. కనుక అలంపూరు రాజుల యాశ్రయమునందే యుండిన బోరవెల్లి గ్రామ

వాసిగానో, ప్రాగటూరునగర నివాసిగానో ఉండి యుండవలెను. లేదా అలంపూరు పరగణాకు చెందిన మరియొక గ్రామవాసియై బిజ్జులవారి మన్ననలకుఁ బాత్రుఁడై యుండవచ్చును. పేరకవిని అనర్ఘరాఘవకర్త యిట్లు పేర్కొన్నాడు.

మ. "కమనీయస్థితిఁ జెంగటన్ ధవళశంఖస్ఫూర్తి రాణింప దీ
ప్తమరీచిన్ బవడంపుఁగెంపుఁ బవలున్ బంజుల్ వెలుంగొంద,ని
స్సమసారస్వత నిర్మలామృతఝురీ జాగ్రత్త రంగాబ్ధి పే
ర మహాసత్కవి తేజరిల్లె! విబుధ ప్రస్తూయ మానోద్ధతిన్."

ఈ పేరమహాకవి మనుమడుగాఁ బేర్కొనఁబడిన "కృష్ణకవి" కృష్ణప్పయే యై యుండినచో, పద్యరచనయందు సర్వవిధముల నారితేరిన యనర్ఘరాఘవ కవి "కృష్ణప్ప" యను ప్రసిద్ధనామమును, గణకల్పనచేతగాక, 'కృష్ణసత్కవి' అని పేర్కొనుటకు బూనియుండడు. కనుక ఇతఁడు కృష్ణయ్య, కృష్ణశర్మ, లేదా కృష్ణకవియేయైయుండవచ్చును. ఇతఁడు వైదిక కుటుంబ రహస్యములు. వేదశాస్త్రమర్యాదలు, తర్క వ్యాకరణాలంకార ముల ఆనుపానులు తెలిసిన మహా విద్వాంసుఁడేగాని, కవితాచాపల్యముగల సామాన్య సాహిత్యవేత్త కాదని యనర్ఘ రాఘవరచన నిరూపించుచున్నది. ఇతఁడు తిమ్మభూపాలునికి నిరంతరమైన సాహిత్య వ్యవసాయమునందుఁ దోడ్పడుచుండిన యాస్థానకవియే యైయుండవలెను. నరసింహకవియే కృష్ణకవి కుమారుఁడేయై యుండినచో "కృష్ణప్ప" యని పేర్కొనఁబడిన యతనిని గురించి కుమార వేంకటరాయలు తన గురువగు నరసింహకవికంటె నితనిని మహోత్కృష్టముగా ప్రశంసించి యుండవలసినది. కృష్ణప్ప రచించిన "యయాతి చరిత్ర" గాని నృసింహకవి రచించిన "సౌపర్ణాఖ్యానము" గాని లభించినచో నీ సంశయములు తీరఁగలవు. అంతవరకు ఈ కృష్ణకవిని గురించి ఇదమిత్థమని చెప్పుటకు వీలులేదు. ఇతఁడు పేరమహాకవి పౌత్రుఁడు అని నిస్సంశయముగా ననర్ఘరాఘవము నందున్నది.

చ. అతనికిఁ బౌత్రుఁడై యసదృశాఖిల విద్యలఁ బ్రౌఢిఁగన్న అ
యతమతి కృష్ణసత్కవి సహాయ కవిత్వమునన్ సమాజ సం
తత భజనాదరుండ నగు నాకు విశేషవిశేష వైదుషీ
ప్రతిభ కరస్థలామలక భాస్వరమై తనరారు టబ్రమే?"

అని తిమ్మభూపాలుఁడు, కృష్ణకవియెడలఁదనకుఁ గల కృతజ్ఞతను,

తన్మూలకమైన తన యశేష విశేష వైదుష్యమును ప్రకటించినాడు. అంతేకాక, తాను న్యాయమార్గమున తనకున్న సాహిత్య కవిత్వ సంపదలతో సంస్కృత మహాకవులలో మూర్ధన్యుఁడైన మురారికవి నాటకమును అనువదింపఁబూనుట యొకవిధమైన సాహసకార్య మగునేమో! యని తాను భయపడుచున్నప్పుడు, తనకు కృష్ణకవి సహాయము లభించినదనియు, అట్లు లభించుట దైవానుగ్రహమే యనియు నీక్రింది పద్యమున వెల్లడించెను.

గీ. "ఎట్టు లన్నను న్యాయమార్గైకవృత్తి
కవనిఁ దిర్యక్కులైన సహాయ మగును;
కాని తెరువున నడచినవాని విడుచు
ననుఁగుఁదోఁబుట్టువైన సత్యంబు సుమ్ము."

"యాంతిన్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం। అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి" అను మురారినాటక ప్రస్తావనయందున్న శ్లోకమునే అనువదించి, తనకును కృష్ణకవికిని గల కవితా సంబంధము నందు సమన్వయించెను. మొత్తముమీద కొందఱు రాజకవులవలెఁ దమకు కావ్య రచనయందు విశేషముగాఁ దోడ్పడిన కవులపేరునే యెత్తని కృతఘ్నతా భావమునకు లోనుగాక సత్యమును వెలువరించి కృష్ణకవినిఁ దన కావ్యమునందుఁ గౌరవముగా బేర్కొన్న తిమ్మభూపాలుఁడు ప్రశంసనీయుఁడు. తన యౌవనదశ యందుఁగాక వార్ధక్యమున, రాచకార్యములను కుమారుల కప్పగించి సుఖముగా దైవచింతనము చేసికొనుచున్న సమయమున, రామాయణగాథను కావ్యముగా రచింపఁదలచిన తిమ్మభూపాలుఁ డున్నసత్యమును జెప్పి కవులకును చరిత్రకారులకును సంశయమును దీర్చినాడు. కాని కృష్ణకవి తనకాలమున సుప్రసిద్ధుఁడై యుండుటవలన ఆయన కులగోత్రములను గుఱించి విశేషముగాఁ జెప్పలేదు. అది మనకు నేడు సంశయకారణ మైనది. ఏమైనను మనము తెలిసికొనవలసిన విషయము బిజ్జుల తిమ్మభూపాల విరచితమైన యనర్ఘ రాఘవ ప్రబంధము గాని కృష్ణకవికాదు, కనుక తిమ్మభూపాలుని వలెనే మనమును కృష్ణకవికి జోహారు లర్పించుచు నీ మహాకావ్య విశేషములను, కవి సామర్థ్యమును పరిశీలించి తెలిసికొని యానందింతముగాక.

# కావ్య ప్రాశస్త్యము

తిమ్మభూపాలుఁడు తమకులదైవమైన ప్రాగటూరు రామేశ్వరస్వామికి ప్రతిసంవత్సరమును ఉత్సవముఁ జరుపుచుండెను. ఆయుత్సవసమయమునందు విద్వత్కవిగాయకసభలు నిర్వహించుచుండెను. ఆసంరంభమునకు "సమస్త దేశ విద్వత్కవిప్రభృతి ప్రశస్త ఘనసభాజనము" చేరుచుండెను. ఆ సభల యందు "నానాదేశసమాగతుల్ కవిజనుల్ నానారసోద్యత్ప్రబంధాసీకంబు"ను "వివాదకంఠరత" చేతనా విష్కరించుచుండిరి. అనఁగా కవులు తమ కావ్య ములు వినిపించుచున్నప్పుడు చర్చలు, వాదప్రతివాదములు, ఆక్షేపసమాధాన ములు, పూర్వపక్ష సిద్ధాంతములు జరుగుచుండెను. ఆకోలాహలమును వినలేక విసిగిపోయిన సభ్యులకు ప్రీతితో "ఇష్టరసభవ్య"మైన కావ్యమును వినిపించెద నని తిమ్మభూపాలుఁడు తనయనర్ఘరాఘవ "మహాప్రబంధనాటకము"ను బయటఁబెట్టినట్లు తన కావ్యపరిచయమును, ఆనాటి సభాజనమునకును, ఈనాటి రసజ్ఞలోకమునకును జేసినాడు. శృంగారైక ప్రధానములగు ఇతివృత్తములను విడనాడి, వీరరసప్రధానమై, ధీరోదాత్తనాయకమైన కావ్యమును రచింపబూనిన యాకవికి రామాయణగాథ మనస్సున గోచరించెను. కాని రామాయణగాథను యథాతథముగా ననువదించుటవలన తన యుద్దేశము నెరవేరదు కనుక మురారి మహాకవిచేత సంస్కృతమునందు నాటకముగా రచింపఁబడిన రామకథను, "అనర్ఘరాఘవమును" తీసికొని యనువదించెను. వాల్మీకిరామాయణము శ్రీరామ చంద్రుని శౌర్యమును దెలుపునదేయైనను ఆద్యంతములందు కరుణరసప్రధానమై యున్నది. కనుక నాయకుఁడైన రామునియందు కరుణస్థాయియైన శోకమును తగ్గించి, వీరరసస్థాయియైన ఉత్సాహమునే (శౌర్యమునే) ప్రధానముగాఁజూపింప దలచిన మురారికవి "అనర్ఘరాఘవము" అనునామముతో నాటకమును రచిం చెను. ఆయనర్ఘత్వమున కనుకూలముగా రామునియందు వాలివధాదులకు తగిన కారణములు చూపెను. మహాకవుల వాక్కును పవిత్రము చేయఁగలిగినది ఒక్క రామకథయే యన్నభావము మురారియు, తిమ్మభూపాలుఁడును ఈ క్రిందివిధ ముగా ప్రకటించినారు.

శ్లో. యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్యచరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః ?

స్వమాత్మానం తత్తద్గుణగరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః ?

మ. గొనబౌ రామచరిత్ర యాదిమకవి తుణ్ణంబుగా నెంచి మా
నిన, నీరీతి గుణాఢ్యుఁడై తనరువానిన్ నాయకున్‌గాంచలే
మిని, తత్తద్గుణగౌరవస్ఫురిత గాంభీర్యాతి మాధుర్య వా
క్య నవబ్రహ్మలు పండితుల్ తమరయో! సార్థక్యమున్ గాంతురే.

కనుక వీరరసప్రధానమును, ఉదాత్తనాయకమును, రామకథాత్మము నగు సంస్కృతానర్ఘరాఘవనాటకమును తన వాక్యనవబ్రహ్మత్వమునకు అనుగుణమైనదానిసిగా నెన్నుకొని యనువదించెను.

మురారి రచనను తన యనువాదమునకై యెన్నుకొనుటలోనే యీకవికిఁ గల అసాధారణ కవితా ప్రావీణ్యము ప్రకటితమగుచున్నది. ఇది శ్రీనాథుఁడు హర్షనైషధకావ్యమును ఆంధ్రీకరించుటకుఁ బూనుటవంటిది. మురారి సామాన్యుఁడు కాడు,

"దేవీం వాచ ముపాసతేహి బహవ స్సారంతు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః,
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్యగంభీరతా
మాపాతాళనిమగ్న పీవరతను ర్జానాతి మంథాచలః"

(ఎందఱో కవులు కవితా సరస్వతిని ఉపాసించువారు గలరు. కాని అత్యంతమైన గురుకులక్లేశము ననుభవించి విద్యలు సాధించిన ఒక్క మురారికవి మాత్రమే సారస్వతసారమును చాలా బాగా పూర్తిగా నెఱిఁగియున్నాఁడు. వానరగణములు సముద్రమునుపై పైనదాటి పోవుట యెఱుగును. పాతాళమువఱకు మునిగిన మందరగిరి మాత్రమే సముద్రముయొక్క గాంభీర్యమును. లోతును ఎఱుగును. అనగా చపలచిత్తములైన వానరములవలె కవితా చాపల్యముగల యితరకవులు తమ భావాలకు అనుగుణమైన నైఘంటికార్థములు గల పదములను వాడి పద్యరచన పూర్తి చేసికొని యానందింతురేకాని, పద పదైకదేశ ప్రకృతి ప్రత్యయాదుల యర్థవిశేషములను సమర్థతతో నెఱిఁగి సుష్ఠుప్రయోగములు చేయజాలరని శ్లోకభావము) అని లోకముచేత కొనియాడబడిన మురారినాటకమును అనువాదమునకై చేపట్టి నూటికి నూరుపాళ్ళుగా కృతకృత్యుఁడైన తిమ్మ

భూపాలుడు ఆంధ్రకవులలో నసాధారణ ప్రతిభా పాండిత్యములు కలవాఁడని చెప్పక తప్పదు. అట్టి యాత్మవిశ్వాసము సైత మితని కున్నట్లు కావ్యము నిరూపించుచున్నది. అందుచేతనే కాబోలు కావ్యాదిలో వ్యాస వాల్మీకులతో పాటు కొందఱు సంస్కృతకవులను, తెలుఁగుకవులలో కవిత్రయమును మాత్రమే ప్రశంసించినాడు.

గీ. "ధరణి నా నాకుభవ పరాశరకుమార
కాళిదాస మయూర సత్కవుల దీప్తి
రవుల సజ్జన నిర్జరగవుల ధీమ
హాత్వ నీరేజభవుల నే నభినుతింతు."

ఉ. "భారతకల్పకంబునకుఁ బాదగు నన్నయభట్టధీరు, నం
కూరత నొప్పు నెట్టి ఘనకోవిదమౌళిఁ బ్రకాండశాఖికా
కారతఁబొల్చుమీరిన ప్రగల్భుని 'తిక్కనసోమయాజి' నే
సారెకు సన్నుతించెదను సారవచోరచనాభివృద్ధికిన్."

అని ప్రశంసించి, మురారికవిని సవిశేషముగా నిట్లు స్తుతించెను.

సీ. "నిఖిల తపోధన నివహా సంస్తుత్యా చా
రిత్రైక మౌద్గల్యగోత్ర భవుఁడు,
నానావిధ కళా భినవ పితామహా వర్ధ
మాన భట్టార్య కుమారకుండు,
తత సతీవృత్తాంక తంతుమత్యాహ్వయ
మానవతీ శుక్తి మౌక్తికంబు,
గురుభట్ట దేశికోత్తర పూర మధ్యస
రన్నిరాఘాట సారస్వతుండు,

గీ. "బాలవాల్మీకి" బిరుద శుంభన్మురారి
నాటక మనర్ఘరాఘవనామకంబు;
దాని నాంధ్రప్రబంధంబుగా నొనర్చి
యుదితసామగ్రి సమ్మదమూన్తు సభకు."

అని ప్రశంసించి, తాను ఆదికవి క్షుణ్ణమైన రామాయణమునే యేల రచింపవలె నను సంశయమును తీర్చుచు ఈ క్రింది విధముగా లోకమున కెఱుకచేసినాడు,

సీ. అస్మదాశ్రితు లంటినా రసపార గీ
తములఁ బ్రత్యేకంబు దతులరయ
మౌద్గల్యకవి వచోమాలిక లంటినా
మాధుర్య గాంభీర్య మంజులములు
సరస కావ్యార్థబీజం బంటినా సుధీ
రోదాత్తుఁడైన రఘూద్వహుండు
తన్మనన ప్రసిద్ధ సువాక్కు లంటినా
పరగు వాల్మీకి తపః ఫలంబు

గీ. అట్టి ప్రాచేతసీయమై యలరుకథ న
నేకులు రచించుదాననే కృతియొనర్చె
శ్రోత్రియాత్మజుఁ డలదాని సుకవులెన్న
నేను దెనిఁగింప నపరాధ మేమి కలదు ?

ఇట్లు ఆరంభింపబడిన కావ్యమునందు తనకుఁగల అసాధారణ కవితా ప్రాగల్భ్య మును, మూలమునకు విధేయుఁడై అనువాదచాతురినిఁ జూపినాడు. సంస్కృత నాటకమునందలి సంభాషణములనుగూడ విడువక వాటిని సీస గీత కంద పద్య ములలో కొంచెము సులభశైలిలో అనువదించి, మురారివాగ్గుంభనములతో విరా జిల్లునట్టి శ్లోకములను చక్కఁగా అర్థము చేసుకొని, భావములను జీర్ణించుకొని, మూలమునకు సంబంధించిన ప్రౌఢిని, శైలీవిశేషమును,పదబంధముల సొంపును, శాస్త్రవిశేషముల సంబంధమును సాకల్యముగా నెఱిఁగి మూలమునకు లోపము రానీయక, కొన్నిచోట్ల మూలాధిక సౌందర్యము విలసిల్లునట్లుగా కూడ ఈ అను వాదకావ్యమును రచించిన యీకవి పూర్వకవులలోని ఉత్తమశ్రేణికిఁజెందిన వాఁడని కావ్యమే నిరూపించుచున్నది. అనువాద భాగమునందేకాక తాను స్వయ ముగా రచించిన కావ్యాదిలోని పీఠికాభాగమునందుఁగూడ తనయశేషవిశేష వైదుషీ ప్రతిభను జూపినాఁడు. సంస్కృతాంధ్రభాషలలోని సారస్వత సార మును సంపూర్ణముగా నెఱిఁగినదిట్ట. సంస్కృత సమాసమునుగాని, తెలుగు

సమాసమునుగాని, విశిష్టపదబంధములనుగాని, అచ్చతెలుగు, దేశ్య అన్యదేశి యాది పదములనుగాని వాడినప్పుడు శైలి యేమాత్రమును కుంటువడకుండు నట్లు నడుపఁగల ప్రతిభాశాలి. పూర్వప్రబంధముల పోకడలన్నిటిని యెఱిఁగిన కవి. తనకుఁ గలలోన సాక్షాత్కరించిన ప్రాకటూరి రామేశ్వరస్వామిని వర్ణించు పట్టున నడిచిన యచ్చ తెలుగు శైలియిది,

సీ. "జడలఁ బెంపగు జాలు నొడలి కింపగు డాలు
పొడల సొంపగు శాలు వడరువాఁడు
చలువనించిన సొమ్ము నలువవంచిన హొమ్ము
చిలువ నుంచిన బొమ్ము గలుగువాఁడు
గిరిని నిల్చినజోక కరిని గెల్చినఢాక
కిరిని గూల్చిన వీఁక మెఱయువాఁడు
కాఁడి మోసినడాలు లేఁడి డాసినకేలు
వాఁడి సేసినవాలు వఱలువాఁడు

గీ. అమరులను బ్రోచు మహిమచే నమరువాఁడు
ప్రాకటూరి పురీశుఁడై ప్రబలువాఁడు,
శాశ్వతైశ్వర్యకరుఁడు రామేశ్వరుండు
కరుణమీఱంగఁ గలలోనఁ గాన నయ్యె."

అచ్చతెలుఁగు పదములేకాక చక్కని శబ్దాలంకారముగల యీ పద్యము యమకాలంకార ప్రియులైన భట్టుమూర్తి మొదలయిన కవుల రచనలను బోలి యున్నది.

శ్లేషను చెప్పునప్పుడుగూడ శబ్దమునకు రెండును నైఘంటికార్థములే యగుచుఁ జమత్కారమంతగాలేక రెండర్థములుండుటయే చమత్కారమని తృప్తి పడు కొందఱు కవులవలెఁగాక, ఒకయర్థము లోకవ్యవహారసిద్ధమై పదమునకు దేశీయతను జేకూర్చునదియు, రెండవయర్థము సామాన్యముగాగాని నైఘంటికముగాగాని యాశబ్దమునకుండునట్లు శ్లేషను జెప్పుటలో నీ కవి మిక్కిలి సమర్థుఁడు. అట్టివానిలో నీ క్రింది పద్యమొకటి.

సీ. "అప్పుగా కియ్యఁడెంతైనఁ బర్జన్యుండు
పూటగా కియ్య దెప్పుడును సురభి,
వృద్ధిలే కియ్యఁడు వెన్నెలరాయఁడు
పత్రంబులే కీదు పారిజాత
మెత్తున కెత్తుగా కియ్యఁడు శిబివిభుఁ
డడుగుగా కీఁడు దైత్యాధినాథుఁ
డుత్తరాశనెకాని యొసఁగడు ధనపతి
యిల్లట మున్నఁగా కీయఁడబ్ధి

గీ. యనుచు వారి వదాన్యత లపహసించి
వలసినంతయుఁ గోరిన వస్తులెల్ల
సకల దేశాగతార్థార్థి సమితి కొసఁగుఁ
గూర్మి బిజ్జుల యిమ్మడికొండ విభుఁడు.

పర్జన్యుఁడనగా మేఘుఁడు అప్పుగానే యిచ్చునుగాని దానమీయఁడను నర్థమున "అప్పు" (అప్ = నీరు, రెండవయర్థము) "పూట" యనగా మూడవ వ్యక్తి యిచ్చునట్టి హామీ (Security) అని యర్థము. సురభి = కామధేనువు (ఆవుగనుక) పాలు ఉదయమున, సాయంత్రమున మాత్రమే యిచ్చునన్నది మరియొక దేశీయార్థము. చంద్రుని వెన్నెలరాయఁడనుట సొగసైన ప్రయోగము. వృద్ధి అనగా వడ్డి (కళలు పెరిగి, తదియలు మొదలయిన తిథులలో వృద్ధి చెందుట చంద్రపరమైన యర్థము.) పత్రంబు = ఆకు, ప్రోనోటు. ఎత్తునకెత్తు = మూలద్రవ్యమెంతో వడ్డీ అంత అనిభావము. అడుగుగాక = పాదము; లొంగి యుండుట. ఉత్తరాశ = ఉత్తరదిక్కు, ఒకగొప్ప వ్యక్తియిచ్చు హామీ ఉత్తరము. ఇల్లటము = విష్ణువు సముద్రమున కిల్లటపల్లుడు (తనయింటిలో పడియుండుట అని రెండవ యర్థము) ఇట్లు అతిసులభములై దేశీయములైన పదములచేతనే రెండవయర్థమును నిర్వహించుటలో నీకవి అందెవేసినచేయి.

అచ్చ తెలుఁగు పదములు, దేశ్యములు, అన్యదేశ్యములు కూర్చి రచించునప్పుడు తెలుఁగు వ్యాకరణము, తెలుఁగు భాషా సంప్రదాయములు మొదలయిన వాటిని యెంత చక్కగా నెఱిఁగి శైలిని కుంటువడనీక పద్యమును నడపునో అంతచక్కగా సంస్కృత వ్యాకరణాలంకార భావ రసధ్వనుల నెఱిఁగి సంప్ర

దాయము నెఱిఁగి తనకుఁగల గీర్వాణ వాణీధోరణినిఁ జూపును. ఒక అపూర్వమైన భావకల్పనము నందు తన వ్యాకరణాభిజ్ఞతను ఈ క్రింది పద్యముద్వారా వెల్లడించెను.

మ. "ఇనదబ్జంబు, ధనంజయచ్ఛరము, వాణీశద్గిరీశంబు, కో
కనదత్కైరవ, మబ్జరాగదుడుపాట్కాంతంబు, కాశ్మీరజ
ద్ఘనసారంబు, సురాలయద్రజతగోత్రంబయ్యె బ్రహ్మాండమా
చిన తిమ్మక్షితిపాలకొండవిభునక్షీణ ప్రతాపంబునన్."

ఇది తిమ్మభూపాలుని తాతముత్తాతలలో నొకఁడైన కొండారెడ్డి ప్రతాప వర్ణనము. ప్రతాపమును ఎఱ్ఱనిరంగు కలదానినిగ వర్ణించుట కవి సమయము. కొండవిభుని ప్రతాపముచేత బ్రహ్మాండ మంతయు నెఱ్ఱఁబడినదని చెప్ప వలయును. కనుక కొన్ని ముఖ్యమైన తెల్లని వస్తువులు రక్తవర్ణము కలవిగాఁ గనఁబడుచున్నట్లు ఒక్క పద్యమునందే క్లుప్తముగాఁ జెప్పి బ్రహ్మాండమంతయు నెఱ్ఱఁబాఱినట్లు మనకు గోచరింపఁజేయుటకై తన భావకల్పనా సామర్థ్యమునకు సంస్కృత వ్యాకరణ పాండిత్యమును తోడు చేసికొని రచించిన పద్యమిది. సంస్కృత భాషలో నామవాచకములను గూడ క్రియలుగా మార్చుకొనుటకు వీలున్నది. అట్టి నామధాతు ప్రక్రియలోని సూత్రములలో "సర్వ ప్రాతిపదికేభ్యః క్విప్ వా వక్తవ్యః" అను వార్తికముచేత ప్రతి నామవాచకమునకును వికల్పముగా 'క్విప్' ప్రత్యయమును చేర్చి దానివలె అయినది అను నర్థమును సంపాదించవచ్చును. అప్పుడా శబ్దము క్రియాపదముగా మారును. ఆపైన ధాతువునకు వచ్చునట్టి ప్రత్యయములను (కృదంతములను) చేర్చవచ్చును. కనుక ఇచ్చట 'ఇనః' అనగా సూర్యుఁడు 'అబ్జః' అనగా చంద్రుఁడు. తెల్లనిచంద్రుడు రక్తవర్ణమును పొంది సూర్యునివలెఁ గనపడుచున్నాఁడు అనునది తాత్పర్యము. (ఇనః ఇవ ఆచరతి ఇనతి అని విగ్రహము) 'క్విప్' ప్రత్యయము ప్రాతిపదికమునకు ధాతుత్వమును కలిగించి తాను అదృశ్యమగును. ధాతుత్వమును పొందిన శబ్దము క్రియావిభక్తులను పొందును. ఆవిధముగా 'ఇనః' అను సూర్యవాచక శబ్దము సూర్యునివంటి వాఁడైనాడు అను నర్థమునందు 'ఇనతి' అను క్రియాపదమైనది. దీనికి వర్తమానార్థమునందు వచ్చునట్టి 'శతృ' ప్రత్యయమునుచేర్చగా (శతృ ప్రత్యయమునందు 'అత్' అనునది మాత్రమే మిగిలి ధాతువునకుచేరును) ఇన+అత్ = 'ఇనత్' అని యగును. ఇనత్అబ్జఃయస్మిన్తత్ అను

అనుపమాచ్యుత సమాఖ్యారూఢిఁ దనెరె నే
ఖడ్గనారాయణాంకన ధురీణుఁ

గ. డా కృపాగుణ పారీణు నా ప్రవీణు
నా బుధత్రాణు నామహోద్యత్కృపాణు
నా జయోదగ్రనిస్సాణు నాయరీణు
నెన్న శక్యమె కొండపృథ్వీశమణిని"

ఇట్టివే కాక వంశావతార వర్ణనలో వచ్చిన వారివారి నామధేయము లైన "రామ. కృష్ణ, యాగ," పదముల ద్వారా చిత్ర విచిత్రములైన భావము లనుగల్పించి శ్లేష యమకాలంకారములను నిర్వహించెను. ఈ వంశావతార వర్ణనను తానుగాక తన యాస్థానకవులు చేసినట్టిగాఁ జెప్పుకొనెను. సభాసదు లను బహువచనమును ప్రయోగించినను, రచన అంతయు నేకధాటిగా యుండుట చేత నా సభాసదులలో ముఖ్యుడైన కృష్ణకవియే యీ పీఠికా పద్యములను రచించియుండునని మన మూహింపవచ్చును. అందులో గ్రంథ కర్తయైన తిమ్మ భూపాలుని వర్ణించిన యీ క్రింది పద్యములు తిలకించుట మనక ప్రస్తుతము కాదని భావించుచుఁ గొన్నిటి నుదాహరించుచున్నాను, ఇది తిమ్మభూపాలుని తల్లి బచ్చమాంబ వర్ణన,

సీ. నాయకు నేలదున్నకను మూన్పఁ గలేచి
యల రత్నగర్భ గంధానుషక్తి
ధవు దూఁడగాపరితనము వారింపని
సంపన్మృగాతీ చాంచల్య గుణము
పతి అప్పుమోసెడి భంగ మెడల్పని
వసుమాత ప్రతికూల వర్తనంబు
ఆత్మవల్లభు నెత్తి యప్పుమోఁపెల్ల దిం
చని యపర్ణావ్వాయ చండితనము

గీ. నెంచి వారల నిరసించి హృద్య వినయ
వతియు, స్థిరమతియును, శీలవతియు, సాధు
మతియునై పొల్చెఁ; తను మానవతులు మెచ్చ,
భళిర ! బిజ్జల కృష్ణేంద్రు బచ్చమాంబ.

(ఈ బచ్చమాంబ వనపర్తి సంస్థానాధీశులలో పూర్వుఁడును, అష్టభాషా బహిరీ గోపాలరాయని తండ్రియునగు వేంకటరెడ్డికూతురు) ఈ పద్యమునందలి 'గంధానుషక్తి' చాంచల్యగుణము, ప్రతికూలవర్తనము" అనుపదములు సాభిప్రాయములు. 'అప్పు' శబ్దమునకు జలమని రెండవయర్థము.

మ. అలబచ్చాంబికయుండుఁ గృష్ణవసుధాధ్యక్షుండు నిన్ గాంచె,నా
కలశాంభోనిధి కన్యకామణియెడన్ గంజాక్షుఁడా మోదియై
వలరాజున్ గనులీల; భూవలయ భాస్వత్కీర్తికల్లోల! బి
జ్జుల తిమ్మక్షితిపాల! ఫాలనయనాప్తోకార్చితా లాలసా !

సీ. తలయేఱుగలిగి నిచ్చలుగండములు సెంది
గతిమాలు నదుల సాంగత్య మెడలి
దుర్వర్ణయుక్తి బంధురమైన నెమ్మేనఁ
బొడలూను కరటుల పొందు మాని,
భరిత మహోత్సవ సాగరస్నాతుఁడై
యొంటిఁ గ్రుమ్ములు పోరిజంట వదలి,
చెవుల విన్కలి లేక సీదనంబునఁ గాన్పు
పేదయైన భుజంగుఁ బెనఁగు టుడిగి,

గీ. ప్రేమ రామాభిరామ నిరామయాంగ
రామణీయక విభవ విరాజమాన
కలన విహరించు నిను ధరాకాంత సెందె;
దీపితాటోప ! బిజ్జుల తిమ్మభూప !

ఇది ధరాకాంత ప్రేమతో తిమ్మభూపాలుని వలచి వచ్చినట్లు చెప్పబడిన పద్యము. కులగిరులయందును, దిగ్గజములందును, ఆదివరాహమునందును, ఆదిశేషునియందును జూపఁబడిన రోగములు, అపకీర్తి, అసమర్థతాది దోషములను స్ఫురింప జేయునట్టి "తలయేఱు" మొదలయిన పదములయందలి శ్లేష మిక్కిలి చమత్కారముగా నున్నది. ఇక నీతని శౌర్యము ఇంతకంటెను చమత్కారముగా వర్ణింపఁబడినది చూడుడు,

మ. "అరుదా ? రంభకు నిచ్చయౌవన నిశాంతాసక్తి, ఆశ్చర్యమా?
పరికింపన్ శశిరేఖకున్ దమి మహాపాశ్చాత్యయోగం" బటంబ్రదు
రహిన్ దిమ్మనృపాలః నీవలుకమైఁ బ్రదుంపన్ దివిన్ సిద్ధియం
బరు రాహుత్తులు చేరి యచ్చరలఁ బ్రేమన్ గూడఁ దద్రాష్ట్రవ్యుటుల్.

సీ. మొనసి నీదుకటారి మొనపోటు నాటఁగా
గాటమౌ రంభ చన్పోటు కలిగె,
నీబాణ మెదగంటి నివ్వటిల్లఁగఁ జేయ
హారిణిచే మోవికాటందఁ గలిగె,
నీజయభేరికా నినదముల్ చెవిసోక
వెస తార మణితముల్ వినుటకలిగె,
నీఖడ్గ మంగముల్ నెఱనాముకొన మేన
కాక్రాంత జడవాటు కవయఁగల్గె,

గీ. నౌర ! తమ కెంతయుపకారి యనుచు మెచ్చు
మోహమున నిన్ను నాహవోన్మాలి తోగ్ర
పికిలి చెన్న క్షమాపాల వీరసమితి
దివిని శుభరూప ! బిజ్జలతిమ్మభూప !

ఇట్లనేకములైన కావ్యగుణములతో శోభిల్లునట్టి పద్యపరంపరచేత తిమ్మభూపాలుని పూర్వులను, తిమ్మభూపాలునిని, అతని పుత్రపౌత్రులను సయితము వర్ణించిన సభాసదులు తుదకీ పద్యముతో ముగించి కావ్యరచన కుపక్రమింపుమనిరి.

ఉ. "ఈ దృశ పుత్రపౌత్ర విభవైక మహామహిమాభిరామతన్
మేదిని సుప్రసిద్ధిఁగను మీకరుదే ? యిటువంటి కావ్యముల్
సాదులు మెచ్చఁగా బహురసప్రతిపాదనలీల హెచ్చఁగా
నాదృతి మీర దేవతల కంకిత మూన్చుట తిమ్మభూవరా!"

వారి యాదేశానుసారముగా తనకులదైవమైన ప్రాకటూరు రామేశ్వరస్వామి నభివర్ణించి, అంకితముచేసి, యనర్ఘరాఘవ భాషాంతరీకరణ మారంభించెను.

# భాషాంతరీకరణము

భాషాంతరీకరణము లేక అనువాదము అనునది ఒక కళ. మూలభాష యందును అనువాదమున కెన్నుకొన్న భాషయందును సంపూర్ణపాండిత్యము గల యనువాదకుల రచనలే పది కాలములపాటు లోకమునందు మనియుండును. మూలమును చక్కగా నర్థముచేసుకొని, జీర్ణించుకొని దానిని తనదిగాఁ జేసుకొని నిరాటంకముగా అనువదించినప్పుడే అది స్వతంత్ర కావ్యమువలెనుండి చదువరుల నాకర్షింప గలుగును. మన ప్రాచీన సారస్వతము నందుగల కావ్యములలో నెక్కువభాగము సంస్కృతమునుండి యనువదింపఁ బడినట్టివే. నన్నయాది మహాకవులందఱును ఉభయభాషలయందలి సారస్వతసారము నెఱిఁగియే చేసిరి. వారిలో కొందఱు కథానువాదమును, కొందఱు విషయానువాదమును, కొందఱు సాహిత్యవిశేషముల యనువాదమును మాత్రము జేయఁగా శ్రీనాథుని వంటి యుభయభాషా సాహిత్యసారవిదులు పద పదైకదేశ సారస్యమును విడువక భాషాంతరీకరణమును గావించిరి. అట్టి సందర్భమునందు మూలభాషయందున్న పదబంధము లేవిధముగను మార్చుటకు వీలుపడనివియు, మార్చినచో స్వారస్యము చెడునవియు, వాటియౌన్నత్యమునకుఁ దగిన భాషాపదములు తేనివియు నగుటచేత యథాతథముగనే యుంచి మూల కావ్యమునకును తాము రచించిన యాంధ్రకావ్యమునకును గౌరవమును జేకూర్చిరి. శ్రీనాథమహాకవి వాడిన ''గమికర్మీకృత నైక నీవృతుఁ''డనై, "యాచమాన జన మానసవృత్తి," పంకసంకరవిగర్హిత "అస్తినాస్తివిచికిత్సాహేతు" తల్లి "మదేకపుత్రక", ''వేదాభ్యాసవిశేషపూతరసనా'', "తపనీయదండైక ధవళాతపత్రిత" మొదలయిన పదజాలమంతయు నట్టిదే. కొందఱు మూల రచనను చక్కగా గ్రహించి, జీర్ణించుకొని, స్వభాషలోనికి దించుకొనునంతటి తాలిమిలేక అర్థమైనదికదా యని అనువదించుటకుఁ బూనుకొందురు. అట్టివారి రచనలు అంతంత మాత్రముగానేయుండి, చదువరులకు బోధపడక, మూలము నెఱిఁగినవారికిఁ దృప్తినీయక, శ్రమైకఫలములై నిరుపయోగములగును. శ్రీనాథ కవి కాలమునాటికి శ్రవ్యకావ్యములనే కాని దృశ్యకావ్యముల ననువదించు వాడా

రము లేకపోవుటచేత నతఁడు శాలివాహనసప్తశతిని, హర్షనైషధమును మాత్ర మాంధ్రీకరించి తన ప్రతిపద్యానువాదచాతురినిఁ జూపి, యావిమ్మట వస్తుప్రధానములైన యనువాదములుగా భీమేశ్వరపురాణ కాశీఖండాదులను రచించెను. శ్రవ్యకావ్యపద్యానువాద కళకు శ్రీనాథుఁడు శ్రీకారమును జుట్టఁగా తరువాతి వారెందఱో ఆపద్ధతిలో తమ రచనలు సాగించిరి, కావ్యములు వ్రాసిరి. మూల పద్యమునందలి పదప్రయోగ భావసౌందర్యాదులను చెడనీయకయు, మాతృ భాషాశైలిని (తెలుగు శైలిని) పాడుపడనీయక, అనువాదమునకుఁ బూనిన వారిలో శ్రీనాథుని మార్గమున నడచినవారు మాత్రమే కృతకృత్యులైరి. అట్టి వారిలో తిక్కనామాత్యుఁ డొకఁడు.

సంస్కృత నాటకములను తెనుఁగు ననువదించినవారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు ప్రథముఁడు. మహాకవి కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలమును "శృంగార శాకుంతలము" అను పేరున ననువదించెను. ఈ కవి మూలమునందలి భావములను మార్చియు, చేర్చియు రచించెను. కొన్ని యితర కవుల భావములను సైతము స్వీకరించెను. శ్లోకములయందలి పదపదైకదేశ ప్రాధాన్యము నంతఁగా పట్టించుకొనలేదు. తరువాత కృష్ణమిశ్రయతీంద్రుఁడు వేదాంత విద్యాబోధకముగా రచించిన "ప్రబోధచంద్రోదయము" అను సంస్కృతనాటకమును "మలయమారుతకవులు" అని ప్రసిద్ధి వహించిన నంది మల్లయ్య, ఘంటసింగయ్య అను జంటకవులు ప్రౌఢ ప్రబంధముగా ననువదించిరి. వీరు పద్యానువాదమం దాసక్తి జూపిన వారేయైనను మూలమునందలి విషయమునకే యెక్కువ ప్రాధాన్యము నిచ్చిరి. పద్యానువాదమున కంతఁగా ప్రాధాన్యమీయలేదు. రాజశేఖరుని "విద్ధసాలభంజిక" యను నాటకమును మంచనకవి "కేయూరబాహు చరిత్రము" అను పేరున ననువదించెను. ఇందులో మూలమునందలి పాత్రలపేర్లుసైతము మార్చఁబడి యథాసంభవముగా మూలపద్యము లనువదింపఁబడెను. మంచనకవియు విద్ధసాలభంజికయందలి వస్తువునకే యధిక ప్రాధాన్యము నిచ్చెను. ఇక నీ పద్ధతిలో జయదేవుని ప్రసన్నరాఘవనాటకమును బొడ్డుచర్ల చినతిమ్మయకవి "ప్రసన్నరాఘవనాట్యప్రబంధము" అను పేరున పద్యప్రబంధముగా రచించెను. పైవారివలెనే చక్కని కవిత్వము వ్రాయఁగలిగిన దిట్ట. వారుచేసినట్లే మూలాతిశాయిగా రచనసాగించినను, పద్యానువాదమునఁ గొంత యెక్కువ శ్రద్ధ వహించెను. పండితులగు వారికిఁ గవిత్వము వ్రాయుట వచ్చునా ? యను సంశయమునకు సమాధానముగా జయదేవుఁడొక శ్లోకమును రచింపగా దాని నితఁడిట్లనువదించెను. (ఈ బొడ్డుచర్ల తిమ్మయ క్రీ. శ. 16వ శతాబ్దివాఁడు)

శ్లో. "యేషాం కోమల కావ్యకౌశలకలా లీలావతీ భారతీ
తేషాం కర్కశ తర్క వక్ర వచనోద్గారేఽపి కిం హీయతే?
యైః కాంతాకుచమండలే కరరుహాః సానందమారోపితా
స్తైః కిం మత్తకరీంద్రకుంభశిఖరే నారోపణీయాః శరాః?"

మ. "భువి నెవ్వారలు నవ్యకావ్యకలనాభూషారతిన్ భారతిన్
దవులన్ నేర్తురు వారిచేతన యగున్ తర్కాతి వక్రోక్తులున్;
నవలాగుబ్బలు లీల గోరుమొనల న్నాటింపఁగా నేర్చువా
రు విదారింపరె కుంభికుంభయుగళిన్ క్రొవ్వాఁడి వాలంబులన్"

పూర్వులు పెక్కురు కాక ఆ సంస్కృత నాటకములలో గొప్పవాని ప్రబంధములుగా రచించిన కవులును గలరు.

ఇక ప్రస్తుతమైన యనర్ఘరాఘవము, మూలమునందలి యితివృత్తమునే కాక రచనా ప్రౌఢిని, సౌందర్యమును, యలంకారప్రయోగ కౌశలమును జాఱనీయక అనువదింపఁబడిన మహోత్కృష్టనాటకము. అవసరమని తోఁచినచోట నితఁడు మూలాతిశాయియైన రసస్ఫూర్తిని గలిగించు రచనలు మాత్రము చేసెను. సంస్కృతానర్ఘరాఘవ నాటకమునందలి నాందీశ్లోకమును కావ్యప్రారంభము నందలి దైవప్రార్థనమున జేర్చుకొని యిట్లు తెనిఁగించెను.

శ్లో. "నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీలక్ష్మణః
కోకప్రీతి చకోరపారణ పటూ జ్యోతిష్మతీ లోచనే
యాభ్యా మర్ధవిబోధ ముగ్ధమధుర శ్రీ రర్ధ నిద్రాయితో
నాభీపల్వల పుండరీక ముకుళః కంబోః సపత్నీకృతః"

ఉ. "శ్రీకరమైన నాభిసరసీరుహ మర్ధవిబోధనార్ధ ము
ద్రాకరమైక చాతురి దరప్రతిమానముఁ జేసి నిచ్చలున్
గోకవిలోకనోత్సవ చకోరకపారణముల్ ఘటించు లో
కైకశరణ్య కన్నుఁగవ యాపుత మాకు నిరంతరాయమున్"

"మహారాజ! కిముచ్యతే, సమానవృత్తేరపి క్వచిదేవ
కస్యచిత్ తారా మైత్రకమ్, తథాహి సత్రభవాన్,

శ్లో. సాధారణో రఘూణాం గురుర్భవన్నపి విశేషదృష్టి స్తే
నామోదయతి కిమిందుః కుముదం పున రస్య సర్వస్వమ్."

**అనువాదము**

ఆ. గీ. అనిన వామదేవుఁ డనియె నోరాజన్య
తిలక! యరుదు గాఁగఁ బలికె దేల?
యెట్టి సర్వసములకేనిఁ దారామైత్రి
యెంచి చూడ నొక్క యెడనకాదె?

గీ. అరయ రఘుకుల సామాన్య గురుఁడతండు
నిక్క మట్లయ్యు నీయందె నెమ్మి ఘనము,
సకలజన మోదకరుఁడైన చంద్రునకుఁ గు
ముదము దలపంగఁ దాఁ బ్రాణపదము కాదె?

"తారామైత్రక" మనఁగా 'చక్షూరాగము'. కన్నులతో నందఱినిఁ జూచు చున్నప్పటికిని కొందఱికి కొందఱియందే యెక్కువప్రీతి. అట్లే వసిష్ఠునికి దశరథునియందు అని చెప్పువామదేవుని వాక్యమునందలి తారామైత్రక శబ్దమును భాషాంతరీకరింపకపోవుట మూలపద స్వారస్యము నెఱిఁగి యుండుటయే. లేనిచో నెక్కువప్రీతి మొదలయిన రీతిగా నేదియో యొక పదముతోఁ దెనుఁగు చేసియుండును, దశరథునిఁ బ్రశంసించుచు విశ్వామిత్రుఁడు పలికిన మాటల లోని యొక ప్రశంస,

శ్లో. "దత్తేంద్రాభయ విభ్రమాద్భుత భుజాసంభార గంభీరయా
త్వద్వృత్త్యా శిథిలీకృత స్త్రిభువన త్రాణాయ నారాయణః
అంతస్తోష తుషార సౌరభమయ శ్వాసాని లాపూరణ
ప్రాణోత్తుంగ భుజంగతల్ప మధునా భద్రేణ నిద్రాయతే."

మ. "అభయం బింద్రునకిచ్చు తావక భుజాహంకారవృత్తిన్ జగ
త్యభిరక్షా నిరపేక్షుఁడై హరి మనోహర్షాతిశైత్యోరు సౌ
రభ నిశ్వాస సమీరపూరణ పృథుప్రద్యోత వాతాశన
ప్రభుశయ్యన్ సుఖనిద్రఁ జెందెడుఁ బయఃపాథోధి మధ్యంబునన్."

ఇది మూలమునందలి యోజోగుణమును చెడనీయక చేసినయనువాదము. ఒక్కొక్కచోట మూలమునందలి రచనకు వన్నెలు దిద్దుటకై పెంచిరచించు టయు నీకవికిష్టము. రావణునికి సీత నిమ్మనికోరుటకై వచ్చిన రావణపురోహితుఁడగు శౌష్కలుఁడు. జనక శతానంద రామలక్ష్మణుల యెదుట రావణాసురుని యవక్రపరాక్రమమును వర్ణించుచుండగా విన్న లక్ష్మణుఁ డన్నతో రహస్యముగాఁ బలికినమాటలు,

"ఆర్య! కథ మసౌ సహస్రార్జున వాలిభ్యా మవలీఢశౌర్య సారోదురాత్మా రావణః ప్రస్తూయతే ?" ఇచ్చట ప్రతినాయకుఁడైన రావణుని శౌర్యమును బహుళముగా వర్ణించిన శౌష్కలుని పలుకులు విని క్రుద్ధుడైన లక్ష్మణుని కామాత్రపు మూలవచనములు చాలవని తెనుఁగున విస్తరించి రచించిన పద్యమిది.

సీ. కోడిగంబులు నేసి కోనంగియాటకు
దిద్దరే ? తెలిదీవి ముద్దరాండ్రు,
మొలకు వాలము చుట్టి మున్నీటి పెన్నీట
నీతనేర్పఁడె ? నిర్జరేంద్రసూతి,
తన బందిగమునకు మనుఁగాపు సేయడే ?
వికృమోన్నతిఁ గార్తవీర్య నృపతి,
కడికడి కొక కుప్పిగంతు వేయించరే ?
చేరి దైత్యేంద్రదాసీ జనములు,

గీ. తీంద్రచెడి యిట్లు మఱియుఁ బెక్కండ్రచేత
భంగపడినట్టి రావణు బంటుతనము
లుగ్గడింపుచు నున్నాఁడు సిగ్గులేక
కటకటా ! పూని యీ వైదిక ప్రధాని."

ఇట్లే యహల్యాశాపవిమోచన సందర్భమునఁ బ్రవేశించిన మునికుమారుల నామధేయములు వైదికసంప్రదాయము ననుసరించి మురారికవిచేత హాస్యరసస్ఫూర్తికై "శునఃశేఫః, పశుమేఢ్రః" అని కల్పింపఁబడగా నవివైదిక వాఙ్మయము నెఱిఁగినవారికిమాత్రమే శ్రవణయోగ్యములగునుగాని, ఆంధ్రప్రబంధమును జదువుకొను తెలుగువారికి నెబ్బెట్టుగాఁ దోచునన్నభావముతో శునశ్శే

పుని "కళాధరుఁడు"గాను, రెండవవానిని "సదాచారుఁడు"గాను తిమ్మభూపాలుఁడు మార్చెను. అంతమాత్రమే కాక సదాచారుని భయమును, అహల్యకు జరిగిన పాతివ్రత్యభంగ, గౌతమశాపములను ఒక హాస్య శృంగార రసముల కాటపట్టగు రసవద్ఘట్టమునుగా తన కల్పనతో నిర్మించి తెలుఁగుపలుకుబడుల సొగసును జూపెను. మూలమునందు వాక్యరూపమున సూచనాప్రాయముగా నున్న యీ ఘట్టమును విస్తరించుట అమూలకము గాఁజాలదు. విచారింపఁగా మూలమునకు విశేషసౌందర్యమును జేకూర్చుట. ద్వితీయాశ్వాసమునందలి "జోటజోటఁ జెమటలువడఁగ" యను 1[illegible]వ పద్యమునుండి తాపసోత్తమ! నీ ప్రసాదమున మడ" యను [illegible]వ పద్యమువఱకుఁగల యీ రసవద్ఘట్టమును జదివి తీరవలయును.

శ్లో. "యస్మిన్నేకధనుష్మతో భగవతః ఖట్వాంగపాణే రసా
వాక్రష్టో గుణతాం గతోఽస్త్యహిపతిః కర్ణావతంసాయతే,
ఉన్ముక్తః పునరేవ భూషణపదం యాతి ప్రకోష్ఠాంతరే;
కాకుత్స్థేన తదేవ భార్గవగురోః కోదండ మాకృష్యతే"

చం. "శివునకు నింపుసేసెమును శింజినియై తెగనిండఁదీసినన్
శ్రవణవతంసమై విడిచినన్ కరకంకణమై ఫణాధర
ప్రవరుఁ డనన్యధన్వి సులభంబగు నేవిలుఁ జేరె; యట్టిభా
ర్గవగురు చాప మెక్కిడియెఁ గంటివె! రాము గుణాభిరామునిన్"

అని శివధనుర్భంగము జరిగినప్పటి యద్భుతదృశ్యమును వర్ణించి, దాని ధ్వని నీ క్రిందిరీతిగా యుల్లేఖించెను :

శ్లో. "రుంధన్నష్ట విధేః శ్రుతీ ర్ముఖరయన్నష్టాదిశః క్రోడయ
న్మూర్తీ రష్ట మహేశ్వరస్య దలయన్నష్టౌ కులక్ష్మాభృతః,
తాన్యక్ష్ణాబధిరాణి పన్నగకులా న్యష్టౌచ సంపాదయ
న్నన్మిన్నిత్యయ మార్యదోర్బల దలత్కోదండ కోలాహలః"

సీ. "బధిరత్వ మొనరించె భాషానితంబినీ
ప్రాణేశు నెనిమిది వీనులకును,
కబళీకరించె దాక్షాయణీ రమణీమ
నోహరు నెనిమిది దేహములను,

ఆర్భటింపఁగఁ జేసె నందంద బహుగుహా
కోటిచే నెనిమిది కులనగముల,
చెవుడు గల్పించె నక్షిద్వయంబున మహా
ద్భుతముగ నెనిమిద భుజగములకు,

గీ. గీలుకొల్పె నిరంతరాందోళనంబు
మిక్కుటంబుగ నెనిమిది దిక్కులకును,
లక్ష్మణాగ్రజ భుజ నిర్దళ న్మహోత్క
వాహ కోదండదండ కోలాహలంబు."

రావణ వధానంతరము శ్రీరాముడు పుష్పకవిమానముపై సీతా లక్ష్మణ సుగ్రీవ విభీషణాదులతోఁ గలసియెక్కి, అయోధ్యానగరమునకు తిరిగివచ్చు నప్పుడు, దారి భూభాగాంతరాళములందున్న విశేషములను, సముద్రగిరినదీ వనములను సింహళద్రవిడాదిదేశములను విమానముపైనుండి చూచుచు, వర్ణించుచుఁ, బ్రయాణము చేయుచుండును. ఇది మహాకవి కాళిదాసు మేఘదూతము నందుచేసిన వర్ణనము వంటిది. కాళిదాసు ఉత్తరభారతమును వర్ణింపఁగా మురారి కవి యనర్ఘరాఘవనాటక సప్తమాంకమునందు దక్షిణభారతమును వర్ణించెను. అట్టివర్ణనమునందు మందరపర్వత ప్రసక్తిరాగా శ్రీరాముఁడు దీనిమూలముననే లక్ష్మిపుట్టినది. లక్ష్మిపుట్టుటచేతనే మానవజాతిలో శ్రీమంతులు, దరిద్రులు అను రెండు తెగలేర్పడినవి. లేనిచో నెంతబాగుండును అనియనెను. అట్టి భావము గల మురారి శ్లోకమును, దాని యనువాదమును జూతుడు,

శ్లో. "తత్రావ్యక్ఫణిరాజ రజ్జు కషణాం సంబాధ వక్షశ్ఛిదా
మాతారుంతుద మప్యహో! కథమయం మంథాచలః సోఢవాన్,
ఏతేనైవ దురాత్మనా జలనిధే రుత్పాద్య పాపా మిమాం
లక్ష్మీ, మీశ్వర దుర్గత వ్యవహృతి వ్యస్తం జగ న్నిర్మితమ్"

మ. "విను,రూఢోరుగరుచ్ఛిదాభ్రవణ ముహుర్వేధ వ్యథాహేతులో
చనకర్ణాధిప రజ్జు కర్షణముఁదా సైరించి యీ దుష్టమం
థ నగంబాకలుషాత్మయై సిరి సముత్పాదించి, లోకంబహో
యనిశం బీశ్వర దుర్గత వ్యవహృతి వ్యస్తంబుగాఁ జేయదే?"

ఆతరువాత సింహళాదిదేశములను, తామ్రపర్ణీప్రభృతి నదులను జూచుచు,.

వర్ణించుచు, గుణదోషములనగ్గడించుచుండగా విమానము ఆంధ్రదేశము సమీపమునకు వచ్చినది. అప్పుడు శ్రీరామునితో విభీషణుఁడిట్లు వర్ణించి చెప్పును. మూలమును అనువాదమును తిలకింపుడు,

"దేవ! ప్రణమ్యతా మయ మాంధ్రవిషయలక్ష్మ్యాః సప్తగోదావర
హారకలాపైకనాయకో భగవాన్ భీమేశ్వరః, అయంహి,

శ్లో. తత్తాదృక్తారకాటవీ విజృంభణ పరిత్రాసాదిన ప్రభక్త్రాతా
వామార్ధేన తదేకశేషచరణం బిభ్రద్వపుర్భైరవమ్,
తుల్యంచాస్థి భుజంగ భూషణ మసౌ భోగీంద్రకంకాలకై
ర్బిభ్రాణః పరమేశ్వరో విజయతే కల్పాంతకర్మాంతికః"

గీ. "నావుడు విభీషణుఁడు దక్షిణంబు సూపి
తెలియు మిట్లను నిదె యాంధ్రదేశలక్ష్మి
పూను గోదావరీహారమునకు నాయ
కంబు భీమేశలింగంబు గానవయ్య!

మ. అలకాలంబునఁ బుట్టి బిట్టడరు నత్యంతాత్కటీధాటి భీ
తిలి వామార్ధము జార నేకచరణాప్తిన్ భైరవాభైన మే
నలరన్ శేష కళేబరంబును సమంబౌనట్టుగా గీకసా
హులు సొమ్ముల్గని లయాంత యాజ్ఞికతచే నొప్పారు
నీతఁడిలన్."

శ్రీరాముఁడు తాటకను వధించుట, యాగసంరక్షణము గావించుట, మొదలగు విశ్వామిత్రాశ్రమకార్యములు పూర్తిచేసిన పిమ్మట, రామలక్ష్మణులతోఁగలిసి విశ్వామిత్రుఁడానందమునఁ బ్రకృతివర్ణనముఁజేయును. రామలక్ష్మణులందులో పాల్గొని తాము వర్ణింతురు. చంద్రుని వర్ణించునప్పుడు చంద్రబింబమును గుఱించిన గుణదోషచర్చ జరుగును. చంద్రునికి "సుధాకర, అమృతకిరణాది నామధేయములున్నందువలన లోకులతనిని సుధామయుఁడనుకొనుచున్నారుగాని అట్టి విశేషమేమియులేదని చెప్పుచు విశ్వామిత్రుఁడిట్లు వాక్రుచ్చెను.

శ్లో. "స్మేరాదిశః, కుముద ముద్భిదురం, పిబంతి
జ్యోత్స్నాకరంబ ముదరంభరయ శ్చకోరాః,

అః కీదృ గ్గతిమునిరోచన దూషికాయాం
పీయూషదీధితి రతి ప్రథితోzనురాగః"

వెక్కిలు తమంతట తామే ప్రకాశించును. కలువలు సైతము తమంతట తామే వికసించును. వాటికి చంద్రాపేక్షలేదు. పొట్టనింపుకొను స్వభావముగల చకోరములు వెన్నెలముద్దలను నాకుచు క్షుత్తు నివారించుకొనును. అలాంటి చంద్రబింబమును అమృతకిరణుడని లోకము ప్రసిద్ధిగా మెచ్చుకొని ప్రేమించును. చంద్రుడు అతిమహిమునికంటె మహిమయు ప్రఖ్యాతియు గలవాడేమి కాదు. ఈ శ్లోకమునందలి భావమునకు 'ఉదరంభరి' శబ్దము ముఖ్యము. సంస్కృత వ్యాకరణసార్వభౌముడగు పాణిని మహర్షి "ఫలేగ్రహిరాత్మంభరిశ్చ" అనుసూత్రముచేత "ఫలేగ్రహిః, ఆత్మంభరిః" అను శబ్దములను నిపాతించెను. దేనిచో నీ శబ్దములిట్లు సిద్ధించునో మరియొకరీతిగా చెప్పను. "ఫలాని గృహ్ణాతి ఫలేగ్రహిః, ఉపపదస్య ఏదంతత్వం, గ్రహేరిన్ ప్రత్యయశ్చ నిపాత్యేతే," అనియు, ఆత్మానం బిభర్తి ఆత్మంభరిః, ఆత్మనో ముమాగమః, ఇన్ ప్రత్యయః" అనియు భట్టోజి వ్యాఖ్యానించెను. ఫలేగ్రహిః అనగా కొమ్మమీది పండ్లుమాత్రము తీసుకొనువాడని యర్థము. అమరకారుడు ఫలేగ్రహిః అనగా బాగా ఫలించునట్టి చెట్టు అనునర్థము చెప్పెను "స్యాదవంధ్యః ఫలేగ్రహిః". 'ఆత్మంభరిః' అనగా పొట్టనింపుకొనువాడు లేదా తన సంగతి మాత్రము చూచుకొనువాడు అని యర్థము "చాత్కుక్షింభరిః" సూత్రమునందలి 'చ' కారమువలన 'కుక్షింభరి' శబ్దము గూడ సాధువేయని చెప్పెను. ముమాగమము నిపాత చేయనిచో "ఆత్మభరి, కుక్షిభరి" అని యగును. ఇట్లు కుక్షిశబ్దమును సైతము భట్టోజి సాధించుటకు కారణము "కుక్ష్యాత్మనోర్ముమితి వక్తవ్యమ్" అనుపతంజలి భాష్యవచనమే. అమరసింహుడుగూడ "ఆత్మంభరి, కుక్షింభరి" శబ్దములనే అమరమునందు చెప్పెను. "ఉభావాత్మంభరిః కుక్షింభరిః స్వోదరపూరకే" కాగా "ఉదరంభరి" శబ్దము అపాణినీయ మైనది. అయినప్పటికిని ఆ శబ్దమును పై శ్లోకమునందు మురారికవి "ఉదరంభరయశ్చకోరాః" అని ప్రయోగించెను. కవులు నిరంకుశులుగదా! యనుట మామూలు మాట. బహువ్యాకరణవేత్తయు, గురుశిష్యుడునైన మురారి యెడల నామాట అంత సమంజసముగా నుండదు. అని భావించిన సిద్ధాంత కౌముదీకారుడు "చాంద్రాస్తు ఆత్మోదర కుక్షిష్వితి పేఠుః" అని చెప్పెను. చాంద్రవ్యాకరణము వలన "ఆత్మంభరి,

ఉదరంభరి, కుక్షింభరి" శబ్దములు సాధువులగును, నవ వ్యాకరణవేత్తయైన మురారికవి ప్రయోగించిన "ఉదరంభరి" శబ్దమును గురించిన యనుమానము మనకుండదీరును. భట్టోజీ కంటే ముందే జన్మించి వ్యాకరణశాస్త్ర విశేషములన్నిటినీ యెఱిఁగిన ఆంధ్రానర్ఘరాఘవకర్త 'ఉదరంభరి' పదమును తన యనువాద పద్యమున విడువక ప్రయోగించుట ప్రశంసనీయము,

చం. "సకల దిగంతముల్ కడు ప్రసన్నములైనను, గైరవాచ్ఛకో
రకతతి ఫుల్లమైన, నుదరంభరులైన చకోరపాళి చం
ద్రికలను మెక్కి-మెక్కి పరితృప్తి వహించిన, న్నతినేత్ర దూ
షిక యగు నీతనిన్ తగునె చేరి సుధానిధి యంచునెంచగన్?"

శ్లో. "పార్శ్వే త్రయాణా మేతేషాం ఋక్సామయజుషా మివ
రూపాభ్యాం విధిమంత్రాభ్యా మథర్వేవ ప్రదీప్యతే."

జనక శతానంద విశ్వామిత్రులు ఋగ్వేద సామవేద యజుర్వేదములవలెనుండఁగా వారి సమీపమున నున్న రామలక్ష్మణులు విధి మంత్రములతోఁ గూడిన (విధి=అనుష్ఠానము) అథర్వ వేదములవలె నున్నారు. ఈశ్లోకమునందలి వైదిక సంప్రదాయమును చక్కఁగా నెఱిఁగి యుండుటచేత నిట్లు తెనిగించెను.

కం. నిగమ త్రయంబు చెంగటఁ
దగు విధిమంత్రా హుతుల నథర్వము నా ని
మ్ముగురి కడన్ సహజోన్నత
మగు నివ్వటుయుగము మిగుల నందంబయ్యెన్

త్రయీశబ్దమునకు ఋక్సామ యజుర్వేదములే యర్థము గనుక "నిగమ త్రయంబు" అని సంగ్రహించెను. అప్పుడు జరుగఁబోవునది రావణవధాదికము గావున నథర్వవేద యాగమని చెప్పఁదగిన యుద్ధమున కనుకూలించు నట్లుగా, రామలక్ష్మణులు విధి, మంత్రములుగాను, వారివలనఁ జరుగఁబోవు రాక్షసవధ ఆహుతులుగాను వర్ణింపఁబడెను. ఇట్లు మూలమును చక్కఁగా నెఱిఁగి యనువదించును. మూలాతిశాయియైన విషయమును ప్రకృతోపయోగిగా జేసి శైలిని కుంటువడనీయక కావ్యమును నడపుటలో శ్రీనాథునివంటి చాతుర్యము గలవాఁడనుట కీ క్రింది పద్యములు ఉదాహరణములుగా నొప్పును.

శౌష్కలుని వచనములు : హా వత్సే! సుకేతునందిని! తాటకే! కథ మీదృశాన్మనుష్యాడింభాంత్త్వాదృశో దైవదుర్విపాకస్తే సంవృత్తః? (మూలము)

గీ. హా! సుకేతుపుత్రి! యక్కజంబగు నీదు
లావుఁ బెంపు దక్కి దైవవశత
నొక్క నరునివలన నుక్కడఁగితి వెట్లు
తగరుఁదాకఁ గొండ వగిలినట్లు

ఈ గీత పద్యమునందలి చివరిపాదము మూలాధికమే యైనను ప్రకృతార్థ సౌందర్యము నినుమడింపఁ జేయుచున్నది.

శ్లో. మాహేశ్వరో దశగ్రీవః క్షుద్రాశ్చాన్యే మహీభుజః
పినాకారోపణం శుల్కం హా సీతే! కిం భవిష్యసి?

గీ. పరమశైవ శిఖామణి పఙ్క్తిముఖుఁడు;
జమ్మిదూలమ్ములన్య రాజన్యకోటు;
లజగవారోపణము శుల్కమట్టుగాన
నెట్టులున్నదో! సీపూజ యయ్యెదు మహిజ!

ఇందలి "జమ్మిదూలమ్ము"లను పదము మూలమునందలి "క్షుద్రాః" అను పదమునకు వివరణము. జమ్మిగడ్డితో దూలము వేసినచో నది వంగి యిల్లే పడిపోవును. ఇతరరాజులు చచ్చు నెవవలని శౌష్కలుని యభిప్రాయము, దానికై 'జమ్మిదూలమ'ని ప్రయోగించి మూలమునకు వన్నెఁబెట్టెను. 'మాహేశ్వర' శబ్దమునకు "పరమశైవ శిఖామణి"యు సరియైనదే. ఇందలి పరమశబ్దము రావణాసురుని పిచ్చి శివభక్తిని సూచించును. శివధనుస్సు అయితేనేమి ? సీతకోసము తాను విఱిచివేస్తేపోదా ? యన్న శౌష్కలుని భావమును వ్యక్తము చేయును ఇట్లు కొన్ని స్థలములందు మూలమున లేని భావములను గాని పదములను గాని తన యనువాదమునందు జొనిపినప్పుడు మూలాతిశాయి సౌందర్యమును సాధించి తీరునేగాని చేతగాని యనువాదకునివలె వ్యర్థపదములను వాడఁడు, తెలుగు కవితాశైలిని భగ్నము చేయఁడు.

మూలమునందు మురారిచేతఁ బ్రయోగింపబడిన ప్రౌఢ ప్రయోగములను వివరించినచో నర్థమును, ప్రౌఢియుఁ దగ్గిపోవునను భావముచేత వానినట్లే శ్రీనాథుని వలెస్వీకరించును. "దౌర్భాగినేయుండు, అపత్యప్రత్యయప్రాప్తి

వణ వ మెవలయునవట్టివి. మూలము సంవలి రచన యెంత ప్రౌఢముగానున్న నంత ప్రౌఢముగానే యనువదించును. రావణుఁడు యుద్ధరంగమునకు వచ్చుటను మురారి యిట్లువర్ణించెను.

శ్లో. న్యంచన్నుంచ ద్ధరిత్రీస్ఫుత చరణభర శ్చంద్రహాసైకదృష్టి
ర్జ్యావల్లద్యోగపదోత్సుక సకలభుజాక్రాంత దిక్చక్రవాలః
క్రోధక్రూరాక్షి రక్తోత్పలరచిత వియత్తోరణ స్రంజి బిభ్ర
ద్వక్త్రాణి ప్రత్యనీక ప్రసరసరభసో నిర్జగామైవ దశాస్యః"

పై శ్లోకము ననువదింపవలసినచో సంస్కృత సమాసములను వాడియేతీరవలెను అప్పుడే వీరరసస్ఫూర్తి గలిగింపఁగల ఓజోగుణము నిలుచును.కనుక నీ రీతిగా ననువదించెను.

మ. సమద క్రూర విలోకహల్లక కృతాశాతోరణ స్రజ్మ్ముఖ
క్రముఁడై ఖడ్గవ రైకమానస వివల్గద్యోగపదోత్సుకా
సమ దోస్సంవృత రోదసీకుఁడయి విస్ఫారాంఘ్రి భారానతో
న్నమ దుర్వీస్థలుఁడై దశాస్యుఁ డరిసేనందాక నేతెంచెడిన్.

పైవిధముగా ప్రౌఢబంధము లేక మూలము సరళముగా నున్నప్పుడు తానును సరళముగానే యనువదించును. మచ్చునకొకటి, రాముఁడు రావణవధ చేసి యయోధ్యకు దిరిగివచ్చినప్పుడు వసిష్ఠుఁ డన్న పలుకులు,

"వత్స ! మాంగలికలగ్న మతిక్రామతి,''

శ్లో. తదిదం రఘుసింహానాం సింహాసన మలంకురు,
రాజన్వంతః ప్రతన్వంతు ముద ముత్తరకోసలాః

మ. అని, కాకత్స్థుగుఱించి మౌనియనునన్నా ! రామ! యేతెంచెఁగ
క్కన నిర్దోష శుభాంశ మాంగలిక లగ్నంబీవు సీతాన్వితిన్
మనుసింహాన్నత సింహపీఠిక రహింపంజేయు దానన్ జగ
జ్జనగీతోత్తరకోసలంబులిక రాజన్వత్తచే నొప్పుతన్'

మూలమున లగ్నపదమున కొక "మాంగలిక" పదమునేవాడి మురారి సంగ్రహించిన విశేషములను వివరింపఁదలచి" నిర్దోష శుభాంశ "విశేషణము లను గూర్చెను. ఇది జ్యోతిశ్శాస్త్రవేత్తృత. మూలమున" రఘుసింహా"అని

యుండగా రఘువుకంటె పూర్వుఁడై వంశమునకంతటికిని మూలపురుషుఁడైన మనువును పేర్కొనుట మిక్కిలి విశేషము.

ఇట్లు మూలార్థమునకే విఘాతముగను విరుద్ధముకాని యట్లును, మూలసౌందర్య మినుమడించునట్లును భాషాంతరీకరణముఁ జేసిన ఆంధ్రానర్ఘరాఘవ ప్రబంధకర్త శక్తి యసాధారణమైనట్టిది.

## తెలుఁగు నుడికారము

సంస్కృతమునందలి కృత్తద్ధిత సమాస క్రియా నామధాతు రూపములకు సంబంధించిన వ్యాకరణమును, లక్ష్య లక్షణ విశేషములను, గుర్తెఱిగి యుండినట్లే యీకవి తెలుఁగు వ్యాకరణ విశేషములను, తద్భవ దేశ్యముల యొక్కయు, అన్యదేశములయొక్కయు స్వరూపములను, తెలుఁగు జాతీయపదముల సొంపును నెఱిఁగి యుండెననుటకు ఈ యనూదితానర్ఘరాఘవము పలుచోట్ల సాక్ష్యముగా నున్నది.

*సమ్మదమూస్తు నభవ* : 'ఊస్తు' ఊను ధాతువునకుఁ బద్ధ్యార్థకము 'ఊన్తును' అని యుండవలెను పడదుగనుక ప్రతమునకు లోపముచేసెను.

*పాదుషాదత్తబంభద్ధంతి హయముఖ్యావస్తులు* : అన్యదేశ్యమైన 'పాదుషా' శబ్దమును సంస్కృత సమాసమునఁ గూర్చుటయొక విశిష్టత.

"*ధరవంతుకెక్కు కందనవోలిదేశంబు*" : 'వంతుకెక్కు' కువిభక్తికి ముందురావలసిన 'న' కారమును విడుచుట (వంతునకెక్కుగా ప్రయోగింపక పోవుట) "వంతుకువచ్చు సత్యగరువంబిక చెల్లదటంచు మానినీ" యని ప్రయోగించిన ముక్కు తిమ్మన వలెనే యతడును చేసిన ప్రౌఢప్రయోగము.

"*కాణయాచి*" : కాణాచి పదమునకు రూపాంతరము.

"*నేలదున్నకము*" : చక్కని తెలుఁగుసమాసము. (భావార్థమున 'క' ప్రత్యయము)

"*తలయేఱుగలిగి*" : తలపై నది గలిగియనియు, తలనొప్పిగలిగి యని యుశ్లేష. చక్కని అచ్చతెలుగుశ్లేష.

"*వెన్నెలరాయఁడు*": చంద్రుడు(ఒకవ్యక్తినిస్ఫురింపజేయుట ప్రస్తుతాంశము)

నానా వజీరులు : అన్యదేశ్యపదసమాసమున 'నానా' నువాడుట,
"తత్పురి యొంటరీలు" : చక్కని సమాసము. (ఒంటరీలనఁగా విలుకాండ్రు)
"భూవరుడు రెండింటికిని జెడ్డ రేవఁడగుమ" : చక్కని కూర్పు.
"ఏ విన్నపమాచరింప నెంతటివాడన్" : సహజశైలి.
"ఇంక నీయెడఁ గర్తవ్యమెద్దియనిన, ననఘ! యింతకు మమ్మింత యడుగ వలెనె?"
"ఇది దూరం బిది చేరువ, యిది యోచున్నది యిదైన దిది యిఁక కానున్నది
యనక యడరు నన్నిట, సదమలమతి యతికి దివ్య చతుర్మహిమన్"
రెండును చక్కగా నడచిన శైలి కలవి."

కం. "జొటజొటఁ జెమటలు వడియఁగ,
తటతటమని గుండెయదర, దగ నిగుడ, హుటా
హుటి నచ్చటి కరుదెంచెన్
జట లూడగ నొక్కవటుడు సంత్రాసమునన్"

ఇది, సదాచారుఁడను మునికుమారుఁడు జాతిప్రతిమ యహల్యయై తన కెదురుగా వచ్చినప్పుడు భయపడిన దృశ్యము. అంతేకాక నతఁడు. "దాని యుద్వృత్తిఁగాంచి, గుండెవగిలినఁ బైగప్పుకొన్న నార పంచె గుడ్డయు నచటనే పాఱవైచి, చావుపరుగున వచ్చితినో వయస్య" యని చెప్పుకొన్న మాటలు సహజవర్ణనము.

"ముప్పుఁదెలియక చీకటితప్పు సేసె, గొబ్బునతన, కుతిఁదీర్చుక దుమ్ము దులుపుకొనుచుం జనియెన్" ఇవి యింద్రుఁ డహల్య యెడలఁ జేసిన చేష్టలు; చక్కని నుడికారము.

"వేలునాకి యుపాసంబు గొనిపోయినటుల" తుచ్ఛసుఖమువ కాశపడి యహల్యా పాతివ్రత్యమును గోలుపోవుటకు దృష్టాంతవచనము.

గిటగిటనదంతకుంతముల్ గీటికొనుచు గౌతముని కోపవర్ణన.

"విన్నుద్రోవరిదొర" గగన సంచారులకు రాజు (ఇంద్రుడు) చక్కని యాచ్ఛిక సమాసము. ఇట్టివే "ముదిగోద" "ఒలికిబూది" "బొంతబట్ట" మొద

లయిన చిఱుసమాసములు. ఇప్పటికిని గొన్ని ప్రాంతములందున్న 'అగ్గువ' (చౌక) 'ఎద' (భయము) ఎదబడు (భయపడు) మున్నగు వ్యావహారిక పదములను వాడుటచేత నవి యచ్చమైన దేశ్యములే యని భావింపనగును.

"ఖరదూషణాది రక్షః ప్రధానోదగ్ర
తరమైన యొకకొంత తనబలంబు
నలవాలికిని వెన్నుబలముగాఁ బొలదిండి
పాదుషా వెస నామ జాదువనుప,"

రావణుఁడు తనమిత్రుఁడైన వాలికి సహాయముగా కొంతసైన్యమును బంపెనని యర్థము. 'పాదుషా' పదము నితఁడు రాజశబ్ద పర్యాయముగా వాడును. అది యిచ్చట 'పొలదిండి' యను నచ్చతెలుఁగు పదముతో సమసించినది. 'పొలదిండిపాదుషా' అనఁగా మాంసాశనులైన రాక్షసులరాజు, అనగా రావణుఁడు. నామజాదు పారశీక పదము. 'నామ్‌జద్' అనగా కేటాయించి యిచ్చుట. ఆయన్య దేశ్యమును 'నామజాదు' అని వ్యవహరించుటచేత దానిని ప్రయోగించెను. ఇట్లు నాటి పశ్చిమాంధ్ర దేశమున వ్యవహారమునందున్న కొన్ని పారశీక పదములను వాడుట యీ కవి కిష్టము. వాటిని చక్కని సమాసములందును, విడిగాను వాడెను. "ఖానులు, వజీరులు, తురకలు, ఉరుసు, అబిసీలు మసూదుఖాను, సిద్దియంబరు, సురుమాయి మొదలయిన పారశీక పదలమును ఉచిస్థానములందుఁ బ్రయోగించెను. "కంచుమించుగావె" ప్రాణములుకిక్కిరిబిక్కిరి యగుట.

"తలపొలంబున కేగి దగదప్పులకు నోర్చి (దగవచ్చింది=ఆయాసము కలిగినది. నేటికిని వ్యవహరింపఁబడుచున్నది). "రొమ్మున గ్రుడ్లువెడలంగ" మోయలేని బరువును మోసినట్లు చెప్పుటలో వ్యవహరింపబడుచున్నది. "పడమర పడంతి"=పశ్చిమ దిగంగన, ఇక తాటకవచ్చునప్పుడు,

సీ. చుఱుకు చూపుల మించ నుఱుకు జేగురుగ్రుడ్లు
దింద్రించి బిఱబిఱ ద్రిప్పికొనుచు,
పునుక కంచమున నించిన క్రొత్త నెత్తురుల్
జుట్టుజుట్టున సారె జుట్టుకొనుచు,
..................................

నుద్ధవిడివచ్చె వినువీధి గ్రద్దలాడఁ
దాటకానామ యొక్క నిశాటభామ

ఇది యచ్చమైన యాంధ్రీకరణమే. ఇట్లనేక పద్యములు నడచినవి. "తగరుదాకఁ గొండవగిలినట్లు" రామునిచేతిలో తాటక చచ్చుట యట్లున్నదట ప్రథమావిభక్త్యంతములైన పదములపై వచ్చు "కచటతప" లకు "గసడదవా" దేశములనే చేయుట యీ కవి కిష్టము. అది లోకవ్యవహారమునకు సన్నిహితమై యుండునని తలంపుగా నోపును.

"ఒళ్ళెఱుంగ కింత త్రుళ్ళిపడితివి" గర్వించెనని యర్థము.

నగి, నగిరి, నగిరందరున్ పకపకాయనుచున్ యని ప్రయోగించెను. ఇప్పటికిని "నగితిమి" అని వ్యవహారమున కలదు.

కం. నావుఁడు నగి యతఁడవ్వసు
ధావరునకు ననితివి నాపదలు గీపదలున్
రావణునకుఁ గలిగినఁగద
భూవర! మావేదమంత్రములు గింత్రములున్.

"కోడిగంబులు" కోడిగమనగాఁ బరిహాసము, నేటికిని వ్యవహారమునందున్నది. "ఎట్టులున్నదో నీపూజయిఁక మహీజ!" "తల్లిబడిపిల్ల" యనుమాట యెల్లజనులు పలుకుదుర కాదెలోకటి పాటగాగ" "ఏమంటివోరి యేమంటివిరా?"

"జన్మపుకూటిచే బలిసి సాంద్రతరాంగవళీ సమున్నతిన్ గన్నులు పూడి నేడు బలఘస్మరుఁడేగతి నున్నవాఁడొకో" (కన్నులుపూడి బలుపునకు సూచన)

"ఈబేరజంపు రాచమిఱుగురు" చక్కని సమాసము. వ్రాయసకాఁ డుత్తరమును వ్రాసిన తీరు నిట్లు వర్ణించెను.

కం. "తెలి దంతపు టొంటలోపలి
గిలకల గంటంబు కేలఁ గీలించి వచో
లలనా పరమణినూపుర
కలనాద మెసంగ వ్రాసి గణగణఁ జదివెన్"

ఇది యీకవి గంటమే యగునేమో!

ఆ వ్రాయసకాఁడు వ్రాసి పంపిన యుత్తరమిది,

సీ. "శ్రీమన్మహారాజశేఖరులగు జనకేంద్రు
లుత్తర కోసలేంద్రులైన
పంక్తిరథతనూపతిగారి చాలమనుష్యులకుఁ
బుత్తెంచు ప్రియోజనంబు,
జగదేక దేశికుండగు కౌశికునియాజ్ఞఁ
దశరాఘవునకు సీతామహిళను,
లక్ష్మణునకు నూర్మిళాకుమారిని, భరతునకు మాండవిని,
శత్రుఘ్నునకును

గీ. కుసుమసమమూర్తి శ్రుతికీర్తి నొసఁగినాము;
పరిణయమునకు సకుటుంబబాంధవముగఁ
దాము దయచేయవలెనని దశరథేశ్వ
రులకుఁ జాలుమనుష్యులు దెలుపవలయు".

మూలమునందు వాచికసందేశమును శతానందునిద్వారా పంపి దశరథుని రాపించినట్లున్నది. కాని యదిరాజమర్యాదకు చాలదని తెలుఁగుదేశపు సంప్రదాయము ననుసరించి యీ లేఖను సృష్టించెను. ఇది వ్యవహారమునకు దగ్గరగా నుండుటయేగాక ఒకరాజు మరియొక రాజునకు వ్రాయించు పద్ధతినిఁ దెలుపుచున్నది. ఇక్కడి చాలు మనుష్యులు (ఉన్నతోద్యోగులు) అక్కడి చాలుమనుష్యులకువ్రాసి, రాజులకు వాగ్రూపముగా మనవి చేయవలెను. అది సంప్రదాయము. ఈ యుత్తరమును దీసికొని శతానందుఁడు పల్లకినెక్కి అయోధ్యకు వెళ్ళెను.

'రేఁగొమ్మచుట్టింపురేక' (బాలచంద్రుడు) "పాఁపరాజన్నిదము"
"కోడెమిటారిచన్నుఁగవ", చికిలివజ్రపుబాసికములు, "జిగికుంకుమపు నల్లుసరిమి," "మేనిరసిమి," నునుజాళువాజన్నిదములు, ప్రొద్దువంగడంపు రాచపెండ్లికుమారులు, రెండందబులు ఇట్టి యాచ్ఛికమాసములు కోకొల్లలు

"మిగ్రింగిన కడులకు జవు లడుగంగానేమిటికి !"
(అయినపనిని మళ్ళీ త్రవ్వుటయేల ? అనియర్థము).

“వ్రేలునాకి యుపాసము గోలుపోవుట”
(స్వల్పమునకై అధికనష్టమును బొందుట).

“ఎదురులేనిచోటఁ గదురువాఁడి”

‘గుడిమ్రింగెడువానికి గుడిలింగము ప్రవడియముగాదే’

‘కొంచపుఁబిడుగులకుఁగాదె కొండలు పగులున్’

‘నీవున్ బలుపోటరివలె వెఱవక పలికెదలిటు, వెన్నకౌర !
పండులువచ్చెన్’

(ఇది పరశురాముఁడు తనపైఁ గోపించిన జనకునితో నన్నమాట)

‘బూచిబూచియని నన్నహహా ! వెఱపింపఁజూచెదు
అద్దిరాయయ్యో పసివమెత్తె !’ అనినేఁడేమికూరఁగోయఁబో
యెనే! (క్రుద్ధుఁడైనపరశురామునితో శ్రీరాముఁడు పరిహాసించిపలికిన మాటలు).

‘చిచ్చైనవేళ నెవ్వనితరంబు బావిఁద్రవ్వంగ’

ఇట్టి లోకోక్తులను భావానుకూలముగా, మూలమునకు వన్నె తెచ్చునట్లుగాఁ ప్రయోగించును.

“తెలుపంగఁబట్టదు” (తెలుపవలసినపనిలేదనియర్థము) “పట్టదు” అక్కఱలేదు అనునర్థమున నిప్పటిని వ్యవహారమునందున్నది “వింతసుద్ది” చిత్రమైన వార్త. ‘సుద్ది’ కన్నడమునఁగూడ వాడుకలోనున్నది (ఏనుసుద్ది ?) “వీరస్థలియయ్యె క్ష్మ్రాదశముఖుండాఁబూని” దీర్ఘాణాంహస్వస్స్యాత్ అను చింతామణి సూత్రమువలన దీర్ఘాంతములైన సంస్కృతపదములన్నిటికిని రావలసిన హ్రస్వము “నచైకవర్ణేఽపి” అను చింతామణిసూత్రముచేతనే నిషేధింపఁబడుటవల్ల ‘క్ష్మా’ శబ్దము హ్రస్వముగా మారకయట్లేయుండి భూమి అనునర్థము నిచ్చుచున్నది. శ్రీ హ్రీ శబ్దము లేక వర్ణములుగాఁబరిగణింపఁబడుటచేత ‘క్ష్మా’ శబ్దముసైతము ఏకవర్ణమునుగానే యీ కవిపరిగణించి ప్రయోగించెను. ఇది ప్రథమాంతపదము.

“దేవతలకంకిత మూన్పుట” ఊను ధాతువునకు ణిజంతము (ప్రేరణార్థకము) దానిపై భావార్థక ‘ట’ కారము. ఆంధ్రశబ్దచింతామణి “భావే టవర్ణ

కో స్తే సర్వేషాంచ క్రియాపదానాం స్యాత్" అని చెప్పిన సూత్రము నందలి "సర్వేషాం'' అనుపదమునకు అన్నివిధములైన క్రియలు అనగా ప్రేరణార్థకములు సైతమనియర్థము కనుక పై విధములైన ప్రయోగముల నితఁడు విరివిగాఁజేసెను.

"జన్నపుకూటిచే" షష్ఠీసమాసమున పుగాగమము. ''శాంతదూర పుటవనికి" ఇది సముద్రపుటొడ్డువంటిది.

ఇట్టి తెలుఁగునుడికారముగల పదములతోను, సంస్కృతసామశబ్ద ప్రయోగములతోను, "జటిధూర్జటి, జటికిరీటి" వంటి నూతనప్రయోగములతోను గూడి సంస్కృతాంధ్రవ్యాకరణములకుఁజక్కని యుదాహరణములు కాదగిన సుశబ్దములతో విరాజిల్లుచున్న యీ కావ్యము తిమ్మభూపాలునియొక్కయు నతనికి సహాయముచేసిన కృష్ణసత్కవి యొక్కయు ప్రౌఢిని వేనోళ్ళచాటు చున్నది. పద్యమునందు వాడిన పదములు సంస్కృతభాషకుఁజెందినవైనను, అచ్చతెలుఁగు బాసకుఁజెందినవైనను, అర్థపుష్టి, సరళత, సాధుత్వము మున్నగు గుణములుగలిగి ధారాళమైనశైలితో పద్యమును నడిపించుట యందీకవి శేఖరు డందెవేసిన చేయి.

# పాత్రౌచిత్యము

అనూనరసభావ భవ్యమ్ముగాను, పురాతన పుణ్యశ్లోక చరిత్రంబుగాను, అనవద్య హృద్య గద్య పద్యాత్మకంబుగాను రచించిన ఆంధ్రానర్ఘరాఘవ మహాప్రబంధ నాటకమునందు కవి పాటించిన పాత్రౌచిత్యము.

## శ్రీరాముఁడు

ఈకావ్యమునందు రామపాత్రచిత్రణము వీరరస ప్రధానముగా నిర్వహింపఁబడినది. రాముఁడు ఆదర్శప్రాయుఁడైన మహావీరుఁడు. వీరరసమునకు ఆలంబనమైన యితఁడు ప్రతివీరులైన వాలి, పరశురామ, రావణాసురుల యెడల మచ్చరేని యుత్సాహముతో శౌర్యమునఁజూపిన ధీరోదాత్త మహానాయకుఁడు. విశ్వామిత్రుని యజ్ఞవాటికా సమీపమునకు వికటాట్టహాసముఁ జేయుచు వచ్చిన తాటకను జూచి కళాధరాది మునికుమారులు భయభ్రాంతులై విశ్వామిత్రునితో విన్నవింపఁగా నతఁడు శ్రీరామునితో "మఖంబు నడంచుచున్న తాటకన్, దునుమఁగ విల్లుగైకొనవె దుష్టనిశాటి నుపేక్షసేయకన్" అని తాటకా వధకు ప్రోత్సహించును. కాని రాముఁడు మనస్సులో జుగుప్స, దయ రేకెత్తగా మునితో "అనఘా, యీయాఁడుదాని నగునే చంపన్?" అని ప్రశ్నించును. కాని కళాధరాది మునికుమారుల యార్తనాదములు విని "బెదరక నిలువుఁడు, ఈనిశాచరవారంబులఁ ద్రుంచుటెంతపని యని మరలనుత్సహించును. విశ్వామిత్రుఁ డుత్తరప్రత్యుత్తరముల కిక వలనుగాదు ఉపద్రవము సమీపించిన దని తొందరపెట్టును. లక్ష్మణుఁడు స్త్రీవధ యని భావింపనేల "మౌనుల, ఆ వాక్కులగాదె శాస్త్ర మనువర్తించున్" అని స్త్రీవధను సమర్థించును. కాని రాముడు తనలో తాను తర్కించుకొని, పూజ్యులు ధర్మాధర్మవిదులు నైన గురువుల యాజ్ఞచేత చేసినది స్త్రీవధయైనప్పటికిని అధర్మముకానేరదు. ఇక తెలియని లోకులు నన్ను అపకీర్తిపెట్టినను దానికి వెరవక యీ రాక్షసీవధ చేసె దనని యాత్మలో నిశ్చయించుకొనును. మరల సంశయముతో "త్రిజగంబుల యాడికచేతను, ఆఖిలజనములు వాయించునట్టి అస్మదపకీర్తిపటహంబు విని మాకులగురువగు వసిష్ఠుఁడు తన జ్యోతిర్మయాత్మలో లజ్జచేత కుందునేమో! యని ధర్మసందేహమునఁబడును. ఇంతలో సుబాహుడు మునులను హింసించి తన ఖడ్గధారలకు గురిచేయుటకు పూనుకొనును. మునుల

హాహాకారములు విని రాముఁడు సంభ్రమముతోలేచి ధనుర్బాణములు ధరించి విశ్వామిత్రుని సన్నిధికివెళ్లి "స్వామి? నేను మనువంశముఁబుట్టి విల్లునుబట్టి సూర్యవంశమునకే కళంకమును దెత్తునేమో! యని సంశయించుచున్నాను. అయినప్పటికిని మీ పలుకులు సంశయంబు నెడఁబాపెను జేసెద దర్పధ్వంబికన్" అని తాటకావధనుజేసి, రాక్షససైన్యమును నిర్మూలించి, తిరిగివచ్చి, లక్ష్మణుని యెదుట మనకు సూర్యుఁడు, వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడును గురువులు. కౌశికుని యాజ్ఞచేతనే చేసినదైనప్పటికిని ఈ స్త్రీహింస నామనస్సును లజ్జింప జేయుచున్నది. ఆకులపరచుచున్నది. పినుక ఆశ్రమప్రాంతమును జూతము రమ్మని ప్రకృతి విలాస దర్శనమును జేయుచు మనశ్శాంతికై ప్రయత్నించును. ఇట్లు రామునియందు పాపభీతిని, అధర్మభీరుత్వమును, స్త్రీవధవలన కలిగిన లజ్జను చిత్రించుటచేత శ్రీరామునియందు మహానాయకుఁడైన ధీరోదాత్తుని కుండవలసిన దయాశాలిత్వము, ధర్మపరాయణత్వము వ్యక్తమగుచున్నది.

శివధనుర్భంగవార్త చెవినిఁబడిన పరశురాముఁడు క్రోధావిష్టుఁడై వికట భ్రుకుటీ నర్తన మదరగా విదేహులారా! దాశరథి యైన రాముఁ డెచట నున్నాడుః చూపుడు, అని పిచండిలాగ్రహ గ్రస్తుఁడై,

మ. "స్ఫుటగర్వార్జున దోస్సహస్ర నళక ప్రోద్గచ్ఛదస్రార్చి రు
ద్భటమౌ మత్పరశూగ్రవహ్ని నృపసత్త్వామాత్ర పూర్ణాహుతిన్
బటిమంగాంచక నేఁడుచూడుఁ డకటా! ప్రాల్మాలెడుం జాల నా
కటఁ దత్త్వాక్కబళైకభుక్తి విఘసత్పుత్రాధమ శ్రేణికిన్."

అని కటూక్తివికటంబుగా సమీపమునకు వచ్చినప్పుడు రాముఁడు అవార్య ధైర్యసంభ్రమములు గలవాఁడై భయపడక "నిటలాక్షుని ఉపదేశములను షణ్ముఖునితోపాటుగా నెఱిఁగి, యోధశ్రేణిలోను, మహాజటి సింహములలోను అప్రతిమ తేజస్ఫూర్తితో వర్తించునట్టి యీ పుణ్యాత్ముడైన భార్గవరామునిఁజూచు భాగ్యము లభించెగదా!" యని సంతసించును. పరశురాముఁడు పల్కుచున్న వీరాలాపములు వినుచు నతని ఘనతను లక్ష్మణునితోఁ గొనియాడుచుఁ జెప్పెను. ఇఁక తనను సమీపించి "ఓరి నృపాలడింభ? మద దంభ క్రూర నానా కుభృత్కుల సంహారి కుఠార భీకరుఁడనైన నన్ను సింహము వద్దకు కురంగము చేరినట్లు చేరితివి, మిక్కిలి హర్షించితిని" అని యనగా శ్రీరా

ముదు దేవా! మీరానతిచ్చినది సత్యము, మీకును నాకును గల యంతర మట్టిదే యని అకుటిలమైన నిర్మలభావముతో ననును. అంతేకాక,

మ. "జనకుండా భృగుమౌనిచంద్రువలనన్ సర్వాగమార్థావలో
కనమున్, ధూర్జటిచే శరాసనకళా కౌశల్యమున్ గాంచి, వా
జ్మనసాతీత భుజాబలార్జిత మహిన్ బ్రాహ్మదేవతాకోటి కి
చ్చిన నిక్షత్రపతిమ ప్రభావమహితున్ సేవించెదన్ భార్గవా!"

అని ప్రస్తుతించును. ఆ స్తుతికి సంతసించిన పరశురాముఁడు రాముని భుజ వీర్య సౌజన్యములను మెచ్చుకొనుచునే, కార్తవీర్యార్జునుని రక్తముతోఁ బితృతర్పణముచేసి క్షత్రజాతి సంతతిని భుజించి చల్లాఱుచున్న నాక్రోధాగ్నికి నీవు శివకోదండ దండమును విరిచి యింధన మయితివి. అని పలుకగా రాముఁడు మౌనినాథ! నిన్ను మఱచి బాల్య చాపల్యముచేత నేను ఉగ్రతరమైన ఉగ్రుని శరాసనమును ఎక్కిడఁబోగా అయత్నముగ నది విరుగుటవలన నిట్టి యమంగళము దాపురించినది, యీనా తప్పును క్షమింపుమని వేడుకొనును. కాని పరశురాముఁడు రెచ్చిపోయి ఓరి నృపడింభక! మన్మథమథనుని ప్రథమ శిష్యుఁ డనై పరశు ధరుఁడనైన నన్ను గణింపవా? నీ మహిమను నీవు చెప్పకయే చెప్పు చున్నావు! ముయ్యేడు మాఱులు వసుంధరను అక్షత్రియను జేసి గెలిచి తిని, నాకరము ఉదగ్ర క్రూర సంగ్రామ ఖేలన సన్నద్ధ కుఠార భీకరమైయున్నది కాలక్షేపములు సైపదు, ఇక నీవు విశ్వామిత్రుని వద్ద సంపాదించిన అస్త్రశస్త్ర ములను తెంపుతో ధరింపుము, ఓరి! భార్గవుఁడు జాతి మాత్రమున పూజ్యుఁడను మాటవిడువుము, క్షత్రవధ మహాయజ్ఞమునందు క్షితితలము నంతయు దానము చేసిన సోమయాజికి "నీకేల శుష్కహేతి తగదు విడుమయ్య భృగురామ! సుగు ణధామ! అని నన్ను కొనియాడుచున్న జనకుని పలుకులు వినుచుఁ గాలక్షేపము చేయుచున్నావు, సీరధ్వజ! నీమాట వినుటకిది సమయముకాదు; దశరథా! యేల ప్రతిమాలెదవు? "చండికానాథ కోదండ ఖండనమున, నొదవి మది నేర్చు కోపమహోగ్రవహ్ని, రఘు విదేహ కుటుంబ ధారాళబాష్ప సంతతాసేకమునఁ గాక శాంతమగునే?" అని విజృంభించును అడ్డము వచ్చిన జనక దశరథులను తృణీకరించివైచును. అప్పుడు రాముఁడు జామ దగ్న్యః రాముని ప్రతిమాలిన నిక లాభము లేదని వీరాలాపములు పలుకును. దానికి మండిపడిన పరశురాముఁడు "ఓహో! సప్తద్వీపద్వీపాభ్యంతరవర్తిమహీ

పాలకులార। హెచ్చరిక! ఎవఁడు తల్లితలనుద్రుంచి, క్షత్రియరక్తపానముచేసిన కుఠారమును ధరించి ధరణిని నిఃక్షత్రియను జేసెనో, ఎవని బాణముచేత క్రౌంచాద్రికి గల్గిన వ్రణము నుండి హంసల రూపమున నిప్పటికిని యెముకలు రాలునో ఆ భార్గవ రాముఁడు పునఃక్రోధమును బూనెను. ఓరి తోయజాప్త వంశపాంసనః రాచకసీసపు మొటికాః నృపకీటమః మొదట కార్తవీర్యుఁడు నా తండ్రి హోమధేనువు కొఱకై ఈ నాధనుస్సునకు అనేక రాజక వధ స్వాధ్యాయమును నేర్పెను, ఆక్రోధమహాగ్నిని నీవు నేడు మరల గురు ధనుర్భంగా జ్యధార చేత వెలిగించితివి. రమ్ము యుద్ధమున కని కఠోరముగాఁ బల్కుట చేత రఘురాముఁడు కోపమువచ్చి, ప్రాతగిల్లిన నీకీర్తి పతాకను వర్ణింప నేల చూపుమా నేడు నీశౌర్యముఁ జూడవలయునని" తెమ్ము ధనువు నని లక్ష్మణుని జూచి పలుకను. అప్పుడు పరశురాముఁడు "ఓరీ! పరమశివుఁడు బహు పర్యాయము లెక్కువెట్టుట చేత సారహీనమైయుండిన శివధనుస్సు విరుగుటకు నీవు నిమిత్తమాత్రుఁడవు. ఆమాత్రమున కింతకావర మేందుకు? మదీయ ధనుస్సు, ఇది దైత్యవైరిది, నృపతి ఖండన పండమైన దీనిని ఎక్కిడుము, చూతము నీ భుజదర్పము" అని రామునికా వైష్ణవ ధనుస్సు నిచ్చి తాను కుఠారమును ధరించి సమర యోగ్యమైన స్థలమునకుఁ జేరఁబోవును, శ్రీరాముఁడా ధనుస్సు నెక్కువెట్టి బాణమును గూర్చి యది వ్యర్థము గాకుండుటకై మునీంద్రా! ఈ మార్గము సరిగాలేదు అని బాణమును విడిచి భార్గవుని మార్గమును, వృక్షలతాదులను ఛిన్నములుగాఁజేసి, చక్కగా నేర్పరచెను. అప్పుడందఱును హర్షధ్వానములు చేసిరి. రాముఁడంజలి బంధముఁ గావించి "మహాత్మా! యుద్ధమునకుఁ బిల్చిన క్షత్రియుల యెడల మాకు అస్త్రము శాస్త్రోక్తము, విప్రులయందు ఇక్ష్వాకులు అనాయుధకళా జల్పాకులు అట్టి పావనాన్వయమునఁ బుట్టియు ఈ యవినయము నాచరించినందుకు క్షమింపు" మని వేడెను. అప్పుడు పరశురాముఁడు,

"వత్సా! వివరించెదన్ వినుము, తావక వైష్ణవ దివ్యతేజ మే
నీవిధిఁ జూడఁగోరి కినియించి తదున్నతిఁ గాంచి యద్భుతం
బావహిలంగ నిర్భరుఁడనైతి నొకింత హృదంతరంబునన్"

అని రాముడు చూపుచున్న మార్గమున నడచుచు నతని చిన్నారి ముద్దు గడ్డమును బుదుకుచు, జనక దశరథ యాజ్ఞవల్క్యులకు మోదమును గలిగించి

రాముని పెండ్లి కొడుకపు గమ్మని దీవించి వెళ్ళను. శ్రీరాముఁడతని మార్గమును కొంతసేపు సోద్వేగముగాఁ జూచి వెనుకకు మరలును.

ఈ ఘట్టము కథానాయకుఁడైన రాముని ఒకగొప్ప వినయశాలిగాను, గురుజనభక్తియుక్తుఁడుగాను, కులగౌరవమును గాపాడువానినిగాను, శాంత చిత్తుఁడుగాను, అప్రతిముఁడైన మహావీరుఁడుగాను ధర్మపరాయణుఁడుగాను చిత్రించినది. కనుకనే జనకచక్రవర్తి దశరథుని నభినందించుచు నిట్లనెను.

సీ. "జగదేక జీవాతు వగు రాచమగటిమి
మగుడనిల్పిన మేటిమగఁడు వాఁడె
భార్గవీయ భుజా విసర్గ గర్వోద్రేక
మణఁగరాచిన వీరవరుఁడు వాఁడె
వంశకర్తలలోన వనజాతవన బంధుఁ
గొనల కెక్కించిన ఘనుఁడు వాఁడె
వర్ణాశ్రమాచార నిర్ణేతయై ధాత్రిఁ
బాలింపఁ దగు ధర్మపరుఁడు వాఁడె

గీ. సేవ నేతెంచి నేత్రరాజీవయుగళి
నమృతపూరంబుఁ జల్లెడు నల్లవాఁడె
యఖిల కల్యాణగుణ వైభవాభిరాము
రాము నీక్షించితే ? పంక్తిరథ నృపాల !

సీతాకల్యాణ, భార్గవవిజయోత్సవములు మిథిలానగరమున జరిగిన పిమ్మట దశరథుఁడు నలుగురు పుత్రులతోను, నలుగురు కోడండ్రతోను దరలి అయోధ్యకు వెళ్ళనున్న సమయమునకైకేయి పంపినట్లుగా సృజింపఁబడిన కూటలేఖ వచ్చును. అందులో,

"స్వామి ! దేవాసుర సంగర భూమి ము
న్నంగీకరించిన యట్టి వరము
లవి రెండు నిప్పుడే నడిగెద భరతు న
శేష సామ్రాజ్యాభిషిక్తుఁ జేసి

గీ. లక్ష్మణునిగూడి జానకీలలనతోడఁ
దాపసాకృతిఁ బూని పద్నాలుగేండ్లు

దండకాటవి రఘురాము సుందరుని వి
నన్ను మన్నింపుఁ డింతియు విన్నపంబు."

అనియుండెను. అది చదివిన జనకుఁడు దుఃఖితుఁడై మూర్ఛిల్లెను.

దశరథుఁడు పిడుగుపడినట్లు తోచి నేలపైఁ గూలెను. వారిద్దఱికిని రాముఁడు శైత్యోపచారములు చేసెను. ఆ యుత్తరమును కన్నులకద్దుకొని, సంతోషముతో, అస్మదారాధన స్వబహ్మచారిణియైన మీ వదినెను తరలించు కొని ముందుగా బయలుదేరు"మని లక్ష్మణుని నియోగించెను. జనక దశరథులును, పౌరజానపదులును, దుఃఖాక్రాంతులై కైకేయిని దిట్టుచు, రాముని బ్రతి మాలుచున్నను, వారి నోదార్చి, సీతాలక్ష్మణ సమేతుఁడై యరణ్యమునకేగును. "ఈ ఘట్టమునందు శ్రీరాముఁడు వెల్లడించిన మాతృవాంఛాపూరణము, పితృ దత్త వర నిర్వాహణము, భరతునియందుఁజూపిన వాత్సల్యాదిగుణములేకాక విధివైపరీత్యమును చిఱునగవుతో నెదుర్కొనఁగల ధైర్యము, సౌజన్యము అసా ధారణముగాఁ జూపబడినవి.

ఇక వాలివధ ఘట్టమునందు రాముఁడు చాటుననుండి బాణమును వేయుట లేదు. జాంబవంతుని మాటలువిని అతఁడు రెచ్చగొట్టినందువలన వాలి తనకు తానై వచ్చి రామలక్ష్మణులను జూచి, రామునితో ద్వంద్వయుద్ధమును జేయుటకై యుత్సహించి, రణరంగమున కాహ్వానించును. రాముఁడు చిఱునవ్వుతో నాధను ర్లత నెక్కువెట్టెదను నీవును సాధనము గైకొనుమనియనగా నాకపియూథస్వామి భళిభళీ ! రాఘవా ! ధర్మపథంబుఁదప్పక పలికితివని ప్రశంసించి, పరాక్రమ వంతులకు వారివారి జాతి కనుకూలమైన ఆయుధశ్రేణి యోగ్యమగును, వానరు లకు ఇనుముతోఁజేసిన ఆయుధములతో పనియేమి ? శత్రుదర్పహరణ కేళిలో "అలచేతుల్ పిడికిళ్లు గోళ్లు నివిగావా? సాధనవ్రాతముల్" అనును. అప్పుడు పరస్పరవీరాలాపములతో, రాముఁడు చేయు వాలి ప్రశంసలతో యుద్ధ మారంభమగును. ఆ ఘోరయుద్ధమునందు శ్రీరాముఁడు వేసిన బాణము మొదట అంతకు పూర్వము వాలి పెకలించిన సప్తతాళసంతతిని తునిమి, తరువాత వాలి హృదయమునదూరి, తిరిగివచ్చి తూణీరమునందుఁ జొచ్చెను. అప్పుడు బల శాలియు, కీర్తిశాలియునగు వాలి వీరశయనము నలంకరించి తన ప్రాణావలి యను పద్మమాలతో రాముని నలంకరించి దీర్ఘనిద్రనొందెను. అందఱును విచారగ్రస్తులై వాలి మరణమునకుఁ జింతించిరి. జాంబవంతుఁడు వాలి దుర

హంకారమును బోకార్చి సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని జేయుటకు పన్నినప్రాగము సఫలమగును; తాను కనకకలశముతో నభిషిక్తుని జేసిన సుగ్రీవుని మెడలో రాముఁడు హెంపమ్మిదండ వేయును. ఈ ఘట్టమునందు రాముఁడు చాటుగా నుండి వాలిని వధించిన కిల్బిషమునుండి తొలగింపఁబడెను. వాలి, తనకై తానే, ఒక మహావీరుఁడు కనబడగా నతనితో యుద్ధముచేసి, జయించి, తనకు ప్రతి వీరుఁడు లోకమునలేడని యనిపించుకొనుటకై ముందుకువచ్చి ద్వంద్వయుద్ధ మును గోరగా రాఘవుఁ డంగీకరించును. చిఱునగవుతో నొక్క బాణమును వేయఁగా అది సప్తసాలములను, వాలినిఁగూల్చి వేసెను. ఇట్లు రాఘవుఁడు నిర్దోషియైన వీరాగ్రేసరుఁడుగా చిత్రింపఁబడెను.

ఇఁక రావణవధ ఘట్టమునందు హేమాంగద రత్నచూడులను గంధర్వు లాకాశమునుండి యాశ్చర్య సంభ్రమ భయాతిరేకములతోఁ చూచుచు వర్ణించిన రామరావణుల భీకరయుద్ధము "రామరావణయోర్యుద్ధం రామ రావణయోరివ" అని యాలంకారికు లనన్వయాలంకారమున కిచ్చిన యుదాహ రణ శ్లోకార్థమునకు లక్ష్యముగానే ప్రవర్తిల్లినది. చివరికి శ్రీరాముని బాణము నందుంచఁబడిన బ్రహ్మశక్తిచేత (బ్రహ్మాస్త్రముచేత) దశమ శిరము తెగి రావణుని కబంధము వీరశయ్య నలంకరించి లోకశాంతినిఁ గలిగించును.

ఇట్లు ప్రతిఘట్టమునందును అకిల్బిషవర్తనుఁడుగాను, అకలంక శౌర్య ధైర్య సాహసౌదార్యములు గలవాఁడుగాను, రాఘవుఁడు ప్రవర్తించినట్లతని శీలమును వ్యక్తపరచుటచేత మహానాయకుఁడైన శ్రీరాముఁడు అనర్ఘరాఘవుఁడై నాఁడు. (అనర్ఘః పూజ్యోరాఘవః యత్రనాటకే తత్ అనర్ఘరాఘవమ్ అని విగ్ర హము) అనర్ఘుఁడు అనగా అన్ని విధముల పూజ్యుఁడేయైన రాముఁడు నాయకు డుగాఁగల యీ మహాకావ్యము "అనర్ఘరాఘవం" అని వ్యవహరింపఁబడుటకి పాత్ర చిత్రణము మిక్కిలి దోహదకారిగా నున్నది.

## సీత

ఈ పాత్రమును చిత్రించినరీతి మిక్కిలి స్వల్పము. నాటకము వీరరస ప్రధానమగుటచేతను, సీతారాములు పూజ్యులైన యాదిదంపతులును, పాతివ్రత్య మునకును ఏకపత్నీవ్రతమునకును బట్టుగొమ్మలగుటచేతను, సీతారాముల శృం గారలీలను యెక్కువగా వర్ణించుట సముచితముగాదని కవి విడిచియుండ

వచ్చును. అట్లని కేవలము శృంగారరస హీనములగు పాత్రలనుగా సీతారాములను చిత్రించలేదు. వివాహమునకు శుల్కమైన శివధనుర్భంగము జరుగక మునుపే వారికి రాగోదయమైనట్లు కవి వర్ణించెను. వారి వాంఛాలతలు మొగ్గదొడిగినట్లు ఇతరుల సంభాషణముల ద్వారా వ్యక్తపరచెను. జనకుని అంతఃపురదాసికిని కంచుకికిని జరిగిన సంభాషణమునందు కలహంసియను పేరుగలయాదాసి, కంచుకితోమీరు వృద్ధులగుటచేత,

"సిగ్గువిడిచి మీకుఁ జెప్పెద వినుఁడు మా
సీత కిప్పుడు గలవిశేష మొకటి."

ఉ. "బొమ్మల పెండ్లిసేసి, ననబోఁడి!
ఱేకన్ మిథునంబుఁ గూర్పఁగా
రమ్మని బాలికల్ బిలువ, రానన
వత్తుననన్ దలంకుచున్
గ్రమ్మి కపోలపాళిఁ బులక ప్రకరమ్ము
కరమ్ము మించఁగా
నమ్మదిరాక్షి సిగ్గుపడినందుకు
సిగ్గుపడున్ మనంబునన్."

అనిచెప్పను. ఆమాటను కంచుకి యిట్లు సమర్థించును.

క. మనమునఁ దలఁకెడు బాలా
జనములచే మను ననూన సామ్రాజ్యండై
మనసిజుఁ డాఱవకన్నెఱుఁ
గని మంత్రము గల్గి వికచ కమలదళాక్షీ ;

(ఆఱవకన్నెఱుఁగని యనగా ప్రేయసీ ప్రియులకుఁ దప్ప మూడవవ్యక్తి చూడకుండునట్లు వారు రహస్యములు మాట్లాడుకొనుట. "అషట్కర్ణము" అను ప్రయోగముకూడ కలదు. ఇచ్చట మురారి "అషడక్షీణ" శబ్దమును ప్రయోగించి యుండుటచేత తిమ్మభూపాలుండు దానిని "ఆఱవకన్నెఱుఁగని" యని తెనుఁగుచేసెను. "అషడక్షీణ షాడ్గుణ్య మంత్రీ మకరకేతనః" అని మూలము.) శివధనుర్భంగ, కల్యాణసమయ, వనవాసగమనాదుల యందితరు

లచే సూచింపఁబడినట్లే రావణుఁ డపహరించిన సమయమునందును సీతచరితము జటాయువుచేత సూచింపఁబడినది.

కం. "హా నాథ! నాథ! యనుచున్
దీనత మైఁ గురళి వోలెఁ దెసి మొఱవెట్టన్
జానకి రథమున నిడికొని
యానీచుం డెందుఁబోవ నెదఁ దలఁచెనొకో"

శ్రీరాముఁడు సీతావియోగ దుఃఖభారమును భరింపలేక తపించు ఘట్టమునందు ప్రకృతి సౌందర్యమును, రావణోవధోపాయములను జూపి లక్ష్మణుఁడు, గుహుఁడు నోదార్చుచుందురు. కాని రాముడు మాత్రము సీతను పలువిధముల స్మరించి దుఃఖపడును.

ఉ. "నావుడు రాఘవుండు నయనంబుల
నశ్రులుగ్రమ్మ హా! ప్రియా
ఆవిధిఁ దాటకేయ మృగయా వ్యసనంబున
నేను బోయినన్
రావణుఁ డేగుదెంచినఁ గరంబును
నీ తెలిగన్ను లీకురం
గీ వళమాన లోచన సఖిత్వమునన్
గనుపట్టెనో కదా!"

ఈ ఘట్టమునందు సైతము రాముని నంతగా సీతావియోగదుఃఖభరముచే క్రుంగిపోయి కర్తవ్యమునకుఁ బూనని కేవల కరుణ విప్రలంభ రసాశ్రయునిగా చిత్రింపలేదు. అతనికి సీతావియోగదుఃఖ ముప్పతిల్లుటయు వెంటనే లక్ష్మణుఁడు లేదా గుహుఁడు ఓదార్చి కర్తవ్యోన్ముఖుని జేయుటయు జరిగినది. అట్లు రాముఁడు లంకను జేరువరకును ఆయా సందర్భములలో సీతను స్మరించును. సీత రావణవధానంతరమున అగ్నిపూతయై శ్రీరామునితో పుష్పక విమానము నెక్కి అయోధ్యకుఁ దిరిగివచ్చునప్పుడు ఆకాశమునుండి నేలపైఁగల నదనదీ పర్వత నగర ప్రదేశములను జూచి వర్ణించుచు ఆనందించుచు వచ్చునప్పుడు రామునితో సంతోషముగా మాట్లాడుచు, ఆయా విశేషముల నడుగును. రామ సుగ్రీవ విభీషణులు ఆ విశేషములను వివరించుచుందురు. దండకాటవిని సమీ

పించినప్పుడు సీత తనను రావణాసురుఁ డపహరించిన విషయము స్మృతికి వచ్చినట్లగును.

చ. "అనవుడు దైన్యగద్గద గళారవయై
'మహిజాత పుష్పకం
బునకు విమానరాజ! కృపఁబూనుము
నాహృదయం బధైర్య భా
జనమయి వ్రీలెడున్ మిగుల
సత్వరవృత్తిని దాటు దండకా
వనము నటన్న రాఘవుఁడు
వామవిలోచనతోడ నిట్లనున్."

గీ. "అదె పురోభాగమునఁ గానవయ్యె నీల
కచ! మహారాష్ట్రమండలైక ప్రమండ
నమగు కుండిన నగరంబు నర్మదా
తరంగ నిజహేమకేతు సంరంభ మిందు".

అని రాముఁడు మరియొక దృశ్యము వైపునకు సీత దృష్టిని మరల్చెను. ఉజ్జయినిని జూచి మహాకాళనాథుని మహిమను, అచ్చటి సౌందర్యమును రామ సుగ్రీవాదులు వర్ణించునప్పుడు రాముఁడు,

ఉ. "ఓహర! నీ నిటాలమున నుద్భవ
మొందిన వీతిహోత్రుఁ డ
మ్మోహన శస్త్రహస్తుఁడయి
మూగిన కంతునిఁ జెంతఁజూచి లో
స్వాహాఁ దలంచియో! మిగుల
జాడ్యముచే నొకకొంతసేపు త
ద్దాహ మొనర్పఁడయ్యెఁ
బరతంత్రుల వర్తన మిట్టిదే కదా!"

గీ. "అనుడు నవనిజ పల్కెఁ బూజార్హుఁడైన
హరుఁడు సర్వజగద్గిలనాప్తి వలనఁ

దనదు పేరాకటని శాప్రకొనియు కంతు
నకట భ్రమింగెనె? యన నవ్వి రందఱపుడు.''

ఇట్లు సరససల్లాపము లాడుకొనుచు నయోధ్యను జేరిరి. సీత భర్తను అన్ని సమయములందును అనుసరించునట్టి మహాపతివ్రతగా మనకు గోచరించునుగాని, ప్రత్యేకమైన యొక రసమునకు ఆలంబన విభావముగాగాని నాటకీయమైన యొక ముఖ్యపాత్రగాగాని చిత్రింపఁబడలేదు. అట్లు చిత్రించినచో శృంగారరసమునకుగాని, కరుణరసమునకుగాని, వీరరసముతో సమప్రాధాన్యమేర్పడి, ఉద్దిష్టమైన వీరరసము దెబ్బతినును. కనుక మహాకవి మురారి అట్లు చేయలేదు. మూలమున కేవిధముగను న్యూనత కలుగకుండునట్లు అనువదింపఁ దలచుకున్న తిమ్మభూపాలుఁడు మురారి యడుగుజాడలలోనే నడచి ఈ పాత్రను చిత్రించెను.

## లక్ష్మణుఁడు

లక్ష్మణ పాత్ర చిత్రణము ఈ కావ్యమునందు స్వల్పముగానే యున్నను ఎచ్చటెచ్చట నితఁడు ప్రవేశించునో అచ్చటచ్చట రామునికి అనుగామియై యున్నాడు. చంద్రోదయాది వర్ణన సమయమునందు రామునివెంటనుండి తాను వర్ణించును. తాటకావధ సమయమున శ్రీరాముడు స్త్రీవధను చేయుటకు వెనుకాడుచుండగా,

కం. "ఈ వాంచయమి సెలవిడ
స్త్రీవధ తగు తగదనుచును శ్రీరాముఁడు దా
భావింపనేల? మౌనుల
యా వాక్కులఁ గాదె శాస్త్ర మనువర్తించున్"

అని తనలో ననుకొని యన్నతో "విశ్వామిత్ర మునీంద్రుని యాదేశము ననుసరించి చేసిన యా స్త్రీవధ నీకు పాపహేతువు కాజాలదని చెప్పెను. పరశురాముఁడు వచ్చి పరుషములు పలికినప్పుడు లక్ష్మణునికి క్రోధముప్పతిల్లును. కాని రాముని యాదేశమునఁ నాత్మసంయమనము చేసుకొని యూరకుండెను. అఘట్టమునందు పితృనిందా సంజాత క్రోధ సంధుక్షిత హృదయుఁడైన లక్ష్మణుఁడు పలికిన పలుకులు ఇవి.

మ. ఘనుఁ డీరాముఁడు తా మదగ్రజుఁ
డీశన్ గాల్కుండిననన్ ఘ్నానన్నీ,

మనువంశ ప్రభువుండె కాడని
బుధుల్ మచ్చేష్ట నిందించనీ,
నను ధీరుండననీ యధీరుఁడననీ
నానాజనుల్; పూనితిన్
కనదాటోపత దుష్ట భూపనివహ
శిక్షాదీక్ష నేఁడారఁగన్."

ఆ కోపమును రాముఁడు విరమింపఁ జేయును. ఇట్టిపాత్రము రాముని యనుచరుఁడై అతఁడు విక్రమించిన తాను విక్రమించుచు, అతడు సంతసించిన తానుసంతసించుచు, అతఁడు దుఃఖించిన తానును దుఃఖాక్రాంతుఁడగుచు నొక్కొక్క చోట నుపాయములు చెప్పుచు, నోదార్చుచు, అన్ని విధముల నన్నను అనుగమించుచు, లోకమునందు సౌభ్రాత్రమనగా నిట్టిది, అని యెల్లరు భావింపఁ దగిన యుత్తమాదర్శముగా నీపాత్రము చిత్రింపఁ బడినది.

## పరశురాముఁడు

ప్రకృతి సిద్ధమైన వీరత్వము, నిష్ఠుర తపస్సు, విశిష్టమైన గురుభక్తి మూసలు పోసి కరువు గట్టించిన యీ పాత్రము క్షాత్రబ్రహ్మ తేజముల కేక స్థానమై భాసిల్లుచున్నది. పరశురాముఁడు తనకుగల క్షత్రియ విరోధ వీరత్వాభిమానములను విశృంఖలముగా ప్రకటించుచు, రాముని మాటలను తృణప్రాయముగానైనను భావింపఁడు, వినిపించుకొనఁడు. తన శౌర్య తపోగురుభక్తి ప్రభావములనే ప్రకటించునట్టి నిష్ఠుర వచనము లాడును. అది పరాకాష్ఠను జెందిన గురుభక్తి తపఃప్రాభవముగాను, ఎదురులేని వీరత్వముగాను గోచరించును శ్రీరాముని సంబోధించునప్పుడు "ఓరి నృపాలడింభ, నృపడింభకః రాచపురువః అనుపదములుపయోగించును. దశరథుఁడు వచ్చి సంభాషింపం బోవగా వీడెవ్వఁడురా? అనును. రాముని జూచి,

మ. "పటుశక్తిన్ గృత వీర్యనందన వధూ బాష్ప ప్రియంభావుకో
ద్భట బాణోదిత శోణితాంబుధి నివాసం బర్థిగావించి, ఆ
చటుల క్షత్రతతిన్ భుజించి పిదపన్ చల్లారు క్రోధాగ్ని వె
ల్గుట కీ వింధనమైతి వంధక విభిత్కోదండ దండాహతిన్",

అని గర్జించును. పరశురామునికి బ్రాహ్మణత్వ తపో యజ్ఞాదుల యందెంత యభిమానము కలదో అంత యభిమానము క్షత్రియ ధర్మమైన శౌర్యము నందును గలదు, శతానందుఁడు వచ్చి ధిక్కరించినప్పుడతఁడు బ్రాహ్మణుఁ డని లెక్కసేయక. పలువిధముల దూషించి యిట్లనును.

మ. మఱి సీరాఘవు లస్త్రధారలు శోలంపన్ బూనినారేని, జ
న్నిదముల్ దాల్చిన వారలల్లిరి ఋజులే నే, నిన్ను నందున్ గణిం
పదు రేనిన్, హతవాడ్స్విమిత్ర పశకు బ్రోద్ధామమౌ మద్దురా
సద మౌర్వీ కళ కర్ష ణోల్బణ కిణాంచద్బాహు వింకేటికిన్?."

ఇంతగా క్షాత్రబ్రహ్మతేజోవిరాజితుఁడై నప్పటికిని వీరుఁడుగావున వీరుఁడైన రాముని బ్రశంసించును. ప్రసన్నుఁడై నీ యపరాధమేమియు లేదని శ్రీరాముని మన్నించి "వత్సా ! నీ వైష్ణవదివ్యతేజమునుజూడగోరి, ఇట్లు కినియించి, దానియౌన్నత్యమునుగాంచి అద్భుతరసా విష్టుఁడనై సంతోషించితి" నని యాశీర్వదించి వెళ్ళిపోవును. ఇట్లు ఈ పాత్రము వీర శాంతరస సమాలంబనముగాఁ జిత్రింప బడినది.

## రావణుఁడు

ఈ మహాప్రబంధ నాటకమునందు రావణుఁడు ప్రతినాయకుఁడు. ప్రతి నాయకునియొక్క ఉత్కర్ష నాయకోత్కర్షయందే పర్యవసితమగును. ఆ దృష్టితో పరిశీలించినప్పుడు రావణునిపాత్ర చిత్రణము మొదట సామాన్యముగానే యున్నది. శివధనుర్భంగ సీతాపహరణవృత్తాంతముల అప్పుడతఁడు ప్రత్యక్షము కాడు. అతనికీర్తిమాత్రమే శౌష్కలునిచేత గొప్పగా కొనియాడఁబడును. లంకను వానరసైన్యము ముట్టడించిన పిమ్మటనే యతని జగదేకవీరత్వము గోచరించును. ముఖాముఖిగా నతఁడు రామునితోఁతలపడి చేసిన యుద్ధమును గుఱించి ఇతరుల సంభాషణములలో తెలుపబడినది. ధైర్యసాహసములు విశేషముగా వర్ణింపఁ బడినవి. విలాసిగా సైతమతఁడు చిత్రింపఁబడెను. యుద్ధసమయమునందు మాత్రము తన వీరత్వమునకు తగినట్లే యతఁడు ప్రవర్తించుచున్నట్లు విమానము నుండి యుద్ధమునుతిలకించుచున్న హేమాంగద రత్నచూడులను గంధర్వులు గొప్పగా వర్ణింతురు. రావణుఁడు రామునితో నీవు నాకొక లెక్కగాదని పలికిన పలుకులివి,

మ. "భళిరా! క్షత్రియడింభ! రౌప్యగిరి
నుత్పాటించి, వే నాటి, వ
ర్తిలు నాబాహువిలాస మద్ధరణి
పుత్రిం గోరి యాశాన్ చా
పలతన్ ద్రుంపక మానె కాక
సురరాడ్భద్రేభ దానాంబు ని
శ్చల దౌర్జన్యకృదుగ్ర జాగర
మహాస్త్రశ్రేణి నిన్నోర్చునే?"

గీ. భళిర యో కౌశిక క్షత్రియ బ్రహ్మచారి:
భూరివాచాట! నే డీవు పూర్వశిల్పి
వలె దశానన సత్కీర్తి వారిజారి
యెడ కళంకంబు వ్రాసెద వౌడలు మఱచి."

ఇట్టి వీరాలాపములు పలుకుచు, శరపరంపరల గురిపించుచు, చూపరులు రాముని కేమగునో! యనిభయపడునట్లు ఘోరయుద్ధమును జేసెను. రావణుఁడు లోకవిద్రావణుఁడుగానే చిత్రింపఁబడెను. ఇక విశ్వామిత్ర, మాల్యవంత, సుగ్రీవ, జనక, జాంబవంతపాత్రములను వారివారి సహజస్థితికిఁ దగినట్లు నడిపించెను. విశ్వామిత్రుఁడు రాముని యోగక్షేమము లరయువాఁడుగను, దశరథ, యాజ్ఞవల్క్య, జనక, శతానందులచేత పూజింపఁబడినవాఁడుగను చిత్రింపఁబడెను.

ఇట్లు తిమ్మభూపాలుఁడు సంస్కృతానర్ఘరాఘవ నాటకమును జేపట్టి, అనువాద, శయ్యాసౌభాగ్య, గుణాలంకార, రీతి, వృత్తుల కెచ్చటను లోపము రానీయక, కృష్ణ సత్కవిసహాయముతో నిర్వహించెను. అనర్ఘరాఘవప్రబంధమును రసజ్ఞలోకమున కర్పించుచు, సంస్కృతనాటకాంతమున భరతవాక్యముగా మురారికవి రచించిన "సముత్సీలత్సూక్తస్తబక; దేవస్యాత్మభువః" అను రెండు శ్లోకములయందలి భావమును తన కావ్యమునకుఁ గూడ నన్వయించునని సూచించువాఁడువలె నిట్లాంధ్రీకరించి ముగించెను.

సీ. "కవులు వచోగుచ్ఛక మరందధారల
శ్రుతుల మజ్జన మొనర్చెదరు గాత
జనులు వాగ్బ్రహ్మవాసన లానకయ కవి
సూక్తి దోషము లెంచకుంద్రు గాత

త్రిపథగ యగుచు ధాతృకమండలు జలంబు
పూతత్రిలోకమై పొలుచుఁ గాత
వీర యశస్సుధా సార నిష్యందముల్
శ్రవణాగ్ర గుణములై ప్రబలుఁ గాత

గీ. ధర్మదేవత నాల్గుపాదముల నిలువ
బహుల సస్యసమృద్ధిచేఁ బ్రజ యెసంగ
వితత రాజన్వతీ సంజ్ఞ వెలసి ధరణి
తనరుఁ గావుత మాచంద్రతారకముగ."

మహాకవిశబ్దమునకు పర్యాయపదముగా మురారి కల్పించిన వాగ్బ్రహ్మ శబ్దమును ఇతఁడును స్వీకరించి ప్రయోగించెను. ఇట్లు సర్వసద్గుణభాస్వరముగా నీ యనర్ఘరాఘవమును రచించిన తిమ్మభూపాలుఁడు కవి మూర్ధన్యుఁడనుట రసజ్ఞులకు సమ్మతమైనమాట కాఁగలదని భావింతును.

ఇంతటి యత్కృష్టకావ్యము ఇంతకు పూర్వమొకసారి కవి వంశీయుఁడైన కీ. శే. బిజ్జుల చంద్రశేఖరరెడ్డిగారిచేత ముద్రింపింపఁబడినను తగినంత ప్రచారమును పొందలేదు. ఇప్పుడు బహుజనోపయోగార్థమై పూర్వకావ్యములను పునర్ముద్రణముఁ జేయించి లోకమున కర్పింపఁదలచిన ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఈ కావ్యమును జేపట్టి రసజ్ఞలోకమున కెంతో మేలుచేసిరి. ఈ పీఠికను వ్రాయుటకై నన్ను నియోగించుట ఒక భాగ్యవిశేషమని నేను భావించుచున్నాను. తిమ్మభూపాలుని వంశీయులిప్పుడు నివసించుచున్న పల్లెపాడు గ్రామమును, అతని ధర్మపత్ని అక్కమాంబపుట్టిన గ్రామముగా భావింపఁదగిన చింతకుంటయు నాకు స్వగ్రామములై యుండుట ఒక కాకతాళీయ సంబంధము. విపులమైన వ్యాఖ్యానము రచించినగాని సరిపోని యీకవి కవితా సామర్థ్యమును, కావ్యమహిమను ఒక పీఠికలోఁ దెలుపుట యసాధ్యము. కావున రసజ్ఞశేఖరులు స్వయముగాఁ జదివి యీకావ్య మహత్త్వమును గుర్తించి యానందింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
విద్వత్కవి విధేయుఁడు,
కేశవపంతుల నరసింహశాస్త్రి

తేది : 31-12-1976
బర్కత్‌పుర, హైదరాబాదు.

శ్రీరస్తు.

అ వి ఘ్న మ స్తు

శ్రీహయగ్రీవాయనమః

# అ న ర్ఘ రా ఘ వ ము

ప్రథమాశ్వాసము

—○—

శా. శ్రీఁ జెన్నొందెడు పంకజాక్షు నురముం జేపట్టి యా
లేఁజాబిల్లి యుదేల వచ్చెనని మాటల్లాడు నంతన్ సఖీ
తేజోగూన్యభవానిఁ గాంచి నగుచున్ "నీ వెంత బల్లోలవే
రాజాస్యా" యను ప్రాఁగటూరునగరీ రామేశుఁ డిచ్చున్ సిరుల్.

మ. తన ప్రాణేశ్వరుమౌళి ముత్తియపుఁ బాల్ తాఁ బోయుచో నాతఁడో
య్యన న మ్రుం డగు టింతు లారసి భవిష్యన్మత్కోపాపనో
దనపాదానతిసూచకం బనుచుఁ జెంతన్ నవ్వుచుం బల్కఁగా
విని సిగ్గొందు భవాని మమ్ము విజయాన్వితాత్ములన్ జేయుతన్. 2

ఉ. శ్రీకరమైన నాభిసరసీరుహ మర్థవిబోధనార్థము
ద్రాకరణైకచాతురి పరప్రతిమానముఁ జేసి నిచ్చలున్
గోకవిలోకనోత్సవ చకోరక పారణముల్ ఘటించు లో
కైకశరణ్యుకన్నుఁగవ యీవుత మాకు నిరంతరాయమున్. 3

చ. అల సరసీజగర్భుఁడు మహాప్రళయాపగమంబునన్ జగం
బులు సృజియింపఁ బూని తగఁబుట్టి చరాచర కారణస్థితుల్
దెలియఁగ నాభిపంక రూహదీప్తబిసాంతరబుద్ధిఁ దూఱు నే
యలఘునికుక్షి మాటికిని, నట్టిజగన్నిధి నాశ్రయించెదన్. 4

చ. తన మధురాధరాధరసుధారసముం బతి వేఁడఁ బోఁడుఁగ్రొ
న్నన నజు వామలోచనమునన్ గన సన్న యొనర్చి చూపి యం
తనె యదియున్ నిమీలనమునందగ నవ్వుచుఁ దన్మనోరథం
బనువుగఁ జేయు నిందిర మదాయతనంబున నిల్పుఁగావుతన్. 5

మ. "వెలిదమ్మిన్ గడు నేకనాళమున నావిర్భూతి నొందెన్ జతు
ర్జలజాతంబులు వేచియుండవె ప్రకాసం బొందఁగా నెంతవిం
తలో యంచున్ సురకోటి వల్కఁ హరియుద్యన్నాభినాళీకమం
వెలమిం దోఁచి చతుర్ముఖిం దనరు వాణీశున్ మదిన్ గొల్చెదన్. 6

చ. ఎదురుగ నున్నయాస్యమున కెంతయు వాతెఱతేనె, క్రేవలం
బొదలెడుమోముదోయికిఁ గపోలతలద్వయమంబనంబు, వెం
న్కఁ దనరువక్త్రపాళికిని గప్రపుభాగము, లొక్కమాటె యిం
పు దనర నిచ్చి పద్మజుఁ గవుంగిటఁ జేర్చిన వాణిఁ గొల్చెదన్. 7

చ. మనసిజవైరి గౌరియును మక్కువ నొక్కటఁ జెక్కుదోయి చుం
బన మొనరింపఁగా, నెఱిఁగి, మస్తమువెన్క కెదల్ప, వార లిం
పునఁ దమమోము లొండొరులు ముద్దుగొనం గని, నవ్వ నా గజా
నను భజియింతు నే ననుదినంబు మనోరథసిద్ధికిం దగన్. 8

సీ. భవ్యరామాయణ కావ్యామృతోద్భూతి
కలన కెవ్వనిమోముకలశవార్ధి
ఘనభారతీవంశగంగాతరంగిణీ
వేణి కెవ్వనిమోము విష్ణుపదము
వివిధ పరేంగిత విజ్ఞానరోలంబ
పఙ్క్తి కెవ్వనిమోము పంకజంబు
భానుమన్మతి కథాప్రస్ఫురన్మాత్సర
త్సాళి కెవ్వనిమొగ మ్మాకరంబు

గీ. నమరులను బ్రోచుమహిమచే నమరువాఁడు
ప్రాకటారిపురీశుఁడై ప్రబలువాఁడు
శాశ్వతైశ్వర్యకరుఁడు రామేశ్వరుండు
కరుణమీఱంగఁ గలలోనఁ గాననయ్యె. 13

గీ. ఐనఁ గన్గొని సాద్భుతహర్షకలనఁ
బ్రాంతపూర్ణఘటాంబుపూరంబు చేత
పాద్యము ఘటించి వివిధశుంభన్మణీక
లాపములచేతఁ బూజించి లలి భజింప. 14

చ. ఘనకరుణాసుధారసము కన్గవఁ జిప్పిల నన్నుఁ జూచి యో
యనఘ! భవత్కృతాంధ్రకృతి నాదృతి మాకిపు డంకితంబుగా
నొనరిచి ధన్యతం బొరయు ముర్వర; దాన నితోధికంబుగా
ధనకనకేభసైంధవరథప్రకరంబులఁ బొల్చె దెంతయున్. 15

క. అని శివుఁ డంతర్హితుఁడై
చనియెను; నే మేలుకాంచి సమ్మద మాత్మన్
బెనఁగొనఁగఁ గాల్యకృత్యము
లొనరిచి యాస్థానసీమ నొడ్డోలగమై. 16

క. హితబాంధవ మంత్రిపురో
హితబుధకవికోటిఁ గలయ వీక్షించి మహా
ద్భుతమంది యమందానం
దత నాడెందమున నిట్లు దలఁచితిఁ గడఁకన్. 17

సీ. చారుకృష్ణానదీతీరసీమారామ
కమనీయకల్పక కందళంబు
మహితలోకత్రయీమౌళిభాగాభోగ

హిమశైలకన్యకా వృత్తవక్షోజాత
చిత్రితచందన పత్రకంబు
ప్రాకటూరీధరాపదకమధ్యస్ఫుర
న్నవ్యముక్తాఫలనాయకంబు

సీ. నైనరామేశ్వరస్వామి యనుపమోత్స
వైకసంరంభమునకు నేఁ డిదె సమస్త
దేశవిద్వత్కవిప్రభృతిఁ ప్రశస్త
ఘనసభాజన మిచ్చోటఁ దనరెనౌర! 18

శా. నానాదేశసమాగతుల్ కవిజనుల్ నానారసోద్యత్ప్రబం
ధానీకంబు వివాదకంథరతచే నావిష్కరింపన్ దదీ
యానూనశ్రవణంబుచే విసుగుసభ్యశ్రేణికిన్ బ్రీతి నా
హా!నిచ్చల్ ఘటియింతు నిష్ఠరసభవ్యంబైన కావ్యంబునన్. 19

క. ప్రీతిఁ గవితోపజీవిక
చేతఃప్రియతమము దానిఁ జేకొను కుకవి
వ్రాతంబు గెలిచి క్రమ్మఱ
నే తెఱఁగున నైనఁ దెత్తు నిది యెట్లన్నన్. 20

మ. కమనీయస్థితిఁ జెంగటన్ ధవళశంఖస్ఫూర్తి రాణింప దీ
ప్తమరీచిన్ బవడంపుఁ గెంపుఁ బవలున్ బంజుల్ వెలుంగొంద, ని
స్సమసారస్వతనిర్మలామృతఝరీజాగ్రత్తరంగాబ్ధి పే
ర మహాసత్కవి తేజరిల్లె విబుధప్రస్తూయమానోద్ధతిన్. 21

చ. అతనికిఁ బౌత్రుఁడై యసదృశాఖిలవిద్యలఁ బ్రౌఢిఁ గన్న యా
యతమతి కృష్ణసత్కవి సహాయకవిత్వమునన్ సమాజసం
తతభజనాదరుండ నగునాకు నశేషవిశేషవైదుషీ
ప్రతిభ కరస్థలామలకభాస్వరమై తనరారు టబ్రమే? 22

గీ. ఎట్టులన్నను న్యాయమార్గైకవృత్తి
కవనిఁ దిర్యక్కులైన సహాయ మగును;
గాని తెరువున నడచినవాని విడుచు
ననుఁగుఁదోఁబుట్టువైన సత్యంబు సుమ్ము. 23

మ. తమి శాస్త్రామృతపూరముల్ సుకవిచేతశ్శుక్తికం జేర్చి యం
త మరల్పందగు నక్షరాకృతుల ముక్తాశ్రేణులన్ గూర్చుహా
రము లుద్యద్కమనీయనాయకమణిగ్రామోపసంవర్గణై
కమహాలంకృతులై చెలంగెడు సుహృత్కంఠంబులం దెల్లెడన్. 24

మ. అటులం బొల్పువహించు సర్వపురుషార్థాచంద్రహర్షప్రదో
త్కటవీరాద్భుతగాఢరూఢ మహిమోదాత్తైక వస్తుస్ఫుర
త్పటిమన్ లోకముదావహప్రథమకందంబైన సందర్భమూ
ఱటకై కోరుచుఁ గోరుచున్ దలఁచితిన్ రామాయణం బంతటన్.

•సీ. అఖిలలోకారాధ్యుఁడై కవితావతా
రాద్యతీర్థంబైన యనఘమూర్తి
వల్మీకసూతి తద్వాణీవిలాస ని
ర్వ్యాస మిక్ష్వాకుల యమలకీర్తి
భవ్యగాత్రంబు తత్ప్రీతిబద్ధ సుప్రసి
ద్ధప్రబంధానుసారిప్రవృత్తిఁ

---

•సీ. అఖిలలోకారాధ్యుఁడై కవితావతా
రాద్యతీర్థంబైన యనఘమూర్తి
వల్మీకసూతి తద్వాణీలసత్ స్ఫుర
త్ప్రబలభానుకులీననిబిడకీర్తి
భాసురాలంకారభావాన్వయోదిత
సరసార్థపదలసత్సం ప్రవృత్తి

జెలువొందఁగవ నాడు చిత్రమౌర సమస్త
కవిసార్థసాధారణవరిభూతి

గీ. గద తదీయసుభాషితాకారసీవి
నిబిదమై మించుజుంటితేనియలబావి
లలితభావధ్వనివ్యంగ్యములకుదీవి
తీవి నేమని వర్ణింతునావిధంబు. 26

సీ. రాత్రించరాన్వయగ్రామణి భువనముల్
చేడ్పడఁ దపియింపఁ జేయుపెల్లి
నిక్ష్వాకుకులవాహినీశచంద్రుండైన
పురుషోత్తముం డుద్భవించుపెల్లి
వల్మీకసంభవువాచావిలాసంబు
క్షితిఁదను దాఁ బ్రకాశించుపెల్లిఁ
దద్వచోమౌక్తికదామంబునకు నాయ
కాకృతిఁగాకుత్స్థుఁడలరుపెల్లి

గీ. నద్భుతము మించ శృంగార మతిశయింప
వీరము రహింప భావముల్ విశ్రమింపఁ
గృతులు గావింపఁ బూను కవీంద్రకోటి
బహుపురాకృతసుకృతైకపాక మరయ. 27

---

యలఘుకావ్యాలోక నానందరసఝరీ
పరిమగ్న మానస ప్రకటవృత్తి

గీ. గలుగుమామకవాక్సుధాకలిత కావ్య
నియతి గన్గొన జుంటితేనియలబావి
లలిత భావధ్వనివ్యంగ్యములకు దీవి
తీవి నేమని వర్ణింతు నావిధంబు. (ఇది ప్రక్షిప్తము.)

సీ. నిఖిలతపోధనవివహసంస్తుత్యచా
రిత్రైకమౌద్గల్యగోత్రభవుఁడు
నానావిధకళా భినవపితామహ, వర్ధ
మానభట్టార్య కుమారకుండు
తతసతీవృత్తాంక తంతుమత్యాహ్వయ
మానవతీశుక్తి మౌక్తికంబు
గురుభట్ట దేశికోత్తర పూరమధ్యస
రస్నిరాఘాటసారస్వతుండు

గీ. బాలవాల్మీకి బిరుదశుంభన్మురారి
నాటకమనర్ఘ రాఘవనామకంబు;
దాని నాంధ్రప్రబంధఁబుగా నొనర్చి
యుదితసామగ్రి సమ్మద మూన్తు సభకు. 28

సీ. అస్మదాశ్రితు లంటినా రసపాశగీ
తములఁబ్రత్యేకంబు దక్షులరయ
మౌద్గల్యకవివచోమాలిక లంటినా
మాధుర్యగాంభీర్యమంజులములు
సరసకావ్యార్థబీజం బంటినా సుధీ
రోదాత్తుఁడైన రఘూద్వహుండు
తన్మనమున ప్రసిద్ధ సువాక్కు లంటినా
పరగువాల్మీకితపః ఫలంబు

గీ. లట్టిప్రాచేతసీయమై యలరుకథ న
నేకులు రచించుదాననే కృతియొనర్చె,
శ్రోత్రియాత్మజుఁ డలదాని సుకవు లెన్న
నేను దెనిఁగింప నపరాధ మేమికలదు. 29

మ. గొనబౌ రామచరిత్ర నాదిమ కవిత్వుణ్ణంబుగా నెంచి మా
నిన, నారీతి గుణాఢ్యుఁడై తనరువానిన్ నాయకుం గాంచలే
మిని, దత్తద్గుణగౌరవస్ఫురిత గాంభీర్యాతి మాధుర్య వా
క్యనవబ్రహ్మలు పండితుల్ తమ రయో సార్థక్యముల్ గాంతురే?

వ. కావున స్వయం ప్రకాశిత శబ్దబ్రహ్మయగు నాచార్య ప్రాచేతసుని
వాగ్దేవతను తన్మార్గైకవిహారి మురారిం బ్రశంసించెద. 31

గీ. మనుజలోక ప్రవేశంబు గనెడువాణి
కరయ విశ్రామశాఖయై యతిశయిల్లి
యమరభవనావతరణజశ్రమముఁ బాపు
మౌనిమూర్ధన్యునకు నే నమస్కరింతు. 32

క. జలజభవచతుర్వదనీ
గళశృంగాటకవిహారకమనీయఁ బ్రగ
ల్భలసద్వాచాల మదిన్
గొలుతున్ నేవాణిఁ గమలకోమలపాణిన్. 33

మ. కర మారూఢకకుత్స్థ సంతతి సమాఖ్యా సౌరభోదారని
ర్భర గంభీరమనోవిహారములచేఁ బొటిల్లు వాచాపరం
పర వాల్మీకి కవీంద్రవాగమృతమూప ప్రాంతగాహోవమై
పరఁగం జేసిన యమ్మురారికవికిన్ బల్మారు నే మ్రొక్కెదన్. 34

వ. అని యభివాదనం బొనర్చి పేర్చిన కుతుకంబునఁ జతుర్దశ భువనా
ధీశ్వరుం డగు పరమేశ్వరుండు స్వప్నంబున సాక్షాత్కరించి కరుణా
తరంగితాపాంగ విలోకనుండై యానతిచ్చినతెఱంగేను సభాసదులకు
విన్నవించినఁ బ్రమోదంబున వారును మహాద్భుత కందళిత హృద
యారవిందులై యనన్య సాధారణ విబుధజనవిధేయంబగు భాగధేయంబు
నకుఁ బ్రథమకారణంబ వైతివి నీయంత కృతార్థుండు గలడే తావకీనా

న్వయ ప్రసిద్ధులగు పెద్దలు నీద్భశమహత్వంబున వృద్ధిబొందరే?
కావున భవద్వంశావతారంబు సారంబు గావించెదము సావధానమతి వై
యాకర్ణింపుమని యిట్లనిరి. 35

సీ. ఏసరిత్తిలకంబు హేమాంబరుని పాద
రాజీవమునకు మరందధార
యేనదీతల్లజం బీశానమస్తక
సీమకుఁ బాండురోష్ణీషశాటి
యేవాహినీదేవి హిమవద్ధరాధర
శృంగాంతరంబులఁ గ్రీడసల్పు
నేధునీకాంత పాథోధిమూర్ధన్యున
కగ్రభార్యామణియై రహించు

గీ. నట్టిగంగకుఁ దోఁబుట్టు వగు చతుర్థ
జాతియందు నితాంతవిఖ్యాతిఁ దనరు
చున్న మొటవాడకులమున నొప్పుమీఱెఁ
జాల బిజ్జులదాదభూపాలమౌళి. 36

ఉ. దాదనభూమిపాలుఁడు సదా దనరారెడు, నీవి తీవకుం
బాదన నాజిభూచకితపాద నమద్రిపురక్షణంబునన్
సాదన ధైర్యధుర్యత నసాదనగేంద్రునితో నొనర్చుబల్
వాదన నింపెసంగె ధర వాదనకాంతిపరాజితేందుఁడై. 37

క. ఆదాదనకుఁ గుమారుం
డాదటఁ గుప్పన జనించె నతిభీకరతా
మేదురతరతారకరిపు
భేదనచణబాహుశక్తి పృథుసాధనుఁడై. 38

సీ. ఆకులపాటొందు నమరభూజాతంబు
నిరతవిశ్రాణనగరిమ యెంత
దురములో నరునకుఁ గిడ్డైనధూర్జటి
గాఢపరాక్రమక్రమ మదెంత
కడు ననంగుండయి కానరాని ప్రసూన
మార్గణు సౌందర్యమహిమ యెంత
పూఁటపూఁటకు వెల్తిఁ బొందెడు కార్తికీ
కైరవాప్తుని కళాకలన యెంత

గీ. యనుచు నిరసించు నిశ్చలౌదార్య శౌర్య
జైత్రవిక్రమ గాత్రరాజద్విలాస
నిత్యసంపూర్ణకాంతుల నివ్వటిల్లెఁ
గోవిదులు మెచ్చ బిజ్జలకుప్పవిభుఁడు. 39

క. ఆకుప్పవిభుఁడు గాంచె సు
ధీకల్పకశాఖి మేరుధృతి నెఱగొండ
క్ష్మాకాంతమౌళి సుకవి
శ్రీకరఘనదానశాలిఁ జెన్నక్షితిపున్. 40

సీ. కమనీయవాగ్విలాసమునఁ బన్నగరాజు
నగరాజు ధృతిధురంధరనిరూఢి
ననుపమానకళాప్తి నలశీతభానుండు
భానుండు దోఃప్రతాపంబుకలిమి
దారుణసంగ్రామధాత్రిఁ గుమారుండు
మారుండు సౌందర్యమహితరేఖఁ
జారుమేధాయుక్తి నారదజనకుండు
జనకుండు విజ్ఞానసౌష్ఠవమున

గీ. నేమహాభాగుఁ డతఁ డొప్పె నిర్ధరిత్రి
నిఖిలయాచకదారిద్ర్య నిబిడగహన
హరణదవకీలి యాశ్రితాదరణశాలి
భవ్యగుణపాళి చెన్నభూపాలమౌళి. 41

క. ఆ చెన్నక్షితిపుఁడు చిన
మాచమను వరించె సర్వమంగళను సుధా
రోచిశ్శేఖరు చాడ్పున
నేఁచిన మోహమున బంధులెల్ల నుతింపన్. 42

గీ. ఎలమిఁ జినమాచమాంబికవలనఁ బుత్రు
విదితవెన్నాళ్లగోత్రపవిత్రు నంబు
జేక్షణారాధ్యతమసముదీర్ణగాత్రుఁ
జాత్రుఁ జినతిమ్మభూమీకళత్రుఁ గనియె. 43

మ. చినతిమ్మక్షితిపాలకాగ్రణి హయోత్థితక్షమాధూళిపా
ళి నకాలోగ్రతమంబు, దుర్జయభుజాలీఢప్రతాపప్రపూ
ర్తి నపూర్వాతప మేకకాలమున నెంతే మేదినీమండలం
బున శోభిల్లఁగఁ జేసెఁ నంచు నుతిసల్పున్ లోక మచ్చెర్వుగన్. 44

మ. చినతిమ్మేంద్రుఁడు లింగమాంబవలనన్ జెన్నొందఁగాఁ గాంచె నం
దనులన్ శూరవరేణ్యు నప్పనృపు నుద్దామ ప్రతాపాఢ్యు రం
గనరేంద్రుం ధృతిశాలిఁ గొండధరణీకాంతున్ నితాంతైకశో
భనుఁ గృష్ణాధిపు వారిజేక్షణచతుర్బాహూపమాకారులన్. 45

ఉ. అప్పనృపేందుఁ డిక్కువలయంబుఁ బ్రకాశము నొందఁజేసి సొం
పొప్పఁ జకోరదృక్తతికి నుత్సవ మూన్చుచుఁ గౌముదీరుచిన్
దప్పక కాంచి వే ల్యరివితానముమానము చూఱలాడి తా
నెప్పుడుఁగీర్తివైఖరి వహించి చెలంగె నభంగురోన్నతిన్. 46

క. ఆయనకుఁ దమ్ముఁడైన గ
జాయుతబలశాలి రంగపాపనిపాలుం
డాయోధన జయశీలుం
డై యిల యేలెను జనంబు లభినుతిసేయన్. 47

సీ. తనచూపు సుకవిసంతానంబుమీఁద సం
తతము మావలిపసంతంబు లాడఁ
దనమూపు పంటపైఁ బలి విహరింపఁ గ్రొ
మ్మిసిమిగుత్తెండు పైఁడిమేడగాఁగఁ
దనయేపు కలన మార్తాను చెండిమన్నీల
తెగకెల్ల గుండెలోఁ దిగులు గూర్పఁ
దనకాపు సకలబాంధవనికాయమునకుఁ
దగ వజ్రపంజర మగుచు నిగుడఁ

గీ. బొగడు గాంచెను హారికర్పూర హీర
తారహార పటీర సీహార సౌర
వారణాదారణ ప్రబాపూరసార
కీర్తిరుచిశాలి రంగపక్షితిపమౌళి. 48

చ. అతనికిఁ దమ్ముఁడై తనరె నంబుధివేష్టిత భూతలాశ్రిత
ప్రతతిచకోరక ప్రకటభవ్యతరోత్సుకకేళికృద్దర
స్మిత నవచంద్రికారుచివిశేషవిభూషిత వక్త్రచంద్రుఁ డ
చ్యుతరమహావిభూతి గుణసాంద్రుడు కొండనరేంద్రుఁ డెంతయున్.

గీ. ఆమహాబలు ననుజన్ముఁడై ధరిత్రి
గోత్రసంభరణైకదక్షుఁడు నితాంత
కాంతసత్యాభిరాముఁ డాకలిత భద్రుఁ
డచ్యుత సమాఖ్యుఁడనఁ గృష్ణుఁ డతిశయిల్లె. 50

చ. అతనికి నన్నయై చెలువ మందిన ఓబ్బులకొండమేదినీ
పతి భుజహేతి దూతియయి ఖండనఖండిత వైరిజాతికిన్
రతిని హసించురూపమున రంజిలు నా తెఱగంటినాతికిన్
రతి ఘటియింపఁ జేయు నవురా కవిరాజి నుతించుచుండఁగన్. 51

సీ. దినరాజు వనరాజు ధనరాజు నిరసించు
శౌర్యగాంభీర్యతౌదార్యకలన
మృగరాజు నగరాజు ఖగరాజుఁ గుందించు
సాహసపటుధైర్యజవనిరూఢి
నలరాజు వలరాజు నలరాజు హసియించు
రుచి సురూప హయాధిరోహణముల
గిరిరాజు హరిరాజుఁ గరిరాజు నలయించు
క్షితిధృతి వాచాచ్ఛకీర్తిపటిమ

గీ. నే మహోదారుఁ డాశూరుఁ డిలఁ జెలంగె
"గాయగోవాళగేయాధి రాయ" బిరుద
మండనుండుఁ భయంకర ఖండనుండు
భవ్యగుణశాలి కొండభూపాలమౌళి. 52

మ. ఇనదణ్డంబు ధనంజయచ్ఛరము వాణీశద్గిరీశంబు కో
కనదత్త్రైరవ మబ్జరాగదుడురాట్క్రాంతంబు కాశ్మీరజ
ద్ఘనసారంబు సురాలయద్రజతగోత్రం బయ్యె బ్రహ్మాండ మా
చినతిమ్మక్షితిపాలకొండవిభు నక్షీణప్రతాపంబునన్ 53

సీ. కైరవహరణ జాగ్రద్వృత్తి వర్తిల్లె
నే "గండరాదిత్యుఁ" డేపుమీఱి
పరకుంభినీధవోత్పాటనోద్భటుఁ డయ్యె
నే "గండభేరుండుఁ" డిద్ధరిత్రి

నిరతక్షమాధరవరధర్మమున మించె
నే యాదిగర్భేశు డీను లేక
యనుపమాద్భుత సమాఖ్యారూఢిఁ దనరె నే
"ఖడ్గనారాయణాంకన" మరీణుఁ

గీ. దాక్షిణ్యగుణపారీణు నాప్రవీణు
నాబుధత్రాణు నామహోద్యత్ప్రతాపు
నాజయోద్యగ్రనిస్త్రింశనాయకీణు
నెన్న శక్యమె కొండయ్యభూమణిని. 54

శా. ఆ కొండక్షితిపాలచంద్రుఁడు వివాహంబయ్యె నానాసతీ
లోకస్తుత్యసుశీల గోపమను, సుశ్లోకైక సంకీర్త్యకీ
ర్త్యాకల్పాంచిత బక్కమన్, నిరతధర్మాలంబనాకాంక్ష దీ
క్షాకౌతూహల రంగమన్, సుజనరక్షాదక్ష బక్కాంబికన్. 55

సీ. పృథివి తా క్షమ యయ్యె ప్రియమైన పరగతి
ఘనతరవారిభంగంబుఁ దాల్చె
నగజాత సతియయ్యె నాత్మేశు నొకమూల
నటుఁద్రోచి పౌరుషం బణఁగఁ జేసె
వాణి తాఁ బరిశుద్ధవర్ణాత్మ యయ్యె న
వ్వాల విభుఁ దన మాటవాని జేసెఁ
బద్మ శ్రీ యయ్యును బతిఁ గొంచెపడ వేఁడి
పరుసిచే దాసుంబుఁ బట్టఁ జేసె

గీ. ననుచు వారల నిరసించి తనరె ధాత్రి
మహితపాతివ్రతీమహామహిమ నసమ
సుగుణనికరంబ యగుచు బిజ్జలకులేంద్రు
కొండభూపాలచంద్రు శ్రీగోపమాంబ. 56

మ. అల దుర్భిక్షసుభిక్షకాలముల నత్యామోదయై భూసురా
వలి కిష్టాన్నము లన్నపూర్ణకరణిన్, స్వర్ణంబు లయ్యిందిరా
జలజాక్షీమణిఁబోలి దా నొసఁగి ఖాస్వత్పుణ్యకీర్తుల్ ధరా
స్థలిపై నించిన గోపమాంబ కెనయే సాధ్వీమతల్లీతతుల్. 57

క. ఆ గోపమాంబవలనన్
భోగామరవిభుఁడు కొండభూపతి గాంచెన్
ద్యాగసురద్రుపు నప్పన,
వాగీశమనీషి రామవసుధాధీశున్. 58

క. అప్ప ధరాపతి సర్వక
కుప్పటలీనిటలతటులఁ గూరుచు యశమన్
గప్పురపుఁజిత్రకంబులు
ముప్పిరిగొనఁ బ్రేమ సుకవిముఖ్యులు మెచ్చన్. 59

గీ. ఆ మహాభాగునకుఁ దమ్ముఁడై చెలంగె
రాముఁ డురుసత్త్వమున బలరాముఁ డనఁగ
రణముఖంబున భార్గవరాముఁ డనఁగ
రాజితకృపాప్తి శ్రీరఘు రాముఁ డనఁగ. 60

సీ. దశరథారాధన తాత్పర్యమున మించి
క్షమ సుమిత్రాత్మజాసక్తిఁ గాంచి
సాధువితానరక్షణదీక్ష ధరియించి
శివధర్మవర్ధనస్థితి వహించి
ఖరదూషణాహితకాండముల్ విదళించి
హరిముఖ్యబలముల నాదరించి
పరవాహినీశ్వరబంధంబు గావించి
శరణాగతావనస్ఫురణ నించి

సీ. జగడాలఁ బచరించు సౌరమాణిక్యంబు
విషములు గురియుఁ బ్రావృడ్ఘనంబు
నుగ్రశేఖరభావ మొందు సుధాంశుండు
మొరయుచు పడిసుళ్ళ ముంచు జలధి
యాలంబుఁ బెంచు న య్యాంకురభూజంబు
కోసిపెట్టును శిబిక్షోణిభర్త
త్రా నొల్చియొసఁగు సత్తపనకుమారుండు
మెండుకో పాలూరుచుండు సురభి

గీ. యనుచు వారల నిరసించి యనుపమాన
దానలసమానఖేలనానూనమహిమఁ
దనరుబిజ్జులకులసుధావసధిపూర్ణ
చంద్రుఁడో యన యాగనరేంద్రుఁ డలరు. 65

సీ. భూదారతారూఢిఁ బొల్పుమీఱఁగఁ జేసె
వైరుల కల విప్రవాసకలన
పురుషసింహఖ్యాతిఁ బరిఢవిల్లఁగఁజేసె
నహితుల కగుగుహాధ్యాసగరిమ
రాజపుంగవలీల రాజిల్లఁగాఁజేసెఁ
బ్రత్యర్థులకుఁ దృణగ్రసన పటిమ
భోగివిస్ఫూర్తి యొప్పువహింపఁజేసె శ
త్రులకు వల్మీకాధిరోహమహిమ

గీ. విపులజయపేటి యెన్నాని విజయధాటి
యట్టిబలుమేటి సంధృతజ్యావధూటి
తతయశశ్శాటి యాగభూధవకిరీటి
నెనయఁజాలునె యీనాటి నృపతికోటి. 66

క. నిచ్చలమగు ధైర్యంబున
నెచ్చెలు వగు జగ్గనృపతి నెమ్మి పరించెన్
పొచ్చెమ్ము లేనిగుణములు
మచ్చికఁ జెలువొందు వీరమను వేడుకతోన్. 73

క. ఈ కరణిని జెన్న ధరి
త్రీకాంతు మహాన్వయంబు వృద్ధి నెసంగెన్
శ్రీకరుఁడై వెలసెను మే
ధాకలితాత్మ్కుఁ డెఱకొండధరణిపుఁ డెలమిన్. 74

సీ. తనదానధార యుదన్వంతునకు నిరం
తరనూత్నకన్యాప్రదాత్రిగాఁగఁ
దనహేతి యప్సరస్తరుణుల క్రాంత
నవవిటానీక సంధాత్రిగాఁగఁ
దనయశంబు చకోరతతుల కనారతా
భ్యవహారమహిత సంపాదిగాఁగఁ
దనప్రతాపము కోకదంపతులకు సంత
తప్రమోద రసప్రదాయిగాఁగఁ

గీ. దనరె బిజ్జులకుప్ప భూధవపతంగ
కలశపాథోధిపూర్ణిమాకమలవైరి
చటులబలసీరి సంగరజయవిహారి
భూరిగుణహారి యెఱగొండభూపశౌరి. 75

ఉ. ఆ యెఱగొండభూపమణి యత్యనురక్తి వరించె భద్రసం
ధాయినిఁ బెద్దమాచమ నుదారదయాగుణశాలిసజ్జన
ధ్యేయసుశీల ధర్మభృతదీక్ష నిజాశ్రితబంధురక్షణో
పాయమహత్త్వదక్షఁ బతిభక్తిసహాయ నమేయధీనిధిన్. 76

గీ. అట్టిపెదమాచమాంబికయందుఁ గాంచె
వేడ్క నెఱగౌండభూపతి విబుధగణ్యు
విస్ఫురితపుణ్యుఁ బదనమద్భూమతమేది
నీధవశరణ్యుఁ బెదతిమ్మనృపవరేణ్యు. 77

సీ. కమనీయదక్షిణ కాశికాక్షేత్రంబు
రహిమించ నెవ్వనిరాజధాని
తుంగాఖ్యగంగాతరంగ రంగన్మౌళి
బ్రహ్మేశుఁ డెవ్వనిపాలివేల్పు
పాదుశాదత్తకుంభద్దంతిహయముఖ్య
వస్తు లెవ్వానియింట విస్తరిల్లు
ధరవంతు కెక్కుకందనవోలివేశంబు
గణుతింప నెవ్వనికాణయాచి

గీ. సిరుల నొప్పునలంపూరిసీమ కెల్ల
"నాడగౌడును, దేశాయి, నాడకిరణ"
మనెడువిఖ్యాతి యెవ్వాని కలరె నతఁడు
వొల్చె బిజ్జులపెదతిమ్మభూవిభుండు. 78

సీ. పంకజాతాకర ప్రకటసంచారంబు
గల మహాకమఠంబుఁ గలయుకొదువ
నోలిదానంబు చండాలున కిడు ఘనా
ఘనులతోఁ గూడిన కల్మషంబు
విసువక ఘనపఙ్క్తి వేళ్ళకుఁ బెకలించు
నక్కటిని భజించుహైన్యవృత్తి
నెపుడు జగత్ప్రాణహృతిఁ బంట విషమిడు
నలభుజంగాధిపు నంటునఘముఁ

గీ. బాపికొనియె వసుంధరా పద్మనయన
సరసబిజ్జల పెదతిమ్మధరణినాథ
చంద్రభుజపీఠి నిలిచి తచ్చరణజలద
శేషవిష్ణుకథాసుధాసేచనమున. 79

సీ. దుర్వారమడియుక్తిఁ దూఁగెడు కుంభినీ
పతుల నఖంబులఁ బట్టియెగురుఁ
గటకాంతరస్థితి గర్జిల్లు పురుషసిం
హములఁ జంచూపుటాగ్రములఁ జించుఁ
బైగా ఘనాఘనపటలముల్ రా నిజ
పక్షమహాబలప్రతతిఁ దఱుముఁ
బరవాహినీసముద్భవమయ్యుఁ బ్రవహించు
కీలాల మెదనిండఁ గ్రోలి మెఱయుఁ

గీ. నతులవిక్రమలీల నేయనఘమూర్తి
చండిమాఖండ "గండభేరుండ" బిరుద
మతఁ డెసంగెను "రాయవేశ్యాభుజంగ"
భాసురాంకుండు పెదతిమ్మపార్థివుండు. 80

సీ. పుడమిఁ గంకణమాత్ర మిడుదాత ఘనుఁడు క
ణామాత్ర మిడుదాత సోముఁ డరయఁ
బలమాత్ర మిడుదాత యలశిబి పాలుమా
త్రంబిచ్చుదాత నిర్జరుఁగిడ్డి
క్షితిఁ బాదమాత్ర మిచ్చినదాత బలి నిజా
సవమాత్ర మిడుదాత యివు ఖచరుఁడు
త్వఙ్మాత్ర మిడుదాత తాపని యిష్టమా
త్రం బిచ్చుదాత నిధానభర్త

గీ॥ యనుచు వారి వదాన్యత నుపహసించు
నఖిల దేశసమాగతయాచమాన
పరమనోరథసంపూర్తి వఱలఁజేసె
భూరివిభవుండు పెదతిమ్మభూవిభుండు. 81

ఉ॥ ఆ పెదతిమ్మభూమివిభుఁ డర్థి వరించెను గామమాంబ హృ
త్ప్రాపితవిష్ణుసద్గుణకదంబ లసత్కరుణావలంబ స
ద్రూపవిలాసకాంతినికురుంబ ముఖద్యుతిదీర్ణపూర్ణతా
రాపతిబింబఁ గీర్తినికర ప్రవిడంబితకంబు కంబుగన్. 82

ఉ॥ ఆ సతియందుఁ గాంచెఁ జెలువందుకుమారుని శక్తిసంపదన్
భాసిలుశూరునిన్ బుధజనస్తవనీయవిహారునిన్ గుభృ
త్త్రాసవిధాయిశౌర్యసముదారుని గృష్ణనృపాలధీరునిన్
ధీసరసీజసూతిఁ బెదతిమ్మమహీశుఁ డతిప్రకాశుఁడై. 83

సీ. వాహినీశాంతరవాసియై యెప్పుడు ము
 ర్వారాతిపదయుక్తిఁ బ్రబలఁడేనిఁ
బంకజాతాలసాహాప్తశితుండై పూత
 నాభీరునిహతిఁ జెన్నారఁ డేని
సతతసమ్మదమహాసవభోక్తయై గురు
 ప్రజభామినీరతి వఱలఁడేనిఁ
గల్పసత్యాసక్తికలితుఁడై మహిజాత
 రూపాహరణవృత్తిఁ జూపఁడేని

గీ. సరియనఁగవచ్చుఁ గృష్ణుఁ డీజగతియందు
నహితసమవర్తి ధర్మైకశానువర్తి
సత్క్రియమస్ఫూర్తి సర్వజ్ఞ సన్నుతాచ్ఛ
కీర్తియై పొల్చుబిజ్జలకృష్ణపతికి. 84

సీ. ఫణికులాకుల మైనపాతాళమున కేఁగు
వేగఁ బొంగుచు గాంగవేణిసరణి
దుర్గమక్షోణిభృద్వర్గముఁ జరియించు
సారెకు సింహకిశోరిదారి
నంబరంబున నిరాలంబయై మిక్కిలిఁ
గ్రీడించు నైందవరేఖ కరణి
నుగ్రగజగ్రాహవ్యగ్రపాథోరాశి
మించి లంఘించు రాయంచపోల్కి

గీ. భువనవిస్ఫూర్తి సత్వసంపూర్తి విబుధ
హర్షకరకీర్తి నరవినుతాచ్ఛమూర్తి
వర్తిలిన కృష్ణరాయేంద్రు కీర్తియపుర
రమణులకు నెన్న భీతి కృత్రిమముగాదె. 85

మ. అవురా బిజ్జలకృష్ణ రాయహయరింఖాతిక్షతక్షోణిసం
భవధూళీపటలంబు దంబుగ నభోభాగంబునన్ నిండి యం
దు వివస్వంతు సకృత్ప్రకాశమహిమామూర్ఛత్వముఁ గావించినన్
గవిసార్థంబు యథార్థ మయ్యె నను౯ దక్షద్యోతనామంబిలన్. 86

సీ. కరము జడస్థితిఁ గలనైనహరి పేరుఁ
నెఱుగనిదానవద్విరదములను
ఘనులెల్లఁ దమకు వంకలు గడింపఁగ మహా
ఘనములు రాఁబడునట్టి గట్టుమగలఁ
దమిమోరత్రోపున ధర్మశాలిక్షేత్ర
తతులు హరించినదారకానిఁ
బరఁగ రోఁజుచు మహాబలవిరోధం బెప్పు
డాచరించుచు నుండు నలగరదుని

గీ. నదలి, హరిపాద సేవనాసక్తు ననఘు
సాధుసంరక్షణోత్సాహు సారజనస
హాయు బిజ్జలకృష్ణ రాయక్షమేశు
మెచ్చి ధర తద్భుజాపీఠి వచ్చినిలిచె. 87

సీ. పండ్ల యూటలు ద్రావు పారిజాతంబును
గాలిఁబోమెడు తాలకంధరంబు
నల్ల నదీనుఁడౌ నమృతపయోనిధి
గతిలేని నాకలోకంబుమఱచి
గడు ఎనువ్వయమునఁ గార్చె మొండసుధాంశుఁ
గూడు లేకటవి నెక్కొను దఫేచిఁ
గరము పేదతికంబుఁ గనుకామధేనువు
భైక్షవిపంచలఁబడు కుబేరు

గీ. ధరసదావనీపకవృత్తి వఱలు శిబిని
నరయ మధ్యాహ్న దారిద్ర్య మందుకర్ణు
నెనయ నొల్లక బిజ్జలకృష్ణరాయ
ధరణివల్లభుకడ నిల్చె దానలక్ష్మి. 88

చ. అనఘుఁడు కృష్ణ రాయవసుధాధిపుఁడా జపపల్లి వేంకటా
వనిప కుమారియై ధరణి వార్తకు నెక్కినబచ్చమాంబ నో
ర్పును గడు నేర్పునుం గలిగి పుట్టినయింటికిఁ జొచ్చినింటికిన్
ఘనముగ వన్నె వాసి చెలఁగ న్మను సాధ్వి వరించె మించుగన్. 89

సీ. నాయకు నేలదున్నకము మాన్పఁగ లేని
యల రత్నగర్భ గంధానుషక్తి
ధవు దూఁడగాపరితనము వారింపని
సంపన్మృగాక్షి చాంచల్యగుణము

పతి యుప్పుమోసెడిభంగ మెడల్పని
వసుమాత ప్రతికూలవర్తనంబు
నాత్మవల్లభునెత్తి యప్పుమోఁపెల్ల దిం
చని యపర్ణాహ్వాయచండితనము

గీ. నెంచి వారల నిరసించి హృద్యవినయ
పతియు స్థిరమతియును శీలవతియు సాధు
మతియు నై పొల్చెఁ దను మానవతులు మెచ్చ
భళిర బిజ్జలకృష్ణేంద్రుబచ్చమాంబ. 90

మ. అల బచ్చాంబికయందుఁ గృష్ణవసుధాధ్యక్షుండు నిన్ గాంచె నా
కలశాంభోనిధికన్యకామణియెడన్ గంజాక్షుఁ డామోదియై
వలరాజున్ గనులీల, భూవలయభాస్వత్కీర్తికల్లోల బి
జ్జలతిమ్మక్షితిపాల పాలనయనాస్తోకార్చనాలాలసా! 91

సీ. తలయేఱు గలిగి నిచ్చలు గండసులు సెంది
గతిమాలు గిరులసాంగత్య మెడలి
దుర్వర్ణయుక్తిబంధురమైన నెమ్మేనఁ
బొడలూను కరటులపొందు మాని
భరితమహోక్షయపాండురుగ్గాత్రుఁడై
యొంటిఁ గ్రుమ్మలు ఘోణిజంట వదలి
చెవులవిన్కలిలేక సీదనంబునఁగాన్పు
పేదయైన భుజంగుఁ బెనగు టుడిఁగి

గీ. ప్రేమ రామాభిరామనిరామయాంగ
రామణీయకవిభవవిరాజమాన
కలన విహరించు నిను ధరాకాంత సెంచె
దీపితాటోప బిజ్జలతిమ్మభూప! 92

మ. "అరుదా! రంభకు నిచ్చ యౌవనసితాంతాసక్తి, యాశ్చర్యమా!
పరికింపన్ శశిరేఖకున్ దమి మహాపాశ్చాత్యయోగం" బటం
ద్రు రహిం దిమ్మనృపాల! నీవలుక మైఁ ద్రుంపన్ దివిన్ సిద్ధయం
బరురాహుత్తులు చేరి యప్సరలఁ బ్రేమం గూడఁ, దిత్పారిగ్రీటుల్. 93

సీ. "పటుమహాసవపూర భరితులౌచుఁ దికల
స్ఫుటమహాసవసారభోక్తలుగను
పరసుధర్మాభోగహరణులౌ ఖానుల
నురుసుధర్మాభోగయుక్తులుగను
వారక సన్మార్గహారులౌ నబిసీల
సంతతసన్మార్గచారులుగను
దతసుమనోభివర్ధన మూన్చుపసుల
సమధికసుమనోభిసంగులుగను

గీ. జేసె నఘటసఘటనావిశేషభాస
మానచాతుర్యధుర్యతానూనకలన"
ననుచు నీథాటి వినుతించు నహితకోటి
ధీరసల్లాప బిజ్జుంతిమ్మభూప! 94

ఉ. భోరనఁ గృష్ణరాయనృపపుంగవు తిమ్మనృపాల! నీశితో
దారకరాసి డాసి యసిలాస్త్రికియున్ నటియించుఁ గాంచితో
జోరుమసూదుఖానరణశూరుని ప్రాణసమీరణంబులన్
వారణ సేయునే నిమిషమాత్రములోననె శ్రీసమగ్రమై. 95

సీ. పోరుచేసి కరంబు నో రెండిపడు వారిఁ
జేరదు తనపయోధారగూర్చి
యంకపాళికిఁ జేర కళుకుచు నెళవులు
గొనువారిఁ బెంప దకుటిన ఘటించి

యెద(బడువారి సమ్మదమున( దేర్పదు
పట్టి రమ్మని తన(బక్కనుంచి
తొడికాళ్లగాన లేచి యడుగున( బడువారి
స్వస్థుల( జేయను చంక(జేర్చి

గీ. విజయలక్ష్మల( బ్రోవదో వెలయ శౌర్య
నందనుల( గావదో మహానందకలన
మీరి నిర్దయయయ్యె నీ నారి యొూర
దీపితాటోప బిజ్జులతిమ్మభూప! 96

సీ. అందంపు(బులితోలు బొందళంబను జగా
పసిమిపుప్పొడిచేల మిసిమిగులుక
భోరన వాగెడు బొడ్డుఘంటలపేర
ఘంటలమొలనూలు కటిని బ్రోయ
వాలు పేరిటివేజి జాళువాపరజను
సంపంగివిరిదండ సొంపునింప
బిరుదంపుజగజంపుసురుమాయిజల్లులన్
చామరంబుల రభసంబు వెలయ

గీ. వరపతాకాచలంబు పావడలునిగుడ
నాజిమహా తేజి నెక్కి మున్నధివసించె
వేడ్క జయలక్ష్మి రీతినేన్పికిలిచెన్న
ధీరు నెద(బాసి నిసు(జేం తిమ్మభూప! 97

సీ. మొనసి నీదుకటారి మొనపోటు నాట(గా
గాట మౌ రంభచన్నొప్పటుగలిగె
నీబాణ మెద గంటి నిప్పటిల్ల(గ( జేయు
హరిణిచే మోవికా టంద( గలిగె

నీజయ భేరికా నినదముల్ చెవిసోక
వెస తారమణితముల్ వీనులగలిగె
నీఖడ్గ మంగముల్ నెఱ నాటుకొన మేన
కాకాంత జడివాటు కవయ(గగ్గె

గీ. నౌర! తమ కెంతయుపకారి యనుచు మెచ్చు
మోహమున నిన్ను, సాహసోత్కలితో(గ
పికిలి చెప్ప క్షమాపాలవీరసమితి
దివిని శుభరూప! యుజ్జ్వలత్స్వరూప! 98

గీ. ధరణి పతిగజసింహపద్వారప చింత
కుంట ధర్మరాజేంద్రుసనిహూ(తు నంతి
యకర్షామాంబను పరిణయించి యంత జౌర
మాంబ నుద్వాహ మైతివీ వాసకముక. 99

క. ఆయకాంత్రాంబిక బంధుని
కాయపరిస్తూయమానఘనపాతివ్ర
త్యాయత సతతకృపాధా
రేయత(గడు నతిశయిల్లె శ్రీపినసిత్తయై. 100

సీ. ఆశ్రితపంకజాతాలయయౌ లక్ష్మి
ననయంబు చండిక యైన గౌరి
బహుభాషిణి యనంగ(బరగుచుండెడు వాణి
నరయంగ(బాంసుల యైన ధరను
వడి సుళ్ళచే(జాలదడ(బడు జాహ్నవి
దమయంతి యగు నైషధప్రమదను

సైరంధ్రియై ధరాస్థలి మను ద్రౌపది
నకులీన యగు నరుంధతిని గేలి

గీ. పఱచి, పుణ్యక్షమామితవాక్స తీత్వ
భద్రరక్షణ సంపత్తి పావనాన్వ
వాయజననంబుఁను ధాత్రి వార్త కెక్క
ననుపమానగుణాలంబ యుక్కమాంబ. 101

క. సౌరమణీవైఖరి బుధ
వారమనోభీష్ట మొసఁగి వసుమతి సారా
చారమనోజ్ఞత వర్తిలు
బౌరమ శ్రీరమ యనంగ బాంధవుల రయన్. 102

సీ. పాకవిధ్వంసిఁ జేపట్టు పులోమజ
పుణ్యజనాశినిబొందు లక్ష్మి
బ్రహ్మఘాతుకుని నేర్పడ వరించిన గౌరి
తలకొట్టమారిని దగులు వాణి
కడు గురుద్రోహిని విడువని ద్రౌపది
సవిసంగతుని బ్రేమ నంటు స్వాహ
యనిశమహాబలాహారి గూడిన ధాత్రి
శివధర్మ మర్దనుఁ జేరు సీత

గీ. సాటి యని పల్కవచ్చునె సకలసుగుణ
భాసమానని జేశ సేవాసమాన
మధురసానూనలసమానమానసాబ్జ
యైన బిజ్జల శ్రీబౌరమాంబతోడ. 103

క. ఆలయకర్ణాంబయెడఁ బు
త్రులఁగాంచితి నీవు సుగుణతోయధి యగుచున్
జెలువందు ధర్మభూవరు.
కులభూధరధృతివిహారుఁ గొండసర్విసాలున్. 104

సీ. శాంతరసంబు సాక్షాత్కరించె ననంగ
దాతృత్వ మాకృతిఁ దాల్చె ననఁగఁ
బటుధైర్యమహిమ రూపంబు భజించె ననఁగఁ
గరుణ సాకారమై నెరసె ననఁగ
శూరత యుపఘనస్ఫురణఁ జూపె ననంగ
వినయంబు పుంభావ మెనసె ననఁగ
దాక్షిణ్య మవయవోదార మయ్యె ననంగ
న్యాయంబు సాంగమై యలరె ననఁగ

గీ. నేపెసంగె జగద్రక్షణైకపక్ష
శాశ్వతైశ్వర్యధుర్యరామేశ్వరాంఘ్రి
మహితసారసలాలసమానసాళి
భవ్యగుణపాళి ధర్మభూపాలమౌళి 105

సీ, ప్రకటదానములందుఁ బ్రతిదినం బాసఁ
జేచాఁచు నట్టి దిక్సింధురముల
నడవడి దప్పి యేర్పడ నీక్యమోపరు
తొనఁగు నప్పుడుఁ దోఁగుచుండు గిరుల
జోగులఁ గలసి యధోగతి నంటుచుఁ
బడగ లెప్పుడు మోయు పాపడేని

నడవిలో వెల్పెలనై వేరువెల్లంకి
త్రవ్వకతినెడు భూదారవరుని

గీ. మాని, సర్వంసహాకాంత మఱగి నిలిచె
నతులసామ్రాజ్యధౌరేయుఁ డఖిలవిబుధ
సతతభజనైకచరుతుఁడు చతురుపాయుఁ
డైన బిజ్జలధర్మభూజానిమణిని. 106

చ. బలయుతుఁ డైన ధర్మమహిపాలుకృపాణము కృష్ణమూర్తియై
వెలయును గానిచో నపునిపేదన మూర్చి భజించువైరికు
జ్వలసురతాప్తి నిర్జరమసారవణీ రమణీయవేణికా
కులసురతాప్తియున్ మిగులఁ గూర్చి యెసంగునెః తత్క్షణంబునన్ . 107

సీ. సింధు దేశమున కేశ్రీఘనదానాంబు
తతి బహుజీవనస్థితి యొనర్చుఁ
గాశ్మీరమున కేజగత్ప్రతిభాషాభి
ముఖ్యంబు మేదు రామోద మొసఁగు
సౌరాష్ట్రమునకు నే$సవరసూతపౌఢి
యరయ శోభాస్పదస్ఫురణ గూర్చుఁ
గరహాటమునకు నేవరరుచితేజంబు
మేలిమిదులకించుదాలు నిల్పు

గీ. మత్స్యమున కేరసాధీశు మహితధామ
మమలకమలాప్తి ఘటియించి యలరఁజేయు
నతఁడు సామాన్యుఁడే బిజ్జలాన్వయాబ్ధి
పూర్ణిమాబ్జారి శ్రీధర్మభూపశౌరి. 108

$ "సౌరసూత" కావచ్చును

చ. వలగొని ధర్మభూపశరవహ్ని తపింపఁగఁజేయ వేదనా
విలతనులై విరోధినృపవీరులు వీఁపు దూలి జాలి లో
జిళికి తదీయపాదజలజాతములం బడి వ్రాలినన్ గృపా
కలనతఁ డార్తిమాన్పి యనిఁగాచె మహోతనుకేతనాంకముల్. 109

సీ. సేవింప నిచ్చును క్షీరపాథోరాశి
కాచిన నిచ్చును గల్పశాఖి
పాదమానఁగ నిచ్చుఁ బౌర్ణమాసీ శశి
పేరుకో నిచ్చును సౌరభేయి
డాలు పట్టఁగనిచ్చు నాలేఖరత్నంబు
వినుతింప నిచ్చు శిబిప్రభుండు
నెమ్మి గూయఁగ నిచ్చు నీలజీమూతంబు
దండ మూనఁగ నిచ్చు దైత్యవిభుడు

గీ. కాన వారల దాతలుగా గణింపఁ
దగునె? సిద్ధార్థుకకృపానితాంతకాంత
సంతతావితనానాదిగంతబుధవ
నీవు ధర్మమహీపు వర్ణించుచోట. 110

చ. అతఁడు వరించె శేషమఁ గృపాశ్రితబాంధవమిత్రపోష స
చ్చతురమనీష మంజులవచః కలనాజితధాతృయోష మా
నితపతిభక్తియుక్తిరమణీయవిభూష మహాసుశీలతాం
చితనిజవేష మాధవపిశేషమహార్చనతోషమానసన్. 111

సీ. జాహ్నవికై వడి సంతతాశ్రిత కవి
శ్రేణి సంరక్షించు శేషమాంబ

పార్వతిమాడ్కిఁని బటుకుమారోదయ
స్థితి రహించుచు నుండు శేషమాంబ
భారతిరీతిని బహునరస్తుత్య సౌ
శీల్యంబు భరియించు శేషమాంబ
మేదినిభాతి నమేయక్షమాభిఖ్య
చెలువంబు మతిఁ బూను శేషమాంబ

గీ. యనుచు బాంధవసందోహ మభినుతింప
నిత్యపావనతాధర్మనిర్మలత్వ
సహజసహనత్వముల ధరాస్థలిఁ జెలంగు
స్థిరగుణాలంబ ధర్మేంద్రు శేషమాంబ. 112

క. శేషమవలనన్ గాంచెను
భాషాశేషుండు ధర్మపార్థివుఁడు మహా
భీషణవిద్వేషణభయ
వేషాపహకరణభరణు వెంకటరమణున్. 113

గీ. ధర్మభూపాలమౌళికిఁ దమ్ముఁడగుచుఁ
దనరు నిమ్మడికొండేంద్రుఁ దరమె యెన్నఁ
జండభుజదండమండితమండలాగ్ర
ఖండితోద్దండరిపుమహీమండలేంద్రు. 114

మ. పలుకుందొయ్యలికొప్పు వట్టి, ధవళాబ్జాతాళులన్ మెట్టి, ద్యో
తలకల్లోలవతీతరంగచరకాదంబచ్ఛటన్ ముట్టి, య
గ్గలికన్ శారదనీరదౌఘపద మాఁకంబెట్టి, ధట్టించె బి
ట్టలవో కిమ్మడికొండభూవిభు సమాఖ్యాహంసి చిత్రంబుగన్. 115

సీ. పరధరాధీశ్వరుపాదంబు లెనయించె
నాత్మీయకుంభిసీనాళి నెల్ల
బలుపిరతరులగుంపులుదాఁగులాయంబు
గాఁజేసె వాజిసంఘముల నెల్లఁ
గరము నానావనీవరయోగ్యముగఁ జేసెఁ
గాంచనస్యందనోత్కరము లెల్ల
మెఱయురసాధిపుశరణ మందఁగఁజేసె
నిర్వేలవాహినీనివహ మెల్ల

గీ. నరయ సుచితజ్ఞుఁడౌర ప్రత్యర్థిధరణి
పాలుఁ డిమ్మడికొ-దభూపాలుధాటి
పరువు లిడువేళ నాయాయువస్తువితతి
తగినయెడలనె మఱవక తార్చెఁగాన 116

సీ. అప్పుగా కియ్యఁ డెంతైనఁ బర్జన్యుండు
పూటగా కియ్యఁ డెప్పుడును సురభి
వృద్ధిలే కియ్యఁడు వెన్నెలరాయఁడు
పత్రంబులే కీదు పారిజాత
మెత్తున కెత్తుగా కియ్యండు శిబివిభుఁ
డడుగుగా కీఁడు దైత్యాధినాఁథు
డుత్తరాశనెకాని యొసఁగఁడు ధనపతి
యిల్లటమున్నఁగా కీయఁ డబ్ధి

గీ. యనుచు వారివదాన్యత లపహసించి
వలసినంతయుఁ గోరినవస్తులెల్ల

సకలదేశాగతార్థార్థిసమితి కొసఁగుఁ
గూర్మి బిజ్జలయిమ్మడికొండవిభుఁడు. 117

మ. అవురా! యిమ్మడికొండభూవర సముద్యద్దోర్భుజంగేంద్రుతో
నవలీలన్ గవగూడి కాంచుఁ గరవాలాభీలజాగ్రద్భుజం
గి విరోధిక్షితిమండలేశ్వరమదాకీర్ణద్విపా స్తంభకుం
భవిభేదచ్యుతమౌ క్తిక ప్రకరదంభస్ఫాయదండంబులన్. 118

సీ. కటకాధివాసులై కనుపట్టుపెరులఁ
గటకాధివాసులఁ గాఁగఁజేసె
గంధర్వసంగతి గమనించువిమతుల
గంధర్వసంగతి గాంచఁజేసె
వాహినీసుస్థితి వఱలుప్రత్యర్థుల
వాహినీసుస్థితి వఱలఁజేసె
నచలశృంగారవిహారులౌ శత్రుల
నచలశృంగారంబు లందఁజేసె

గీ. నించుకేనియు శాత్రవమెదఁదలంప
కెంతయౌచిత్య మెఱుఁగు! మేలిద్ధరిత్రి
బిజ్జలాన్వయరాజీవబిసరుహాప్తుఁ
డైన యిమ్మడికొండభూజానిహేతి. 119

చ. అతఁడు వరించె నంచితదయానికురుంబను సీతమాంబ, నూ
ర్జితసుగుణావలంబ యయి చెల్వువహించిన కృష్ణమాంబ, న
చ్యుతుఁడు రమాపురంధ్రిని, మహోన్నతి భూతరళాక్షిఁబోలె న
త్యతులితసంపదాప్తి, సహనాప్తియుఁ గల్గి మెలంగువారలన్. 120

చ. ఎలమిఁ దలంపఁ దిమ్మధరణీశ్వర! నీ వల బౌరమాంబయం
దలఘుతరప్రతాపనిధియై తగు శ్రీనరసింహు, సత్కృపా
జలనిధిఁ గృష్ణభూవిభుని, సాహసభార్గవు బచ్చభూపతిన్,
బలజితభీమసేనుల శుభస్థితి గాంచితి వౌ కుమారులన్. 121

సీ. అరిఁజూడ స్తంభోద్భవాఖ్యనొందకయున్నఁ
బెఱవారి కద నోరుదెఱవకున్న
శత్రులచెంగట సటలు చూపకయున్న
నభియాతిహతి కద నరయకున్నఁ
బెల్లు దాయ యెదుర్ప గోళ్ళు సెందకయున్నఁ
బగతుఱయెద వెల్లబాఱకున్నఁ
గ్రూరాహితునకు ద్వైరూప్య మూనకయున్నఁ
బరిపంథిఁ గని వాలు మఱవకున్న

గీ. దీటనఁగ వచ్చు నరసింహదేవుఁ డాహ
వక్షమాబలదక్షవిపక్షధరణి
మండలాధ్యక్షశిక్షణాఖండరూక్ష
వీక్షణుం డైన నరసింహవిభునితోడ. 122

సీ. ధామనిధిప్రథోద్ధాముఁ డౌనితని కా
శ్రితచక్రసంభృతి చిత్రమగునె?
రాజశేఖరుఁ డన రంజిల్లునితనికి
శాశ్వతైశ్వర్య మాశ్చర్య మగునె?
చతురాననవిలాససహితుఁ డౌ నీతని
కతులకళావాప్తి యరిదియగునె?

బలభద్రవిస్ఫూర్తిఁ బరగు నీతనికిఁ గృ
ష్ణాగ్రజవిఖ్యాతి యద్భుతమగునె?

గీ. యనుచు బుధకోటి వినుతించు ననుదినంబు
నెవని నాతఁడు సామాన్యుఁడే యుదార
ధీరవీరగుణాధారతిమ్మనృపకు
మారబిజ్జలనరసింహమనుజవిభుఁడు. 123

మ. అవురా! బిజ్జలతిమ్మభూవిభునృసింహాధీశబాహాసి రా
హువు మాద్యత్పరరాజమండలము సద్యోజీర్ణమౌనట్లుగాఁ
గవళింపం గని సమ్మదం బెసఁ బొసంగం బద్మినీచక్రముల్
సవికాసస్థితి గాంచె సత్ప్రికర మంచచ్ఛ్రీ భరించెన్ దమిన్. 124

సీ. గడగడవడఁకి నల్గడలఁ బాఱు తురుష్క-
వాహినీచ్ఛట డాఁగ వనధియయ్యెఁ
బోఁగాళ్ళు లేక బల్బుసకొట్టి పడు పార
సీకాహితతికి వల్మీకమయ్యె
వెఱ నిజపక్షంబు లఱఁ బోవు పాశ్చాత్య
కౌశికాళికి నంధకారమయ్యె
భువి దిగంబరు లైన యవనయోగుల కాయ
ములు నిండఁగా భూతిపూఁతయయ్యె

గీ. ననుచు నానావజీరు లెవ్వనిమహోగ్ర
చటులధాటీనిరాఘాటపటుతురంగ
ఖురసముద్ధూతధూళిఁ బేర్కొనుచునుందు
రతఁడు సామాన్యుఁడే నృసింహప్రభుండు. 125

ఉ. ఆ నరసావనీశుఁడు ప్రియంబలరంగ వరించెఁ జెన్నమన్
మానవతీలలామ నసమానదయాసుగుణాభిరామ సా
ధ్వీనివహానిశప్రణుతధీగరిమాపరసీమ సప్తసం
తానముఖోల్లసత్సుకృతధామ సుధామయవాగ్ధురంధరన్ 12౬

ఉ. ఆ నరసేంద్రుతమ్ముఁడు మహావిభవేంద్రుఁడు చెన్నసంగు దు
ర్మానవిరోధిభూధవపరాభవకారణవారణాదిసే
నానివహాతిసాంద్రుఁడు ఘనాఘనగర్జితతర్జనైకభీ
షానకరావభీతవిమతాధిపజిష్ణుఁడు కృష్ణుఁ డిద్ధరన్. 12౭

సీ. దుర్గమాత్మీయారివర్గవిముక్తిచేఁ
దగి వాహినీకబంధములఁ దోఁగి
సారంగవరచర్మధారణం బొనరించి
వనవాసిసంభోగ మనువుపఱచి
భరితక్షమాభూతిపైఁ గోర్కి కడుఁ బెంచి
విజ్ఞానమున మౌనవిధి వహించి
భూరిరుచిరమణీసారకాంక్ష లడంచి
కఠినాసనస్థులై కన్నుమోడ్చి

గీ. మోక్షమార్గంబు గైకొనుదీక్ష నరులు
పరమ మని యెంతు రెవ్వానిభవ్యనామ
మతని బిజ్జలశ్రీకృష్ణ సహితజిష్ణు
భోగజితవిష్ణు నేరికిఁ బొగడఁదరమె? 12౮

సీ. కుంభినీపతులతోఁ గూడియుండుటఁజేసి
దంతీంద్రముల కింత దలఁకదయ్యె

ఘూదారవరులతోఁ బొత్తుగాంచుటఁజేసి
క్రోడపరంపర కోడదయ్యె
పురుషసింహములతోఁ బొం దొనర్చుటఁజేసి
హర్యక్షముల కాత్మ నదరదయ్యె
ధరణిభృద్వ్యాఘ్రతత్పరతఁ బొల్చుటఁజేసి
శార్దూలసమితికి జడియదయ్యె

గీ. బిజ్జలాన్వయపాథోధిబిసరుహారి
యైనతిమ్మేంద్రుకృష్ణభూజానిచంద్రు
ధాటి నిలు వోపలేక కాంతారవాటిఁ
బాటిలినచింత శత్రువధూటికాళి. 129

క. ఆకృష్ణధరాధిపమణి
చేకొని తాఁ బెండ్లి యయ్యె స్థిరతరసత్యన్
దీకలనాకృతకృత్యన్
శ్రీకరయశ లక్ష్మమాంబ శ్రీతిమ్మాంబన్. 130

గీ. ఆమహామహునను జన్ముఁ డలరు బచ్చ
ధరణిపాలుఁ డనారతదానశీలుఁ
దరివిఘాలుఁడు హరిసేవనాతిలోలుఁ
డతులకరుణావిశాలుఁడు నగుచు మిగుల. 131

సీ. నిండుజాఁబిల్లిఁ గుందించు నన్న విపాండు
శరజంబు నాకులపఱచు టరుదె?
గరుడతుండంబు వంకలుసేయు నన్న ద
ర్వీకరేంద్రులఁ జుట్టఁ బెట్టు టరుదె?

వజ్రములఁ జెక్కు లు వడఁ జేయు నన్నుఁ బ్రా
లేయాద్రిపక్షముల్ జెండు టరుదె?
మృగరాజు గట్లపాలుగఁ జేయు నన్న ది
క్సింధురేంద్రము నెత్తిఁ జించు టరుదె?

గీ. చంద్రికాలీల దివము నాశంబు సేయు
ననిన నక్షత్రముల వగ బడఁచు టరుదె?
యబ్జజాండకటాహంబు నాక్రమించి
వర్తిలెడుబచ్చ భూపాలకీర్తి కరయ. 132

ఉ. ఈదృశపుత్రపౌత్రవిభవైకమహామహిమాభిరామతన్
మేదిని సుప్రసిద్ధిఁ గను మీ కరుదే యిటువంటికావ్యముల్
సాదులు మెచ్చఁగా బహురసప్రతిపాదనలీల హెచ్చఁగా
నాదృతి మీర దేవతల కంకిత మూన్పుట తిమ్మభూవరా! 133

వ. కావున నీ విప్పు డొనర్చిన యనూనరసభావభవ్యంబగు కావ్యంబు శాశ్వతైశ్వర్య విధానావధానకృపానశ్వరప్రభావుండగు రామేశ్వర దేవున కంకితంబు సేయుమని రేనును దత్ప్రభావం బభివర్ణించెద. 134

సీ. అరుణశోభాపరిస్ఫురణభాసిజటాళి
కరము పల్లవసముత్కరము గాఁగ
భూషాచ్ఛటాయితశేషాద్యురగపాళి
దం బూనుతీవతండంబు గాఁగ
మందాకినీరుఝురామందాంబుపూరంబు
ధారాళమకరందధార గాఁగ

గాశ్రప్రభావత్ప్రకాశకాయవిలి ప్త
భూతి పరాగ సంభూతిగాఁగఁ

గీ. గొమరుజాబిల్లి విరిగుత్రికొమరు గాఁగఁ
దా ననర్ఘేష్ట ఫలసంప్రదానకలనఁ
గ్రమ్ముకొని నిల్చుకల్పనగమ్ముగతి ర
మేశ్వరస్తుతుఁ డొప్పు రామేశ్వరుండు. 135

—ష ష్ఠ్యం త ము లు.—

క. ఏతాదృశమహిమావి
ర్భూతసమస్తప్రపంచపోషణరతికిన్
శీతాగమజాతాసమ
వేతాకృతి కసమసమరవిజయోన్నతికిన్. 136

క. గంధాంధసింధురాంధక
కంధరజంఝూశుగాసికాదక్షునకున్
సంధాతనుగంధాత్మసు
బంధాతను హరణకరణపాలాక్షునకున్. 137

క. ఘోటిత పుంగవపతికి వి
పాటితభవతతికి విష్ణుపదభవతటినీ
ధాటీకనదాటీకన
జూటీవనవాటికాచ్ఛసుమదుడుపతికిన్. 138

క. ముష్టింపచనిచయమనో
భీష్టదకారుణ్యనిధికి భీమత్రిపురీ

దుష్టాసురకష్టావహ
చేష్టానరదాసగ ప్రసిద్ధశరధికిన్. 139

క. ధర్మమయధర్మధరునకు
ధర్మేతరకర్మమర్మతామసరవికిన్
*దుర్మానసధర్మానవ
శర్మానగహాశతౌఘశైలవసతికిన్. 140

క. రాజీవజాండదీపక
తేజోమయదివ్యకాయదివసేశునకున్
రాజతగిరిరాజపరి
భ్రాజచ్ఛ్రీప్రాకటూరిరామేశునకున్. 141

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన "యనర్ఘ రాఘవం" బను
మహాప్రబంధనాటకంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 142

సీ. పృథుగోపురోన్నత్యభిక్షార్థగతిహైమ
వరజకైతవభాగవధిధరంబు
వరరత్న యాచ్ఞార్థపరిసరాయాతక్షే
యచ్ఛలాస్వీతరత్నాకరంబు
స్వాతిజీవనగోపనార్థాగతమసార
మణిసౌధరంభకుంభధ్వనంబు
సంపదాదానార్థసంశ్రితచంద్రికా
లోపరిభ్రాజితదోఃపురంబు

---

* చింత్యము.

క. ఘర్మహర్మ్యసటన్నటీపటలనటన
పటుకళాఖ్యసనార్థసంప్రాప్తసాల
భంజికాఛద్మవత్పౌరభామినీక
లాప మింపొందు నిల నయోధ్యాపురంబు. 143

చ. సురుచిరలీలమై వరుసఁ జుట్టును గెంపులు సెక్కి నట్టిభూ
తరుణికడానికమ్మ యనఁ దార్కొనుకొమ్మలతోడికోటచే
బరఁగు నయోధ్య సాటియని పాటిలు వేలుపుమేటిపీటి నం
బరతలచుంబి కేతుపటపాణితలంబునఁ జెంపఁగొట్టుచున్. 144

గీ. విమలమణిశృంగములకల్మి పిటికోట
ధర సదామందరాగవిస్ఫురణఁ దనరె
పరిఖ తద్వేష్టనాహీనపటిమఁ గాంచి
నిబిడవిషపూర సంభృతి నివ్వటిల్లె. 145

ఉ. ఆపురిముద్దరాండ్రు పరిఖాంబుచరత్పణిరాజసత్ఫణా
ప్రాపిపయోజరాగములు రక్తసరోరుహకోరకభ్రమన్
బైపయిఁ జేరి నిర్భయతఁ బాణులచేఁ గయికొండ్రు నిచ్చలున్
బాపురె బర్హిబర్హక చభారధురంధర తొంటనో కదా! 146

సీ. సమదసారంగవిభ్రమలీల విలసిల్లి
ధారాలహరులచేఁ దారసిల్లి
ప్రబలరథాంగశోభాలీల శోభిల్లి
రాజహంసస్థితిఁ దేజరిల్లి
ఘనమైనసంతానగరిమచే వాటిల్లి
కమలాధివాసమై గారవిల్లి

కలితమహావర్తకస్ఫూర్తి వర్తిల్లి
పద్మినీసంసిద్ధిఁ బరిఢవిల్లి

గీ. శంఖమకరనిధిప్రౌఢి సంపతిల్లి
* .......................
యల్లదామరకొలను నా నతిశయిల్లె
నాపురంబు సమున్నత గోపురంబు. 147

మ. సిరతంబున్ మణిసౌధపీఠికలఁ గన్నొల్ తాపినన్గుంకుమం
పురసానన్ మెయి నల్లువెట్టి జలకంబున్జేయుపన్నీరు ని
ర్ఝరశైవాలినిఁ గాల్వలై కలయఁ దత్సావర్ణనీరేరుహో
త్కరముల్ వాసన నొప్పఁ; గానియెడ బంగారంబు వాసించునే ? 148

ఉ. అప్పురి సౌధకేతనపటాంచలముల్ వినువీధి రాయఁగాఁ
దెప్పన రాలి క్రింద నరుదెంచు ఘనంబులఁ జిక్కి వృష్టితోఁ
దప్పక ధాత్రిపైఁ దొరఁగి తారతఁ దారలు గాంచెఁ; గానిచో
నొప్పనె తారహార మను నుజ్వలనామము మౌక్తికశ్రీకిన్ ? 149

చ. పురిమణిగోపురం బొఱయఁ బుష్పవనచ్ఛలనందనావళిన్
గిరు విడి సౌధపంజరశుకీకలనాదము పేర సన్నుతుల్
నెరపుచు దాని నిచ్చ మది నిల్పుట గోపురమై తనర్చె న
గ్గిరిరిపువీడు తా భ్రమరకీటనయంబు దలిర్ప నేఁటికిన్. 150

ఉ. నాలుగుమాట లేయుగము నాటివొ నేరిచి సృష్ట నంచు నే
వేళను రాజసప్రకృతి వీడక తాల్చి నితాంతపంకజా
తాలయవృత్తి వర్తిలె నటంచు నజున్ హసియింతు రెంతయున్
బ్రోలిమహీసురుల్ నిగమమూర్తులు సాత్త్వికపుణ్యవర్తనుల్. 151

---

* ఈ పాదము మూలమున లేదు.

సీ. గోత్రవిద్వేషంబు గోరని రాజులు
మలినవర్త్మలు గాక వెలయుశుచులు
పరహింస గోరని పరధర్మ లెట్టియ
ఫ్పలమూల డాఁగని పుణ్యజనులు
శరభంగ మూనక పరఁగిన భువనేశు
లహిభయరహితమహాబలాఖ్యు
లాశఁ జిక్కనియట్టి యర్థపు లేరికి
ననిఁ గ్రిందు గాని దుర్గాధిపతులు

గీ. కువలయాహితవృత్తిఁ గైకొనని యినులు
తమ్ములకుఁ గీడొనర్పనిదారిఁ దనరు
సత్ప్రభువు లంచు లోకులు సన్నుతింప
క్షత్రియులు పొల్తు రప్పురి సవతులేక. 152

ఉ. ఆకటకంబుకోమటు లనంతమణిక్రయవిక్రయప్రభా
వాకలనన్ జెలంగఁగఁ దదాహ్వయుఁ డైన యినుండు భీతి ర
త్నాకరుమర్వుఁ జొచ్చి, యతఁ డంతకుమున్నె సముందు గాక భం
గాకులుఁడై చెలింగి చను నచ్చట నుండక తూర్పుకొండకున్. 153

మ. అమితైశ్వర్యనిరూఢిఁ గాంచి సురవిప్రారాధనౌదార్యధు
ర్యమతిన్ జెన్నగు తత్పురాంఘ్రిజుల దీటంచున్ బ్రశంసింప నో
పమితైశ్వర్యుమాత్రనే సురవరబ్రహ్మాదివిద్వేషదో
షమహోగ్రుండయి యింతలో నతులభిక్షావర్తి యౌస్థాణువున్. 154

చ. అరుదుగ గండభాగముల నంటిన చందిరపున్ ధగద్ధగల్
పరిఢవిలంగ దంతములఁ బాటిలి ధాత్రిఁ జరించు భూధరో

త్కరమున బృంహితప్రబలగర్జితమై మదకైతవాంబువుల్
గురియు ఘనాళి నా సమదకుంజరయూథము దిమ్మరున్ భువిన్ 155

చ. శరముల దొప్పిబ్బితిన్ శరధిసంఘములోఁ, బవమాను మూలకున్
దటిమితి, నాత్మ లోఁబడ నొనర్చితి నాఁబడివచ్చుబాయ, ను
ద్ధురఖురపాటితక్షితిజధూళిఁ దూపఁ జేసితిన్, ధరన్
సరి తన కెవ్వ రంచుఁ బరిసైంధవబృందము పల్కు హేషలన్. 156

క. కరము సిరాఘాటస్థితిఁ
బురికర్బురఘనశతాంగములు సరిపోలన్
దిరిగిన సౌరవిమాన
స్ఫురణన్ గురుశరశరాసముల లోఁబఱచున్ 157

సీ. పిడుగుతున్కలనంగఁ బొడిపొడి గావింతు
రొరసిన భూమిభృద్వరులనెల్లఁ
గార్చిచ్చు సెకలనఁ గలసి వేల్తు రెదుర్పఁ
జాలు మహావనీపాలి నెల్ల
సింగంపుఁగొదమలనంగ ఖండింతురు
పరమత్త కుంభినీశ్వరుల నెల్ల
నౌర్వాగ్ని కీలంబులనఁగ లోఁబడఁ జేతు
రానీకవాహినీశాళి నెల్ల

గీ. మాటి కుఱుముచుఁ దేజంబు నేటుపఱచి
దూటి లంఘించి నిబిడహేతుల ధరించి
రౌర వీరని తము శూరు లభినుతింప
నొప్పుగాంతురు తత్పురియోంటరీలు. 158

సీ. కఠినత గల్గు మీగబ్బిచన్గుబ్బలుల్
గాంచి నారదుఁ డైనఁ గవయ కున్నె?
మధురిమఁ జిల్కు మీయధరబింబమ్ములు
చూచి యాశుకుఁడైనఁ జొక్క కున్నె?
మేచక ప్రభ లొల్కు మీకచధ్వాంతంబు
లరసి కౌశికుఁ డైన మరగ కున్నె?
మృదురీతి బొలుపారు మీయూరుకదళికల్
గని మతంగజుఁ డైన మొనయ కున్నె?

గీ. యనుచు భోగసమాసక్తి నలభుజంగ
పుంగవులు వల్కువచననైపుణికిఁ బొంగి
యంగజాభంగసంగరాలింగనాది
కేళిఁ దేల్తురు పురి భుజంగికలు వారి. 159

సీ. కై కొందు సామోదకరపల్లవం బమ్మ
పైకంబునకుఁ గాగ పాళె యడుగఁ
ఏపైనవలపులనించు కల్వలనించు
రేయైనఁ గాని యేరీతిఁ బొసఁగు
సడలవే పట్టునఁ జను మొగ్గ నాయ దే
పట్టియాడంగఁ జొప్పడు నె యిపుడు.
తాల్మమై గోరుగేదంగి చా లెనయించు
విను పొంది కై నఁ గా దనను నేను.

గీ. గాంతవదన సరోజాప్తి కలుగఁ జేయు
కలుగఁc దగవందు రా యని కడు విటాళి

వనచరనాసుగుణముగాఁ జలికి కులికి
విరులుపిల్తురు పుష్పలావికలు పేట 160

చ. కలమపుంజేల ప్రాఁకఁ గని కాంతలు గల్లునఁ గూసి తేఁపగాఁ
జిలుకలపిండు లేచి చనిఁ జేరి రసాలఫలాళి ముక్కులఁదూ
పులఁ బొడువన్ దొరంగురసపూరపునీటఁ బెరుంగటన్ గదా
వెలయు రసాలసారమున వీటిజనించు న వేక్షుకాండముల్. 161

మ. తటరూఢప్రథమేక్షుకాండతతు లత్యంతంబుఁ బక్వంబులై
చిటులన్ రాలిన యాజిముత్యముల పేటీపాళికాహస్తసం
పుటమందూఁచి పురోపకంఠసరయూప్రోద్యద్ధునీదేవి ముం
దటఁ దన్నుంగలయంగ వార్ధిగనియెన్ రత్నాకరాఖ్యానమున్ 162

ఉ. పోఁకల నల్లిబిల్లిఁ గని పొంగఁ బెనంగుభుజంగవల్లి తా
నాకులపాటు నెందెనని యచ్చపుఁబూజిగిఁ జొన్న నవ్వ నోఁ
బోకలవారితోఁ బెనగఁబోయిన యాఁతకూన కబ్బదే
యాకులపాటటంచు నను నవ్వని రంభ శుకోక్తిపేరటన్. 163

ఉ. ఆపురి నింపు నింపు మలయాచలచంచలకుంజపుంజ ర
థ్యాపరభిల్లపల్లవపదాస్తసశస్తనవాంకసాంకవ
శ్రీపరిణీతశీతలఝరీతతరంగరంగసం
దీపితకంజగుంజపశిరీకపసారవవాతపోతముల్. 164

క. ఆకటక మేలు దశరథ
భూకాంతుఁడు రిపుపరాజిభూకాంతమదో
త్సేకాంతదభాకాంతప
తాకాంతశ్రేష్ఠగిరిసుతాకాంతుండై. 165

మ. శుకవాణీమకరాంకుఁ డాదశరథక్షోణీవిభుం డొక్కనా
డకలంకోన్నతిఁ గెంపురాపతిమకోలాటంపుబల్ టాకులన్
రక మౌ నంతిపురంబుకొల్వుచవికెన్ లాటీమరాటీశకీ
కుకురీదత్తన్నృపోచారుఁ డగుచున్ గొల్వున్న సచ్చోటికిన్ 166

సీ. దివ్యకులాంకషాతీర్థ సేకంబునఁ
బావనం బగుజటాపటలివాఁడు
సత్పురుషావతంసఖ్యాతివిలసిల్ల
నార్యానుషక్తుఁడై యలరువాడు
సురుచిరాత్మక్షమాధరధర్మ మెడలక
యరివర్గజయముచే నడరువాడు
మారుతాశనపరిష్కార మౌ నెమ్మేన
నతనుభూతి ధరించి యమరువాఁడు

గీ. వామదేవుండు రా సమ్మహీమహేంద్రుఁ
డెదురుగాఁజని మది భక్తి గుదురుకొనఁగ
నాదరంబున నర్ఘ్యపాద్యాదు లొసగి
నిగనిగలు దేరు నాకమణిస్థగితపీఠి. 167

క. ఉనిచిన ననిచినవేడ్కం
జనపతి గనుఁగొని వసిష్ఠశాసన మనఘా!
విను మని యమ్ముని యిట్లని
వినుపించె సుధారసంబు వీనుఁ దొలఁకన్. 168

క. మేదురతరమధుకైటభ
మేదోవిస్రామిషంబు మేదిని దీనిన్

వామకౌసం ఘుజియింత్రుప
సీదన్నిజకీర్తి సురభిచేసిన నృపతుల్ 169

వ. అని వినిపించిన విని దరహసితాంకురంబు నిజముఖపంకజంబు నలంకరింప నరదేవుండు వామదేవున కిట్లనియె.

ఉ. అమితభక్తియుక్తిఁ జనయాజ్ఞ శిరంబునఁ దాల్చి రాజ్యమేఁ
జేయుచునుంద నిట్లుజరచే నరసెన్ జెవిచెంత, నిప్పుడుం
బాయనికార్శ్య సత్వమును బాయనకుంబలె నాకుఁ దెల్పెదున్
నామెడఁ బక్షపాతము ఘనంబు గుణోత్తమునెమ్మనంబునన్ 171

గీ. అనిన వామదేవుఁ డనియె నో రాజన్య
తిలక! యదుపగాంగఁ బలికె దేల?
యెట్టిపర్వసముల కేనిఁ "దారామైత్రి"
యెంచిచూడ నొక్కొ యెసన కాదె? 172

గీ. అరయ రఘుకులసామ్రాజ్యగురుఁడ వతండు
నిక్కమట్లయ్యు నీయందె నెమ్మి ఘనము:
సకలజనమోదకరుఁడైన చంద్రమునకుఁ గు
ముదము దలపంగ దా ప్రాణపదము కావె? 173

వ. అనిన నన్నరేంద్రుండు మునీంద్రా! మదీయశ్రవణవృత్తియును మా
మంతుండు గుణవచన తృష్ణాంశకంబున నింద్రియానుసారి యగు
మానసంబును నేనుంగుం బోనీక మరల్పెదుఁ దద్వాచావిశేషం బశేషం

బెరింగింపవే యన సకలసందేశ సంగ్రహకందం బగు నిక్కందంబు
నీడెందంబునం బొందుపఱుపు మని మునిపురందరుండానతిచ్చె సావధా
నుండవై వినుమని యిట్లని పఠించె. 174

గీ. సదనంబున కర్థిజనుల్
ముదమున రాఁ బూర్ణకాములుగఁ జేయుము, నీ
కది హోమం బది యాగం
బది తప మది వంశధర్మ మవనీనాథా! 175

వ. అని పఠియించి. 176

క. కీలింపు మేతదర్థము
నీలో నన గురువరేణ్యునెయ్యపునుడులన్
పూలసరంబులు శిరమునఁ
దాలిచినాఁడ నని మఱియు దశరథుఁ డనియెన్ 177

సీ. నేఁడుగా పద్మినీనేత మత్కులకర్త
హవిరన్నభుజులతో నాద్యుఁ డగుట
నేఁడుగా నేఁ బ్రయీనిర్దిష్టవిధులచేఁ
గ్రతువులు చేసి విఖ్యాతిగనుట
నేడుఁగా నీపయోనిధిపరీతధరిత్రి
రాజన్వతీసంజ్ఞఁ దేజరిలుట
నేడుఁగా నాసఖ్యనియతిచే జంభారి
దా మహోన్నతునిగాఁ దలఁచుకొనుట

గీ. యహహ యీరీతి తను దానె యస్మదీయ
భాగ్యమహిమ నరుంధతీప్రాణభర్త
దేశికాగ్రణి హితసమాదేశకలన
నిన్నుఁ బుత్తెంచి నన్ను మన్నించెఁ గాన. 178

వ. అనిన వాసుదేవుం డిట్లనియె. 179

ఉ. ఓరఘురాజవంశకలశోదధికల్పమహీజ! మీకు నీ
చారుయశోవిభూతి సహజం బుపదేశ మొనర్చుమాత్ర మౌ
దారము కైరవోత్సవనవద్యుతిపూర్తికిఁ గాత్రికీనిశా
హారివిహారయుక్తి పలెనా నళినారికి నెంచి చూచినన్? 180

గీ. నాయకోత్తమ! నీయన్వవాయమునకుఁ
జెలగు నేతన్మహాఖ్యాతి గలుగు టెల్ల
యపరపరమేష్ఠియైనట్టి యవ్వసిష్ఠ
మౌనివంశవతంసముమహిమ సువ్వె. 181

సీ. ఉదితోదితం బయ్యె నుర్విని నేమౌనిచే
యాజ్యులై తనరు మీయన్వయంబు
నవపూర్తమయ్యె నర్ణవ మధ్వరము సేయు
సగరుని కేమునీశ్వరునికరుణఁ
గీర్తిధ్వజం బయ్యె గీర్వాణవాహిని
*యేఋషిమహిమ భగీరథునకుఁ
దోహదక్రియ యయ్యె లోహితగురుని సూ
నృతవచోలతకు నేయతిప్రతిజ్ఞ

---

*(ఈ దశమున విశ్రమము చింత్యము.)

గీ. కౌశికునిపట్టు గలిగియుఁ గాసినొందె
నజ్ఞుఁడై యే తపోధనునాజ్ఞమీఱి
యకట దివియును భువియుఁ గానక త్రిశంకు
భూవరుఁడు రెంటికిని జెడ్డ రేవఁ డగుచు. 182

గీ. ఆమహామునీంద్రు నానతత్రిదశేంద్రు
నాతపోగరిష్ఠు నవ్వసిష్ఠు
నాసుధీశరణ్యు నాపుణ్యు గొనియాడ
నలవిరించి కైన నలవియగునె ? 183

మ. అను నంతన్ బ్రతిహారుఁ డప్పు డొకరుండచ్చోటికిన్ వచ్చి యో
జననాథాగ్రణీ! వాఁడె వాఁకిటికి విశ్వామిత్రుఁ డే తెంచినాఁ
డనినన్ సంభ్రమ మొప్పఁ గౌశికుఁడె! నా నౌ నన్న నగ్గాధినం
దనుఁ డో డ్డేరఁగ వామదేవు ననిచెన్ హర్షప్రకర్షంబునన్. 184

వ. ఇట్లనిచి తనమనంబున. 185

శా. హారిశ్చంద్రశరీర ముద్భటతపస్యాశాతటంకచ్ఛటన్
దీరన్ జెక్కుచు నేమహాత్ముఁడు సముద్దీప్తంబుఁ గావించె దు
ర్వారబ్రాహ్మణరూప మట్టి విరజః ప్రఖ్యాతభాస్వద్గుణో
దారుం డింటికి వచ్చె గాధిసుతుఁ డాహా యెంత ధన్యుండనో! 186

సీ. అని తలంచుచు నుండె నంత నవ్వామదే
వుండు గాధితనూభవుని యథోచి
తముగఁ దోడ్కొని వచ్చుతఱి నతఁ డనియె నో
యనఘాత్మ! యలవసిష్ఠాశ్రమమున

నుండియే మీరాక యన్నాఁడె సుఖలీల
నతఁ డయ్యరుంధతీసతియుఁ దాను ?
ననుడు నోమౌనీశ! తనయిష్ఠసిద్ధికిఁ
జెలిమిమై మీరు విచ్చేయుకతన

గీ. నిపుడె కేవలసుఖి యాయినేంద్రుఁ డనిన,
నామనంబునఁ జాలదినాలనుండి
దశరథక్షోణినాథసందర్శనేచ్ఛ
యెల్లకోరికలకు మీఁద నుల్లసిల్లు. 187

క. అనవుడు గాధేయునితో
నను నిట్లని వామదేవుఁ డనఘా! మీరున్
గనుగొనఁ గోరుదు రటె! యా
జననాయకుభాగ్యమహిమ సామాన్యంబే ? 188

క. నావుడు వాచంయమకుల
దేవుం డిట్లనియె వామదేవునితోడన్
భూవరమాత్రుఁడె రఘుకుల
పావనుఁ డీతఁడు మహానుభావుం డనఘా! 189

చ. సవిధనమన్మహీరమణరత్నకిరీటవిభావిభాకర
చ్ఛవివిలసత్పదాంబురుహజృంభితదోర్విభవాభిరాముఁ డీ
యవనివిభుం డొనర్చె హరిదంతపరిభ్రమ దశ్వమేధ సైం
ధవఖురచంద్రకప్రకరదంతుర గాఁగఁ బయోధిమేఖలన్. 190

శా. ఆజంభాసురవైరికిన్ గెలుపుదోడై మించుజోదుం డ్రిలో
కీజంఘాంభుజాప్రతాపు నసురీఖేలత్కచాకర్షణ
భ్రాజత్పాణిసరోరుహున్ మనుకులప్రఖ్యాతు నేఁ డిమ్మహా
రాజున్ గన్గొనఁ గల్గెఁ గన్నుఁగవ నిర్ఘాత్యస్థితిన్ జెందగన్. 191

వ. అని పలికి వెండియు నమ్మునిపంచాస్యుండు వయస్యా, వామదేవః
మద్భావంబు చాతకంబుగాఁ జల్లనియమృతంబుజిలుకు సుజనసం
వాదానుమోదం బను పయోదంబునకుఁ దూర్పుఁ దెమ్మెరకరణి
నిత్తరణికులకేతు వభివర్ధనహేతు వయ్యె, నన వామదేవుండు
దేవాః భువనంబులకుం బ్రథమగురుం డగునీయంత మునివరుం డీ
తెఱంగునన్ గనుంగొనఁ గోరుటంజేసి యిప్పు డిప్పుడమిఱేని కుల
కుశలకర్మంబులను లతాగంధులకుం గిసలయంబులువోడమెఱున
నియె నిట్లనురూపంబులగు సల్లాపంబుల నుల్లంబు లలర నమ్ముని
తల్లజంబులు చేరనేతెంచిన. 192

తే. కాంచి కాంచనమయమైన గద్దె డిగ్గి
యెదురుగాఁ జని యమ్మహీభిదురపాణి
యుర్విఁ బ్రణమిల్ల మౌని యాశీర్వదించె
"సపరివారాయ భూపః తే స్వస్తి" యనుచు 193

క. భాసురతరసముచితకన
కాసనముల నధివసించి రపు డంద ఱు; ను
ల్లాసమున నంత నుత్తర
కోసలనాయకుఁడు కౌశికున కి ట్లనియెన్. 194

సీ. సంఘటిల్లెనొ దుష్టజంతుసంతానదు
ర్వారఖేదంబు కాంతారవీథిః
సంభవించెనొ భవత్సవనాంతరాయంబు
క్రతుభుగ్గణంబు లాకఁటఁ గృశింపఁ?
దలఁపుగల్గెనొ సమస్తక్ష్మామండలీ
దక్షిణంబైన మహేశ్వర మొనర్పఁ?
బరిణమించెనొ కాక తరణివంశపతంగ
ధారుణీవరచిరంతనతపంబు ?

గీ. మౌనికులనాథ! భవదాగమంబునకును
హేతు వెయ్యది యాన తీవే? యటన్న
మోమునెత్తమ్మి నెలనవ్వుమొలకలెసఁగఁ
గౌశికుఁడు వల్కె నారాజకౌశికునకు. 195

గీ. అధిప! సకుటుంబు లగుచు దిశాధిపతులు
నహరహంబును నీపంచ నధివసింప
విమతుఁ డనుమాటమాత్రంబు వినుటలేదు
ప్రతిభయోన్నతి మాకు నేగతి జనించు? 196

మ. అభయం బింద్రున కిచ్చుఁ దావక భుజాహంకారవృత్తిన్ జగ
త్యభిరక్షానిరపేక్షుఁడై హరి మనోహర్షాతిశైత్యోరుసౌ
రభనిశ్వాససమీరపారణపృథుప్రదోత్థితవాతాశన
ప్రభుశయ్యన్ సుఖనిద్రఁ జెందెడుఁ బయఃపాథోధిమధ్యంబునన్. 197

చ. అన జననాథుఁ డిట్లను రణాంగణభూమి విరోధికోటిమా
ర్కొనియెదునింద్రుఁడుపేన నెలగోలున నేనును సంచరించుచున్

ధను వొకవేళ నెక్కిడితి దాన జనించునశీకవార్త యో
మునికులసార్వభౌమ! యిటు మోదము మీమదిఁబాదుకొల్పెడున్. 198

వ. అనిన నవ్వుచు విశ్వామిత్రుం డమ్మహీకళత్రున కిట్లనియె. 199

ఉ. ఎన్నఁగ ముజ్జగంబులకు పీ వభయం బిడుపూఁటకాఁప వౌ
ట స్నిజ చాపనై పుణియెడన్ మరపొందుట దాను నిచ్చలున్
జన్నపుకూటిచే బలిసి సాంద్రతరాంగవశీసమున్నతిన్
గన్నులు పూడి నేడు బలమున్మరుఁ డేగతి నున్నవాఁడొకో! 200

వ. అనిన వామదేవుం డిట్లను నరేంద్రా! యిమ్మునీంద్రుఁ డానతిచ్చి
న యర్థంబు సార్థం బేనును బెక్కుమార్లుసుధర్మామధ్యంబునఁ
బ్రత్యక్షంబుగాఁ గనుంగొనిన తెఱం గెఱిగించెద. 201

మ. జననాథాగ్రణి! నీవు దేవసభ నాజంభారి యర్ధాసనం
బునఁ గూర్చున్న భవజ్జయాంక చరితంబుల్ కిన్నరుల్ పాడ మీ
ఋనమర్థోన్నతి యాఁగి తాపక భుజారోమాళ్ళవిద్ధాశిపూ
ర్ణనవీనాశ్రువులన్నటించు నతఁ డానందంబునందంబుగన్. 202

క. అన విని నవ్వుచు నతఁ డి
ట్లను నోమునినాథ! నీవు నకటా గాధే
యునిఁ గూడి యిట్లు పలుకన్
జనునే యాఖండలుండు సామాన్యుండే? 203

మ. కదనోర్విన్ భిదురప్రభోగ్రభుజుఁడై కన్పట్టుజంభారిక
ట్టెదురన్ గెంటక నిల్చుబంటుగలఁడే? యెచ్చోట నమ్మేటి దు

ర్మదవైరిచ్ఛటకున్ ఘటించు నపలాస్త్రంబున్ బహిర్భాగని
ర్యదమర్షాగ్నికణ భ్రమావహమహారక్తాక్షిపీక్షారుచిన్. 204

వ. అనిన విశ్వామిత్రుండు సగౌరవంబుగా నమ్మహీభుజు భుజశిఖ
రంబున నిమురుచు నిట్లనియె.

చ. అల జంభేది తావకభుజార్గళ శక్తిమహావిభూతిచే
మెలఁగుట యంతవింత యశమే యిది నీకుః మదన్వితంబినీ
కలితకపోలపత్రలతికామకరీపశుపాలనంబు మి
క్కిలి రఘువంశజుల్ మును లిఖించి పఠించినవృత్తియే కదా. 206

క. నావుఁడు భూవిభుఁ డిట్లను
ధీవిభవబ్రహ్మ పీవు దేవా! నీవా
చావితతికిఁ బత్యుత్తర
మే విన్నప మాచరింప నెంతటివాఁడన్? 207

క. మౌనివతంస! త్రిశంకు
క్ష్మానాథకథా ప్రసంగచతురులు, మిమ్మున్
వేనోళ్లఁ బొగడ నిచ్చలు
వీనులకున్ విందుగాఁగ విందున్ ముందున్. 208

మ. ధర గంపింపఁగ నల్కఁ బాక్తనజగత్సర్గంబు నీ వన్యథా
కరణారూఢము సేయ, భీతసురజాగ్రన్మౌళిమాణిక్యభా
స్ఫురదీప్తిన్ భవదంఘ్రియుగ్మ మెసగన్ గార్భణ్యవాచాపరం
పరచేఁ జేయఁడె? పాకశాసనుఁడుత త్ప్రిత్యూహసంధానమున్. 209

చ. అనిమిషకోటి వేగ భవదర్చనకై చనుదేర నంచ లో
య్యనఁ జన లేమిఁ జిక్కుఁ గమలాసనుఁ డన్నను నీచరిత్రలన్
వినుతి యొనర్ప నాతరమె నీదుసుధామధురోక్తి వైఖరుల్
వినుటకుఁ బైఁబడుచున్ దివురువీనుల నించుటగాక కౌశికా! 210

క. అని వదనేందునిఁ గని మురిఁ
గిన తమ్ములనంగ మోడ్పుఁగేల్గవ దనరన్
జననాథతిలకుఁ డిట్లనుఁ
బ్రణుతసుధామధురచాటువాచాప్రౌఢిన్. 211

గీ. ఓమహాత్మక! పైపై మహోత్సవంబు
లెన్ని సమకూడె నేసియు నెన్ని చూడ
విశ్వధాత్రి నొకానొక వేళనైన
మానసంబులు దనియునే మానవులకు? 212

క. కావున భవదాగమసం
భావనచే నలరునాదుమది గోరెడు నో
దేవ! నియోగానుగ్రహ
మీవేళం గరుణ నానతీవే యనుడున్.

క. అలయతఁ డితర మ్మోనృప
తిలక! నియోజ్యాంశ మున్నదే? యని మఱియుం
బలికెన్ సాక్షాద్ద్రాక్షా
ఫలరసదాయాదమధురభాషాప్రౌఢిన్. 214

చ. జగము నలంకరించెఁ గుసుమం బెడలించినచల్వరేనిమై
నిగనిగలన్ ధరాధరవిసర్మఫితాంబుధిజాతరస్థలీ
ధిగధిగలన్ ధగద్ధగలఁ దేరెడుచీకటి రేల జారు న
మ్మృగధరషండఖండితములఁ మించు భవద్వరకీర్తిచంద్రికల్. 215

వ. మఱియును. 216

శా. రాజోత్తంస! చకోరభీపకసహాప్రాపిజ్యభిచ్చంద్రికా
భ్రాజద్భ్రాంతి ఘటించు కీర్తులను సంపాదించు, మెండుం దవో
రాజిం దేజ మడంచు తేజములచే రాజిల్లు, మత్రింబునన్
రాజీవాప్తుఁడు దిగ్వధూకలితయాత్రామైత్రి పాటింపఁగన్. 217

వ. అని వెండియు. 218

మ. క్షితినాథోత్తము తోడఁ గౌశికుఁడు వలెన్ నేను వైతానిక
వ్రతదీక్షారతి నుందు; మామకతపోవన్యావనార్థంబు నీ
సుతునిన్ రాము గుణాభిరాము ధరణీసుత్రాముఁ గాంక్షించెదన్
గుతుకం బొప్పఁగ నంపు తత్ఫలము దక్కున్ నీకు నిక్కంబుగాన్ 219

సీ. శరదంబుమాటుగా జలరాశి తనపేట
ధరణీతల బెల్లఁ దనుపురీతి
నరుణుండు చాటుగా నాత్మీయకరరేఖఁ
దరణి చీకటులఁ బోఁదఱుముకరణి
పనటి యడ్డంబుగా ననలుఁ దన్నము నైజ
శిఖలచేఁ బక్వంబుఁ జేయుమాడ్కిఁ
గరువలిమఱుపుగాఁ గస్తూరి దశదిశల్
స్వీయవాసనల వాసించుపగిది

సీ. నీవు శ్రీరాముముఖమున నీప్రతాప
వైభవముమీఱఁ బోఁగ్రివు మావంటిప్రజల;
నధిప! మీవంటిపరపురుషార్థపరుల
కిదియు నొక శీల మౌఁ గదా మదిఁ దలంప. 220

వ. అనివెండియు. 221

క. హరి సాక్షాదసురవిజయి
వరుణనయము మాత్స్యనీతి వక్కాణించున్
గర మహిభయ మహిపురి, ను
ర్వర నీచేఁ దనరె వీర రాజవ్రతియై 222

వ. అని పలికిన. 223

క. అనుడి యుటు మునిపికుగై
పూని యలరు హాలహాలముబుడుగై, పటుదా
వానలకీలలవడుగై
మానవపతినెమ్మనంబు మలమలమాడ్చెన్. 224

వ. అప్పు డప్పుడమి ఱేడు తనమనంబున నిఖిలలోకానందకరం బగు నిందుకరానీకంబు తమ్ములకుఁ గరంబు భీకరం బగుచందంబునం గటకటా! యెల్లవారికి నుల్లంబున మొల్లంబగు తల్లదంబు పెల్లగిల్లం జేయు చల్లని యమ్మునితల్లజంబు రామప్రవాసఖేదంబను నోదంబున మన్మానసంబను నేనుంగుం బదఁ గెడపం గడఁగునే యని యొకింత చింతించి యంతలోన దేశికా దేశకందంబు డెందంబునం గందళించిన. 225

---

220. ఈ పద్యములోని తృతీయ చతుర్థ చరణములు మూలములోలేవు.

మ. ప్రకటప్రౌఢిమఁ గూర్మరాజ భుజగేంద్ర స్తబ్ధరోమాధినా
యకదిక్కుంభికులాచలాధిపులతో నానంగఁ బెన్నుద్దియై
సకలోర్వీభరమున్ వహించురఘువంశం బే జనింపంగ నేఁ
డకటా నిందితమై పరార్థవిముఖం బైనన్ జనుల్ నవ్వరే? 226

వ. అని యివ్విధంబున దెంపంబున నాందోళించు దశస్యందనుచం
దం బెఱింగి యమ్మునిపుంగవుం డిట్లనియె. 227

చ. దశితమహారివీర! కలిదంద్రులకున్ నృపసూతి పోషణా
కులతయు వైభవంబుఁ బ్రజకున్ సకుకూర్చు నిజంబు వేదనా
విలసియు సంభృతిక్రమము వీనులు పూన ననూనలీలఁ జె
క్కులఁ నలరించుఁగాదె మణికుండలమండనధాళధళ్యముల్. 228

ఉ. నావుఁడు భూవరుండు మునినాథున కిట్లను మీర లింత సం
భావన సేయుటన్ మిగుల భాగ్యము చేసితి నైన నింక నా
భావములోన నొక్కయెద బాలుఁడుగాఁ యకృతాస్త్రశస్త్రశి
క్షావిభవుండుగా యనుచు సంఘటిలెన్ గుశికాన్వయాగ్రణీ! 229

చ. అన విని శ్వేతనవ్య వదనాంబురుహంబు నలంకరింప న
మ్మునిపతి వల్కె నోయధిప! మున్నె వశిష్ఠపరూపనీతుఁడ
య్యనఘచరిత్రుఁ డప్రతిముఁ డంతియె కాదు మహాస్త్రశస్త్రగుం
భనము కృశాశ్వసంయమికప్పున్ మదధీనము శంక యేటికిన్? 230

వ. అనిన దశరథుండు సవినయంబుగ మహాత్మా! ధనుర్విద్యాసంప్రదా
యకంబ కాదు కకుత్స్థాన్వయంబు రాజుల కాయువును భవదధీనం
బ భానుకులీనపక్షపాతంబునన కాదే సదారాధనంబునఁ గృశాశ్వ

మునీశ్వరు సహస్రసంవత్సరంబు లుపాసించి యసమానుం డగు న
మ్మహానుభావుపలన దివ్యాస్త్రమన్త్రోపనిషద్రహస్యం బాశాస్యం
బుగా నెఱింగితి రనిన నమ్మహీమండలాఖండలు వాచాపాండిత్యం
బున కలరి మునిమండలేంద్రుండు వెండియు నిట్లనియె. 231

క. బాలుఁ డని రాముఁ దలఁపకు
నీలో భూలోకనాథ! నిజ తేజమునన్
దూలింపఁడె భువనతమో
జాలతిరస్కరణి తరణి సన్నంబయ్యున్. 232

సీ. అని యిట్లు గాధినందనుఁ డాడువాక్యంబు
లాలించి యమ్మహీపాలమౌళి
కుశికవంశపయోధికుముదినీబాంధవ!
పూని నీయట్టిమహానుభావుఁ
డానతిచ్చినమాట కేనాటనైనను
నీచోత్తర మొసంగఁ జూచునట్టి
చులుకనినాలుక గలుగువాఁ డెవ్వఁడో
యని వామదేవు దిక్కునకు మరలి

గీ. మంతనంబునఁ బల్కె నోమౌనిచంద్ర!
కౌశికునిమాట వింటిరేకద, వచింపుఁ
డింక నీయెడఁ గర్తవ్య మెద్ది? యనిన
ననఘ! యింతకు మిమ్మెంత యడుగవలెనె? 233

క. నిటలాక్షనిభుఁడు కౌశికుఁ
డఁట యాచకుఁ డీవు దాతవఁట ధరణీయజ్ఞం
బఁట మఖము రామభద్రుం
డఁట రక్షకుఁ డనుమతించు టొసదే మాకున్. 234

గీ. పార్థివోత్తమ! నిఖిలభూభారభిన్ను
లైన మిమువంటివారి కర్థార్థిజనుల
వాంఛితార్థంబు లొనగూర్చి వారిమోము
చెలువు వీక్షింప కేరీతి సేదదేఱు? 235

చ. కలదు విశేష మింకొకటి కాంక్షితముల్ నిఖిలార్థికోటికిన్
దలకొనఁ జేయుటే పరమధర్మము నీ కని తెల్పి నన్ను మీ
కులగురుఁడౌ వసిష్ఠమునికుంజరుఁ డియ్యెడ నంపుటెల్ల తా
నలఘుసమాధి గధితనయాగమనంబు నెఱింగియే సుమీ. 236

గీ. అనినఁ బార్థి వేంద్రుఁ డవ్వసిష్ఠమునీంద్రు
యోగదృష్టిమహిమ యుల్లమునకు
ముదము గీలుకొల్ప నిది యట్టిద యటంచుఁ
బలికెనిట్లు మేనఁ బులక లూన. 237

క. ఇదిదూరం బిది చేరువ
యిదియౌచున్నది యిదైన దిది యిఁక కాను
న్నది యనక యడరు నన్నిట
సదమలమతి యతికి దివ్యచక్షుర్మహిమన్. 238

వ. అని యవ్విభుండు వెండియుం గొండొక విచారించి. 239

మ. క్రతురక్షార్థము గాధిసూనుఁడు ననుం బ్రార్థించి నాచే నుపే
క్షితుఁడై, క్రమ్మఱి, కించిదంచితతపఃక్లేశప్రశాంతాధ్వర
ప్రతిరోధుండయి తద్విధానమునకున్ బ్రారంభముం బూనినన్
మతి నూహింపఁగ రాఘవాన్వయకథానాశంబు సంధిల్లదే. 240

మ. అనియంతన్ మహికాంతుఁ డాకుశికవంశాధ్యక్షు నీక్షించి యో
మునిసంక్రందన! గాధినందన! మఖంబున్ జేయ నూహించి రా
మునిఁ గాక్షించితిరేని నీ త్రిచతురంభోరాశిసంవీతమే
దిని మాపట్టున నింక గైకొనెదుఁ బాతివ్రత్యసాంగత్యమున్. 241

మ. అని యారాజశిఖావతంసము ప్రతీహారుం గటాక్షించి "రా
ఘునిఁ దోడ్తె"మ్మన, వామదేవుఁ "దనుజన్మున్ లక్ష్మణుం దోడితె
మ్మనుఁ"డన్నన్ నగి, "మిన్నుఁబాసి యుదయంబౌనే నిశానేత" నాఁ
బ్రణుతించెన్ జటిశౌరి వారి యవినాభావంబు భావంబునన్. 242

ఉ. అంతట ద్వారపాలుఁడు సమంచితభద్రుని రామభద్రునిన్,
బ్రాంతవినీతు లక్ష్మణు మహానృపలక్షణుఁ జేరి "మిమ్ము భూ
కాంతుఁడు పిల్వనంపె" నని కౌశికసంయమిరాక దెల్ప శు
ద్ధాంతగృహంబు వెల్వడి యుదారముదానమితాననాబ్జులై. 243

క. ఏతెంచునెడ సుమిత్రా
జాతుని నీక్షించి రామచంద్రుఁడు "వినుమా
యోతమ్ముఁడ! యిమ్ముని మహి
మాతిశయం బుగ్గడింతు" నని యిట్లనియెన్. 244

మ. శతమన్యుస్థితమన్యుఁడై నిజతపశ్శక్తిన్ జగత్సృష్టికిన్
ప్రతి కల్పింపగ సృష్టికర్త లగుసప్తబ్రహ్మలం జేసి, సం
స్తుతులన్ శాంతి వహించి వారి కొసఁగెన్ జ్యోతిష్పథోర్వీబహి
స్స్థితి యంచున్ దెలుపున్ బురాణకథ లీదివ్యర్షి చారిత్రముల్. 245

క పరమాద్భుతఖని యిమ్ముని
యరుదెంచె తనంత, నిట్టియతిలోకమహా
చరితుని సముచితగతి నుప
చరితుని గావింప మనకు శక్యంబగునే? 246

వ. అని మునుపటం జనిచని యమందానందంబు డెందంబునం గ్రందు
కొన లక్ష్మణభ్రాత తాత వామదేవులయంతికంబున నితాంత
ప్రశాంతగాత్రుం డగు నప్పరమపవిత్రుండు విశ్వామిత్రుండు గావ
లయు ననిన సుమిత్రాపుత్రుం డాశ్చర్యంబు మున్నుగా నన్న
తో నిట్లనియె. 247

ఉ. ఆకృతిఁ దాల్చెనాన్ శమ మహాః నయనోత్సవ మాచరించులో
కైకశరణ్యుఁ డిమ్ముని యదభ్రగజగద్భయకృన్మహోగ్రతన్
గైకొనె నెట్లొకోః యిదియుఁ గన్నక్రమంబ తమంబు వర్తిలన్
జోక వెలుంగవే మృదుమనోజ్ఞతుషారమహౌషధీలతల్ ? 248

క. అని రఘుతిలకుఁడు లక్ష్మణుఁ
గని యిట్లను దురవగాహగంభీరకథా

ఋషులు మునీంద్రులు వారల
ఘనమహిమ మహాద్భుతైక కారణ మనఘా. 249

చ. చటులతపఃప్రశాంతికిని సౌరవిలాసిను లేఁగుదేర సు
త్కటధృతి వారితోడనె జగత్త్రయసంగ్రహ మాచరించు నీ
జటిక్రమముల్ నమద్విబుధజాలకిరీటతటచ్ఛవిచ్ఛటా
స్ఫుటితమహోగ్రరోషతమముల్ సుమహత్తమముల్ వినంబడున్ 250

ఉత్సాహము. అనుచుఁ జేరనేఁగుదేర నమ్మహానుభావునిన్
బ్రణుతసద్గుణాభిరాము రాముఁ గాంచి నెమ్మదిన్
గొనలు సాగ రాగలతిక కుశికవంశపద్మినీ
వనజహేళి కతనిఁ జూపి వామదేవు డిట్లనున్: 251

క. పరమబ్రహ్మజ్యోతి
ష్పరిణామచతుర్విభాగభాసురశాంతా
వరకృతచరుపాయసమున
నరయఁగఁ బ్రథమాంశ మిమ్మహాభుజుఁ డనఘా! 252

మ. అన గాధేయుఁడు ఋష్యశృంగుఁ డధికుం డారణ్యకశ్రేణిలోఁ
బ్రణుతింపన్ బరమాద్భుతం బనఘ! తద్బ్రాహ్మణ్యవిస్ఫూర్తి యా
ఘనుచే నెన్న విభాండకుం డొకరుఁడే కాఁ డీదశస్యందనుం
డును గాంచెన్ ధరఁ బుత్రివజ్జనులలో నూత్నప్రభావోన్నతుల్. 253

క. నావిని యవ్వాచంయమి
యో విశ్వామిత్ర! మునికులోత్తమ! నిక్కం

రోదాంభఃప్లవ కేళిభవ్య నిను దివ్యుల్ దెచ్చిరిద్ధాత్రికిన్
మీఁదం దద్దశకంధర ప్రభృతులన్ నిర్జించె దీపేశ్వరా! 260

వ. అనియు తెఱంగున నత్త పోధనసత్తముండు సామ్రాజ్యలక్ష్మీవక్షోరుహ
సరోరుహసంచరచ్చంచరీకంబగునవ్వంచనాపంచజను నచంచల
గుణానుభవంబున నభివర్ణించుచున్న సమయంబున, 261

గీ. వామదేవుండు చిఱునవ్వుమోముతోడ
రాముఁ గని "యీతపస్విలలామ మిపుడు
ననుచువేడుక మిమ్ముఁ దోకొనుచుఁ బోన
వచ్చినాఁడన" డెందంబు పిచ్చలింప. 262

క. అయ్యకు మీకును హర్షం
బెయ్యది యట్లగు నటన్న నృపమణి వారిన్
నెయ్యమునఁ గేలఁ గైకొని
యొయ్యనఁ ' గౌశిక ' యటంచు నుడితార్థోక్తిన్, 263

క. అవిరళశోకదవానల
వివశుఁ డగుచు, నోటమాట వెడలక ధరణీ
ధవమౌళి వామదేవుని
నవలోకించుటయు నాతఁ డవహితమతియై. 264

సీ. శ్రీరామలక్ష్మణుల్ వీరెకౌశిక!యని
తన కొప్పగింప నమ్మునివిభుండు
గారవంబు దలిర్ప వారిఁ గైకొని, యప్పు
డదరుమధ్యాహ్న శంఖారవములు

దిక్కటాహంబుల నొక్కటఁ బూగింప
విను శుభోదర్కంబు లనుచుఁ దెలిపి
వామదేవుఁ డభంగురామోదమయపయః
పాథోధిఁ దేలింపఁ బఙ్క్తిరథుని

గీ. నంత భూకాంతమందిరప్రాంతసీమ
నధివసించి మధ్యందినవిధులు దీర్చ
వేళ యని పల్కె నిట్లు వైతాళికాళి
పేశలవచోమచర్చికా కౌశలమున. 265

గీ. మింట దినమణికిరణంపుమంట గురియ
బైటఁ దాఁబేనెక్రియఁ గొంచపడియె నీడ,
శిశిరకరిరాణ్ముఖోద్గీర్ణ శీకరములఁ
జల్లి నగు నీళ్ళచెంకులు లేళ్ళు చేరె. 266

చ. నెలకొని వేడ్కఁ బాడెదరు నిగుణముల్ ఫణముల్ గదల్చుచున్
పులకవిభిన్నకంచుకసముద్గతసమ్మదఘర్మపూరలై
కలరసనాయుగాస్యతముఖస్థలితాక్షరయుక్తి రక్తి పా
టిలఁగఁ బటీరకోటరకుటీరములన్ ఫణిరాజకన్యకల్. 267

క. ఈలీల విన్నవింపఁగ
నాలించుచు వామదేవుఁ డనియెన్ మేలో
భూలోకనాథ యీవై
తాళికుఁడు ప్రియం బెసంగఁదత్త్వమె పాడెన్. 268

ఉ. ఆనినరత్నభారమున నొ(డల లిల్లన నూ(చి సమ్మదా
నూనశిదాఘవారి పులకోద్గతకంచుకసంధి సుబ్బ(గా
గానము సేయుచుం(డ్రు ఫణికాంతలు వారిధికాంచశైలసం
స్థానములన్ భవద్గుణవితానము తాముు ల్లసిల్ల(గాన్. 269

వ. అనిన విని విస్మితాంతఃకరణుండై యా రాజపంచాననుండు వినయంబున నూరకున్న గాధిసుతుం బతనిం జూచి నరేంద్రా! దీక్షాసమయం బాసన్నం బయ్యెం గావున నీవు విశ్రమధురగోష్ఠీభంగనిష్ఠురత్వం బంగీకరింపఁ గోరెద నసిన భూపాలకుండు బాలకులం గనుంగొని కన్నీ రొలుకఁ బలుకనేరక యూరకుండినం జూచి దిగ్గనలేచి యథోచితంబుగా వామదేవుండు విశ్వామిత్రున కారాజపుత్రుల నప్పగించి నృపతియుం దానును నయ్యతిపతిం గతిపయపదంబు లనుగమించి యమ్ముని తమ్ము నిలువు మన నిలువుమని యనుప ననుపమోదారులగు నక్కుమారులు లేతేర నతండు దాశరథిమోన్ముఖుండై తన లోచనగోచరం బగువారకం జూచి చూచి దృష్టిపథం బతిక్రమింపం దర్శింపఁ జొప్పడమి నప్పుడమిఱేఁడు వేఁడినిట్టూర్పులు నిగుడ మగిడి యేతెంచి వామదేవు నాలోకించి యిట్లనియె. 27

క. ఓఋషిచంద్ర! యకారణ
కారుణ్యసుధాగభీరు గాధికుమారున్
శ్రీ రాముఁ దలఁచి జేయున్
గారామున నతఁడు చూడఁగా నివ్వేళన్. 271

వ. అని వెండియుఁ గొండొక విచారించి యమ్మహీమండలాఖండ
లుండు. 272

గీ. అకట యస్మద్వియోగార్తి నాత్మ నదరి
పొగులఁ జేయునొ, కాక యపూర్వదేశ
విభవవీక్షణకుతూహలాప్తిఁ దగుచు
డెంద మలరించునొకొ, గాధినందనునకు? 273

కం. అని విని నిష్ఠుమ హాపది
కనియెన్ మని రామచంద్రుఁ దను హాసర్యం
బునకుఁ బ్రణమిల్లి కౌశికుఁ
డనియెన్ గద్యవిభాగ మరయం గలదే? 274

మ. హరిణాంకప్రసవోదయక్రమము నయ్యంభోనిధానంబు వా
ఛరియింపన్ దగు నం మహాబ్ధి గణుతింపన్ దత్ప్రసూత్వంబు త
త్పరిపాటిం గుముదంబు దాల్చుటకు సంబంధాంతరం బున్నదే
నిరుపాధిప్రణయుల్ విశుద్ధులయెడన్ నిత్యంబు శుద్ధాత్మకుల్. 275

గీ. అని విచారించి వశిరఘుఁ డాపయోధి
తండ్రి కౌస్తుభపారిజాతములు సుధయు
ననుజవములు మైన నే మగును దాన
తుహినకిరణుండు కుముదబంధుండె నిజము. 276

వ. అని పురోభాగం బవలోకించి రామలక్ష్మణసహితంబుగా విశ్వా
మిత్రుండు నేత్రపథం బతిక్రమించె నేనును దత్ప్రవాసదుర్మన
స్కయై కుందు దక్షిణకోసలేశ్వరనందన నూఱడింతుఁగా కని
యంతిపురంబునఁ బ్రవేశించె నంత. 277

మ. రజితోర్వీధరవాసః వాసవముఖప్రస్తుత్యబాణావిత
త్రిజగచ్ఛైలశరాసః రాసకరసాంద్రీభూతశోభావిభా
స్వజహద్గాత్రవిలాసః లాసనియమధ్యానాదియోగాఢ్య మౌ
నిజనస్వాంతసదాసః దాసకరుణానిత్యప్రసన్నాననా. 278·

క. రామాః రామాంగశ్రీ
వామాః వామాంధకాదివారణచణదో
ర్ధామాః ధామాధఃకృత
సోమాః సోమాదిమిత్రశోకవిరామా 279·

కవిరాజవిరాజితము. సనకసనందనసంయమివందన సంతతనందనచా
రుమతీః ఘననిభకంధర కంజజకంధర గర్వధురంధరకంతుహృతీః
జనభయకారణసామజమారణ సాహసధారణ సారధృతీః
కనకధరాధరకార్ముక భూధరకాంతసుతాధరకాయ కృతీః 280·

గద్య. ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వత కృపాకటాక్షవీక్షణాసాదిత సకల
సామ్రాజ్యధౌరేయ్యాక్రాంతవిశ్రాణనావధీరితరాధేయ బిజ్జలకుల
కలశజలనిధానకార్తికీనిశాకళత్ర వెన్నూక్లగోత్ర పవిత్ర
కృష్ణరాయమహీధవకుమార సంగరాంగణకుమార
దయాగుణగోపాల తిమ్మభూపాల ప్రణీతంబైన
యనర్ఘ రాఘవంబను మహా
ప్రబంధంబు నందు
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

# అనర్ఘరాఘవము

## ద్వితీయాశ్వాసము

—o—

క. శ్రీమద్గౌరీ మానస
తామరసాకరమరాళ! ధవళాంశువిభో
ద్దామజటాజాల! సుర
క్షేమంకర గిరినివేశ! శ్రీరామేశా! 1

వ. అవధరింపు మవ్విధంబునఁ గౌశికుం డసమకుసుమవిసరసౌరభ
పేటియగు నిజాశ్రమవాటికిం జేరనేతెంచె నయ్యవసరంబున. 2

క. మునిపతియాజ్ఞఁ గలాధరుఁ
డను శిష్యుండొకఁడు ప్రాతరారంభమునన్
ఘనతరనికటాటవికిం
జనియెన్ గుశకుసుమవిసరసమిదాహృతికిన్. 3

వ. ఇవ్విధంబున వనంబునకుంజని యసమకుసుమ సమిత్కుశనికరం
బుఁగైకొని ప్రభాతప్రాయయగు విభావరిం బరికించి యకించిదా
నందకందళవితానయుతాననకళాధరుండై కళాధరుం డిట్లనియె. 4

మ. హరిణాంకుం డపరక్షమాధరము డాయం బ్రజ్వలిష్యత్ప్రభా
కరకాంతోత్కరధూమమో యన దిశల్ గప్పెం దమస్కాండముల్

వ. అని యప్పటుశిరోమణి ప్రాఙ్ముఖాభిముఖుండై యుదయాచలమౌళిమాణిక్య మండనంబగు మార్తాండమండలంబు నభోభాగంబు నలంకరింపకయ మున్న వస్తుకాండంబు మద్దేశికుండగు కౌశికుండుగావించు యాగంబున కుపయోగంబుగా వేగంబునం గొనిపోయెద నని యేతెంచునమ యంబున. 11

క. జోటి జోటిఁ జెమటలు వడియఁగఁ
దటి తటమని గుండె యదరఁ దగ నిలుద హాటా
హాటి నచ్చటికి రుదెంచెఁ
జటులాపగ నొక్కవటుఁడు సంత్రాసమునన్. 12

క. వచ్చి పటూత్తంసము దను
రిచ్చపడి కలాధరుఁడు నిరీక్షింప భయ
ప్రోచ్చలితమానసుండై
చెచ్చెర నొకకొన్ని వెడుగు చేష్టలు చేసెన్. 13

సీ. పలుమారుఁ బిలిచినఁ బ్రత్యుత్తరంబీక
వెడవెడఁ గడునేడ్చు వెక్కి వెక్కి
కారణం బడిగినఁ గడఁగి చెప్పఁగఁబూని
తబ్బిబ్బులాడుచు బొబ్బరించు
నులికిపాటొందప నుండుండి దిగ్గునలేచి
యదెవచ్చె నని దిశల్ బెదరిచూచు
గడగడ నెమ్మేను వడఁకంగ దీనుఁడై
ననుఁ గావుమని వచ్చి వెనుకకొదుగు.

క. మఱియు నీరీతిఁ జేష్టించు తెఱఁగులెల్లఁ
గని సదాచారు భీతునిగా నెఱింగి
వెఱవ కోడకు మని సారె వీపుసఱచి
భయము నుడుపుచు లాలించిపలికెనతఁడు. 14

క. ఉన్నవిధమేమి నీ వో
యన్న సదాచార! యిమ్మహాటవిలోనం
బన్నగఘోరమృగాదులు
వెన్నాడెనొ దైత్యుఁజూచి వెఱచితొ చెపుమా? 15

గీ. అన్న నిను జూచి యెదబడి యున్నవాఁడ
నన్ను గడవంగ నాప్తుఁ డున్నాఁడెనీకు
బేలవిధమున నీవిధఁబేల తెలుప
వకట నేనింతయడుగ నోయనుఁగు వడుగ! 16

వ. అని యమ్మునికుమారసత్తముండు చిత్తంబుత్తలంబందం దత్తరంబున నుత్త
రాసంగంబు కొంగునం బొసంగనిడిముడిచిన హోమభూతి భీతిఁగొని
యున్న యప్పిన్నవడుగు నిటలఫలకంబున రక్షాతిలకంబుదీర్చి
భయంబుఁదీర్చి వెండియునడుగ నవ్వడుగిట్లనియె. 17

క. మౌనికుమారక! నీతో
నే నేమని విన్నవింతు నిదె యదరునకుం
దానకమై వివరింప భ
యానకమై పాయకున్న యది మదిలోనన్. 18

క. నావుఁడు మేను జలింపఁగ
నావటుని మొగంబు జూచి యతఁ డెచ్చోటన్
నీ వింత వింతఁగాంచుట
నావిని వడు గక్కుమారునకు నిట్లనియెన్. 19

సీ. వినవయ్య యినవంశవనరాశిచంద్రుఁడు
రామచంద్రుం డనురాకుమారుఁ
డొకఁ డిపు డేతెంచి యున్నవాఁడన విని
వేడుకతోడ నేఁజూడఁ బోవఁ
బెనుకాలముననుండి మనయాశ్రమప్రాంత
భూతలంబుననున్న జాతిప్రతిమ
నిక్కంపుటాడుదై నీటునఁ గనుపట్టి
యదుటుమై నడిచె నాకెదురుగాఁగ

గీ. నిట్లు నడతెంచు దానియుద్వృత్తిఁ గాంచి
గుండె వగిలినఁ బైఁగప్పుకొన్ననార
పంచె గుడ్డయు నచటనే పాఱవైచి
చావుపరుగున వచ్చితి నో వయస్య! 20

క. అనినఁ గలాధరుఁ డానన
వనజమునకుఁ జిఱుతనగపువై ఖరి యొసగం
దనకూరిమినెచ్చెలిదెసఁ
గనుఁగొని పరిహాసపూర్వకంబుగఁ బలికెన్. 21

గీ. మేలుమేలు వయన్య! యమ్మృత్యుయువతి
కారిఁ బడియును మఱి ప్రాణభయములేక
మగుడివచ్చిననినుఁ గంటి; జగతి నోము
లెన్ని నోచెనొ మున్ను నాకన్నుఁదోయి! 22

ఉ. నావుడుఁ దల్లడిల్లెడుమనమ్మున నవ్వటుఁ డిమ్మహోగ్రర
క్షోవనితాముఖంబునఁ దగుల్పడకుండ మహాత్మ! నన్నికం
గావుము కావుమంచుఁ బదకంజయుగంబునఁ వ్రాల నిందు కే
లా? వెఱ పంచు నవ్వుచుఁ గలాధరుఁ డక్కునఁ గారవింపుచున్. 23

క. "వటుకా! వినవే గౌతమ
జటిధూర్జటిధర్మపత్ని సాధ్వి నహల్యా
కుటిలాలక" నన, సంస్కృతి
ఘటితవిబోధాభినయవికస్వరముఖుఁడై 24

క. జానుగ జనకాధిపసం
తానపురోహితునకున్ శతానందమహా
మౌనికిఁ దల్లిగదా! య
మ్మానవతిన్ విందు నైన మఱియేమాయెన్? 25

వ. అనినఁ గళాధరుండిట్లనియె,

సీ. సమధికాలోకమాత్రమున నాశాపూర్తిఁ
గీలించు రతనంపుదాళిఁ బూని
వాడక నెత్తావి పీడక పరువంబుఁ
జెందుక్రొవ్విరిఁ బొందు సికయొనర్చి

పెను జట్టు నటికిన తన ధారయుడివోని
బలువంకి మొలవంక నలవరించి
యనిలవేగంబున నాకసమునఁ బోవు
రేవున దిగుమ త్రిమార్గ నెక్కెఁ

గీ. తిరుగువేగంజి వేగంటి సరుగుదెంచి
యొంటినున్నట్టి తపసివాల్గంటిఁ జూచి
కడఁగి కామాంధకారంబు కప్పుకొనఁగ
ముప్పుఁదెలియక చీకటితప్పు సేసె. 27

కం. శతమఖుఁడంతఁ దపోధను
సతి యవిదితసురసత కేళి సంభ్రమనిరతిన్
మతివెతఁబడ గొబ్బునఁ దన
కుటిఁ దీర్చుక దుష్కృదులపుకొనుచుంజనియెన్ 28

క. విమలాత్ముఁడు గౌతమ సం
యమి యంతట రా నిజాశ్రమాంతికసీమన్
సుమనోనగసుమనోనుగ
కమనీయసుగంధలహరి గమగమ వలఁచెన్. 29

క. నాసాపుటపేయంబగు
నాసౌరభమునకు నాత్మ నరుదందె నిజా
వాసమునకు నొయ్యనఁ జని
యా సంయమి తన్మహాగృహాంతరసీమన్. 30

సీ. వదనఘర్మజలంబు వాలారుకొనగోళ్ల
మాటిమాటికిఁ బాఱమీటుదానిఁ
దలిరాకుమోవి యంగుళీయుగంబునఁ జూచి
క్రేఁగంటఁ గంటి నీక్షింపుదానిఁ
గరమూలపరిణతకరజక్షతంబున
నాదవు నెత్తురు వ్రేల నొత్తుదానిఁ
జెదరి సల్గిడ జాఱు చికురంబు లలఁతచే
వెతవెతగాఁ గొప్పు ముడుచుదాని

గీ. వేలునాకి యుపాసంబు గోలుపోయి
నటుల సీతుచ్ఛసుఖమున కాసచేసి
నిందపాలైతి నని చింతఁబొందుదాని
నాతి వీక్షించి మఱియు నగ్గౌతముండు. 31

సీ. చిఱుతబొమ్మంచు వాతెఱదొండపంటిపై
మొలచిన నునుగెంపు మొలకఁ జూచి
నఖరబాలశశాంకనవ్యసౌహార్దంబు
గైకొన్న చన్ను జక్కవలఁ జూచి
యుడివోని కమ్మనిట్టూర్పుఁదెమ్మరలచే
నదరు గోనాళినీలాహిఁ జూచి
చిన్నారి పొన్నారిచెమటపన్నీటిచే
వసివాడు మైఁదీగ వడువుజూచి

గీ. యబ్బురంబంది జడదారిబొబ్బమెకము
యోగదృష్టిఁ బురందరు నాగడంబు

నాలిడ శ్చేష్టితంబును నపు డెఱింగి
గిటగిటన దంతకుంతముల్ గీటికొనుచు 32

భుజంగప్రయాతము. అజేయోసి పాపిష్ఠి! యయ్యో వృథా నే
డిచేలా యుపేక్షించితే? యుష్టికృత్యం
బటంచున్ యుగాంతోజ్జ్వలార్చిర్జటాలో
స్ఫుటజ్వాలికీలానిభప్రేక్షదృష్టిన్. 33

క. కట్టల్కన్ మౌనిపతి తన
పట్టపుదేవేరిఁ గాంచి "బహుకాలము నీ
విట్టియఘ మనుభవింపుచుఁ
జట్టై యుండుమని" ఘోరశాపంబొసగెన్

మ. అని యమ్మౌని శపింప నాతి శిలయై యట్లుండి, యీరామచం
ద్రుని తేజోమహిమంబుచే నివుడు తద్ఘోరాంధకారంబు వా
సి నిజాకారముఁ దాల్చె; నట్టగుట నీచిత్తంబునన్ భీతిలం
జనదన్నం గనువిచ్చి నల్గడలు నుత్సాహంబునం జూచుచున్. 35

క. దెందముతల్లడ మించుక
డిందుపడఁ గలాధరాఖ్యుఁ డిలకించి మహా
నందమున వటుఁడు పలికెను
వందన మొనరించి చాటువాచారచనన్. 36

గీ. తాపసోత్తమ! నీప్రసాదమున మగుడఁ
జీవలోకంబులోఁ బ్రతిష్ఠితుఁడ నైతి,
నైన నిపుడును బోదు నామానసమునఁ
బ్రజ్వరిల్లు నళీక శంకాజ్వరంబు. 37

వ. కావునఁ దన్నివర్తనంబునకు ముహూర్తమాత్రంబు విశ్రమింప వలయు ననినఁ గళాధరుండు వయస్యా! విప్రసమాజంబునకు భయంబు నైజంబకదా యటుగాన నీమానసంబునంగల సాధ్వసంబు మట్టుపడుదాక నిప్పట్టున విశ్రమింపు మనిన నట్లకావించి యవ్వేటుం డొకింతచింతించి సవిస్మయంబుగా నతనికిట్లనియె. 38

గీ. ఋషికులోత్తమ! యాత్మనూహించిచూడ
నెంతవింత! మహేంద్రుని యంతవాఁడు
వేలుపుల మేటి బలు లేటి విధముఁబూనె
నహహ విషయమరీచికా లహరియందు 39

ఆ. అనిన నతఁడు నవ్వి యౌ నోవటూత్తంస!
భళిర మంచిమాటఁ బలికి తీవు,
తలచు లోకులెల్ల ధరలోన నెన్నంగ
నల్పసుతు లదెట్టు లంటివేని. 40

క. మతి నైహిక సౌఖ్యంబులు
సతమని సుతదారవిత్తసమధికరతి మో
హితులై జను లుంద్రు వితా
వితలగుచుం గాలమెల్ల వీటంబోవన్. 41

క. మనము హరించు నతాత్త్విక
ఘనవిషయములనెడుభటులు గవయించుకొనం
జను కనుఁగవయేనుఁగునకు
జనుఁ బోఁడు తెలివి నంకుశముఁ గావింపన్. 42

క. కావున ముజ్జగములు దన
కైవసమైయెసఁగ వేయుఁ గన్నులకలిమిం
గావరమున నుండెడు విను
ద్రోవరిదొర ననఁగ నకట దోసమకాదే ! 43

గీ. మునికుమార! వినుము మొదలఁ జక్షుఃప్రీతి
యుదయమైనఁ దోన యుదయమందు
నెట్టివారికేని నిల మనస్సంగాది
రూప కుసుమచాప చాపలములు. 44

వ. అనిన విని సదాచారుండు మహాత్మా! యిమ్మునిసువాసిని సు
కృతవాసనాపరిణామంబు రామభద్రప్రవాసంబునకుం గారణంబు
గానోపు నని నామనంబునం దోచుచున్నయది యనినఁ గళాధ
రుం డిది ప్రథమకారణంబు నావుడుఁ దదాకర్ణన కుతూహలంబు
సందడింప నవ్వటుం డతనిం గనుంగొని. 45

క. రెండవహేతువు వీనుల
పండువుగాఁ దెల్పుమనుచుఁ బ్రార్థించుటయుం
బాండిత్యము మెఱయంగ న
తం డిట్లనిపలికె వటువతంసముతోడన్. 46

క. శ్రీనిలయంబగు కిష్కిం
ధానగరము దనకు రాజధానిగ నేలన్
నానా వనచర సేనా
నూనాపనశాలి వాలి యుద్యన్మహిమన్. 47

ఉ. అన్నగభేది యాత్మసుతు నాకపినాథుని ప్రాజ్యరాజ్యసం
పన్నతయుం బ్రసన్నతయు బాహుబలంబు చలంబుఁ బెంపు నిం
పున్నయమున్ సమిజ్జయము మూపులుమూడయి చూచు నిచ్చలుం
గన్నులు వేయిగల్గుటకుఁ గల్గె ఫలంబని సంతసిల్లుచున్. 48

క. ఆవాలి పెక్కుదినములు
రావణుతో మైత్రిసేసి, లంకకు దానున్
రావణుఁ డాకిష్కింధకు,
నేవేళన్ రాకపోక లిట్లొనరింపన్. 49

క. జాలింబడి ప్రజ లడలఁగ,
వాలికి నొకనాఁడు జాంబవంతుఁడు, గోలాం
గూలాచ్ఛభల్ల వానర
జాలాగ్రణి, వల్కె సకలసచివానుమతిన్. 50

గీ. అధిపః రాక్షసజాతి మాయాప్రసూతి,
యదియుఁగాక పురందరమదవిభేద
కందళితబాహువిక్రమక్రముఁడు గానఁ
గేవలము నీకుఁబిత్రువైరి రావణుండు. 51

గీ. వనచరోత్తమ! నీయంతతనయుఁ డుండి
తండ్రివగఁ దీర్చనోపెడితీండ్ర లేక,
శాత్రవముఁదక్కి యతనితో మైత్రిసల్ప
నకట! కపులెల్ల నిను వికావికని నగరె? 52

శా. లంకానాథు నుదగ్రవిశ్వజయలీలాధుర్యుఁ దంచున్ మదిన్
శంకింపన్వల దోకపిప్రవర! నీశౌర్యంబు సామాన్యమే
బిరం బింక రణోర్వి నద్దశముఖున్ భీమోద్ధతిం బట్టి నీ
చంకం బెట్టి బిగించి వీరరసనిస్స్వానంబు గావింపవే! 53

క. ఘనతరబలు నొకసామం
తునిఁ బట్టుటకేని వానితోడుంగిడున్
వనచరనాయక నీ కిపు
డొనఁగూడదు నడుమ వార్ధి యుండుటకతనన్. 54

సీ. సురలోకవిభుని ఉంగరుగట్టఁ బట్టించి
కీలి సుగ్రాటవిహారు సేసి
జమునకు భుజదండచండిమోన్నతిఁ జూపి
యాతుధాను దివావిహార ముడిపి
పాశపాణి ననేకభంగసంగతి నుంచి
పవమాను నిల నెందుఁ బాఱఁదోలి
యక్షనాయకు నిధుల్ వీక్షింపఁబో నంపి
హరునిపౌరుషముఁ గొం తఱుఁగరాచి

గీ. తెగి సురాసురవరులతోఁ బగ గడించి
యాత్మఁ దనచేఁదెలియంగక యఖిలలోక
కంటకుండైన యద్ధశకంఠుతోడి
బాంధవము నీ కనర్థానుబంధిసూవె. 55

క. ఎందును బౌలస్త్యులతో
బొందున కుపకారమునకు భువి నతిదూరం
బిందుకు దృష్టాంతం బల
యిందుకళాధరుఁడు వానరేశ్వర వింటే? 56

వ. అది యెట్లంటేని. 57

సీ. ముడిగోదయే కాక మదికి ముచ్చటయైన
నెక్కఁ గల్గెనె బక్క జక్కినైనఁ
బునుకపేరులె కాక పెనుపండువునకైన
బూనఁగల్గెనె పేదపోకిమైనఁ
నొలికిబూదియె కాక యొకవేళ మనసైన
నలఁదఁగల్గెనె యింత కలపమైన
దంతిచర్మమె కాక యెంతయుత్సవమైనఁ
గట్టఁగల్గెనె బొంతబట్టయైన

గీ. నకట భిక్షిరంబె కాక యెం తగ్గువైన
నానఁగల్గెనె తనయింట నంబలైన
నర్మసఖుఁడై నిధీశుఁ దనారతంబుఁ
జెంతనుండిన త్రిపురాసు రాంతకుండు. 58

వ. అని చెప్పినవిని నవ్వెఁబగంది యవ్వటుండు. 59

క. ఈసముచితమంత్రోప
న్యాసముఁ బరిహాసకౌశలాన్వితవాచో
ల్లాసము నెక్కడనేర్చెనొ!
యీసరణిన్ వృద్ధభల్లుకేంద్రుం డాడన్. 60

ఆ. అతఁడు వటునిఁ బల్కె నలజాంబవంతుని
నెలుగుమాత్ర మనుచుఁ దలఁచె దేల?
యమ్మహానుభావుఁ డంభోజసంభవు
నావులింతఁ బుట్టినతఁడు సువ్వె. 61

క. నావుఁడు భావం బెఱఁగఁగ
నావటుముఖ్యుఁడు గళాధరాఖ్యునిఁగని యో
కోవిదనుత! వినియెద నిక
నావలికథఁ దెల్పు మనిన నతఁ డిట్లనియెన్. 62

సీ. ఎలుగుఱేఁ డీరీతి హితనీతి బోధింప
మతిదప్పె ముదిమిచే నితని కనుచు
వాలిఁ నవ్వుచుఁ దన్ను గేలిసేయ నతండు
గేసరియను మంత్రికేసరిసుతు
హనుమంతుఁ గని రహస్యముఁ దెల్ప నతఁడు నా
రేయిఁ గుమారసుగ్రీవనాముఁ
దోకొని చని ఋశ్యమూకాఖ్యగిరిదుర్గ
మున నున్నవాఁ డన విని మహాత్మ!

గీ. మారుతాత్మజు జగదేకవీరుఁ డండ్రు
వార్త కెక్కిన యటువంటికీర్తినిధికి
నధిపుఁ డెటువంటివాఁడైన నతనివిడిచి
ధర్మమే పూన విపరీతకర్మమునకు. 63

వ. అనినవిని కళాధరుండిట్లను వయస్యా! యవక్రవిక్రమధౌరేయుం
డగు నీయాంజనేయుండు విధేయుండై మున్ను సహస్రభాను
సన్నిధానంబున వ్యాకరణవిద్యాపరిజ్ఞానం బనూనంబుగాఁగాంచి
యవ్వేలుంగుఱేనికిసూనుండై వానరయోనింజనించిన సుగ్రీవునకు
నక్షయ్యంబగుసాహాయ్యంబు గురుదక్షిణాప్రాయంబుగాఁ దదభి
ప్రాయంబుదెలిసి యొసంగె ననిన నవ్వటుండు. 64

గీ. అనఘ! యట్లైన నాసందియంబు దీరెఁ
గూర్మి సబ్రహ్మచారిని గురుతనూజు
ననుసరించుట యుచితంబ యదియటుండె;
నంతమీదటి కథ చెప్పు మన నతండు. 65

సీ. విని సదాచారుఁ గన్గొని యప్పుడిట్లను
నట్లు తద్భేదకృత్యంబుకతనఁ
జెలికానియింటికి నలజడిదోప న
వ్వార్త చారజనంబువలన నెఱిగి
ఖరదూషణాదిరక్షఃప్రధానోదగ్ర
తరమైన యొకకొంత తనబలంబు
నలవాలికిని వెన్నుబలముగాఁ బొలదిండి
పాదుశా వెస నామజాదు వనుప

గీ. జలధియుత్తరతటమున విడిసి రఘు
వరుఁడు వెలిగించె హోమాగ్ని వదలఁజేతఁడు
రాక్షసుఁడయ్యు మిత్రధర్మంబు బట్టి
నాకశాఖరుఁ డతని కీర్తినియె నగపు. 66

క. అంచితనిజగుణమణిగణ
సంచితమాధుర్యధుర్యచారిత్ర సుధా
సంచద్ధారాసారము
నించఁదొకో రామభద్ర నీవు వినుటకున్. 67

చ. అనఘుఁ డతం డొకానొకని కర్థిఁ బ్రియంబుగ నాత్మకంఠలుం
ఠనకుతుకోన్నతిం గనునెడన్ క్షణలూన పునర్నవీన సం
జనితతదీయమూర్ధములు సారెకుఁ జూచు నపత్రపాభరో
పనతవివర్ణతాపిహిత భంగము నర్ధశిరాత్తమాంగమున్. 68

వ. అనినవిని ముదంబంది సదాచారుం డనంతరకథాప్రకారం బెఱింగింపు
మనిన నతం డిట్లనియె. 69

చ. అంత ఖరాదిభీకరనరాదవరూథిని నిర్గమించి దు
ర్దాంతసహస్రదంతిబలధారిణి తాటక నా మనుష్యభు
క్కాంత లోకకర్తు సేరె మునికాండము భీతిల నేతదాశ్రమ
ప్రాంతము మర్త్యమండలవిహారకుతూహల మావహిల్లగన్. 70

క. నావుఁడు గుండెగుబిల్లనఁ
గా వటుఁడిట్లనియె నింతకాలము నెందున్
నే విన వేయుగజంబుల
లావునఁ దగునట్టి యిట్టి లలనాజనమున్ . 71

ఆ. అనఘ ! యెంతవింత యద్ది రా యిటు దాని
లావువిన్న గుండెలావులించు;
మౌనికోటికెల్లఁ బ్రాణంబు లింక దాని
గాంచినపుడ కంపమించుగావె. 72

ఆ. అనుచు నిపె నిమిత్తమయిక దా మౌనివి
తానమునకు, నిజవితానమునకు,
రక్షణం బొనర్ప రామలక్ష్మణుల మ
ద్దేశికుండు దెచ్చెఁ గౌశికుండు. 73

సీ. అని కళాధరుఁడు పలికిన వటుండిట్లను
నో మహాభాగ! యీ రామభద్రుఁ
డవతరించుటయెల్ల నసురసంహరణార్థ
మని తలంచెద, ననవిని యతండు
నీమాటనిక్కంబు 'రామభద్రా' యను
చతురక్షరంబు రక్షస్సమాజ
మహితశిక్షాసిద్ధమంత్ర మంతియ కాక
యింకనొక్కవి శేష మిపు డితండు

గీ. కౌశికమహామునీంద్రుచేఁ గాంచె విబుధ
కీర్తితబ్రహ్మతేజోవివర్త మాన
దివ్యనానాస్త్ర మంత్రోపదేశ మనిన
నాత్మనలరి సదాచారుఁ డనియె నిట్లు. 74

క. అమోఘ యొసంగంబోలు న
హా! మంత్రమహాస్త్ర దేవతాన్వితముగా
రామునకు "బలాతిబలా"
నామక శక్తిద్వయంబు నా నతఁడనియెన్. 75

క. ఇందుకుసందేహమొ? యవి
ముందును వెనుకన్ మహాస్త్రములు నొసఁగెఁ గృపా
మందిర మనుటయు నతనికి
మందస్మిత మెసఁగ వటుఁడు మఱి యిట్లనియెన్. 76

గీ. అనఘ! యిట్లు నిజాధీన మగుచు నట్టి
శక్తియుగళంబు నమ్మహాస్త్రములు నెంత,
యాగ విఘ్నోపశాంతికై యత్తపస్వి
రామునకు నేల యిట్టి గౌరవ మొసంగె?: 77

క. ఓహో యిప్పుడు తెలిసెన్
బ్రాహ్మణిక కరాభిరచితఫణిపూరణ మీ
యూహ, యన వటుఁ కలఁడను
నాహా సి వజ్జురీతి నాడందగునే ? 78

మ. విలసల్లీల మహాసభాంతరములన్ విద్యాప్రసంగంబు శి
ష్యులుగావింప నెసంగుఁ దద్గురునకున్ శుంభద్గుణస్ఫూర్తి; యు
జ్జ్వలశక్తిచ్ఛటలం జలంబు ఘనముల్ వర్షింప ధాత్రిన్ నిర
ర్గలవిఖ్యాతి బయోధి గై కొనుఁగదా రత్నాకరాఖ్యానముల్. 79

వ. అనిన నవ్వాక్యంబులకలరి వటుఁడు మహాత్మా! యింక నొక్కచో
ద్యం బడిగెద, ననన్యభేద్యంబగు నవ్వానరమంత్రప్రాకారం బెత్తెఱం
గున నెఱింగితి రనిన నయోధ్యాప్రయాణసమయంబున సమాధిమ
యచక్షుస్సాక్షాత్కృతజగత్త్రయవార్తావిధానప్రచారుండగుగాధికుమారుం
డానతిచ్చె నని తెల్పి ప్రభూతప్రభాతలక్షణలక్షితయగు భువనలక్ష్మి
నీక్షించి కళాపకుండిట్లనియె. 80

మ. బలభిద్దిక్తటికిన్ విభూషణములై ప్రత్యగ్రదీప్తారుణో
పల నీరాజితముల్ దినేంద్రకరముల్ పంకేజరాగద్యుతిం
జెలఁగె న్నిద్ర నెపంబు పెంపున విసర్జించెన్ జగత్పన్నగం
బలఘు ధ్వాంతకరాళకంచుకభరం బక్షాళనాచ్ఛంబుగన్. 81

క. జలరుహకోరకనవశు
క్తులు చీకటివానచినుకు గ్రోలి వెడల్చెన్
ఛళిఛళి యశికైతవమునఁ
గొలకులఁ గారణగుణానుగుణ మౌక్తికముల్. 82

క. వికసిత ముకుళిత భూయో
వికసత్కమలా విభేదవిధిఁ దగు సద్యో
వికచత్పంకజకళికా
ప్రకరముల మిళిందబృందపరిచితి దెలి పెన్. 83

గీ. కటువు లయ్యె రథాంగప్రకాండ విరహ
చటుల తాపోపశమ శైత్యపటువులైన
తనకరంబులఁ దిమిరార్త జనదృశాశి
కంజన మెసంగ నిడియె నిక్కంజహితుఁడు. 84

వ. కావున హోమకాలంబతీతంబుగాకుండ మానితంబగు నివ్వస్తుజాతంబు గొనిపోయెద ననినఁ గళాధసంగముఁగొని యుప్పటుందును రామలక్ష్మణపీక్షాకుతూహలంబునను న్న వాఁడ, వారలెచ్చోటను న్న వారనిన యజ్ఞవాటంబునుత్తరభాగంబున నమ్మహామునిభావు లున్న వారు నీవునచటికేగి నిశ్శంకంబుగా నవలోకింపుమని యనిచి యత్తాపసకుమారుఁడు సనియె; నంతనక్కడ రామభద్రుండనవగత పథశ్రమంబగు సిద్ధాశ్రమంబునందలి యశేషవిశేషంబుల నీక్షించుచు లక్ష్మణున కిట్లనియె. 85

సీ. తలపోలంబున కేగి దగపప్పులకు నోర్చి
గాసిల్లి కసవులు గోసికోసి
కడఁగి కొమ్మన గ్రుద్దు వెడలంగఁ
బెపపెద్ద మోపులుగాఁ గట్టి మోసి మోసి
కంటి కెప్పుడుఁగూర్కు గానక రేలెల్ల
వేగించి తినఁ దిన వేసి వేసి
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లటువెట్టి
దినమును బిజుదులు దీసి తీసి

గీ. యడలు మాదుఃఖఫల మింకగుడువు మనుచు,
నగుచుఁ బలుమారు సోల్లుంఠనము లెసంగ
వటులు విశ్వసింపుచున్నారు వత్సతరిని
నతిథిసంతర్పణంబున కదె కుమార! 86

క. మతియమునఁ బ్రాగ్వంశజమై
సురుచిరమధుపర్కపాకసురభిళమగు తె

మ్మొర యుచ్చ్వాసితనాసాం
తరు లతిథులు పీల్చ నల్పతం గననయ్యెన్. 87

క, కౌస్తుభమణికిఁజల్కి
ప్రస్తుతనీలోత్పలంబు పద్మాచిత్తో
పాస్తవ్యుఁడు హరి వక్షుఁడై
యస్తోకతపం బొనర్చెనట మున్నిచటన్. 88

క. ఈరీతి నలఘు మహిమో
దారంబగు నిమ్మహాశ్రమావనిఁ దపసుల్
వారక యకుతోభయనం
చారత నడిపెదరు కంటె షట్కర్మంబుల్? 89

మ. అదె కంటే? పశుబంధ వేదిపలయం బౌదుంబ రాచ్ఛాదనా
స్పదమై నిచ్చలు గృహ్యతంత్రవిధిఁదెల్పం బొల్చె, నేతన్మహా
సదనోర్విన్ గృహమేధు లిమ్మునివరుల్ స్వారాజ్యసింహాసనం
బిదరన్ వ్రేల్చెద రధ్వరానలమునం దాయాపురోడాశముల్. 90

క. అవయవములు పూరింపగ
నవశిష్టంబగు సిరోచ్చయంబు జటాకై
తవమున దాల్చె ననందగు
నవుదలలన్ మునిసమాజ మల రెడు నిచటన్. 91

గీ. జలజసూతి పురాసృష్టి కొఱవు లిట్లు
చేసియుంచినకైవడిఁ జెలఁగుచుండు
ఘనతపస్యాకృశాంగుల మునులఁగంటె
రేపుమాపును వహ్ని నర్చించువారి. 92

చ. అనల గృహోపలిం బలిసమార్జితనూతన తండులంబు లో
యృన దినులేటిపైఁ గిసిసి యాత్మవధూజనముల్ దదీయచో
దనమున కుద్ధతింజనుడుఁ దత్కర మండిత చండదండముం
గనుఁగొని మూర్కొనందివురఁ గంటివె నవ్వెదర మ్మహామునుల్. 93

చ. హరిణి వినూతన ప్రసవ యల్లదె యంగణ యజ్ఞవేదికా
పరిసరభూమిఁ బచ్చనగు పచ్చిక మేయుచు సారెసారెకున్
గర మనురక్తిఁ గన్గొనెడుఁ గంటివె మౌనికుమారకుల్ దృఢాం
కురములు నోటికందియిడ గోమున నుండెదు నాత్మడింభమున్. 94

మ. అలఘూత్సాహమునం దపోధన కుమారాకీర్ణనీవారతం
డులముల్ నల్గడలం బిపీలికలు శ్రేణుల్గట్టి కొంపోఁ గుతూ
హలసంధాన మొనర్చెఁ జూడ్కికి సముద్యచ్చిత్ర పత్రావళీ
విలసద్వైఖరి నాశ్రమోర్వి యిదిగో వీక్షించితే లక్ష్మణా! 95

గీ. అనిన విని లక్ష్మణుం డార్య! యౌర! పశువి
తతికినైన నపత్యవాత్సల్య మెంత!
యనుఁడు, సత్కార్మతాచ్ఛిల్య మర్భకులకు
నైన నాశ్చర్యకరమైన దనుచు మఱియు. 96

క. చేరువ కచ్ఛ స్థలముల
నారయ గోకర్ణ తర్ణకావళి మునిరా
డ్వార విలూనములై పున
రారూఢములైన దర్భలానెడిఁ గంటే? 97

వ. అనుచుఁ బురోభాగంబునకుంజనునెడ సుమిత్రాపుత్రుండు మిత్రకు
లశేఖరున కిట్లనియె. 98

అనఘ ! జలవేణి కదుఁడి ప్రయాగపుఁబటి
నవలతావాలముం జేత నడుమనడుమ
గ్రంథిలములగు కాళ్లఁ గవిసి నిలిచి
నిలిచి ప్రవహించుచున్నది పొలుపుమీఱ. 99

వ. అనిపలిని సుగుణసముద్రుండగు రామభద్రుం డన్నా ! నీవు కనుం
గొన్న పారలౌకికానందంబై యొప్పుచున్నయదిగదా! యని
యిట్లనియె. 100

క. అనుపదమందును భూరుహ
కనదావాలములు నిండి కదలక కుల్యం
బను జల మలరెడుఁ గేరళ
వనితా కచనిచయరచనవైఖరిఁ గంటే? 101

క. అంతిక గత సీ కౌశికిఁ
గొంతవడిం జూచి మనము కోరి పవిత్ర
స్వాంతుల మవుదమె యని యా
చెంతకు వేవేగఁ జేరి చెలువుగ ననియెన్. 102

చ. అనిశముఁ జల్లనై విమలమై మధురంబయి యింద్రియత్రయిం
దనరఁగఁజేయు నిత్తటిని నైజగుణంబు నతిక్రమించెఁ బా
వన వనవేతసప్రసవవాసన యట్టిదకాదె యొక్కెడన్
మునుపటివారికన్నను సమున్నతిఁ బూనరె నూతనాగతుల్? 103

మ. నిజమేధాజననవ్రతప్రణయులై నిచ్చల్ వటుల్ బెంపగా
నజహన్నిత్యవసంతవిభ్రమము సంప్రాప్తించి యాకింశుక
వ్రజముల్ సింహనఖాంకుశోగ్రకలికారాజిన్ మహోద్దామసా
మజబాధల్ దలఁగం దపోవనము శుంభల్లీలఁ గాపాడెడున్. 104

వ. ఆ సమయంబున నాకసంబున. 105

క. జనకసుతావర! నీవు మహా
వనవాసము లెంతఁ [illegible] ధన్యమతిన్
తనర [illegible]
మ్మ[illegible]తోడ [illegible] సదా [illegible]మున్నన్. 106

మ. కమలాక్షా! [illegible] తపమే కావింపఁ జేజస్థితిన్
[illegible] కిసంయముల్
[illegible] జేయువాఁడై గుణం
[illegible] నం దాసన్నులై యుండగన్ 107

వ. అని సమ్మాటలు వినమి రామచంద్రుండు సానురాగంబుగా
నిట్లనియె. 108

సీ. కౌశికీ పుణ్యోదకస్నాన మొనరించి
ధౌతవల్కలపటద్వయి ధరించి
విమలభస్మ త్రిపుండ్రము లుక్తవిధిఁ గాంచి
మెడను రుద్రాక్షతావడము లుంచి
దర్భాంగుళీయసందర్భ మంగుళిఁ జేర్చి
సంధ్యాద్యనుష్ఠానసమితిఁ దీర్చి
యైణేయచర్మభద్రాసనస్థితిఁ బొల్చి
స్ఫటికాక్షసరము హస్తమునఁ దాల్చి

గీ. రమ్యమై చర్మచక్షు రగమ్యమైన
బ్రహ్మ మీక్షింపుచును వన్యభక్షణమున
బరగు నవిరలసాత్త్వికస్ఫురిత చర్య
డెందమున నించె నానందకందళములు. 109

వ. అని ససంభ్రమంబుగా నూర్ధ్వభాగంబుపరికించి ప్రచండమార్తాండమండలంబు గగనమధ్యారూఢం బయ్యెఁ గృతాహ్నికుండగు కౌశికుని సమీపవర్తుల మగుదము రమ్మని యాగశాలసమీపంబున కేగిరంత లక్ష్మణుండు దిగంతరంబు లవలోకించి యిట్లనియె. 110

మ. పరుషోద్యద్ద్యుమణిద్యుతి వ్యతికర ప్రక్రీడదర్కోపలాం
కురిత జ్వాలజటాలజాంగలరటత్కోయష్టులై భౌమని
ర్భరబాష్పప్లవమాన భానుకిరణోగ్రప్రక్రియ న్నైత్రతా
మరసంబుల్ దరికొల్పెడున్ దశదిశల్ మధ్యాహ్నశూన్యంబులై 111

సీ. అని రాముఁగని యార్య! యజ్ఞవాటిక మన
కిదె చేరువై యున్నయది, దినమణి
వేడిమిపడి స్రగ్గువెనుకఁ గౌశికుఁ జూచె
దముగాని, యీవటతరువునీడఁ
దనరారు మంటపంబున నిల్చి ఋత్విక్కు
లను వేగదర్శింత మనిన, రామ
చంద్రుండు సమ్మతి సాంద్రహర్షంబుతో
విశదమౌనచ్చోట విశ్రమించె,

గీ. నంత సౌమిత్రి యాశ్రమప్రాంతభూమిఁ
గలవిశేషంబు లెదకు సౌఖ్యంబుసేయఁ
బార్శ్వభాగంబువీక్షించి పలికె మహిత
వచనరచనావిశేషంబు ప్రచురముగను. 112

ఉ. చండమయూఖమండలము సాంద్రరుచిం గిరణౌఘము న్నభో
మండల మధ్యఖేలన సమగ్రముఁ జేసి విలంబమానమై
యుండ బలాత్కృతింగడఁగి యొక్కరుఁడీడ్చుచునున్నవాఁడునా
మండితశౌర్యః ఛాయలు నమందగతిం గనుపట్టెఁ జూచితే! 113

వ. అనిన రాఘవుఁడు వత్సా! మధ్యాహ్నం బతిక్రమించినదనియె
నన నది దివసావసానంబుగుటయె అదియెట్లన్న. 114

చ. నిరతిశయానసమగ్రగతి నెక్కొనమున్న దయాద్రినుండి యం
బరశిఖచక్కి నెక్కి సులభంబుగ డిగ్గెడు నిప్పు డౌర స
త్వర గమనంబెలర్ప దగదప్పు లెఱుంగక యస్తధారుణీ
ధరశిఖరాగ్రసీమకుఁ బతంగ శతాంగ తురంగసంఘముల్. 115

క. అనవుఁడు నపుడు సుమిత్రా
తనయుండు రఘురాముఁజూచి దనుజాగమనం
బున కిది యదనన విని య
య్యనఘుం డిట్లనియె నట్టహాసముతోడన్. 116

మ. అటులైనం గ్రతువిఘ్నకృద్దనుజ సంహారంబుఁ గావించు మ
త్పటుచాపంబు యుగాంతచండధరదోర్దండస్ఫురచ్చండిమో
ద్భటరూపంబు జగంబరాక్షసమొనర్పంబూని మౌర్వీపరి
స్ఫుటటంకార మిషంబునం దొరకొనున్ బుణ్యాహమంత్రావళుల్. 117

వ. అనినవిని లక్ష్మణుండు నవ్వి యార్యుని హృదయంబు రాక్షసశిక్ష
ణక్షణోత్కంఠంబై యతిదీర్ఘదర్శియగు కౌశికదేశికేంద్రుని సంభావింప
కున్నదని యమ్మహాత్ముని మహిమంబిట్లనిప్రశంసించె. 118

గీ. అనఘ! యజ్ఞానబీజనాశనముకతనఁ
దేజరిల్లెడు నిజయోగదృష్టిఁ గాంచు
ఇమ్మహామౌని వర్తమానార్థమటుల
భూత భావి సమస్తార్థజాతములును. 119

క. అన విని నవ్వుచు రాముం
దనుజున కిట్లనియె నిటుల ననునేటికి నా

ఘనుఁడగు గాధి మహీధవ
తనయుని మహిమంబు మదిని దలపందరమే? 120

గీ. బ్రహ్మతత్వజ్ఞుఁడైన యప్పారికాంక్షి
పట్టభద్రుస కధ్వరోపక్రమంబు
మహిత గృహమేధినిత్యకర్మంబటంచుఁ
గాని సురలోక విభవేచ్ఛఁగాదుసువ్వె. 121

ఉ. ధీరనుతుం డతండు వినతీకృతవాసవమౌళిపాళిమం
దారమరందపూరమున దారుణకోపదవానలంబు చ
ల్లార వినూత్నభూతరచనాదరముంభుజవైచి* యద్భుతో
దారగతిం ద్రిశంకుచరితంబు జగద్విదితంబు సేయఁడే. 122

వ. అని ప్రశంసించె నంతనక్కడ విశ్వామిత్రుండు మిత్రుం డపరగిరి శృంగంబుచెంగట వెలుంగుట గనుంగొని తత్కాలంబు దైత్యాను కూలంబని రఘుపుంగవుల కెఱింగించుతలంపున. 123

గీ. నిజమహాధ్వరచర్యచే నిగమభాషి
తార్థజాతంబు చరితార్థమై చెలంగ,
యజ్ఞవాటంబు వెడలి తత్ప్రాంతమునకు
నరుగుదెంచుచు నాత్మ నిట్లనితలంచె. 124

చ. సమధికభంగి సాంగమయి జన్నము దీరఁగనయ్యెఁ, బుత్రయు
క్తముగ వినాశమై యిపుడు తాటకయుం బడు, నింక నీరఘూ
త్తముఁడు పురారివిల్లునిమి ధాత్రిసుతన్వరియించి పౌరకా
ర్యములఁ జరింప నప్పుడు గదా కృతకృత్యుఁడనై సుఖించుటల్. 125

---

*"భుజవైచి" లేఖకదోషము,

శా. ఓగంభీర చరిత్రులార! మది మీ కూహింప నాశీర్వచో
భాగం బెద్దియుఁగాన, మీవలన జంభద్వేషి యెల్లప్పుడున్
యోగక్షేమములొందుఁ దత్ప్రహరణవ్యూహం బికన్ ప్రాభవ
ప్రాగల్భ్యోచిత వస్తుమాత్ర చరితార్థంబై తగుం గావుతన్. 180

వ. అని యవనతశిరస్కులై యున్న యన్నరపుంగవులఁ గనుంగొని
వెండియు నతండిట్లనియె 181

సీ. శుకముఖోదితకథావికచామృతాస్వాద
కేళిఁ దేలి చెలంగు సాళువములు
పంచాస్యదర్శనప్రాంచన్మనో వృత్తిఁ
దళుకొందు భద్రదంతావళములు
కాపిలార్యైకసంఘటనపాటవయుక్తిఁ
జరియించు శార్దూలశాబకములు
కాకోదరాననోద్గతశబ్ద మెటవిన్న
ముదమునఁ బరతెంచు మూషికములు.

గీ. సతత శాఖామృగాదరస్థితిఁ జెలంగు
కొండగొటియలు గలిగి యఖండమహిమ
ధామమగు మామకాశ్రమసీమ రామ!
ప్రేమనిల్పెనె నయనాభిరామమగుచు? 182

సీ. కుశదర్భపేటికాకోటి గారుడమణీ
రమణీయసింహాసనములు గాఁగ
భరితపాటలజటాపటలంబు లభిరూప
పద్మరాగకిరీటపటలి గాఁగ
ప్రాలంబినిర్మలస్ఫటికహారంబులు
విమలముక్తాహారసమితి గాఁగ

పవమానవశ తరుచ్యసమానసుమధూళి
బెడ గైన పసుపుపావడలు గాఁగ

గీ. పరతపః ప్రాజ్యసామ్రాజ్యవైభవమున
నుల్లసిల్లు తపోధనతల్లజముల
గార్హపత్యంబు నేడు మీకన్నుగవకు
రాగ మొసఁగెనె యోరామః రఘులలామః 133

క. కౌశికుఁ డీగతిఁ బల్కిన
దాశరథి వినీతి మేనుదాల్చెనొ యనఁగాఁ
శేశలతర నిజవాచా
కౌశల మెనయంగ మునిశిఖామణి కనియెన్. 134

క. ఇది రమ్య మతమ్యం బని
మదిఁ దెలియఁగ నెవ్వఁడోపు మఱియొకచిత్రం
బిదె యనఘః యిదికనుంగొన
సదమలమతి నామనంబుసాత్వికమయ్యెన్. 135

ఉ. నావుఁడు గాధిసూతి రఘునాథున కిట్లను నోమహాత్మః ము
న్నీవని దంభవామనుఁ డహీనతపంబొనరించె, నిప్పు డ
ద్దేవునిగాఁ బ్రబోధమయదృష్టి మిముం బరికించి నేత్రరా
జీవము విచ్చెఁ జూచితె ఋషిప్రకరంబు కరంబు వేడుకన్. 136

గీ. అనిన రాఘవు డత్యంతహర్షు డగుఁడు
యతియు మనమున వీరి సంస్కృతపురాణ
జననవర్తనులుగఁ జేసితిని నితాంత
భాసురోత్సాహమున కింత ప్రకృత మెందు. 137

వ. అవి యిప్పుడంబున మనంబున నెంచునెడ పొడఁపుగుబ్బలిపేరిట
కాశ్మీరంబునం జెలంగు తొలుసంజెకెంజిగికుంకుమంపుమడిం బొడ
మి వెలుంగు వేఁడివెలుంగు ముప్పుంపుఁబుప్పుఁగుత్తి హత్తి నతమి
హరిత్తరుణీజనంబు లందఱుసు హస్తానుహస్తికఁ జేఁ గౌతుకంబడర
వైచి కదపటం బడమరపడంతిహస్తంబునఁ జేర్చిరన నస్తంబునం
బొలుపొందెఁ దదనంతరంబ పశ్చిమభాగం బవలోకించి యిట్లనియె. 138

మ. కలవింకీకలకాకునాందికలనాకల్పద్రుమోదగ్రశా
ఖల యగ్రంబుననుండి భానుఁ డిదె యాకర్షించెడుఁ గర్దభీ
గలకాషాయము నీషదావృతతమస్కాండోర్ణికా జర్ఝరాం
చలదేశంబును నైన యర్చిని రఘుక్ష్మాపాలవంశాగ్రణీ! 139

గీ. నిగమము కెల్ల మూలమై నిఖలవిబుధ
పూజితంబగు రవిసంజ్ఞ దేజరిల్లు
మేటి తేజంబు మునిఁటి నీటఁ గ్రుంకెఁ
దజ్జలంబులు మంత్రపూతములుగాంగ 140

వ. అనినవిని రామభద్రుండు దిక్కులన్నియుఁ బరికించి సౌమిత్రి
కిట్లనియె. 141

గీ. చండమార్తాండకిరణప్రకాండదీప్తి
వెలిగి చల్లారె నన దిశల్ నలుపు దేరె
వరుస నంతటఁ దదవస్థ వరుణదిశయు
దా నెఁ గ్రిందికిమీదికి వాసిగాఁగ 142

శా. శ్రీల న్మించె మునీశ్వరాశ్రమసుధరా శ్రేష్ఠంబు త్రేతానల
జ్వాలోపప్లవమానధూమవలభీసంక్రాంతదిగ్భిత్తి కా
జాలంబై పటువుల్ దృతీయసవనస్వాధ్యాయవి స్తీర్ణలీ
లాలీఢేక్షు స్వరాశి దీర్ఘముగఁజేయం బూని రన్యోన్యముల్ . 143

వ. అనిన విశ్వామిత్రుండు మిత్రకులవర్ధనున కిట్లనియె. 144

క. దినమునఁ బరిముక్త మునగు
తనవీదల మగుడ నిమీళితంబయ్యె ననన్
దనరుచు జగ మివ్వేళం
గనుపట్టె నిరంతరాంధకారావృతమై. 145

గీ. ప్రాంతమున వార్ధికడుమను రత్నసాను
వునఁ బ్రకాశించుచుండఁగా నెనసియున్న
యంధకారంబుచేతఁ జిత్రాంగి యగుచుఁ
గౌతుకము సేయుచున్నది కదు ధరిత్రి. 146

వ. అనిన రామచంద్రుండు సనిర్వేదంబుగా నిట్లనియె. 147

క. మునుమును దేజోమయమై
కనుపట్టినయట్టిదిశలు క్రమ్మఱఁ జూడం
దనరెఁ దమోమయమై ముదిఁ
గనుగొన నజుభువనసృష్టి కడువింతగదా! 148

మ. బిలముల్ వాల్చె భుజంగరాట్ఫణమణి ప్రేంఖద్ద్యుతిన్ దావనో
పలముల్ వాసి రథాంగయౌవతమునః ప్రాప్తిం గనెన్ బావకుం
దలరెం జూడ దివానిశానిబిడయాతాయాతసంఘృష్టి సం
ధిలు సంధ్యాశిఖవిస్ఫులింగములునా దీప్తాకృతిం దీపముల్. 149

సీ. కటికిచీకటియె తక్కఁ బిలోచనగ్రాహ్య
మగుసమస్తము నదృశ్యత వహించెఁ
బ్రాచ్యాదిభేద మేర్పడఁ గారణములేమి
నేకమై కనుపట్టె నెల్లదిశలు

నెటువంటిధీరులపటుదృష్టి కేనియు
భయ హేతువులు బట్టబయలఁ దోచెఁ
బలికినఁ గాని ముంగలనున్న యాకార
ముల వీరువారని తెలియదయ్యె

గీ. నెల్లెడలఁ బెల్లుగాటుకఁ జల్లినటుల
బెడిదమై మోము తెరువున నడిచి రేని
గాన రాని మహోగ్రాంధకారపటలి
మించిజగదండకుహరంబు ముంచుకొనిన. 150

గీ. కటకటా పంకజాత జాగరణదీప
మైన రవి గ్రుంకఁ గ్రైరవ మలరుటకును
సురభిమాధుర్యభాసురజ్యోత్స్న నీ చ
కోరతతి మ్రింగుటకుఁ గాల మౌర వచ్చె! 151

గీ. బలుచీకటి తేటిగముల్
దొలవగఁ గాష్ఠాంతరములఁ దోచినతారా
చ్ఛలరంధ్రములం బలుమరు
జలజల నుసిరాలె కిరణచయదంభమునన్. 152

వ. అయ్యవసరంబున. 153

సీ. చుఱుకుచూపుల మించనుటుకు జేగురుగ్రుడ్లు
దింద్రించి బిఱబిఱ ద్రిప్పికొనుచుఁ
గఠినదంతాంతరగ్రథితంబులై యున్న
బుదుసులు జిహ్వచే గొడిసికొనుచుఁ
బుమకకంఠమున నించిన కొత్త నెత్తురుల్
జుఱ్ఱుజుఱ్ఱున సారె జుఱ్ఱుకొనుచు

నవతంస గత శోణితామ్లగంధమునకై
సుడియు నీఁగలఁ బాఱఁజోపికొనుచు

గీ. వివృతముఖగహ్వరజ్వలద్వీతిహోత్ర
చటులకీలలు కటకిచీకటులఁ దఱుమ
నుద్దవిడి వచ్చె వినువీధి గ్రద్దలాడఁ
దాటకానామ యొక్క నిశాటభామ. 154

లయవిభాతి. వచ్చి మఖశాల వడిఁజొచ్చి ఘనయూపములు
పుచ్చి పటుకాయములు వచ్చి వలయంబుల్
వెచ్చి పతగప్రతతికిచ్చెఁ జరుపాత్రములు
విచ్చి హవిపేరన్న రుచిమెచ్చి తనచూడ్కిన్
జిచ్చు దొరగఁగ మునుల హెచ్చు దొలఁగన్ బలము
పెచ్చు పెరుగఁగ సవనకృచ్చటులవృత్తిన్
విచ్చలవిడిం దిరిగె నిచ్చలపుబీరమున
నిచ్చల వియచ్చరులు జెచ్చెఱఁ దలంకన్. 155

గీ. అని కలాధరముఖు లప్డు యతికులేంద్రః
యనలకుండంబులను నెత్తు రావహించి
తాటకేయాది రాక్షసతతులు మమ్ము
జుట్టుకొనె నేమిగతి యని బెట్టుగూయః 156

గీ. విని సాకూతముగాఁ దన
మనమున నాశ్చర్యమంది మనుజాదిని వ
చ్చినదాః యని మునిపతి యా
యినకుల శేఖరుని జూచి యిట్లని పలికెన్. 157

చ. మనుకులసోమః రామః వినుమా యిపు డుగ్రగత నాతతాయులై
తనరు సుబాహుముఖ్యులగు దైత్యులు తోడుగ మాగ్రహంబునన్

ఘన నిగమోదితంబగు మఖంబు నడంచుచునున్న తాటకన్
దునుమఁగ విల్లుగైకొనవె దుష్టనిశాటి నుపేక్షసేయకన్. 158

క. అనవిని రఘుపతి యిట్లను
మనమునను జుగుప్స దనరయు మల్లడిగొవ న
మ్ముని పతి వదనము గనుఁగొని
యనఘా! యీయాతుధాని నగునే చంపన్? 159

వ. అయ్యవసరంబున. 160

ఉ. చాలఁ గళాధరుండు దితిసంతతిచెయ్వులఁ జిక్కి రాక్షసా!
యేల యనఘ్ను లిద్విజులు హింసకుఁజాలరు; తండ్రి కౌశికా!
తాళము తాళమేఁసు వడి దంచిరి నొంచిరి క్రూరకర్ములై
కాలను జేత మమ్ము నిదె కార్ముకపాణిని రాముఁ బంపవే. 161

క. అనవిని రాఘవుఁ డాతని
గనుఁగొనుచుఁ గళాధరాఖ్య! క్షణమాత్రము నీ
వనుపమ దృఢధైర్యుఁడవై
మనమునఁ బెదరకను నిలువుమా యని మఱియున్. 162

మ. గురువింగూరిచి యింతక్లేశపడుచుం గూయంగ నేలా నిశా
చరవారంబుల ద్రుంచు టెంతపని యీసన్మౌనిరాట్ప్రేమ కి
ష్టరయన్ శిష్యుఁడవై ననీవు తనయుండౌ నామదుచ్ఛందుడున్
సరిగారా! భవదాజ్ఞ మాకును విశేషంబైన దూహింపఁగన్. 163

గీ. అనువెడను గాధినందనుఁడనఘచరిత!
రామ! యుత్తరప్రత్యుత్తరముల కింక
వలనుగా దాశ్రమోపద్రవంబు చేరు
వయ్యె ననుతఱి లక్ష్మణుం డాత్మలోన. 164

క. ఈ వాచంయమి సెలవిడ
స్త్రీవధ తగవని యనుమను శ్రీరాముఁడు దా
భావింపనేల మౌనుల
యావాక్యంబుఁగాదె శాస్త్ర మనుకర్త్రింపన్. 165

వ. అప్పు డారామచంద్రుం డాశ్రమగతంబుగ నిట్లని వితర్కించె. 166

చ. స్థిరగురుశాసనంబునఁ జేసిన స్త్రీవధమైన ధర్మమా
ర్గరహిత మేలయౌను? ద్విజగణంబులు యాచకచేత సిగ్గునన్
వెఱపక నేమనిల్చు మఱి వేఁడనసేగెదు మేము దానివేఁ
గరము జయించి మించెదము కన్నులమూసుకయున్న మాత్రలోన్ 167

వ. ఐనను. 168

గీ. అస్మదపకీర్తిపటహంబు నఖిలజనము
లకట వాయింప జ్యోతిర్మయాత్మదేహ
మునను జగదంతసాక్షియౌ మునివరుండు
కులగురుండు వసిష్ఠుండు గుందు లజ్జ. 169

వ. అయ్యవసరంబున సుబాహుండు మునుల నుద్దేశించి యిట్లనియె. 170

గీ. మానుఁడీ మీక లోమూర్ఖమౌనులార!
యాగసంతతి; దివికి నేఁడేగ నివిగా
దారుణంబైన నాఖడ్గధారయనెడు
త్రోవ చేరువయైనది తేవమీకు. 171

క. అనవిని రఘురాముండురు
మనసంభ్రమ మెసయ లేచి కార్ముకముఖసా
ధనములుగొని దితిజాలం
ఘన నైపుణి దోప వినయబద్ధాంజలియై. 172

వ. భగవంతుండగు గాధినందనునకిట్లనియె. 173

చ. అల యజుపట్టియింట నుదయంబయి నే విలుఁబట్టఁబట్టి యు
జ్జ్వలరవివంశశోషకవిశాలకళంక నవాంకురంబు వే
మొలచునొ యరచునెంచితిని మున్నతివన్ వధియింప స్వామి! మీ
పలుకులు సంశయంబునెడఁబాపెను జేసెదఁదద్వ్యథంబికన్, 174

వ. అని మునులనుద్దేశించి భయంబువారింపుచునిట్లనియె. 175

గీ. రండు మునులార యిదెరామవుంత వచ్చి
నాడ, దైత్యులఁ దఱుముచు నాధనువును
దిశిజనాళ విసృష్ట గాధిజకుశాగ్ర
సలిలకణముసకెనయని తలఁచు డిపుడు. 176

క. అనికార్ముక మెక్కిడుచుం
జనియెన్ రాఘవుఁడు వే నిశాచర సేనం
దునుముట కై లక్ష్మణుఁడుం
దనలోనూహించెఁ గొంతనందన్మతియై! 177

క. మునుఁజేసిన భాగ్యంబున
ఘనవీర్యుండైన యార్యుకౌమారము గ
న్గొన శాత్రంబుననే చ
య్యన సఫలంబయ్యెఁగాదెయని రణభూమిన్. 178

వ. విలోకించి కుతుకాంచితమనస్కుండై ప్రకాశంబుగా నక్కౌశికున
కిట్లనియె. 179

మ. మునిచూడామణి! నీదుశిష్యుఁడగు రాముండిప్డు విల్లందినం
తన వాయవ్యవృషత్కయోగ విగతాధారుండు మారీచుఁడ

మ. నిఖిలాశాంచితకీర్తి ఫాలగగనుల్ నిర్వ్యాజవీరోద్ధతుల్
ప్రబలప్రౌఢమనస్కులైన రఘువుల్ పాలింప నిర్వ్యాజశ
త్రుబలాళీ విజయాహవాంగణ ఘనస్వేదంబులై లీలనె
ర్పె బలద్వేషిగనెన్ శచీకుచములం బత్రాంకముల్ వ్రాయఁగన్. 184

గీ. అనుడు సౌమిత్రి చూడుము మునివతంస!
యాళితావరవాహినీ హననమను ప్ర
వీరధర్మార్థపూర్వ ఘాన విధిని వేగఁ
జేసి రాముండు మిముఁ గలఁ జేరవచ్చె. 185

వ. అనియె నయ్యవసరంబున రామచంద్రుండు ప్రవేశించి యీషదం
కురితలజ్జావనత వదనుండై. 186

గీ. దినమణిసిష్ఠ కౌశిక మునులు ముగురు
రఘువులకు గురు లీపతిప్రవరుసియను
మతిని జేసిన స్త్రీహింస మాకుఁ సుఖము
వేయదని యెంచి యాశ్రమసీమఁ గాంచి. 187

వ. ఇట్లనియె. 188

శా. నిస్సీమోత్సవమయ్యె గర్భితవిధూన్నిద్రాంశునశ్యత్తమో
దోస్సారప్రద హోమధూమ లహరీమగ్నవస్తుస్థితుల్
శ్వస్సంచీవరయిష్యమాణపటుః వ్యాధౌళిపల్యంబు లం
తస్సుప్రాతిథికంబు లిమ్ముని నిశాంతంబుల్ నిరీక్షింపగన్. 189

చ. నలినవనంబునన్ వింసనంబు దొరంగఁ గుకంగభృత్కరం
బులు బిసలక్ష్మిఁ బొంద దివిఁ బొల్పెసగం గుధరాగ్రసీమలం
దెలుపు సెలంగె లోపల మునింగినయట్టి జగంబు గ్రమ్మఱన్
వెలువడఁ జేయఁ దమోంబుధి జనించిన ఫేనవితానమో యనన్. 190

శా. పౌలోమీకుచకుంభకుంకుమరజో బాంధవ్యజాతో ద్ధతుల్
ప్రాలేయాంశుకరంబు లింద్రనగరీభాగంబు లందంబుగా
హాళిన్ దిద్దుచు ద్రిమ్మఁగుచుం దమిచె మయ్యూఖావళిందేర్చుచున్
నేలన్ నించుచు మింటిసట్టినడుమన్ వెల్గొందెడిన్ వ్రేల్మిడిన్. 193

శా. ఆవిస్ఫోటిని గ్రోళయుగ్మమును రాజా యెక్కి రాఁడిప్పుడున్
తేవన్ గైరవచాటుకార కిరణానేకంబు లెంతేఁ దమి
సాంద్రివారంబుల రాచి ఘూధరగుహాచక్రంబులం దోఁచియున్
జీవగ్రాహము గాచి యేచి పదవైచెన్ సీదఁటన్ బ్రోడలై. 194

సీ. కిరణాఖ్యకతక సంఘృష్టిఁదేరు తమోబ్ధి
యడుగునఁ జేరిన యిన లనంగ
కరటంకతక్షణస్ఫుటితాభ్రమున జారి
యెద నెవజనిన బొట్టిద లనంగ
వితతాంశు భటకోటి వెన్నాడ దగదొట్టి
కలఁగినదిక్కుచీకటు లనంగ
ప్రాంచన్మరీచిధారాంబు సేకంబున
జనియించు భౌమోష్మచయ మనంగ

గీ. క్షోణికి మయూఖబిసముల గూడి డిగిన
గగనధునిలోని కాదంబగణ మనంగ
నిండి సీదలు కన్పులఁ బండు వగుచు
దండి గనుపట్టె ధారుణీమండలమున. 195

ఆ. అలమృగాంకరోచి తిలతండులితమయ్యె
దళవితానభరితతరుతలములఁ
దమిఁ జకోరవితతి తమచంచుపుటముల
నడుమ నడుమ దినిన వడుపుదోప. 196

చ. జనులు సుధాకరుండన విశాలతమః పటలంబు గ్రమ్మి చూ
పెనయనికన్ను దమ్ములకు దృష్టియొసంగుద్విజేంద్రుఁ డర్థియై
చన విముఖంబులైన జలజంబుల కిచ్చె నిశాఘ ముంగనా
జనవదనోపహాసుకృతసారము గైకొనియెం బదీయమున్. 203

గీ. అనినవిని కౌశికుఁడు తన యాననమున
మొలకనవ్వొల్క సకల లోకు లభిధాన
మాత్రమాధుర్యమున భ్రమ మడసెబోని
నిశ్చితార్థంబు తెలియఁగక నిందు లైరి. 204

వ. అదియెట్లన. 205

చ. సకలదిగంతముల్ గడుఁ బసన్నములైననుఁ గైరవాచ్ఛకో
రకతతి ఫుల్లమైన ముదరంభరులైన చకోరపాళి చం
ద్రికలను మెక్కి మెక్కి పరితృప్తిపహించిన నత్రినేత్రదూ
షికయగు సీతనిం దగునె చేరి సుధానిధియంచు నెంచగన్. 206

వ. అని గాధినందనుండు దశరథనందనుం గనుంగొని యతండు కౌమా
రార్జితప్రచండఖండనోద్దండవిజయలక్ష్మీపరిణయకౌతూహలాయ
మానమానసంబునం బ్రవేశించుచున్నవాఁడయ్యె నిరాఘాటధా
టీ పరాభూతవిబుధమునిజంయూటయగు తాటక నొక వ్రేటున మీ
టుదొలంగఁజేసియు స్త్రీవధంబని నిరంతరచింతాకులస్వాంతుండగు
చున్గ్రక్కు గ్రక్కున మనలంగలయరాదని సుమిత్రాపుత్రు నవలో
కించవత్స ! మనకీవృత్తాంతంబువలన బ్రకృష్ట పౌరుషలక్ష్మీసదృ
శయై ప్రదోషలక్ష్మీ పొడకట్టుచున్నయది యదియెట్లన్న. 207

గీ. దనుజగాఢాంధకారవిదారి యైన
రామచంద్రుఁడు చెంతకు రాఁగమునుల

సీ. తనువుపై వాసవోసినరీతిఁ గనుపట్టు
బరులతో నెమ్మోముతరులతోడ
నలుకప్పుపొరలచేఁ గుఱుచమాపులుచూచు
దృష్టితో నపలంబయష్టితోడ
నరలగడ్డమునఁ జేపురుసించు పీడెంపు
రసముతో జమిలికుప్పసముతోడ
పటిమగోల్పడి బ్రేఁకబడుచు నుయ్యెలలూగు
కడుపుతోఁ దడబాటునడుపుతోడ

గీ. గూనుకతమున నెమ్మేనఁ గానుపించు
దగ్గుతో నగ్గలపుఁ బొడిదగ్గుతోడ
సొరిదిఁ గనుపెట్టె జరఠకంచుకి యొకండు
జనకశుద్ధాంతభామినీజనము వనప. 225

వ. పోవుచున్నయతండు తనమనంబున. 226

చ. పలుకుల జీర్ణగాత్రముల బాటవ మించుకలేక మిక్కిలిన్
నలువురు నవ్వఁగాఁ బ్రహసనంబు సహించిన నన్ను నింకఁ బా
టిలినమహాయు వేమిటి నటింపఁగఁజేయునొ కాసరా దయో
వలిపలితాదిబాధ పగవారలకున్ వల దివ్వసుంధరన్. 227

క. అని పురపరిసరసురుచిర
వనవీధిని రఘున్నపాలవరనందనులన్
ఘనుల న్నిజభుజభీకర
ధనులన్ మహనీయకీర్తిధనులం గాంచెన్. 228

వ. ఇత్తెఱంగునం గాంధినందను దన్మహాధ్వరప్రత్యూహపరిహారకు
లగునక్కుహనాదారకులను గనుంగొని యంతరంగంబున నభంగు

రప్రమోదంబు నిగుడ మగుడ నగరుసొత్తెంచికొన్నికక్ష్యాంతరం
బులు నిర్గమించి ముందట. 229

క. కాంచీ మణికింకిణికా
ప్రాంచన్నినదంబు చెవులపండువు సేయన్
గంచుకి యాకర్ణించి యొ
కింపుక చితించి తెలిసి యుంచినవేడ్కన్. 230

మ. కలహంసీకటిభాగశోభితరణత్కాంచీమణికింకిణీ
కలనాదం బిదియంచు నెంచఁగ, ధరకన్యాపదాంభోజని
శ్చలసేవాచరణైకదాస్యయగు నాచంద్రాస్య యేతెంచి ని
ర్మలభక్తిం బ్రణమిల్లి యిట్లను సుధామాధుర్యధుర్యోక్తులన్. 231

గీ. అయ్య! యెటనుండి మీరాక యానతీయఁ
దగిన వినిపింపుఁ డనిన నప్పుగుపఁ జూచి
సౌవిదల్లుఁడు పల్కె నోపూ.ప్రబో...
యీవెఱుంగవె? దాపఁగానేల నీకు. 232

శా. శశ్వద్బోధకళానసనాథు జనకక్ష్మానాథు వీక్షింపఁగా
విశ్వామిత్రమహామునీంద్రుఁ డిటకున్ విచ్చేయఁడే రాసుతుల్
విశ్వాశ్చర్యధురీణవిక్రమయుతుల్ విద్యోతమానాకృతుల్
విశ్వాసంబువలిర్ప సిద్ధబు మహావీరుల్ దనుంగొల్వగన్? 233

ఉ. ఆనరనాథనందనులయాకృతు లేర్పడఁ జూచి రమ్మటం
చానినవేడ్కె నన్ను నిపు డంతిపురంబుజనంబు వంపఁగా
నేనును వారలున్న యెడకేగి తదీయతనూవినూత్న రే
ఖానిఖిలాంగసౌష్ఠవము కన్నులపండువుగాఁగ జూచితిన్. 234

క. సాకేతనగర రాజ్యార
మాకల్ప మనం దనర్చు నాధరణీభృ
త్సాకారి తనయు లీరుచి
రాకారులు రామలక్ష్మణాహ్వయు లఖలా! 239

గీ. అతులభుజదండచండిమాహత విరోధి
వీరు లగుచును, ఘువి ద్వంద్వ చారులగుచు
భరతశత్రుఘ్నులను పేరఁ బరగువారు
పిరియనుజన్మలో రాజకీరవాణి! 240

సీ. అనఁ గలహింసి యిట్లను నో మహాభాగ!
మనవిదేహనృపాలుమందిరమున
సీతోర్మిళానామశాతోదరీమణుల్,
మాండవీ శ్రుతకీర్తి మానవతులు,
నున్నకైవడి వీరు నున్నారు నలువు రీ
రాకుమారకులు మహాకులప్ర
సూతులు సద్గుణాన్వితులు పీరికిఁ
బరిణయం బొనరంచుభాగధేయ
గీ. మహిమ చేకూడదొకో? యింత మనకు ననుఁడు
భద్ర మయ్యెడు నఖిలంబు భగవదాజ్ఞఁ
దల్లడిల్లకు మనిన నప్పల్లవోష్ఠి
యలరి ప్రణమిల్లి యిట్లను నతనితోడ 241

ఉ. నిక్కము పల్కు మోయనఘ! నీవు మదీయమనోవిచారమున్
మొక్కలువుచ్చఁ బల్కితివొ? మున్నుగ నీదృశభద్రసూచకం
బెక్కడ నైనఁ జూచి యిపు డీగతిఁబల్కితివో? యనన్ మదిన్
మక్కువ మీఱఁగా నతఁడు మానవతీమణితోడ నిట్లనున్. 242

వ. ఒక్కవిశేషంబు గలదే నక్కుమారులం గనుంగొని మరలి యే తేర గౌతమపుత్రుండు రాజపుత్రీసౌభాగ్యదేవతారాధనంబు నకు నన్నుఁ బుత్తెంచె నత్తపోధనసత్తముండుఁ గాలత్రయవిత్త ముండు గాన నతనివాక్యంబమోఘంబనుతర్కంబున శుభోద ర్కంబు వలికితి నన నక్కాలికి కొంతొకవిచారించి యిట్లనియె. 243

గీ. జానకీవధూటిఁ బండీశకోదండ
మెక్కు బెట్టువాని కిత్తు ననుచు,
జనకుఁ డాడుకొన్న సాహసంపుఁబ్రతిజ్ఞఁ
గొంచ కితఁడు నిర్వహించఁ గలఁడె ? 244

గీ. నావుఁ దతఁడు మాకు నీవిచారమకదా
మగువ యుల్లమునకు దిగులొనర్చు;
నైన శంకవంచ దమ్మహాద్భుతశక్తి
యీకుమారకునకు లేకయున్నె ? 245

వ. అట్లు లేకుండునేని. 246

క. సవనము ముగిసియు, రక్కసు
లవిసియు, ముని నృపుసిప్రతిన యరసియు, నీరా
ఘవు బాలు నింత దూరపు
టవనికిఁ దేనేల దశరథైకప్రియునిన్ ? 247

సీ. అన విని కలహంసి యాత్మలో నొకమాటఁ
దలపోసి కంచుకిపలను జూచి
యడలుచు నిట్లను "ననఘ! నేఁ డొకవార్త
విని విషాదమునొందుతనమనంబు

ధర్మపాంచాలికా పరిణయోత్సవకేళి
కైతవంబున సాంద్రకౌతుకంబు
గావించునృపపుత్రిఁ గాంచి మీవటికార్య
మరయుట కిప్పుడే సరుగుదెంచి

గీ. తావకాలోకనమున సంతయును మఱచి,
చెవుల రక్కసులనుమాట దవుల మగుడఁ
దలఁచికొంటిఁ గడంక నాతరుణి సీత
కింతవెతసేయు నవ్వార్త యెట్టి దనిన. 248

క. వినవాః యిచటికి రావణ
దనుజపురోహితుఁ డొకండు తమయేలికకై
మనసీత నడుగవచ్చుట ?
యన నతఁడది సరకుగొనక యంగన కనియెన్. 249

ఆ. నృపతనూజ యిట్టివిపరీత కార్యంబు
దెలిసి యింతవంత నలసెనేని
తరుణియంగకములు తారుణ్యలక్ష్మికి
నెదురుసూచుచున్న వింతిః నిజము. 250

ఆ. అనిన నగుచుఁబల్కు సయ్యింతి, నిక్క మ
మ్మాట యనఘ ! వృద్ధులౌట నింక
సిగ్గువిడిచి మీకుఁజెప్పెద వినుఁడు, మా
సీత కిపుడు గల విశేష మొకటి. 251

ఉ. బొమ్మలపెండ్లిసేసి నసబోడి, యికన్ మిథునంబుఁగూర్పగా
రమ్మని బాలికల్ బిలువ రానన వత్తునసనం దలంకుచున్

గ్రమ్మి కపోలపాళిఁ బులకప్రకరమ్ము కరమ్ము మించఁగా
నమ్మదిరాక్షి సిగ్గుపడినందుకు సిగ్గుపడున్మనంబునన్. 252

క. అనవుఁడు నవ్వుచుఁ గంచుకి
యను నిపు డట్టైన బాల్యయౌవనసంధిన్
దనరుచు నున్నది జానకి
విను మోకలహంసి! యిట్టివేళనకాదే. 253

క. మనమునఁ దలఁకెడుబాలా
జనములచే మను ననూనసామ్రాజ్యంబై
మనసిజుఁ డాఅవకన్నెటుఁ
గని మంత్రముగల్గి వికచకమలదళాక్షీ! 254

చ. నవనవమార్దవాంగకఠినత్వముగూర్చి యొనర్చె జవ్వనం
బవిరళభంగి నాభిగుపులొ జిగిగుబ్బ లురంబు సెందఁగా
సవినయధృష్టఁతామసృణశంబరివైరికథావధాన లౌ
యువతులె కాక లోకమున నొండు శుభోదయహేతువున్నదే? 255

గీ. అనినఁ గలహంసి నవ్వి యోయనఘ! యిప్పు
డేను నేమియుఁ జెప్పలే దీవు నేమి
వినుట లేదిది యింక నీ మనసులోన
మఱవఁదగు నన్నఁ గంచుకి తెఱవతోడ. 256

ఆ. చెలువ! నాగుణంబుదెలియ కాడెదవు నీ
వైననేమి గోప్యమైన మాట
యడరఁనొరులెఱుంగు టది యెట్లు నూతిలో
గుండు వైచినట్టు లుండ వలదె? 257

క. అని వెండియు నతఁ డిట్లను
మనజనపతికౌశికాగమన మీవఱకున్
వినఁ డొకొ వినినన్ వినఁగా
కనిసం గలహంసి వేత్రహస్తన కనియెన్. 258

క. కుహనాపరుఁడు దురాత్ముఁడు
మహిసుతకు దశాస్యుఁ డేడ మగఁడగునో యన్
దహతహఁ బొందెద ననవిని
యహహా యని నవ్వి మగువ కతఁ డిట్లనియెన్. 259

క. ముల్లోకంబుల గెలిచిన
బల్లిదుఁడని పెండ్లియాడఁబాత్రమె సీతన్
దల్లడ మేటికిఁ గుహనా
భిల్లశరాసనము విఘ్నబీజము గలుగన్. 260

మ. జనకక్ష్మాధిపమౌళి యారయ మహాక్షత్రాన్వయోత్తంసుఁ డ
ద్దనుజాధీశునకై జగద్విదిత సంధాహాని సైరించునే?
యన నయ్యంగన నిర్భరప్రమదగుంభాంభోధి నోలాడి యో
యనఘా! యెచ్చటనున్నవారు రఘువంశాంకూరచూడామణుల్? 261

వ. అనినఁ జతురవచనరచనాకోవిదుండగు నాసౌవిదల్లుండు పువ్వుఁ
బోఁడి కిట్లనియె. 262

మ. రమణీ! యారమణీయమూర్తులు పురప్రాంచద్వనీవీథిసం
యమిసంక్రందను గాధినందను సముద్యద్భక్తి సేవించుచుం
బ్రమదం బొప్పఁగ నున్నవారదె యఖర్వజ్ఞానకర్మైకయో
గముచే సొంగకమై లభించునపవర్గస్వర్గ యుగ్మంబనన్. 263

వ. అనిపలికి సౌమిత్రిపల్లుంతప్పల్లనాధరం జూచి వయస్యా! నీవేతెం చియాలస్యం బయ్యె, నింక సత్వరంబుగాఁ గన్యాంతఃపురంబున కుం జను మని పంపి. తానును జనకపుత్రా గారంబుఁజేరి తత్ప్రాం తాజనంబునకు రఘునందను రాకఁ దెలుపంగ తెలియఁ జెప్పించి ముదం బొద వించె ననంతరంబ. 264

మ. తనవెంటన్ రఘురాజనందను సమీరదస్యూర్తి సేతేర స మ్మునిచంద్రుం దరుదెంచి కాంచె నెపుటన్ మూర్ధాభిషిక్తచ్ఛటా ఘనకోటీర మణీమ్మణీలిఖిత రంగత్పాద విస్తారమున్ జనకాధీపు జగాహజారము సమ్యగ్విశాలాంగ శృంగారమున్. 265

గీ. కాంచి పల్యంకికాందోళికా సుదేభ తురగముల డిగ్గి, భయభక్తిభరితు లగుచు, మున్నె యు గుదొరల్ దండములిడంగ నంచితోన్నతిఁ జేర నేతెంచునపుడు. 266

శా. కర్ణాకర్ణిక చేఁ దదాగమన మాకర్ణించి భూజాని సౌ వర్ణప్రోన్నతభద్రపీఠిఁడిగి దీవ్యత్పాదికోలాహలం బర్ణోరాశితరంగనిస్వనము నుద్ఘాటింపఁ గౌతూహలా కీర్ణుండై యెదురేగి చెంగటఁ ద్రిలోకీవేశితుం గౌశికున్. 267

వ. కనుఁగొని సాష్టాంగదండప్రణామంబు లాచరించిన నవ్వాచంయ మినురేంద్రుండు శీరధ్వజ నరేంద్రు నాశీర్వచనపూర్వకంబుగా గాఢాలింగనం బొనర్చి రఘునందనుఁ దానును శతానందో పదిష్టమార్గంబునం జిరత్నరత్న నూత్నస్తంభసంభృతరత్నపాం చాలికాకాయమానప్రతిఫలితనవివిధవివిధోపచారసంచారిపరిచా రికాచంద్రవదనం బగు సభాసదనంబున కేతెంచి సముంచితఖ చితమణినికరవికచరుచినిచయచకచకాయమానంబగు జాంబూ

నదపీఠంబునం గూర్చుండి యర్ఘ్యపాద్యాదుల నభ్యర్చితుండై ని
జాసనంబున నుచితాసనంబుల నందరు నాసీనులై యుండ
నన్నరపతిం గుశలం బడుగ నప్పుణ్యమితే డిట్లనియె. 268

ఉ. ఓకుశికాన్వవాయకంఠోపవిష్టార్ణసుధామయూఖ ! మీ
రాక విపక్షహోగ్రజలరాశి నిమగ్న జనావనక్రియా
నౌక మదీయ సంపదికి నాథునిఁ గూర్చె, యిదంసుహీమహో
శ్రీకి సుపక్షవోషహతిఁ జేసె, యికం గుశలం బొసంగెడున్. 269

వ. అని మఱియును 270

మ. అనఘుం డీయెకలం బ్రదక్షిణసముద్యత్కృత్యులుండై మూగ్యహం
బున హవ్యంబు భుజించుచుండెడు, భవత్రోద్దామతేజం బుద
గ్రగనిహూతిం బ్రకటించ నాంగిరసుఁ డౌరా శైవలీలల దా
ల్చును దా శాంతికపౌష్టికంబుల స్మృతంబున్ నీకృపం దృప్తుఁడై.

వ. అనిపలికిన. 272

సీ. తైత్తిరీయయజుశ్ఖాన మేయతిభర్త
మూర్తిభవింప వైశాముపవెడల్చె
సౌరభేయాసహస్రముగాంచి యేమౌని
మొనసిన పెక్కండ్ర ముక్కలగెల్చె
కమలాప్త సన్నిధానమున నేజటిమౌళి
శుక్లయజుర్మహాశ్రుతిఁ బఠించె
నిఖిలోపకారమై నెగడ నేజడదారి
ప్రతిభచే ధర్మశాస్త్రము రచించె

గీ. నమ్మహాయోగి యాజ్ఞవల్క్యాహ్వయుండు
దేశింకుం డట భవదీయ దేశమునకు

మదిఁ దలంపంగ సంతతాభ్యుదయలక్ష్మి
పొదలుటయెకాక యాపద లొదవు టెట్లు? 273

వ. అదియునుంగాక 274

క. గౌతమసుతుఁడు పురో
హితుఁడీతండట దండధారి పీవట బ్రహ్మ
జ్ఞాతవు భూవర యాపద
లేతీరున నొదవు నిమ్మహీమండలికిన్? 275

చ. అని మునిరాజమౌళి దరహాసవిభాసిముఖారవిందుఁడై
జనకునిఁ జూచి యోనృపతి చంద్రమ! నీదుప్రతిజ్ఞ వమ్ముసే
యని జగదేకమల్లుఁ డగు నల్లునిఁ గాసక తల్లడిల్లు నీ
మనముకలంకఁ దీర్చు టది మాపని నీకు విచారమేటికిన్? 276

మ. హరతుల్యుఁడగు యాజ్ఞవల్క్యకృప వేదాంతార్థముల్ గాంచి ని
ర్భర విజ్ఞానకళానిరూఢిఁ బరమబ్రహ్మానుసంధాన బం
ధురకౌతూహలభవ్యదుగ్ధమయపాథోరాశి నోలాడు నీ
కరయం దాదృశఖేదమోదములు లోకాచారముల్ భూవరా! 277

వ. అనునయ్యవసరంబున లక్ష్మణుండు జనాంతికంబుగా రామభద్రు నుద్దేశించి యస్మద్దేశికుం డగుకౌశికుం డేమహామహుచరిత్రం బతులితాపరిమేయవిచిత్రపాత్రంబని యనవరతంబు వక్కాణించుచుండు నమ్మహాబాహుండగు వైదేహుం డీతండకదా! యనిన నతండును బ్రమోదానురాగభరితుండై వత్స! వాజసనేయబ్రాహ్మణంబున కధికారియగు మహాపురుషుం డితండ సమ్మతాంతేవాసియగు నిమ్మహాత్మునకు యాజ్ఞవల్క్యుండు శుక్లయజుర్వేదంబు నుపదేశించె ననియె నప్పుడవ్విశ్వామిత్రుండు క్షణమాత్రంబు విమర్శించి యతని కిట్లనియె. 278

చ. యతికులజైత్రలీలుఁ దగునాత్మగురుం దగయాజ్ఞవల్క్యునిన్
శతదశగోధనం బొసఁగి సమ్మతుఁ జేసినవాని నాయహ
ర్పతికిఁ బ్రశిష్యుఁడైన జనపాలకులాగ్రణి నాతిథేయు న
ప్రతిముని నివ్విదేహుఁ గనుభాగ్యము చేకురె మాకునియ్యెడన్. 279

ఉ. నావుఁడు మౌనిఁజూచి నరనాయకుఁ డిట్లను నైగమార్థమే
ధావిభవంబు నప్పరమతత్వవిబోధము మీయధీన మ
య్యా విను యాజ్ఞవల్క్యునికటాధ్యయనం బనుమాట యొక్కటే
కేవలమున్ మదీయ యగు కీర్తిపతాక యగున్ జగంబునన్. 280

గీ. యాజ్ఞవల్క్యజనకులగు మీస్వరూపంబు
దెలియ మునులకైన నలవి యగునె?
తగుప్రవాహనిత్యులగు మిమ్మధికరించి
వేయుశాఖ లమరు వేదములకు. 281

క. అనఁ గౌశికుఁ గని గౌతమ
తనయుం డిట్లనియె నిట్టిధన్యులెకారా
ఘన భువనత్రయ మహనీ
య నవప్రతిభాఢ్యులై నయాఢ్యులు జగతిన్. 282

చ. అన జననాథమౌళి వినయమ్మున నమ్మునిఁజూచి పల్కెనో
యనఘ! యఘాపహంబులు మహాగమతుల్యము లైనయట్టి నీ
వినుతవచోవిశేషములు వేడ్కమెయిన్ వినఁగోరు నామనం
బనయము నొందుచున్నవి మదర్థములై తగు నర్థవాదముల్. 283

గీ. కానఁ జాలింపవలయు నోమౌనిచంద్ర!
యనుచు నంజలి నిజశిరంబున ఘటింప

మానవేంద్రలలామ! నీమాట వింటి
ననుచు దోయిలి విడిపించి యతనిఁ గాంచి. 284

క. "శంకర చాపారోప వి
శంకట చాతుర్యధుర్య జామాతృనిరా
టంకాయమాన మానిత
సంకల్పోద్భవ" యటంచు జటి దీవించెన్. 285

గీ. అట్టు లాశీర్వదించుసంయమివరేణ్యుఁ
డలర నప్పార్థివుండు మహాత్మ! భవద
నుగ్రహంబున నేను ధన్యుండ నైతి
నని సుధాబిందు బృందముల్ చినుక ననియె. 286

చ. అనువెడ లక్ష్మణుండు దన రహస్యముగ రఘురాముతోడ "ని
మ్మునిసమవాయ మొండొరులు మెరముతో నిజపౌరుషోన్నతుల్
వినుతి యొనర్చుచున్న యది వింటివె" నా సహజన్ముతోడ న
య్యనఘుఁడు పల్కె నీపనిన యర్థము నిక్కము సుమ్ము దెల్లసన్. 287

గీ. వీర లిందఱు లోకోపకారమునకు
శ్రుతులు స్మరియింత్రు, వీరిసన్నుతు లొనర్చి
ఖ్యాతిఁ గందుము, వీరలయధికమహిమ
వీరలె యెఱుంగుదురు మనకెఱుఁగఁ దరమె? 288

వ. అనియె నప్పుడు సీరధ్వజమహీదారుం డగ్గాధికుమారున కిట్లనియె. 289

శా. సామామ్నాయసమస్త ఋక్పటలికాసంవాద ముద్యద్యజు
స్స్తోమాకాంక్షితనీవి నాఁదనరి యెచ్చో సజ్జనాభీష్టముల్
సేమంబొప్ప ఘటించు తావకమహాశీర్వాద మోసంయమి
స్వామీ! మామకపుత్రికిన్ వరుఁ బురోవర్తింబలెం దెల్పెడిన్. 290

క. ఇంచుకవడి నతఁడు విచా
రించి మదిందెలిసికొన్న రీతిఁ బ్రమోద
ప్రాంచన్ముఖుఁడై సంయమి
పంచాస్యునిఁ జూచి చతురభణితింబలికెన్. 295

సీ. ఏరాజుకీర్తి లోకైకజాంఘిక యయు
చ్ఛలమున విహరించు సంతతంబు
నేధరాధిపుఁ డశ్వమేధదక్షిణఁజేసెఁ
జతురబ్ధిపరివృతక్ష్మాతలంబు
నేగహ్వరీనాథయాగంబునకు నశే
షామృతాంధోవర్గ మతిథికోటి
యేనృపుపుత్రకామేష్టికి నిందిరా
పతి తాన ఫలమండు ఫలము నయ్యె

గీ. నట్టిదశరథభూపాలునాత్మభవులు
రామలక్ష్మణులనువారె యీమహాత్ము
లేతదీయపరాక్రమఖ్యాతి యనఘ!
విందు మనిశంబు వీనులవిందుగాగ. 296

చ. సురుచిరతాటకామథనశోభనవాంఛ మహాస్త్రశస్త్రముల్
నిరుపమలీల మీ రొసఁగ నేర్చి సమున్నతిఁబేర్చి తావకా
ధ్వరపరిరక్షణంబు గురుదక్షిణఁజేయరె దిక్తటీవిక
స్వరతరనూత్నకీర్తిహరిచందను లీరఘురాజనందనుల్. 297

గీ. వీరు జగదేకవీరులు వీరిలోన
రాముఁడెవ్వఁడు లక్ష్మణనాముఁడెవ్వఁ
డానతిమ్మన నిట్లను ననుపమోక్తి
మాధురీ సాధురీతి నగ్గాధిసూతి. 298

మ. ప్రకటశ్రీ విలసిల్లు ధామధిగోత్ర క్షత్రసంతాన వ
ల్లికకున్ వాడనిపూవుబంతులక్రియన్ లీలం జనించెంగుమా
రకవర్గంబు తదగ్రజుం డితఁడు జాగ్రత్తాటకాకాళరా
త్రికిఁ బ్రత్యూషము రామచంద్రుఁడు గుణస్తేమాభిసాంద్రుండనన్. 299

క. విని లక్ష్మణుఁడో యిటఁడనిని
మనమున నమ్ముని వసిష్ఠమహనీయతపో
ఘనతరమహిమను మహ మను
మనువంశము మిగుల సంభ్రమంబునఁ బొదలెన్. 300

వ. అనునంత నమ్మిథిలావల్లభుండమ్మునితల్లజంబులసల్లాపంబు లా
కర్ణించి సవినయంబుగా విశ్వామిత్రుంగనుంగొని మహాత్మా యీ
దృశప్రజాసమాజంబుతో నీయోజం గ్రీడించునీవు సాక్షాల్లక్ష్మీ
కళత్రుండవుగాక మునిమాత్రుండవే యని జగత్పవిత్రంబగు త
చ్చరిత్రంబుగ్గడించి యిట్లనియె. 301

మ. పురుహూతోగ్ర కఠోరహుంకృతి పరాభూత త్రిశంకుత్రపా
భర సంపాదితప్రజ్వలచ్చటులకోపజ్వాలి ముల్లోకముల్
వరుసన్ వేల్చు నినుం గనుంగొని జరావైక్లబ్యశీర్ణాక్షర
స్వరచాటూక్తుల నంతరాయ మల భాషాభర్త గావింపఁడే? 302

వ. కావున నీయట్టి మహానుభావునకు యాగంబునకు నన్యసహాయం
బపేక్షణీయంబగునే యన శతానందుం డన్నరేంద్రుం గటాక్షించి
నీవాక్యంబు నిక్కంబైనను దపోధనయూథంబునకుఁ గ్రోధంబు
దీక్షావిరోధంబుగాన మఖరక్షణంబునకు శూరుండగు క్షత్రియకు
మారుఁగోరుట యుచితంబనిన నమ్మాటలకు సమ్మతించి రామ
లక్ష్మణుల తెఱంగుఁ గనుంగొని యభంగురప్రమోదతరంగితాంత
రంగుండై మంతనంబున గౌతమతనూజున కారాజిట్లనియె. 303

ఉ. కౌశికమౌని రాకయు జగన్నుతబోధవిభూతిమించు మ
ద్దేశికు సన్నిధానము సతిప్రమదోత్సవిజేయు బ్రహ్మవి
ధ్యాశిథిలానుభూతియును నాత్మకొసంగ విదంవసుంధరా
ధీశకుమారకద్వయనిరీక్షణసౌఖ్యసితాంశ మేనియున్. 304

క. అనవిని యతఁడిట్లను నో
జనవర ! యేతత్కుమారసాక్షాత్కృతిచేఁ
గనుపట్టెడి రిదె నాకున్
మనమున సీతోర్మిళా కుమారీ మణులున్. 305

వ. అనిన విన్నరేందుండు శతానందువాక్యంబులకుఁ గృతానందుం
డై గాధినందనునకు రఘునందనులం జూపి యిట్లనియె. 306

ఉ. ప్రాయము లేక, భానుపతంగకులైకులమీతి కేవ ని
క్కాయము మూర్ధవైభవమయి, చరిత్ర మునగ్ర విక్రమా
మేయము, పిరిఁగన్గాని సమీహితరాజ్యముగాంచినట్లు గా
ధేయమునీంద్ర ! యీలోకము మదీయమనంబు ముదంబునొందెడున్. 307

క. నావుడుఁ జిఱునగవొలయఁగ
నావాచంయమివరేణ్యుఁ డనఘాత్మ ! బ్రమో
దావాప్తికి హేతువు ని
భావంబునె యడుగు మన నృపాలకుఁ డాత్మన్. 308

వ. కొండొక విచారించి యమ్మునియభిప్రాయం బెఱింగి సఖేదస్మితం
బుగా నిట్లనియె. 309

సీ. గోత్రైకకర్త యేగోత్రాకళత్రుల
కమితతేజోధారి తిమిరవైరి

కులగురుం డేనరేంద్రుల కనూనబ్రహ్మ
నిష్ఠావధాని వసిష్ఠమౌని
యాజన్మసిద్ధ మేరాజన్యుల కఖండ
జగదండపరిపూర్తి చారుకీర్తి
కేళిమందిర మేన్నృపాలకశ్రేణికి
సౌమనస్యఘనంబు మీమనంబు

గీ. వారు సంబంధయోగ్యులో వరమునీంద్ర!
యైనఁగానిమ్ము తద్బాంధవాంతరాయ
హేతు వేతన్మహాశల్య సేతు వనిన.
పార్థివుని జూచి నగుచు నప్పారికాంక్షి. 310

క. శ్రీరామునకు నశేష గు
ణారామునకుం దనూజ నర్పించుట కి
మ్మేరుశరాసనచాపన
మారోపణ మంతరాయమగునె నరేంద్రా! 311

క. ఇదియెంత! యీవిచారము
మదినుంచకు, మను మునీంద్రు మాటలకర్థం
బిది యది యనుచుం దెలియక
యెద సందియ మొదవ నప్పు డేకాంతమునన్. 312

ఉ. గౌతమసూతికి న్స్వప్రతిభామణి యుల్లసు వంటిపే ధరి
త్రీతనయావివాహసముదీరిత ఘోరశరార్థ వైభవం
బీతఁ డెఱింగియుం బలికె నీగతి నింపుల కర్థనిర్ణయం
బీతఁడె కానలేక యిదె యెంతయు నుల్లము తల్లడిల్లెడున్. 313

ఉ. ఓయనఘాత్మ! నిర్భరతరోగ్రతపోమహనీయశక్తి గా
ధేయుఁ డుదారమారహరదివ్యశరాసనరాజముం దృణ

ప్రాయముఁ జేసి లీలమెయి బాలకుఁ డెక్కిడునట్లుచేయునో ;
యీయెడ మత్ప్రతిజ్ఞ యెడయించునొ ; నావిని మౌనియిట్లనున్. 314

ఉ. ఎక్కిడిమాట లోవసుమతీశ్వర ; యీశ్వరదివ్యచాపమున్
దక్కదుపాటవంబు భువనప్రథితంబగునీప్రతిజ్ఞయున్
జిక్కదు నిక్క; మింకొకటిసెప్పెద నప్రతిమప్రభావుఁడై
దిక్కులమించు రామవిభుతేజ మలౌకిక మివ్వసుంధరన్. 315

క. అనవిని జనకుఁడు కౌశికు
గనుఁగొని యోపారికాంక్షికంఠీరవ ; మీ
యనుపమ గంభీరోక్తుల
కనయము నూహించి కాన మర్థంబనుడున్. 316

గీ. మౌని నవ్వుచు జనకభూజానిఁజూచి
యనఘః యటులేనిఁ జూపుఁ డాహవ్యవాహ
లోచనోద్భటచాప మీరాచపట్టి
కితఁడ తద్వ్యాఖ్య సేయు, వేయేలయనియె. 317

వ. అనినవిని డెందంబున నానందంబుకందళింప రఘునందనుం డా
త్మగతంబున. 318

సీ. సమకూరు టెన్నఁడో జానకీజితకుంభ
కుచకుంభపరిరంభగుంభనంబు
చేకూడు టెన్నఁడో సీతావధూసుధా
మధురాధరాస్వాదమంగళంబు
సిద్ధించు టెన్నఁడో క్షితినందినీకటీ
తటపటీకర్షణోదారకేళి
యొనకూడు టెన్నఁడో యుర్వీసుతాకృతా
మితరతాంతనితాంత చతురిమంబు

గీ. అని యశీకమనోరథ వ్యాప్తి నలరు
నాయభీష్టంబు పూరింప నీయతీంద్రుఁ
డడిగెఁ జండీశకోదండ మని చెలంగి
జనకుచందంబుగాంచి యయ్యినకులుండు. 319

శా. పాపం బెక్కడ ! దేవదానవదురాపంబైన యేతన్మహా
చాపం బెక్కడ ! నంచు నెమ్మది నుపేక్షాబుద్ధిగావించునో
భూపాలుం డటుగాక గాధిసుతుఁ డాప్తుండంచు నిచ్చో దురా
క్షేపంబుల్ వలుకంగఁబోక యిపు డంగీకారముంజేయునో ! 320

వ. అని వితర్కించునప్పు డప్పుడమిఱేడు వేడిసిట్టూర్పునిగుడించి, కౌశికుంగాంచి, మహాత్మా ! మహీకన్య నసన్యసామాన్యచరితుం డగు రఘుపుత్రున కర్పించి భవదనుగ్రహంబుగాంచి వర్తించు భాగ్యంబెక్కడ ! నేనెక్కడ ! నని ముక్కంటివింటిదిక్కుం జూపి యిట్లనియె. 321

మ. నగవిధ్వంసనువిల్ జగత్త్రితయసంత్రాణవ్రతోద్యాపనం
బగుటన్ రోహితమయ్యె నేన్నృపులచాపారూఢి, నిమ్మేటిరా
మగ లూహింతురు దీనిఁగన్గొని మదిన్ మౌర్వీకిణశ్యామికా
మృగనాభిస్ఫుటగంధగంధిలభుజశ్రేణుల్ నిరర్థంబుగన్. 322

వ. అనిన నమ్ముని జనకమహీజానిం గనుంగొని నీవనన్యసామాన్య పుణ్యరాశి విల్లేలయుధన్యంమన్యుండ వయ్యెదవని వెండియు. 323

ఉ. ఓరజనీకరాన్వయనృపోత్తమ ! తాదృశభాగ్యలక్ష్మి చే
కూరెడు నీకు, మాకు నొడఁగూడెడుఁ గన్గొనఁ దన్మహోత్సవం,
బారసిచూడ, విశ్వభువనాథయదానచణుల్ నృపాగ్రణుల్
ధారుణి నెందఱున్న గుణధాముని రామునిఁ బోలనేర్తురే? 324

వ. అనిన నన్నరేంద్రుం డాజటాధరేంద్రుం గనుఁగొని మహాత్మా!
మణిమంత్రౌషధాదిప్రభావంబునుంబోలె రఘుకులడింభా
నుభావం బప్రమేయంబగు నైన నస్మద్గురునామధేయంబగు గిరీశశ
రాసనంబు తెఱం గెఱింగించుటకు వెంపెయు నిట్లనియె. 325

సీ. ఏకార్ముకంబున కిందుకోటీరుండు
దక్షాధ్వరధ్వంసి ధన్వియయ్యె
నేశరాసనమున కిందిరారమణుండు
కుంభినీధవుఁ డంపకోలయయ్యె
నేధనుర్లతకు నంభోధరాధ్వచరంబు
రక్షఃపురౌఘంబు లక్ష్యమయ్యె
నేచాపమున కబ్జలోచనోన్నతశయ్య
దర్వీకరస్వామి మౌర్వియయ్యె

గీ. నట్టిమహనీయకోదండ మఖిలవిబుధ
నికరతేజఃప్రచండ ముస్పృద్రభువన
జయసముద్దండ మద్భుతోచ్ఛ్రయకరండ
మహహ! శక్యంబె తన్మహామహిమఁ బొగడ? 326

ఆ. అన శతానందుఁ డిట్లను నధిప! యింకఁ
జాలుచాలు పినాకప్రశస్తికథలు
కౌశికునిమాట నిక్కంబుగాఁ దలంపు
మనఘుఁ డీరామునకు నసాధ్యంబుగలదె? 327

ఉ. కోటి నిశాటహోమమునకున్ విహితోద్యముఁడై తపోవనీ
వాటమునం బ్రతాపహుతవాహసమింధనసామిధేనిగాఁ
దాటకఁ జేసినట్టి సముదగ్రపరాక్రమశాలికి న్నిరా
ఘాటమగుం జయంబు దశకంఠముఖుల్ గలహించిరేనియున్. 328

సీ. అనిపల్కుచున్నచో నచ్చోటి కొక్కఁడౌ
వారికుం డొక్కింత చేరఁబోయి
దేవ ! జనకధాత్రీనాథ ! యలపంక్తి
గళపురోహితుఁడు కౌశికుఁడు మిమ్ముఁ
గొడఁగనవచ్చి యిప్పుడు హజారంబున
నున్నవాఁ డన నతఁడూరకున్న
నేతెంచుఁగాక రానిత్తునె గౌతమా
త్మజుఁడు పల్కిన వాఁడు నగుచు ననియె

గీ. సంతసిల్లిన శ్రీరాముఁ డనుజుఁ జూచి
యసమరూపప్రతీపచాపాధిరోప
ణోత్సవంబున కెపఁజేసె నోపవార !
యకట విధివాత నిపు డడ్డు రాకుమ్మ రాక. 329

తరల. అనిన లేనగ వాననంబున సంకోచింపగ లక్ష్మణుం
డనఘ యీ కనిరాతచే నెడయైన పేశధనుర్ధ్వరో
కనమహోత్సవమాత్రమే యన గౌసలేయుఁడు తమ్మునిం
బ్రణయకోపదరస్మితాంచితపాంగదృష్టిఁ గనుంగొనెన్. 330

వ. తదనంతరంబ కౌశికుండు దౌవారికుం డనుప ననుపమచి
రత్న రత్ననికరసంతురాంతరంబులగు కొన్ని కక్ష్యాంతరంబు లతి
క్రమించి చనిచని తత్పురోభాగంబునఁ బద్మరాగప్రభావిభాసమా
నదశదిశావాటంబగు కొలువుకూటంబుఁ గనుంగొని యచ్చట
నున్నవారి వేర్వేరం బరికించి కటకటా! మాతృకజనవిశ్వామిత్రుండగు
విశ్వామిత్రుండు జనకశతానందులతోడంగూడి యీ యెడన యున్న
వాఁ డుండుగాక యిప్పురాతునివలన మాకునయ్యెడునది
యెయ్యేది యని మదిం దలంచి యక్కెలంకుల నకలంక తేజులగు
రఘుతనూజులం గాంచి మనోజ్ఞాకారులగు నీక్షత్రియ బ్రహ్మచారు
లెవ్వరొకో యని వెండియు నతం డద్దారకుల దేరకొనం జూచుచు.

క. మౌంజీదండ ప్రముఖ
వ్యంజనముల శాంతరసము వరపుణ్యశ్రీ
రంజితులగు వీరలయెడ
నంజక వీరోపకరణమైకనుపట్టెన్. 332

క. నిగమత్రయంబు చెంగట
దగు విధిమంత్రాహుతుల నధర్వమునా ని
మ్ముగురికడన్ సహజోన్నత
మగు నివ్వటుయుగము మిగుల నందంబయ్యెన్. 333

వ. అని కొండొక విచారించి. 334

ఆ. అవరజద్వితీయుఁడగు రామహతకుండు
వీఁడు గాధిసుతునివెంట నిచటి
కరుగుదేరఁబోలు నని, యంతఁదాటక
పాటుఁ దలఁచి మనముపరితపింప. 335

ఆ. హాసుకేతుపుత్రి: యక్కజంబగు నీదు
లావుఁ బెంపు దక్క దైవవశత
నొక్కనరునివలన నుక్కడఁగితివెటు
తగరు దాకఁ గొండ వగిలినట్లు. 336

గీ. బడుగుఁదపసి కొన్ని వెడముల్కులొసఁగినఁ
గొప్పుదప్పి బ్రహ్మకొడుకుఁబోలె
నకట వీఁడు చూడు మనరణ్యకులుఁడయ్యు
నొళ్లెఱుంగ కింతత్రుళ్లిపడియె. 337

క. సుందాసురసుతశోణిత
తుందిలశరధుర్యుఁడగుచు ద్రోహమితఁ డౌన

ర్చెఁ దశకంఠకుటుంబము
నం దీకౌశికసుఖ[ప్రి]యాబాంధవ్యుఁడై. 338

క. అగుగాఁక వీనిబాహా
యుగయుగళోదగ్రబలమహోద్ధతిఁ జూడం
దగు ననుకొని సీరధ్వజ
జగతీపతి కొలువుఁజేరి సవినయఫణితిన్. 339

వ. అవ్వసుంధరాధీశుఁ గుశలంబడిగి తన్నిదేశంబున సవిధ దేశంబునం గూరుచున్న సురాహితపురోతుంగనుంగొని యమ్మహీరమణుండు మహాత్మా! మీయామినీచరగ్రామణికి సేమంబకదా యని వెండియు నిట్లనియె. 340

క. ఆపద లెడలింప నధ
ర్మోపాయవిదుల్ మహామహులు మీరుండన్
మీపంక్తిముఖునిశుభములు
ప్రాపించుట యడుగనేల యదిసందియమే! 341

క. నావుఁడు నగి యతఁ డవ్వసు
ధావరునకు ననియె నాపదలుగీపదలున్
రావణునకుఁ గలిగినఁగద
భూవర! మావేదమంత్రములు గింత్రములున్. 342

సీ. సవరించె నెవ్వాఁడు జయలక్ష్మిఁ బటుభుజా
ప్రగ్రీవసుభగసౌధాగ్రసీమ
నొనరించె నెవ్వాఁడు పెన్నుదోవ ఫణిలోక
జయకాంక్ష గోచరశైలమైత్రి
కనుపట్టెఁ డెవ్వాఁడు కదనరంగంబున
బలభేదివెన్ను కన్నులకుఁదక్క
సమకూర్చు నెవ్వాఁడు చటులకౌక్షేయక
క్షతిముఖంబులకు లేజవ్వనంబు

గీ. నొసఁగె నెవ్వాఁడు కీర్తికిం బెసఁగుఁ దావి
యతనుహరసఖ పుష్పకాహరణకేళి
నట్టిదశకంఠునకుఁ ద్రిలోకాధిరాజ్య
బట్టభద్రున కాపదల్ వుట్టునెట్లు? 343

క. అని దశకంధరుమహిమన్
జనకునితో నుగ్గడించుశౌష్కలుమాటల్
విని నగుచు సుమిత్రానం
దనుఁ డగ్రజుఁజూచి మంతనంబునఁబలికెన్. 344

సీ. కోడిగంబులు సేసి కోనంగియాటకు
దిద్దరే తెలిదీవి ముద్దరాండ్రు?
మొలకు వాలము సుట్టి మున్నీటిపెన్నీట
నీత నేర్పఁడె నిర్జరేంద్రసూతి?
తనబందిగమునకు మనుఁగాపు సేయఁడే
విక్రమోన్నతిఁ గార్తవీర్యనృపతి?
కడికడి కొకకుప్పిగంతు వేయించరే
చేరి దైత్యేంద్రదాసీజనములు?

గీ. తింద్రచెడి యిట్లుమఱియుఁ బెక్కండ్రచేత
భంగపడినట్టి రావణు బంటుతనము
లుగ్గడింపుచునున్నాఁడు సిగ్గులేక
కటకటా! పూని యీవైదికబ్రధాని. 345

క. నావుఁడు రఘుపతి విను వ
త్సా! వలదిట్లాడ వాలి హైహయపంక్తి
గ్రీవు లుదారులు వారల
లో వారికి హెచ్చుగుందులును లేవెన్నన్. 346

ఉ. వాలికిఁ గార్తవీర్యనృపవర్యునకున్ రణభూమి నొక్కచోఁ
దూలినమాత్ర పంక్తిముఖు దోర్మహిమంబునకుం గొఱంతయే?
కేళివిలాన కంఠతను కీకసమాంసము లేతదంసముల్
శూలి ప్రమోదశాలియగుచుం దుకుచుం గజచర్మశాటికన్. 347

శా. ఆ రాత్రించరభర్త శక్రపవిధారాధఃక్రియానిర్భర
స్వారాజ్యానుభవం బెసంగ వివిధాస్థానీ సమాటీకన
స్వైరక్రీడలడంచి చంచలరమాశాతోదరి న్నిల్పె దు
ర్వారస్ఫూర్తిఁదలిర్పఁగా నిజభుజప్రాసాదమధ్యంబునన్. 348

క. అని రాముఁడనియె నంతట
జనకుఁడు శౌష్కలునిజూచి సత్యంబగు నో
యనఘాత్మ! యెంతపొగడినఁ
జనుఁజను దశకంధరుండు సామాన్యుఁడే? 349

వ. అనినవిని శౌష్కలుండిట్లనియె. 350

చ. ఉడుపతిమౌళి మెచ్చ విహితోదితమస్తకుఁడై వరాప్తికిం
గడఁగెడు నేమహాత్ముని ముఖంబులు దైన్యపరాఙ్ముఖంబులై
యడుగుమటన్న నివడుగుమంచు వెతం బొరి చూపులాడుచుం
గడుజగడించు నట్టిదశకంధరునిం గొనియాడశక్యమే? 351

సీ. అభిమానశాలియౌ నాపులస్త్యాయన
మౌళి నన్ను ధరాకుమారి నడుగ
భూనాథ! గౌతమమౌని పౌరోహిత్య
మహిమచే మను నీదుమందిరమున
కనిచినాఁడన, గాధితనయుఁ డమ్మాటలు
గీటునఁబుచ్చుచు క్షితితలేశ!

పరికించితే రాము హరశరాసనదిదృ
క్షామోదసత్వరస్వాంతు ననిన

సీ. జనకుఁడిట్లను దేవః మీమనసువచ్చి
నట్లొనర్పక తగునయ్య యిట్లుపలుకః
రఘుకులీనులు నిమివంశరాజవరులు
భవదధీనుల కారె తాపసవరేణ్య ! 352

గ. అనిన శౌష్కలుఁడనియె నోజనకరాజః
రాజ్ఞసంబునఁ బ్రత్యుత్తరంబు నీవు,
కటకటాః మామకోక్తి యాకాశవచన
మనియొః మఱి దుష్పరిచ్ఛేదమనియొః చెపుమః 353

ఉ. ఈవలయుం గుమారి నిపుడెవ్వరికేనియు, నిట్టిచోఁ ద్రిలో
కీవిజయైకతానుఁ డడిగెం దశకంధరుఁ, డందుకీయకో
కీవిధి నూరకుండఁదగవేః తగవేదిః భవచ్చరిత్ర ధా
త్రీవరః సాత్వికంబని మరీచిముఖుల్ వొగడన్ వినంబడున్. 354

సీ. అనిన నవ్వి గౌతమాత్మజుండను నోయి
విప్రః నీకుఁ బెద్ద విన్నపంబు,
కాని జనకభూమిజాని ప్రత్యుత్తరం
బిచ్చినాఁడు నీవు వచ్చినపుడ. 355

గ. అనుఁడు విప్రుఁడు రాజకన్యాసమర్ప
ణంబుదక్కఁగఁ బ్రత్యుత్తరంబుమాట
నిక్కమేనియు నదియెద్ది యొక్కమాటు
వింద మనిపల్క నాశతానందుఁడనియె. 356

క. శూలాయుధ కోదండము
హేలాగతి నెక్కువెట్టి యెవ్వఁడు వేడ్కం
దేలించు మమ్ము, నతనికి
బాలామణి సీత పూర్ణపాత్రం బనఘా! 357

గీ. అనిన శౌష్కలుఁ డమ్మాట కదరిపడుచు,
మాటికి "నమశ్శివాయ నమశ్శివాయ"
యనుచు వీనులు వెసమూసికొనుచుఁ బలికె
నీతి మెఱయంగ గౌతమసూతితోడ. 358

చ. ఇటు పలుకంగ నీకుఁ జనునే మునిచంద్ర! యభంగురాంగుళీ
పటలనిమృష్ట యక్షగిరిబాధరవానుపదోక్తి విక్రమో
ద్భట భుజదండమండితుఁడు పంక్తిముఖుం డొనరింపఁ బూనునే?
కటకట! వీరశాంభవ శిఖామణి, యిట్టి యనార్యకృత్యముల్. 359

ఉ. నావుఁడు గౌతమాత్మజుఁడు నవ్వుచు నిట్లను సూనృతప్రతి
జ్ఞావిభవుండు క్షత్రకులసత్తముఁ డీతఁడు, పంక్తికంఠుఁడున్
శైవుఁడు గాన నెక్కిడఁడు చంద్రకళాధరుచాప, మిందు కో
హో! వివరింపనేటికిఁ దదుత్తర సీమ యెఱుంగఁగాఁ దగున్. 360

గీ. అనుఁడు నవ్వుచు శౌష్కలుండనియె నలువ
కంగిరసుఁడు బృహస్పతుండు నాత్మభవులు
గానఁ బౌలస్త్యునెడ నసూయానువృత్తి
యాంగిరస! నీవు దాయాదివౌట నొక్కొ! 361

వ. అని యప్పాకశాసనపురోహితుం డాగ్రహతిరోహితుండయి వైదేహిం
దలంచి యిట్లనియె. 362

గీ. పరమశైవశిఖామణి పంక్తిముఖుఁడు
జమ్మదూలమ్ము లన్య రాజన్యకోటు
లజగవారోపణము శుల్క మట్లుగాన
నెట్టులున్నదొ నీపూజ యిఁక మహీజ! 363

వ. అనిన విని డెందంబునం గ్రోధశోకంబులు గందళింప శతానం
దుండు శౌష్కలుం గనుంగొని త్రిపురనిశాటఝాటతాటంకినీ
కర్ణపూర ఖారపరిహార క్రియాదక్షదక్షుండగు నీలగళుని శయ
శయాళువగు నీచాపం బారాధ్యరూపంబగుట నిక్కంబు, త్రైకశితన
యునకు వినయ విశ్వాస భక్తిరసావేశంబు లొదవం బాశుపత
మంత్రోపదేశం బొనర్పంబోలుఁ గాకయున్న నఖర్వగర్వధూర్వహ
స్వభావుండగు మీ దశగ్రీవుండు శైవుండగునే యని కొండొక
నవ్వి వెండియు నిట్లనియె. 364

గీ. హరున కాధారభూతమౌ నమ్మహాద్రి
తొల్లి భుజకౌతుకంబునఁ బెల్లగించి
యతని ధనువెక్కుబెట్టుమటన్న నహహ
శైవుఁడయ్యెనె నేడు మీ రావణుండు? 365

క. అని యీగతిఁ గేరడములు
జనకపురోహితుఁడు పలుక శౌష్కలుఁ డొకరుం
డును దక్కఁగ, నొండొరులను
గనుఁగొని నగిరందఱును బకాపకయనుచున్. 366

వ. అంత. 367

ఉ. గౌతమసూతి రాఘవుని గన్గొని యో జగదేకవిక్రమో
ద్ధూతనిశాట! యీధనువు ధూర్జటి హస్తవిభూతిరూషిత

జ్యాతత మింకనెక్కిడుము శౌర్యమదాంధులకున్ ధనుర్గుణా
ఘాత భుజాప్రభూతకిణకాళిమ మోములఁ జౌకళింపఁగన్. 368

సీ. అన విని శౌష్కలుం డాగ్రహంబునఁ బల్కె
నోరిశతానంద! యూరకిట్లు
దేవయోగ్యంబైన జీవరత్నముఁ ద్రోచి
జేగురుగై కొన్న చెనఁటికరణి
వెఱ్ఱివై పౌలస్త్యు విడనాడెదేమిరా?
మనుజకీటంబుపై మమతఁ జేసి
గౌతమమునిచంద్రుఁ గనుబ్రామి వెసవఁజి
క్కై అటుఁదదె సీ కన్నతల్లి

గీ. యా యహల్యకుఁ బుట్టినయట్టి నీకుఁ
దలఁప వేఱొకగుణమేల కలుగనేర్చుఁ
"దల్లి బడిపిల్ల" యనుమాట యెల్లజనులు
పలుకుదురకాదె లోకటిపాటగాఁగ. 369

క. అన గౌతమసుతుఁ డాగ్రహ
మెనయగఁ "నేమంటి వోరి యేమంటివిరా
తనువెఱుఁగవు నాముందట"
నని లేచిన గాధిసూతి యనునయ మెసగన్. 370

గీ. వలదు మనయింటి కతిథియైవచ్చినట్టి
శౌష్కలునితోడ నేటికి శుష్కకలహ
మని నివారించి, యాత్మలో నలరుచున్న
దాశరథిఁ జూచి నగుచు నక్కౌశికుండు. 371

చ. అనఘచరిత్ర! ఓరరఘుకులాంబుధిపూర్ణనిశాకళత్ర! ఈ
జనకపురోహితుండు పురసంహరచాపగృహోపసర్పణం
బనుమతిసేసె నీ కనిన నాత్మఁజెలంగి "మహాప్రసాదమం"
చనుజుఁడుఁ దాను నేగె వినయంబును సిగ్గును సందడింపఁగన్. 372

వ. అంత నాశౌష్కలుండు సీరధ్వజుంగనుంగొని దశగ్రీవప్రభావం
బుగ్గడించుచు నిట్లనియె. 373

క. హర పూజార్థము దశకం
ధరుఁ డొకనాఁ డోనృపాల! తనదుశిరంబుల్
వరుసం దొమ్మిది కరభీ
కరతర తరవారిధార ఖండిఁచుటయున్. 374

చ. పశుపతి యమ్మహాద్భుతసపర్యకు మెచ్చి మదిన్ వరంబుఁదా
ద్భుత భయదక్రియాసమర మొద్దికఁ గానక దానపూనఁ ద
త్స్వశమన మాచరింపఁ బరిహాటి జగత్త్రయి వేడెనద్ది య
ద్దశమశిరంబె యర్థియట తావకభాగ్యముఁ జెప్పశక్యమే ? 375

గీ. అన శతానందుఁ డమ్మాట జనకవిభుని
చెవులఁబడసేక కోదండ భజనసవిధ
వివిధ లోకాద్భుతక్రియాస్ఫీతుఁడైన
రాఘవుని జూపి యను, సనురాగమెసఁగ. 376

చ. శివునకు నింపుసేసె ఘను శింజినియై తెగనింపఁదీసినన్
శ్రవణవతంసమై విడివిడం గవకంకణమై ఫణాధర
ప్రవరుఁ డనన్యధన్విసులభంబగు నేవిలుఁజేరి యట్టి భా
ర్గవగురుచాప మెక్కిడియెఁ గంటివె రాము గుణాభిరామునిన్. 377

వ. అను నయ్యవసరంబున. 378

సీ. బధిరత్వ మొనరించె భాషానితంబినీ
 ప్రాణేశు నెనిమిదివీనులకును
కబళీకరించె దాక్షాయణీరమణీమ
 నోహరు నెనిమిది దేహములను
నార్భటింపఁగఁ జేసె నందంద బహుగుహా
 కోటిచే నెనిమిది కులనగముల
చెవుడు గల్పించె నక్షిద్వయంబున మహో
 ద్భుతముగ నెనిమిది భుజగములకుఁ

గీ. గిలుకొల్పె నిరంతరాందోళనంబు
మిక్కుటంబుగ నెనిమిది దిక్కులకును
లక్ష్మణాగ్రజ భుజ సిద్ధశస్త్రమహోక్ష
వాహ కోదండదండ కోలాహలంబు. 379

క. పటుతరగతి నిట్లొదవిన
పటపటరవ మాలకించి పార్థివుఁ డయ్యో!
నిటలాక్షుని విలు విఱిగెనె
కటకట! యని వగచె నరుమఁ గౌతుక మదరన్ 380

మ. క్షితిదేవప్రకరాననాంబుజములన్ సీతావివాహోత్సవ
ప్రతిమంత్రావళియై, వధూముఖములన్ 'శోభానె'యై. మింట నా
యతరక్షోహతికై యుపశ్రుతిశతంబై తోఁచెఁ, దద్రామదోః
ప్రతిభాకృష్టత్రుటద్వృషధ్వజ ధనుర్దంభోళి నిర్ధ్వానముల్ 381

వ. ఆసమయంబున నాసురభూసురుండు విషాదాద్భుతంబులు పెనం
గొన నాత్మగతంబున 382

గీ. ఫెల్లుమని శాంబరీభిల్లు విల్లు విఱచి
సర్వకర్మిణ శౌర్యోష్మ నుర్వినించె;
నౌర! యత్యద్భుతముగ నిబ్బేరజంపు
రాచమిఱుగురు తను జనుల్ జూచిపొగడ. 383

క. అని యడలుచుండె నయ్యెడ
జనకమహీధవుఁడు గాధిసంభవునకు వం
దన మాచరించి వాచా
ఘనచాతురిఁ బలికె నిటలఘటితాంజలియై. 384

గీ. సీత రఘురామగుణమణిక్రీతయయ్యె;
నన్వయాచారసరణి నే ననఘ! యింక
లక్ష్మణునకిత్తు నూర్మిళాపక్ష్మలాక్షి
ననిన, దరహాస మెసఁగ నమ్మునివరుండు. 385

క. భూనాథతిలక! నీకు శ
తానందున కెద్ది యుచిత మది సేయుఁ డనన్
మానవపతి వీనుల నే
మో నొడివి, యహల్యపట్టి మునిపతికనియెన్. 386

సీ. సంయమీశ్వర! మహేశ్వరచాప మెక్కిడె
మీ రాఘవుం డను మేలివార్త
మొదటఁ జెప్పినవాఁడఁగద నాకుఁ బారితో
షిక మెద్దియనినఁ గౌశికుఁడునవ్వి,
వత్స! శతానంద! వాంఛితంబెయ్యది
వినిపింపు మిచ్చెదనన నతండు
మా కుశధ్వజ రాజమణి తనూభవలగు
మాండవీశ్రుతికీర్తి మానినులకు

గీ. భరత శత్రుఘ్న నాముల భవ్యకీర్తి
కాములను వేఁడెద నటన్న గాధిసూతి
యలరి, నిఖిలంబు కర్తవ్య మనఘ ! యింక
సొంపుమైఁ బంక్తిరథుఁ బిల్వనంపు మనిన. 387

గీ. జనకభూపతి కుశికనందనుని జూచి
దేవ ! యుత్తరకోసలాధిపుని బిలువ
మనశతానందుఁ బంపుదమన నతండు
ప్రమదమున లేచి గాధిసంభవుని జూచి 388

గీ. అనఘ ! శుభ లేఖ వ్రాయింపుఁడన నతండు
వ్రాయసమువారిఁజూచి మీ రాజుపేర
దశరథాధీశ్వరునకు నుత్తరమువ్రాయుఁ
డన మనంబునఁ గౌతుకంబడర నతఁడు. 389

క. తెలిదంతపు టొంటిలోపలి
గిలకల గంటంబు కేలఁ గీలించినచో
లలనాపదమణినూపుర
కలనాద మెసంగ వ్రాసి గణగణఁ జదివెన్. 390

సీ. "శ్రీమన్మహారాజ శేఖరులగు జన
కేంద్రు లుత్తరకోసలేంద్రులైన
పంక్తిరథక్షమాపతివారి చాల్మను
ష్యలకు బుత్తెంచుఁ ప్రయోజనంబు,
జగదేకదేశికుండగు కౌశికుని యాజ్ఞఁ
దమరాఘవునకు సీతా మహిళను,
లక్ష్మణునకు నూర్మిళాకుమారిని, భర
తునకుమాండవిని, శత్రుఘ్ననకును

గీ. కుసుమసమమూర్తి శ్రుతకీర్తి నొసఁగినాము;
పరిణయమునకు సకుటుంబ బాంధవముగఁ
దాము దయచేయవలె నను దశరథేశ్వ
రులకుఁ జాలుమనుష్యులు దెలుపవలయు." 391

క. అని చదివి లేఖ యొసఁగినఁ
జనియెన్ గౌతముఁడు, యతియు జనపతియును ద
న్ననుప, మహోన్నతిమెఱయఁగ
ననుపమ పల్యంకికా సమారూఢుం డై 392

క. అంతఁ దపోధనరజనీ
కాంతుఁడు నతవిబుధనికరకమలవనీభా
స్వంతుఁడు తనకృతకృత్యత
కెంతయు హర్షించి యాత్మ నిట్లని తలఁచెన్. 393

శా. త్రుంచెన్ రాముఁ డనంగవైరిధనువుం గోదండలీలాహతిన్
డించెన్ ధాత్రిపవీరబాహుపటలీ సంబంధ ప్రతిజ్ఞాభరం
బించెన్ నామన శాణిపీఠనవిధాహేవాకలక్ష్మిన్ ప్రకా
శించెన్ మత్సఖమంత్రిమంత్రములు ఫలించె న్నేఁడు సూడీవనల్. 394

వ. అనివితర్కించుసమయంబున నిముఁడదనుంబాష్పరోధతిరోహితుండై
పౌరస్త్యపురోహితుండు విదేహదేశాధీశు నుద్దేశించి యిట్లనియె. 395

చ. తెలివిడదలిర్ప నీకుఁ దెకతేరఁగవచ్చిన కన్నె నిచ్చి య
త్యలఘుబలుం బులస్త్యకులు నద్దశకంఠరు నాదరింపఁగాఁ
దలఁపవ, పెద్దవయ్యు వసుధావర! బుద్ధిని చిన్నవైతి లో
కులకు, గుణప్రకర్షమునకున్ వయసుల్ తగుకారణంబులే? 396

క. అని కౌశికుఁజూచి తపో
ధనవర! యిపుడైనదేమి తాటకఁజంపిం
చిన నేరముఁ దీర్చికొనన్
వినుమా నీ కిదియవేళ నేర్పరివైనన్. 397

గీ. వెడగుబుద్ధుల నిఁకనైన విడిచిపెట్టి
జనకునకుఁజెప్పి జానకీచంద్రవదన
నసురనాధున కిప్పించి, యతసికీవు
చనవరివిగమ్ము త్రిజగములన్ సినుభజింప. 398

క. అనినఁ దదుక్తి కపజ్ఞా
భినయంబెనయం దపస్విబృందారకనా
ధునిగనుఁగొని జనకమహీ
జనపతి యిట్లనియెఁ బ్రమదసముదితమతియై. 399

వ మునీంద్రా! ధనుర్ధరంమన్య సామాన్య రాజన్యవరార్థ్య ప్రార్థ్య మాన జానకీకథాదోదూయమానంబగు మన్మానసంబు శ్రీరాముని నెమ్మోము జాబిల్లిసుల్లసిల్లు మొల్లంపువెన్నెలవెల్లివెల్లువం జల్లగాఁ జల్లు లాడినంగాని సేద దీరనేరదు. మిహిరకరనిచయపరిచయకృత దుర్నిరూపతాపభరంబగు కైరవోత్కరంబునకుఁ జెలువంపుఁ జలువంజిందు కలువవిందు పొందు దక్క వేఱొక్క వెజ్జు ముజ్జగంబులం గలుగునే? కావున నమ్మహాత్ము సమ్ముఖంబునకుం బోవుదమురమ్మని యమ్మునియుం దానునులేచినం జూచి దుష్కరక్లేశావేశంబున శౌష్కలుండాకసంబునఁ జూడ్కినిగుడించి "హా! విదేహనఁదని! యమంద సౌందర్యవతియగు నీయట్టియువతికిం గటకటా వికట నిజభుజాభవన భువనవిజయలక్ష్మీ సమారోహ మహోత్సవ ప్రభవదవిరళ ధవళరుచిచ్ఛటాజటాలవీక్షణ గ్రావుండగు నద్దశగ్రీవుండు వేడినం దద్వాల్లభ్యం బలభ్యం బయ్యనే" యని వగచి మరలనిట్లనియె. 400

క. సవతుఁగఁ ద్రిభువనలక్ష్మికి
సవతిగ రావణున కీఁడు జనకుఁడు, పరతం
త్రవునీవు, పుడమివెల్వడి
తివిగానం గాన నీదుతెగ, నెవ్వారిన్. 401

వ. అని కినుకయడర జనకుంగుఱిచి యిట్లనియె. 402

మ. వినవాయేమి ? పురాణ విక్రమకథావిఖ్యాతముల్ మాదశా
నను దంభోళికఠోరఘోర భుజదండంబుల్, దదీయస్మృతిం
దన గంధంబెడలం గనంబడు మిళింద్రశ్రేణికిం బాకశా
సనభద్రేభము నైజమాల్యపటలీ సాధారణప్రక్రియన్. 403

ఉ. అట్టి భుజావిభూతిఁ దగు నారజనీచరచక్రవర్తికిన్
బట్టినొసంగి మామవగుభాగ్యముఁ బొందక, యీగతిన్వృధా
కట్టడివౌటయొక్కటియ కాని, నరేశ్వర! యింకమీఁదఁ దా
నెట్టును సీత దానవకులేశ్వరు హస్తగృహీత యౌఁజుమీ! 404

క. అని రాముఁజేరి యోరీ
మనుజార్భక! చివికి పనికిమాలిన యీవి
ల్లునిమితి నని గర్వింపం
బనిలే దిల్లలికినంతఁ బండుగ యగునే ? 405

ఉ. యామవతీచరాగ్రణి, జితామర తామరసేక్షణామణీ
దామర వాతపోత వికసద్భుజమండల సార సౌరభో
ద్దాముఁ డ, శేషలోకజయధాముఁడెదంగదియించు జానకీ
రామను, బెండ్లి యాడకుమురా, మను నీతి మదిందలంచినన్. 406

క. శికఁబూలుసుట్టి యీకొ
శికసంయమిమాట లీవు చెవిఁబెట్టినచో

నకనకలు నీ కవశ్యము
ప్రకటిల్లును వీనికేమి బవనిఁడు సుమ్మీ! 407

క. అని నొారులు చంపకుండుదు
రనియకదా "బ్రాహ్మణోనహంతవ్య" యనన్
విని, మునుమున్నుగ సీబా
పనవాలగ మితఁడుపూనెఁ బార్థివుడయ్యెన్. 408

వ. అనిపల్కి తనమనంబునం గొండొకవిచారించి యయ్యసురమహీ
సురుం డిక్కార్యంబు లంకేశ్వరున కెఱింగిపవలయునని తలంచి, య
ప్పురంబు నిర్గమించి లంకానగరంబునకరిగి మతిమంతుండగు మాల్య
వంతుంగాంచి తత్పురస్సరంబుగా నిరంతర సురాపాన ఘూర్ణమాన
పూర్వగీర్వాణ సహస్ర సంకుల ప్రఘాణంబగు దశకంఠు దివాణం
బుసేరి, యథోచితంబుగాఁ దద్దర్శనంబు గాంచి తనపోయివచ్చిన
తెఱంగు విన్నవించిన, విన్నవాఁడై యద్దశముఖుండు శూర్పణఖం
బిలిపించి మిథిలావృత్తాంతం బరసిరమ్మని యంతఃపురఁబునకరిగె.
నంతమాల్యవంతుఁడు నిజనిశాంతంబున కేతించి భానుమంతుండ స్తమింపఁ
గాల్యకరణీయంబులు నిర్వర్తించి కృతాభ్యవహారుండై విహారమంది
రంబున విశ్రమించె. 409

మ. అమరేంద్రాహిత దుర్నివారతరఘోరాకార ! రాకారస
త్క్రమశీతాంశువిభావిలాసరసధా రాధార ! రాధారతా
సమకాండోగ్రవిఖండితాసురపురీసంచార ! సంచారక
ప్రమథీతాండవ తాండవత్రుటితతారావార ! వారాదరా ! 410

క. దుర్గాకుచదుర్గానిశ
మార్గదశోదగ్రసర్గ మహితవిసర్గా !

స్వర్గాపవర్గమార్గా
నర్గళసంసర్గ మార్గణన్మునివర్గా. 411

కందగర్భిత మణిగణనికరము :

భవహర శ్రితజనభవహర, రవితా
రవరశిఖినయన రజతధరణిభృ
ద్భవన భువననుత పరిహృత, సవనా
జవనతురగితవిశదవృష సగణా. 411

గద్య. ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్షవీక్షణ సమాసాదిత
సకలసామ్రాజ్యధౌరేయా క్రాంతవిశ్రాణనావధీరితరాధేయ
బిజ్జులకులకలశనిధాన కార్తికీనిశాకళత్ర వెన్నెళగోత్రప
విత్ర కృష్ణరాయమహీధవకుమార సంగరాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాల ప్రణీతంబైన యనర్ఘరాఘ
వంబను మహాకావ్యంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

# అనర్ఘరాఘవము

## తృతీయాశ్వాసము

క. శ్రీకర నానాథ క్రవ
శీకర ! దృప్యన్మహోగ్రసింధురపలభు
గ్భీకర ! నిర్జితసూకర !
ప్రాకటురీరామలింగ ! భసితసితాంగా ! 1

వ. అవధరింపు మవ్విధంబునసుఖనిద్ర సెంది యంతట. 2

సీ. నిలయభూరుహకోటి నెలుఁగిచ్చి యూర్ధ్వస్వ
రములాలకించు కాకములరవళి
ప్రేయోవిలోకన శ్రేయోనుమోదంబు
గను కోకయువతుల కలకలంబు
నాప్రభాతము మేఁతలాడి యాలంబ శా
ఖలు సేరు గబ్బిలంబుల రవంబు
దరదళత్పంకజోదర నిర్గమోత్సాహ
మెదఁబూచు గండుతుమ్మెదల రొదలు

గీ. నెనసి వైతాళికోక్తుల నినుమడింప
నలికిపడిలేచి కన్నులుపులుముకొనుచు
నావులించుచు నట్టాలకాగ్రమెక్కి
మాల్యవంతుండు ప్రత్యూషమహిమకలరి. 3

ఉ. ప్రీతిఘటించెఁజూడ్కులకుఁబెట్టుగనల్లదె భానుమన్నవ
జ్యోతి వియోగకోకయుగ యోగవిధాన నవీనచాతురీ
దూతి విదుప్రభాస్వపన దోహద వైభవశాలిడోలికా
గీతి దినావసాన శిఖికీలిత దీప్తికృతానుభూతియై. 4

మ. బళిరా ! వాసకసజ్జికన్ హరిదిశన్ భానుండు దిగ్వర్తతాఁ
గలయం దత్కిరణంబు లల్లవె రవిగ్రావాగ్ని నాడింధమం
బులు లోలక్షణదా నివార్యరసనసంభోగైక నిద్రాగమం
బుల నిక్షేప మొనర్చెఁ గోకపటలీ పుల్లోత్పలశ్రేణులన్. 5

గీ. అనుచుఁబురలక్ష్మిఁజూచి యిట్లనియెనౌర
పౌరసంభోగవైభవప్రచురమయ్యెఁ
బంక్తికంఠ మహోద్దండ బాహుదండ
పాలితంబైన యట్టి యిప్పట్టణంబు. 6

మ. ప్రకటంబై రవిరశ్మి తూర్పునఁ దమిస్రామర్మనిర్భేదనో
త్సుకలీలం బొడతేరఁ గేళిగృహమిచ్చోఁబాసి యౌరౌర ! యీ
వికచాబ్జేక్షణ నిస్తుల స్తవతటీ విన్యస్త కస్తూరికా
మకరీముద్ర వెడల్చెఁ బ్రాణవిభు దోర్మధ్యప్రదేశంబునన్. 7

చ. నలినవనీవిహారసకలనా పరిహాసకుఁ డీయినుండు రా
నల పువుఁబోండ్లకుం బతిభుజాంతరసీమలలోన నిట్లుచూ
డ్కులఁబొడకట్టినట్టి నిజకుంకుమపంకవిచిత్రపత్రముల్
గులుకు మెఱుంగుగుబ్బలకుఁ గూర్చు వెసం బులకాంకురంబులన్. 8

క. పదకిండ్లు వెడలి వచ్చిరి
పదఁతుక లొండొరుల చెట్టఁబట్టుక, యేమో

నాడువుచుఁ గ్రొన్నెలవంకల
నెడనెడఁ గుచగిరులఁ బులక లెలమి జనింపన్. 9

ఉ. వేడుకమై రహస్యకథ వేకువఁ బోటులు తెల్పుమన్న యా
చేడె నవోఢగానఁ గడుసిగ్గునఁ బల్కక మోమువాంచినన్,
గోడెమిటారి చన్నుఁగవఁ గుంకుమపత్త్రకముల్ రచింపఁ జే
కూడి, తదీయ సీత్కృతి నిగాఢనఖాంకము దెల్పెవారికిన్. 10

గీ. ఆపురాభోగమీక్షించి యలరి, యంత
రఘుకుమార పరాక్రమక్రమము దలఁచి
దుస్సహ విచారభరమున నుస్సురనుచుఁ
గలఁగి తనలోన నిట్లని తలఁచె నపుడు. 11

గీ. జనకుపీటినుండి శౌష్కలుం దేతెంచి
నొడివినట్టి రాచపడుగు వార్త
పిడుగువోలెఁ జెవులఁబడినది మొదలు నా
యెడఁద నకట యెంతబెడఁద దోచె. 12

క. మానవుఁడొకరుఁడు జితబహు
దానవుఁడై హరధనుర్మథనమూత్న భుజ
శ్రీ నలరెడునఁట ! యిక్కథ
వీనులఁబడఁ గుండె లవియవే యెవ్వరికిన్ ? 13

చ. అటుపలె నద్భుతైకనిలయంబగు తేజము మర్త్యలోకమం
దెటులజనించె మిన్నకయ ? యింతయకాదు దశాస్యునెంచినం
గుటిల చరిత్రుఁ డేమగునొకో! యని చింతిలునాకుఁ గన్నులం
గటగట తెల్లవారె నవగాఢ విచారతరంగ సంగతిన్. 14

చ. జనకపురంబువార్త మది జాలి ఘటింపగఁ దద్విచారముల్
మనమున మాటి, కూర్చుఁ జిరునవ్వుఁ దదీయదిశన్ బులస్త్యనం
దనుఁడు సురావరోధవనితా జనతా కచ కర్షణక్రియా
ఘనతర కల్పకప్రసవగంధి కరాంబుజుఁ డయ్యె నక్కటా! 15

క. అని నింగిఁ జూడ్కి నిడి, యి
ట్లను, హా! విధి, యేమి సేతు నతిదారుణతన్
గనఁబడు నీ చిరజీవిత
యొనరుట నేమేమి చూడనున్నాఁడనొకో! 16

చ. నలువ ప్రసన్నుఁడై నిలువ, నాఁటికిమర్త్యులఁగీటకోటిగాఁ
దలఁచి, తదన్యదుర్జయత దర్పభరంబున వేఁడుకొంటి కో
మలమతి నేఁ డయో యదియ మర్మముగాదెడు, నైననేమి హా!
కలవర మింతెకాక దశకంఠుఁడవౌ నినుఁ గీడు సెందునే? 17

వ. అనియతండుకొండొకయూహించి యవ్విదేహనృపవర్యుండు
నీతిధుర్యుండయ్యె నిట్టియకార్యం బెట్లుగావించె నని వెండియు. 18

సీ. ప్రపితామహుండైన పంకేరుహాసనుఁ
దనలోనఁ జీఁకికిఁగొనకయున్న
తాతయై త్రిభువనఖ్యాతిఁగాంచు పురాణ
మునిఁ బులస్త్యుని మాన్యుఁ డనకయున్న
జనకుఁడై విబుధసంస్తవనీయమహిమచే
మను విశ్రవసుకీర్తి వినకయున్న
హితబాంధవారూఢి నుతిగాంచు మముబోటు
లను లక్ష్యకోటిఁగాఁ గనకయున్న

గీ. మఘవమకుటమణిప్రభామండితాంఘ్రి
నఖసుధారోచియైన దానవకులేంద్రు

నైన జామాతగాఁ జేయఁగానఁడయ్యె
విమలమతియయ్యుఁ గౌశికు[భ్రమలఁదగిలి. 19

గీ. అని యొకించుక చింతించి యాత్మలోన
దనుజపతిమంత్రి "యేలొకో! జనక రాజ
రాజధానికి నేగి శూర్పణఖ రాక
జాగుగావించె" ననియెంచు సమయముననుఁ. 20

క. దనుజేంద్రు శాసనంబునఁ
జని, మిథిలావార్తఁ దెలిసి సత్వరగతిచేఁ
జనుదెంచుచుఁ దనమది ని
ట్లనియెన్ శూర్పణఖ కోర్కులచ్చుపడంగన్.  21

సీ. "చకచకల్ ప్రకటించు చికిలివజ్రపుబాసి
కముల భాసిలు నెమ్మొగములతోడ
భుగభుగల్ నిగుడించు జిగికుంకుమఁపునల్గు
పసిమి గాంచిన మేనిరసిమితోడ
మినమినల్ గనుపించు నునుజాళువా జన్ని
దముల మించు భుజాంతరములతోడ
ధళధళల్ దులకించు చెలువంపుఁబీతాంబ
రములఁ బొల్పగు కటీరములతోడ

గీ. రంగుమీఱెడు నల ప్రౌద్దువంగడంపు
రాచపెండ్లికుమారులఁ జూచు నపుడు,
కపటకృత మానుషీ వేష కల్పనంబు
హేయమయ్యును నా కుపాదేయమయ్యె." 22

గీ. అనుచు వెండియుఁబల్కు "నౌరౌర! యిట్టి
గుణముల స్వభావ మిది యని గణుతిసేయ

వచ్చు రిపుహస్తగతము లై స్వాంతవీథిఁ
బరమకౌతూహలస్ఫూర్తిఁ బాదుకొల్పె" 23

వ. అని యభినందించుచు ననతిదూరంబున నేతెంచు నానక్తంచరిం గాంచి మాల్యవంతుండు గారవంబునఁ "గుమారీ! యేనిందుఁజేరి యున్నవాఁడ నీవు నిచటికరుగుదెమ్మన" నదియు నిప్పలుకాల కించి యిదె కట్టెదుట నట్టాలక మత్తవారణము సధిష్ఠించి మాకని ష్ఠమాతామహుం డున్నవాఁడు పోయెదనని నితాంతాక్రాంత చింతాసంతాప పరీతస్వాంతరంగుఁడగు నతని తెఱంగు గనుం గొని తనలోనిట్లనియె. 24

చ. ఘనతరజాగరశ్రమము కన్నులఁ దొట్టఁగ, మాటిమాటికిన్.
బెనఁగొను నావులింతలును, బెద్దయు విప్పగువక్త్రి, మాత్మనొం
దిన యతికార్యభారములఁ దెల్పఁగ నీతఁడు జాతి నెవ్వఁడో
యనఁదగెఁ, గాన దుర్ణయ విధాకుల శీలము లిట్టివే కదా. 25

సీ. అదిగాక సామాన్యుఁడగు ధరాధీశుని
సచివభావంబైన, సకలకార్య
నిర్ణయనైపుణ్యనిర్వాహ సామర్థ్య
బహుతరక్లాంతిచే భారమగు, వి
శేషించి యీతఁ డశేషసాహసరసై
కవ్యవసాయవిఖ్యాతిఁబండ
చారిత్రుఁడైనట్టి మారావణున కమా
త్యుండఁట! యేమనను న్నదింక!

గీ. నని తలంచుచు నారాక నరయుచున్న
వాఁడు నిశ్చయమని చేరవచ్చి మ్రొక్క,
నతఁడు పెండ్లికూతురవుగమ్మనుచు దీవె
ననిడి కూర్చుండనియమించి యనియెనిట్లు. 26

గీ. బాల! భరతశత్రుఘ్నులఁ బంక్తిరథుఁడు
వెంటఁదోడ్కొని జనకునివీడు సేరె
నా? యటన్నను విని శూర్పణఖ యొకింత
యాత్మలో నూహసేసి యిట్లనుచుఁబలికె. 27

గీ. ఆర్య! దశరథుఁడేతెంచినంత నక్కు-
మారకులకును గోదానమంగళంబు
లెలమివర్తిలుచుండఁగా నేను మిథిల
కతిరయంబున నేగితి ననుచుఁబలుక. 28

వ. విని యమ్మాల్యవంతుఁడు నిట్టూర్పు నిగిడించి విన్ననై యో కన్ని
యా! రామునకు మున్నుపరిణయంబుగాక తమ్ములకు వివాహమ
హోత్సవమ్ము ప్రవర్తిల్లదుగదా ! దరాకుమారి యాదశరథాధి
పమౌళికిఁ బెద్దకోడలగుట నీమాట నూటిదప్పెనని కొండొక
విచారించి, కటకటా! క్షత్రియ బ్రాహ్మణుఁడగు కౌశికహతకుని
దుర్నాటకం బిట్టిదికదా యని వెండియునిట్లనియె. 29

ఉ. కోణపకోటిహోమమునకుం గృతనిశ్చయుఁడై, గజాయుత
త్రాణధురీణఁ దాటకఁ బ్రతాపహుతాశనధాయ్యఁ గాఁగ గీ
ర్వాణుల మెచ్చఁ జేసిన పరాక్రమశాలికి, వాని కాఁకఁ గ
ల్యాణము నిక్కువంబగు దశాననముఖ్యులు విగ్రహించినన్. 30

సీ. సవనవిఘ్నక్రియాశాంతికై దశరథ
క్షితినాథుఁ బొడగాంచి సుతునివేఁడె
వేడి తోడ్కొనిపోయి విమతభీకరభంగి
దివ్యాస్త్రమంత్రోప దేశమొసఁగె
నొసఁగి సుబాహుముఖ్యుల నాహవక్షోణిఁ
బెక్కండ్రఁ దునిమించి యుక్కునిలిపె

నిలిపి యంతటఁబోక పిలువని పేరంట
ముగ మిథిలా పురంబునకునరిగె

గీ. నరిగి హరువిల్లు విఱిపించి యతనితనయఁ
బరిణయ మొనర్చె; నకటా యీ పాపజాతి
కొంపc జెఱిపింప నీ రాచకొమరుచేత
నేమి సేయింపనున్నాఁడొ యింక మీఁద! 31

క. అన నంగన "యిదినిక్క_ము
జనకపురంబున వసిష్ఠ సంయమి యెదుటం
దనఘనత నెరపు నమ్ముని"
యన నవ్వుచు నవ్వధూటి కతఁడిట్లనియెన్. 32

క. రమణీయ తపోమహిమన్
రమణీ! యమ్మునికి నొదవు బ్రాహ్మణ్యాదే
శము క్షత్రకార్యమున్ విడు
వమి నైజమ కాదె స్థానిపద్వాపమునన్. 33

వ. ఇంతియకా దౌత్పత్తిక బ్రాహ్మబ్రాహ్మణ్యంబులం ద్రిజాతికుండగు నతని సన్నిధిం గృతాధ్యయనుం డగుటంజేసి నిసర్గ మహిమోదారుండగు నక్కుమారుండును నిందితాచారుండయ్యెడు నది యెట్లంటేని. 34

చ. అవినయజన్మభూమి యయినట్టి యవిద్య నడంప నోపియున్
బ్రవిమలవిద్య దుర్జనసమాగతమై పెనుచున్ ఖలత్వమున్;
భువి భయహేతువైన తమముం దెమలింపఁగజాలియున్ మణి
చ్ఛవి సవరింపదే భయము సర్పఫణాగతమై జనాళికిన్. 35

వ. అని వెండియుఁ నతండిట్లనియె. 36

క. అంగన! యింకిట వర్ణిం
పం గారణమేమి యైనపను లైపోనీ,
మ్రింగిన కడులకుఁజవు లడు
గంగా నేమిటికి మీదికార్యము వినుమా. 37

క. ఈ రావణుఁ డిపుడు బలా
త్కారంబున జనకతనయఁ గైకొనఁదలఁచున్
వారింపం దగునే త
త్ప్రారంభంబింక నెన్నిభంగుల నైనన్. 38

గీ. అనుడు మనకుఁగలదె జనకజసంప్రాప్తి
బలిమి దక్క నొండుపాయ మనిన,
నకట యకట యిట్టి వికటంపుమాటలు
నాతి నీకుఁ బలుక నీతి గాదు. 39

వ. జగదేకవీరుండును ధర్మవిజయాధారుండును నగు నక్కుమారుండు త్రిలోకీమాన్యుండుగాని సామాన్యుండుగాడు, కావునఁ దత్పరిగృహీతసీతాప్రసభాపహరణంబు ప్రమాదకారణంబని తత్ప్రతాపం బుగ్గడించి మాల్యవంతుండిట్లనియె. 40

ఉ. డాకొనుబాహుదండమదడంబర మంచు మదింప దయ్యె, సీ
తాకరబంధసూచనవిధా..క మంచు నుతింపఁ దయ్యె, నీ
రాకొమరుండటంచు మునిరాజులు మెచ్చఁదదాజ్ఞఁగా వెసం
జేకొని యెక్కువెట్టి తిగిచెన్ విఱిచెన్ హరు చాపదండమున్. 41

క. ఏవంవిధమహిమావి
ర్భావునియెడ నాతతాయి భావముఁగనునీ

రావణు నెఱిఁగియెఱిఁగ, యను
జీవులమగు మన కుపేక్ష సేయం దగునే? 42

వ. అనిన విని మాతామహా! నీతిభూషితంబులగు మీభాషితంబులు నిక్కం
బగునని యక్కంబుకంఠి వేడినిట్టూర్పులు నిగుడ మగుడ నిట్లనియె. 43

గీ. అలఘుతరశక్తి భువనత్రయంబుగెలిచి
గెలుపులచ్చిని భుజపీఠి నిలుపునట్టి
రావణునియందు నిటు విచారంబు సేయ
గటకటా! వింటి నిదిగదా కాలమహిమ! 44

గీ. అనుఁడుమాల్యవంతుఁడను "రఘూద్వహుఁబోటి
మేటిమగ డొకండు నేటిదాక
గలుగ కునికిఁ బంక్తిగళు శౌర్య మీడేరె
నెదురులేనిచోటఁ గదురు వాడి".  45

చ. మునిపతిచే మహాస్త్రములు మున్నుగనేర్చి, పినాకభంజనం
బున బలభేదిముఖ్యులకు మోదమొనర్చి, గుణాళి ముజ్జగం
బును గ్రయలబ్ధమై తగ సమున్నతిఁదేర్చిన రాముసన్నిధిన్
బనిఁగొనునే? లతాంగి! మన ప్రాభవచేష్టితదుష్టకర్మముల్. 46

క. నావుడు నిందుకు సందియ
మే, వైవాహోత్సవమున మిథిలాపురిలో
దైవత మునిజన కృత సం
భావన లేఁ జూడలేదె ప్రత్యక్షముగన్. 47

క. అన నతఁడిట్లను వీఁడి
తనమునఁ బసలేనిపనికిఁ దాఁబోయినచో
మనపతికి నిక నవశ్యము
వనితామణి! యేకలోష్టవధ సేకూరున్. 48

ఉ. ఘోరతమీఱఁగా మిథిలసొచ్చి బలాత్కృతి నాలిఁగొంచుఁబోఁ
బౌరుషశాలి యారఘున్నృపాలతనూభవుఁడెట్లు సైచు ? న
వ్వీరవరుండుదగ్రగతివెంటఁ బడం బెడఁ బాయకప్పు డ
ప్పౌరజనంబు వెన్దగులు బంధుసమాజముఁ జెప్పనేటికిన్. 49

క. దవగతి దుఃఖామర్షజ
మవు తేజము నెరపి మండలానుగ్రహమున్
భువిఁ గాంచు జనుఁ డటంచున్
సవిశేషముగాగ నీతిశాస్త్రము దెలుపున్. 50

క. అనివిని "యసు రుసు" రనుచున్
మనుజాశనపతికనిష్ఠమాతామహునిన్
గనుఁగొని, యింకిట యుక్తం
బనఘా ! మనకెద్ది ? యనిన నతడిట్లనియెన్. 51

గీ. మేలు కలకంఠి ! కార్యజ్ఞురాలవౌదు
వినుము చెప్పెద నాకుఁదోచినవిధంబు
వనచరులకెల్ల మంత్రియై వసుధమించు
జాంబవన్నాము డొకఋక్షచక్రవర్తి. 52

సీ. అతఁడు మతంగాశ్రమావని వసియించు
శ్రమణ నాఁ దగు సిద్ధ శబరిఁజేరి
ప్రార్థించిపల్కె నోపావనచారిత్ర!
వానరేశ్వరుఁడైన వాలివలన
దీనులై బద్ధావమానులై ప్రజలు గి
ష్కింధఁ గుమారుసుగ్రీవుఁ బట్ట
భద్రుఁజేయఁదలంచి భానువంశవతంసు
డగురాము సాహాయ్య మభిలషింప

గీ. నంజవాసుతుఁ డచ్చోటి కరుగుదెంచి
వారి కిట్లను "స్వబ్రహ్మచారియైన
యాజ్ఞవల్క్యమునీంద్రు పాదాంబుజములు
గాంచి యిపు డేను మగుడి యేతెంచునపుడు. 53

క. మిథిలానగరప్రాంతిక
పృథివిం బటుతరణికిరణభీషణతాప
ప్రథిమ నితాంతదురంత
వ్యథఁ జేడ్పడియున్న జరఠవనితం గంటిన్. 54

గీ. కాంచి యెవ్వరిదాన వోకంబుకంఠి!
యిప్పు డెందుండివచ్చితి వెందుఁబోవ
వలయు నెయ్యది పే రేమి తెలుపుమనిన
నీరెలుంగునఁ బలికె నవ్వారిజాక్షి. 55

క. భరతుని యోగక్షేమం
బరయగఁ గేకయతనూజ యనుప వయోధ్యా
పురినుండి జనకువీటికి
నరుగుచు నిటఁబడితి మంథరాహ్వాయ ననఘా! 56

గీ. త్రోవ నీష్టలేక పోవఁ గాళ్లనురాక
యెండపిడుగుదాకి బెండువడితి,
ననుచు నోటిమాటయును నోటనుండ న
ప్పూవుఁబోడి యపుడ జీవి విడిచె. 57

వ. అని హనుమంతుం డుగ్గడించిన యుదంతంబునకు హృదంతరంబున సంతసించి మంథరాశరీరవియోగంబు మదీయకార్యోపయోగం బయ్యె నని యేను మున్ను సురాసురసంగరంబున నైనవరప్రసం

గంబు నెఱుంగుదుంగానఁ దదనుకూలంబుగా నొక్కజాలంబు వన్ని
యాలేఖ లిఖియించితి వినుమని యిట్లనిపఠించె. 58

సీ. "శ్రీమ దఖండధాత్రీ మహామండలే
శ్వరులైన దశరథేశ్వరులదివ్య
పాదపద్మములకు భక్తిమైఁ గేకయ
విభుతనూభవ సేయు విన్నపంబు
స్వామి! దేవాసురసంగరభూమి ము
న్నంగీకరించినయట్టి వరము
లవిరెండు నిప్పు డే నడిగెద భరతు న
శేషసామ్రాజ్యాభిషిక్తుఁ జేసి

గీ. లక్ష్మణునిఁగూడి జానకీలలనతోడఁ
దాపసాకృతిఁ బూని పద్నాలుగేండ్లు
దండకాటవి రఘురాము నుండఁబనిచి
నన్నుమన్నింపుఁ డింతయ విన్నపంబు" 59

గీ. అనుచుఁ బఠియించి మాచేతనైనకార్య
మింతమాత్రంబ యిది సంఘటింపఁజేయ
నీకుభార మటన్న నన్నీరజాక్షి
యేనుగావింపఁదగునది యెద్దియనుఁడు. 60

వ. జాంబవంతుం డన్నితంబినింగనుంగొని నీవుభవత్కాయంబు నాంజ
నేయగోపాయితంబుగా నుంచి పరపురప్రవేశ విద్యాచమత్కారం
బున మంథరాశరీరం బధిష్ఠించి మిథిలాపురంబు సొత్తెంచి దశరథ
సన్నిధానంబున నేతత్సంవిధానం బనూనంబుసేయు మటైన జానకీ
లక్ష్మణసహితుండై రఘువంశకేతుం డగ్గురు నియోగంబునం గరా
ళవ్యాలాభీల జంబాల నిశాతకంటకవ్రాత దుస్తరప్రస్తరాకీర్ణంబగు

దండకారణ్యంబుఁ బ్రవేశించి వైదేశికుండుగాన తా నవశ్యంబు వాలి నిగ్రహపూర్వకంబగు ప్రత్యుపకారసంధిం గుమారసుగ్రీవు ననుగ్రహించి కృతార్థుంజేయు"నని ప్రార్థించె, నని మాల్యవంతుండు సెప్పిన విని యప్పల్లవాధరి యుల్లంబుతల్లడిల్ల వెండియు నతని కిట్లనియె. 61

క. ఈనృపపోతము వాలి న
హీనభుజాశాలి దునుమ నెదురే యితరుల్
వీనికిః భువి "గుడి మ్రింగెడు
వానికి గుడిలింగ ముట్రవడియముగాదే." 62

చ. అనుచుఁ జలించి, భల్లుక కులాగ్రణి కౌశలముందలంచి, య
ద్దనుజవధూటి నవ్వుచును దాతకు నిట్లను, 'నాకు జాంబవం
తుని కుటిలత్వముం గృతవినూతన కార్యవిశేషకల్పనం
బును వినవేడ్కయయ్యెడు సమున్నతిఁ దెల్పుము తత్కథాంశమున్. 63

వ. అనుటయు మాల్యవంతుం డిట్లనియె. 64

క. వనచరు లిటు ప్రార్థించిన
మనమున హర్షించి, శబరి, మార్తాండతనూ
జునిపైఁగల యనురాగము
తనుఁదరువిడ జనకరాజధానికి నరిగెన్. 65

గీ. అని జనస్థానముననున్న దనుజులిటకు
వచ్చి తెలుపంగ వింటి నో మచ్చెకంటి!
జాంబవత్కార్యమిది యమోఘంబు గాన
రాముఁ డేతెంచు నిమ్మహారణ్యమునకు. 66

క. ఏతెంచి, విరాధముఖా
స్వీతంబై భీమమైన వింధ్యాద్రిగుహా

వ్రాతంబున విహరింపఁగ,
సీతాహృతి సుకరమగుఁ బిసితభుక్పతికిన్. 67

మ. అదిగాదేని నయోధ్య నయ్యోడునటం చాత్మన్వితర్కించి చే
యఁదలంపన్, సుర దైత్య యోధతతిలో నగ్రేసరుండై మహో
ద్యదహంకారత నింద్రదత్త పటుమాయామంత్ర పారీణుఁడై
న దశస్యందనుచెంగటం బరఁగునే నక్తంచరోపాయముల్. 68

క. అనఁ దరుణి యకట! నికటో
పనతునియెడ నిట్టికీడుపని యొనరింపం
జనునే! యన నతఁడిట్లను
వనితా! నీమాట సాధువర్ణితమరయన్. 69

క. వినుము భువినెవ్వఁడేనియుఁ
దనుఁ జేసినవాని పుత్రదారాముల కె
గ్గొనరించు, నతనిమండల
మనయముఁ జెడునంచుఁ బెద్దలంద్రు కుమారీ! 70

వ. ఇది నిక్కంబైనను నిసర్గతేజస్వి యగు నత్తాటకాఘస్మరుం దస్మదా
శ్రయవృత్తిం బ్రవర్తిల్ల నేరఁడనిన సమ్మతించి, యప్పలలాశివిలాసిని
యింకనొక్క సందియంబు గలదని వెండియు నిట్లనియె. 71

సీ. వినయాభిరాము రామునిఁ గనుంగొని తండ్రి
వనవాసమునకుఁ బొమ్మనుట యెట్లు?
మతి నసత్యాశంక నతఁడు పొమ్మనునపో
భరతుఁ డందుకు నొడంబడుటయెట్లు?
క్షితి లోకసామ్రాజ్యరతి నతం డొడఁబడి
యుండుఁబో సౌమిత్రి యోర్చుటెట్లు?

వెనువెంటఁ జనువాఁడ నని యతండోర్చుఁ బో
గురుఁడు కౌశికుఁ డీయకొనుటయెట్లు ?

గీ. మునిజనానుగుణం బిది యనుచు నతఁడు
నియ్యకొనుఁబో రఘూద్వహుఁ డయ్యమాట
వీటిపుచ్చక యమ్మహోగ్రాటవికిని
వచ్చునే ప్రాజ్యసామ్రాజ్య వాంఛలుడిగి? 72

గీ. అనిన విని మాల్యవంతుఁ డోవనజగంధి!
డెందమున మానుమా వట్టిసందియంబు.
కీర్తికాముకు లగు ధరాభర్తలకును
రాగ మొదవునె రాజ్యోపభోగములను. 73

క. నావుఁడు మాతామహుతో
నావెలఁదుక యింక నొక యనర్థాంతర మే
భావంబున నూహించెద
నా విని యతఁ డెద్ది? యనిన నవలా పలికెన్. 74

మ. భవకోదండవిఖండనోద్భటభుజాప్రౌఢిన్ విజృంభించు రా
ఘవుపైఁ బుట్టినయట్టికిన్క నిఖిలక్షత్రాంతకుండైన భా
ర్గవరాముం డరుదెంచె నంచు నటఁ గర్ణాకర్ణిచే నొక్కవా
ర్త వినంగాఁబడె నిప్పుడేను మిథిలాప్రాంతోర్వియం దుండగన్. 75

గీ. అనుఁడు మాల్యవంతుఁ డగునగు నివ్వార్త
యుక్తమరయ భృగుకులోద్వహుండు
నయనసాయకునకుఁ బ్రియశిష్యుఁ డగుగదా
బాల! యతఁడు రాక యేలమాను? 76

మ. కరసంరోధిత నర్మదామకరచక్ర క్రూరదంష్ట్రాసము
త్కరఘాతవ్రణ జాతకర్కశలసద్బాహాసహస్రాన్వితుం
దరికొల్పెన్ గృతవీర్యపుత్రుఁ బరశుద్యద్వహ్ని నెవ్వాఁడు త
త్పరమస్ఫూర్తి విభాసి దేశికధనుర్భంగం బుపేక్షించునే? 77

గీ. జనఁ గానిమ్ము సకలమూర్ధాభిషిక్త
కంధరాబంధురాస్రావగాహ గాఢ
పంకిలకఠోరతర కుఠారాంకుఁడైన
యతనికేని నజేయుఁ డీయధిపసుతుఁడు. 78

గీ. అనుఁడు విని సైప కంగన యతనిఁజూచి
'పాలబుగ్గల యీ రాచబాలు నెంత
గానలనెక్కించి పలికెద' వనిన నవ్వి
యవ్విలాసినితోడ నిట్లనియె నతఁడు. 79

క. "చంచలలోచన! యతనిం
గొంచెం బనఁజనదు దొడ్డకొంచెంబులఁ బ్రా
పించునె బంటుతనంబులు
"గొంచెపుఁబిడుగులకుగాదె కొండలు పగులున్." 80

గీ. అఖిల రాజదురాధర్షమై యశేష
దేవతామయమైన యద్దివ్యధనువు
మించి భుజశక్తి నవలీలఁ ద్రుంచినపుడె
నాతి! యతఁడు జగత్రయ జేతసువ్వె. 81

గీ. అఖిల రాజన్యరక్తధారాంబురాశిఁ
ద్రిషవణస్నానమొనరించి, తేజరిల్లు

చిరతపోనిధి, భృగురాముఁ డరుగుదెంచి
యేమిసేయునొ? యిటమీఁద నెఱుఁగరాదు. 82

వ. కావున నేతత్ప్రసంగంబు నిశాచరపుంగవున కెఱింగింపవలయుననుచు మాల్యవంతుండు శూర్పణఖయుం దాను దశముఖాస్థానమునకుం జనిరి. నంత నిక్కడ మిథిలానగరంబున నుత్తరకోసలేశ్వరుండు కౌసలేయాది తనూభవ శోభనోత్సవంబు సంప్రవర్తిల్ల యుల్లంబుపల్లవింప నిలింపవల్లభ ప్రముఖ నిఖిలదేవానీకంబును దిగంతాయాతరాజలోకంబును యథోచిత సంభావనాపూర్వకంబుగా వీడ్కొల్పి గాధేయ గౌతమప్రభృతిమౌని సందోహంబును సీరధ్వజాదిబాంధవవ్యూహంబును బరివేష్టింప నున్న సమయంబున. 83

మ. అటకేతెంచె భృగూద్వహుండు నిజబాహాప్రస్తరస్తంభ వి
స్ఫుటమౌర్వీపటుచాప కైతవ లసద్భూచక్రకఙ్క్రాంకుఁ డు
ద్భటరాజన్యమదేభయూథమృగయూధక్షుండు నారాచముల్
చటులాస్త్రప్రణజాత జాతకిణ వక్షఃపీఠిపై నూఱుచున్. 84

శా. చారు స్త్రైణకపోలపత్రరచనా చౌర్యక్రియాభీరువై
తోరంబైన భుజంబశేషనృపజిద్ఘోషోగ్రచాపాప్తిఁ బొ
ల్పారం దూణము లుత్తరీయక కుచేలాకృష్ట తంతుచ్ఛటన్
సారెం గట్టుచుఁ జేరవచ్చె నతఁ డిచ్చన్ జూపఱుల్ భీతిలన్. 85

వ. ఇట్లేతెంచుచు నతండు. 86

సీ. చర్చించిచూడ శస్త్రాస్త్రికథనంబు
గగనారవిందసంకాశమయ్యె
ప్రత్యగ్రగీర్వాణపాణింధమములైన
గగనమార్గములు దుర్గమము లయ్యె

ప్రతివాసరము సముద్భటశ్రీచ్చట నీను
వసుధావరారోహ వంధ్య యయ్యె
పద్మ పద్మాంతర భ్రమరంబులనె కాని
కరిఘటాకటముల నెఱుఁగదయ్యె

గీ. జముఁడు ముకుముస్తు యసమానసాంయుగీన
రాజినెల్ల యథామృష్టభోజి యగుచుఁ
బూని మాఁగియుంప నిట వేకిలేని లంఘ
నములు వాటిల్లెఁ గటకటా! నాలదునకు. 87

వ. అని సవిస్మయంబుగఁ గొండొకవిచారించి వెండియు నాభృగూద్వ
హుండిట్లనియె. 88

ఉ. ఏవిలునారి యించుధరుఁ డెక్కిడుచుం జెవిఁజేర్చినం బుర
స్త్రీపరకర్ణపూరములు ద్రెవ్వుఁ; బ్రకోష్ఠతటిఁ ఘటించుచో
నాపనితాకరాబ్జవలయంబులకున్ విలయంబుగల్గు నేఁ
డావిలు రాముచేత నహహా! విఱిగెన్ దొలఁగెన్మహోన్నతిన్. 89

క. అని వికటభ్రుకుటీ న
ర్తన మడర విదేహులార! దాశరథిన్ రా
మునిఁ జూపుఁ డెచటనున్నాఁ
డని మఱియుఁ బిచండిలాగ్రహగ్రస్తుండై. 90

మ. స్ఫుటగర్వార్జునదోస్సహస్రనలకప్రోద్గచ్ఛదస్రార్చిరు
ద్భటమౌమత్పరశూగ్రవహ్ని నృపసత్త్రామాతపూర్ణహుతిన్
బటిమంగాంచక నేఁడు చూడుఁ డకటా! ప్రాల్మాలెడుంజాల నా
కటఁ దత్ర్పాక్క బలైకభుక్తి విఘసక్షత్రాధమశ్రేణికిన్. 91

వ. అని యజ్ఞటికరటి కటూక్తివికటంబుగా నికటంబున కేతేర నవార్య
ధైర్యసంభ్రమోదారుండై రఘుకుమారుండు. 92

మ. నిటలాక్షుం డుపదేశ మర్థి నొసఁగన్ సేనానితోఁగూడి యు
ద్భటచాపాగమసామముల్ దెలిసి, యోధశ్రేణిలోనన్ మహా
జటిసింహంబులలోన నప్రతిమతేజస్ఫూర్తివర్తించు నీ
పటుపుణ్యున్, భృగురాముఁ జూడఁగలిగెన్ భాగ్యాతిరేకంబునన్. 93

క. అనునెడ భృగుపతి శివునకుఁ
దనపైఁగలకనికరంబుఁ దలఁచి, విషాదం
బనయము నెమ్మదిఁ గ్రమ్మగఁ
దనుఁ దా నిందించుకొనుచుఁ దానిట్లనియెన్. 94

ఉ. శంక యొకింతలేక పరుషప్రతిఘాతిమదాంధబుద్ధి బల్
బింకమునం గుమారు ఖురశీకలహంబున ధిక్కరించి భ
స్మాంకుర ! యంచుఁదిట్టినను నంబయుఁదానునుజూచినవ్వు నే
ణాంకకిరీటుచాపహతి హా వినియుం గనియున్ సహించెదన్. 95

వ. అని కొండొకవిచారించి యజ్ఞటిధూర్జటి కటకటా ! యీరఘుకులాంకు
రంబు సముద్భటరణోల్లాసినగునన్నరణ్యవాసిగా నెఱింగి తరంగిత
మదాంధస్వాంతుండై యింతపరాక్రమించునే! యని యాగ్రహించి సురా
గ్రణీభుజాగ్రజాగ్రద్దంభోళిధారాకఠోరంబగు కుఠారంబుఁ బరికించి
యతిక్రాంచిదుచ్చైస్స్వరంబున నచ్చటిజనంబు మనంబునం దల్లడిల్ల
నిట్లనియె. 96

శా. ఓరీరాఘవులార ! మీరు వినరా ? యుగ్రావనీభృత్కులాం
కూరం బిర్వదియొక్కమాఱు చటులక్రోధోన్నతింద్రుంచి దు

ర్వారంబై వినికృత్తపలలాస్రస్రావవిస్రాంగకో
దారంబైన కుఠారముం పితృవధవ్యక్తాఘనిస్తారమున్. 97

గీ. అనుచు నేతెంచు భృగువంశవనధిపర్వ
శర్వరీనాథు బహుమానపూర్వకముగఁ
గాంచి, యతనిపరాక్రమక్రమము లెంచి
మిత్రకులమౌళి వల్కె సౌమిత్రి తోడ. 98

మ. అలఘుస్ఫూర్తి దశాస్యుగెల్చి నిజబాహాశ్రేణినిశ్రేణికా
తులితారూఢజగచ్ఛటాజయరమాధుర్యాంచితోరస్థ్సలీ
కలనం బొల్చిన కార్తవీర్యుఁ గలసన్ ఖండించె నీభార్గవుం
డలసేనానిముఖంబుఁ జూచు సమరోద్యద్భీతి వెన్నిచ్చినన్ 99

క. ఏతాదృశనిజభుజమహి
మాతతజయశాలి యాతఁడని, యనితరసం
ప్రీతిఁ దదాకృతిఁగనుఁగొని
యాతఱి వెఱఁగంది మఱియు నతఁడిట్లనియెన్. 100

సీ. మకుటయోగ్యంబైన మౌళిభాగంబున
నిడుదపెంజడగుంపు ముడిచినాఁడు
నిఖిలభీకరభంగి నిజభుజాంతరపీఠిఁ
జాపంబుఁ బరశువు మోపినాడు
భసితంపునునుఁబూత నసమించుముంజేతఁ
రౌద్రాక్షవలయంబు దాల్చినాఁడు*
శోణాంబుజశ్రీల రాణించుకెంగేలఁ
గ్రొవ్వాడితూపులు గూర్చినాడు

*ఇచట యతిదోషము ప్రమాదజనితము

గీ. ప్రకటతీవ్రవ్రణచ్ఛటావికటరీతి
నొప్పు నెద నేణచర్మంబు గప్పినాఁడు
చాగురే! యింతయఖిలరసప్రకాండ
సమ్మిళితమూర్తి యిమ్మౌనిచక్రవర్తి. 101

వ. అని చేరనేతెంచు నప్పుంచనాచుంచుపుం గనుంగొని భార్గవుం డం
తర్గతంబున "నిక్కుమారుం డసుప్రమాణగుణగణానురూప
దీపితాకారుం" డనితలంచి ప్రకాశంబుగ నాదాశరథి కిట్లనియె. 102

మ. బళిరా! యోరినృపాలడింభ! మదదంభక్రూరనానాకుభృ
త్కులసంహారికుఠారభీకరు నను న్ గుంభీంద్ర కుంభచ్ఛిదా
కలనాభంగనఖానుషంగమగు సింగంబుం గురంగంబునన్
గెలనం జేరి మదిన్ ఘటించితి తరంగీభూతహర్షోన్నతిన్. 103

క. నావుఁడు నకుటిల నిర్మల
భావుఁడగుచు నతనిఁజూచి భరతాగ్రజుఁ డో
దేవా! నీ నా యంతర
మీ వానతియిచ్చినటుల యింతయె తలపన్. 104

మ. జనకుండౌ భృగుమౌనిచంద్రుఁడనగన్ సర్వాగమార్థావలో
కనమున్, ధూర్జటిచే శరాసనకళాకౌశల్యముం గాంచి, వా
ఙ్మనసాతీతభుజాబలార్జితమహిన్ ద్వ్యాదేవతాకోటి కి
చ్చిన నిన్నప్రతిమప్రభావమహితున్ సేవించెదన్ భార్గవా! 105

క. అనవుఁడు భార్గవుఁడోరీ
జనపాలకడింభ! సంతసమునొందితి నా
మనమున నీభుజవిభవ త
దనుగుణసౌజన్యములకు, నదియట్లుండెన్. 106

మ. పటుశక్తిం గృతవీర్యనందనవధూ బాష్పప్రియంభావుకో
ద్భటబాణోదిత శోణితాంబుధి నివాసం బర్థిఁగావించి, యా
చటులక్షత్రతతిన్ భుజించి, పిదపం జల్లాఱుక్రోధాగ్ని వె
ల్గుట కీవింధనమైతి పంధకవిభితో్కఁదండదండాహతిన్. 107

వ. అనిన మందస్మితకందళితవదనారవిందుండై రఘునందనుండు భృ
గునందనున కిట్లనియె. 108

ఉ. నిక్కముగ మౌనినాథ! మది నిన్నుగణింపక బాల్యచాపలం
బొక్కటి మిక్కుటంబుగ మహోగ్రతరోగ్రశరాసనంబు నే
నెక్కిడఁబో నయత్నముగ నిట్టియమంగళమావహిల్లె, నీ
యెక్కుడుతప్పు నీమది సహింపుము, నింపుముకూర్మి నాయెడన్. 109

క. నావుడుఁ జెప్పకచెప్పెట
వీవు భవన్మహిమ నోరిప్పపడింభక హా!
భావజమథనప్రథమాం
తేవాసిం బరశుధరు గణింపవె నన్నున్. 110

మ. శరజన్మం బసుమారుగాంచె సముదంచన్మృత్యుదంష్ట్రాసహో
దరముల్ ప్రచ్ఛరముల్ రణాంగణమునం దన్నింత చేఁగాచినన్
బురజిత్ప్రీతి, మహోన్నతింగెలిచితిన్ ముయ్యేడుమాఱుల్ సము
ద్ధురదోశ్శక్తి వసుంధరన్ నృపభుజాదుర్గచ్ఛటాబంధురన్. 111

క. అనవుడు నినకులుఁ డిట్లను
ననఘా! భృగువంశతిలక! యవివేకభరం
బునఁగాని నిను గణింపమి
ఘనతరగర్వాంధబుద్ధిఁ గాదు తలంపన్. 112

ఉ. నీవు త్రిలోకవీరుఁడవు నీజనయిత్రియ వీరమాత యో
దేవ! మహానుభావ! భవదీయభుజాపరిభూతబాహులే
యావనతాస్య మంబ జగదంబ త్రపంబరికించి దీనయై
భావమునన్ భవజ్జననిభాగ్యము పెంపు వహింపఁగోరుటన్. 113

క. అనిపలికెడు రఘుకులపా
వను ననుపమవచనరచన వైయాత్యంబున్
విని, యిట్లను నలభృగుకుల
మునికేసరి చిఱుతనగవు మొగమున నిగుడన్. 114

మ. అనుభూతింబునరుక్తముల్ మహిమదీయాశ్చర్యచర్యాస్తుతుల్
చన దాఁజోలి ధరింపు తెంపుమెయి విశ్వామిత్రుచేఁగన్న నీ
ఘనశస్త్రాస్త్రము లింక మత్కర ముదగ్రకుఠారసంగ్రామఖే
లన సన్నద్ధ కుఠార భీకరము కాలక్షేపముల్ సైఁచునే! 115

ఉత్సాహ. అనుఁడు నెంతకెత్తుకొనియె నౌర! యితఁడుగాధినం
దనుని మోవనాడె నైనఁ దానికేమి యాడనీ
కనలి "త్రుళ్లునెద్దుగాదెగంతమోయు" నంచు నె
మ్మనమునం దలంచి నృపతి మౌనితోడనిట్లనున్. 116

చ. జలధిమితోర్విమాత్రము వశంబుగ నిర్వదియొక్కమాఱు దో
ర్బలమునఁగెల్చియుం బరులపాలుగఁజేసిన ధార్మికుండ వీ
వలఘుఁడ! నేను బాలుఁడ భయంకర మిప్పని గానఁ గోపముం
జలమునుమాను మోయనఘ జాతిన పూజ్యులు మీరు మాయెడన్. 117

వ. అనవుఁడు జామదగ్న్యుండు సక్రోధకంపంబుగా నాత్మగతంబున. 118

ఉ. సాటికిఁబోటికిఖలుఁడు క్షత్రియపోతము నేఁడుమాటకున్
మాట యొకింత వీరవరమార్గము దప్పకపల్కె నద్దిరా

పోటరివోలె నంచుఁ దనబుద్ధిఁ దలంచుచు నంత భూరి వా
చాటత నోరి! భార్గవుఁడు జాతిన పూజ్యుఁడె నీకునెయ్యెడన్? 119

చ. అనివచియించి యిప్పటికి నాయుధపాణివి గావదేమి? నీ
వినయనిగుంభితోక్తులు నవీనకళంకముగా యుగాంతకో
పన యమదంష్ట్రికాక్రకచభాసి కఠోరకుఠారసంభృతిం
గనుఁగొన శక్యమైనయది గా దిదెమక్కరమంచు వెండియున్. 120

స్రగ్ధర. త్రైలోక్యత్రాణదీక్షాధరమగు హరిదోర్దండజక్షత్రవర్గం
బాలీనంబయ్యె మున్నే యలఘుభుజముల మ్మహావీరుఁ డత్యా
భీలక్రోధానుభూతిం బెరిగెడు జగముల్ భీషణోద్యద్యుగాంత
జ్వాలాజాజ్వల్యమానజ్వలనకబళనాశంకచేఁ దల్లడిల్లన్. 121

వ. అని బెట్టిదంపుబలుకులం బల్కి నజ్జటిధూర్జటిం గటాక్షించి స
మంచితజ్ఞానజనకుండగు జనకుండిట్లనియె. 122

గీ. క్షత్రవధ రూపమగుమహాసత్రమునకు
క్షితితలంబెల్ల దక్షిణఁ జేసినట్టి
సోమయాజికి నీకేల శుష్కహేతి
తగదు విడుమయ్య భృగు రామ! సుగుణధామ! 123

సీ. అని శాంతగంభీరనినద మేర్పడఁ బల్కి
జనకునిఁజూచి యిట్లనియె నతఁడు
వినుము సీరధ్వజ! వనజాప్తుసన్నిధి
శుక్ల యజుర్మహాశ్రుతిఁజదివిన
యనఘుఁ డాయాజ్ఞవల్క్యమునీంద్రుకరుణచే
వేదవేదార్థకోవిదుఁడవైన
నీమాట వినఁబోలు నిక్కమైనను నిది
సమయమే? శిష్టానుసరణమునకు

గీ. జగతి ముయ్యేడుమాఖులుఁ దగ జయించి
ఋత్విజుల కిచ్చినట్టి దింకేల యడుగ
నభిమతద్వంద్వరణకేళి నఖిలనృపతి
పటలమోటనసార మత్సరశుధార 124

వ. అని యిత్తెఱంగునం దరంగితాగ్రహజ్వలనజాజ్వల్యమానుండై పలుకు
భృగురాముం గాంచి సమంచితవినయభాషాసుధాభిషేకంబునఁ జల్లా
ర్పందలంచి, దశరథుం డిట్లనియె. 125

మ. అనఘా భార్గవ! నీకు మ్రొక్కెద విరోధావాప్తిఁ జాలింపు మ
న్నన లోకత్రితయాభయావిరతదానస్థూలలక్షంబునన్
మను బాహాగ్రమునందు నేల ధరియింపన్ హేతి నీరీతిగా
మొనయంజెల్లునె పుత్రభాండమగు రామున్ సద్గుణారామునిన్, 126

క. అన విని భృగుపతి రాముని
గనుఁగొని గంభీరధీరకర్కశ ఫణితిం
దనరెడు వీఁ డెవ్వఁడురా ?
యన, దశరథుఁ డితఁడు గురుఁడయా నా కనుఁడున్. 127

క. శోకాకులితస్వాంతుం
డై కనలుచు క్షత్రబృంద మఖిలాశలయం
దీకరణి మోసులెత్తునె ?
హా! కటకట! యనుచు దశరథాభిముఖుండై. 128

గీ. భార్గవుఁడుపల్కె వినుమోయిపార్థివేంద్ర!
పుత్రమన్నామమాత్రైక మైత్రిఁ గనుట
నీవు మాన్యార్హుఁడవ కాని యింతకేని
వీరసమయంబుఁ బరికింప నేరవైతి. 129

గీ. చండికానాథకోదండఖండనమున
నొదవి, మది నేర్చు కోపమహోగ్రవహ్ని,
రఘు విదేహ కుటుంబ ధారాళబాష్ప
సంతతాసేకమునఁ గాక శాంతమగునె? 130

చ. అన విని యిట్లనున్ భృగుకులాగ్రణిఁ జూచి విదేహధారుణీ
జనపతి యోమునిప్రవర! శస్త్రకలాపము సన్యసించి ని
ల్చిన మముబోటిశాంతులకుఁ జెచ్చెరఁ గోపమురేఁచి క్రమ్మఱన్
ధనువు పరిగ్రహించుటకుఁ దత్తర పెట్టెదవీవు నావుఁడున్. 131

క. ఉలికిపడి మౌని యిట్లను
బళిరోరి! విదేహవంశపాంసన! నీవుం
బలుపోటరివలె వెఱపక
పలికెద విటు, వెన్నకౌర పండులువచ్చెన్! 132

శా. చితాగ్రింశుప్రియశిష్యుఁడైన యతికిన్ శిష్యుండవంచుందమో
విత్రాసోగ్రతపస్విరుండవనుచున్ వృద్ధుండవంచుం గృపా
పాత్రం బన్న నహా! ధనుర్వచనముల్ భాషించి యస్మన్మహో
క్షత్రాలంభమఖామృతంబ వయి తాఁగా నిన్నుబోకార్చెదన్. 133

సీ. అనిపల్కు భృగునందనునిఁ గనుగొని శతా
నందుఁడిట్లనుఁ గృపానందుఁడగుచు
వినవయ్య మునివిరించన! మున్ను గశ్యప
చ్యవనాదిమౌనుల శాసనమున
సంప్రహారక్రియాసమభిహారము డించి
యవిరళబ్రహ్మానుభవము గాంచి
పరమసాత్వికగుణాభరణమౌ నీకును
బొడమెనే విపరీతబుద్ధి లనఘ!

గీ. కటకటా పూని యిటులెంతకాల మేని
నితరునింబలె నినుఁబట్టి వెతలఁబెట్టి
క్రించుఁదనమున నాటలాడించఁదొడఁగె
నుఱక కోపంబురేఁచి యాయుధపిశాచి. 134

గీ. అననొకింతనవ్వి యోరి! యాజ్యస్నేహ
మితనిమదికి నెంత వెత యొనర్చె!
నైన మంచిమాటలాడి నే నలరింతు
ననుచు భృగుతనూజుఁ డతనిఁజూచి. 135

ఉ. ఓశమిచంద్ర! మీనరవరోత్తము నిత్యమఖక్రియాపురో
డాశరసజ్ఞుఁ గాఁచితి; నటద్భుజవిక్రమజాగ్రదాగ్రహా
వేశులు వీరె రాఘవులు వీరికులంబు చలంబు దీరగా
నాశ మొనర్చి తావకమనఃప్రియవృత్తి వహింతునంతటన్. 136

చ. అనుటయు నాగ్రహంబెసఁగ నంగిరసుండను,నోరి! క్షత్రియా
తనయ దురాత్మ! క్షత్రవనితాజనగర్భవిదారణంబుచే
నొనరెడు భ్రూణహత్యలకు నోడనికష్టుడ! భార్గవాన్వయం
బున జనియించినట్టి యొకబోయవుగాక మహీసురుండవే? 137

ఉ. భానుకులప్రసూతుల కృపాణము నెంచినచో నిసర్గని
ష్ప్రాణమువిప్రకోటియెడ, వారలకో? యెటువంటివాఁడవీ
వైన వహింపఁగావలయు. నట్లని నీవుమదిందలంచియో?
మానమదాతిరేకవలమానగతిం జెలరేఁగి త్రుళ్ళుటల్. 138

క. కానీ వారికి వెఱవక
మానిన మానితివిగాక, మఱి వెఱవవుగా

మానసమున నెంతటి య
జ్ఞానివిః మ|ద్బహ్మవర్చసంబునకైనన్. 139

చ. అనవుఁడు రోషభీషణముఖాంబుజుఁడై పరిహాసకౌశలం
బనయము నేపుఁజూప నతఁడాంగిరసుం బరికించి యేమిరా !
నను నెదురించిపల్కెదు మనంబున శంకయొకింతలేక నీ
వనిమిషనాథనందనుఁడవంచునొ? గౌతమవంశపాంసనా ! 140

క. ఎల్లరు వేల్పులు మును నీ
తల్లి నినుం గనినయవుడ దరహాసమునన్
దెల్లముగఁ గుండశబ్దము
పుల్లింగము సేసితనుచుఁ బొగడరె నిన్నున్. 141

వ. అని వెండియు నఖండజా|గదా|గహ|గస్తుండై యప్పరశుహస్తు
డిటనియె. 142

మ. మది నీరాఘవు లస్త్రగాథలు దలంపం బూనినారేని, జ
న్నిదముల్ దాల్చినవారలెల్ల ద్విజులేనిన్,నన్ను నందుంగణిం
పుదురేనిన్, హతరాడ్సమిత్కుపరశు|ప్రోద్దామమౌ మద్దురా
సదమౌర్వీకుశకర్షణోల్బణ కిణాంచద్బాహు వింకేటికిన్? 143

ఉ. నావుఁడు మౌనితోడ నజనందనుఁడిట్లను నోమహాత్మః రా
జీవభవప్రసూఁతుఁడు వసిష్ఠసనాభి భృగుండు తాత నీ
కీవుఁ |దయీవిదుండవని యోర్చిసహించితి నిప్పుడేని మ
ద్భావము నీయెడందెగదుః భార్గవ మానుము దుస్స్వభావమున్. 144

వ. అనిన భార్గవుఁడు 145

క. అదరిపడి యోరి! యేమని
వదరెదురా రాచపురువ! వాలాయము నీ
మదిదెగదె తెగినఁదెగుగా
కదయత మత్సరశు ఁడరునంతకు ననుఁడున్. 146

వ. విని పితృనిందా సంజాత క్రోధ సంధుక్షిత హృదయుండై
లక్ష్మణుం డిట్లనియె. 147

మ. ఘనుఁడీ రాముఁడు దా మదగ్రజుఁడికఁగాకుండినన్మాననీ
మనువంశప్రభవుండె కాఁడని బుధుల్ మచ్చేష్ట నిందించనీ
నను ధీరుండననీ యధీరుఁడననీ నానాజనుల్, పూనితిన్
గనదాటోపత దుష్టభూదివిజ శిక్షాదీక్ష నేఁడాదిగన్. 148

చ. అనినఁ దదుక్తి కమ్మునిసి యనాదరమేర్పడ రాముఁజూచి వీ
యనుజుఁడయోయిదేమి నిను నగ్రభవుండిఁకఁగాకయున్న మే
లనియెడు నా నతండు పరిహాస మెలర్పఁగ సమ్మహాతపో
ధనమణితోడ నిట్లను సితాంతసుధామధురోక్తి చాతురిన్. 149

క. బాలుఁడుగాన వివేకము
చాలక వీఁడేమియనినఁ జను నెగ్గింపం
బోలదు మీకు జటాలని
టాలవిలోచన! ప్రసన్నుఁడవు గమ్మనుచున్. 150

ఉ. రాముఁడువల్కె,నవ్వి భృగురాముఁడు మేల్పసివాఁడువీఁడు! మా
కేమిటి కల్కె యుష్మదనువృత్తిపరుండగు వీఁడు నీవు మ
ద్భీమభుజాకృపాణహతిఁ ద్రెళ్ళినతోడనె త్రెళ్ళు; నర్కుతే
జోమహిమంబు శాంతమగుచో శమియింపవె తన్మణిప్రభల్. 151

వ. అని లక్ష్మణుం గనుంగొని. 152

ఉ. క్రౌంచనగేంద్రసింధురశిరంబు శరౌఘనఖాంకురంబులన్
జించి మరాళమౌక్తికవిశేషములన్ వెదఁజల్లి యెల్లెడన్
సంచితసింహవృత్తిఁ దగు న న్నిటుచేరఁగనుత్సహించి,కా
వించితి వద్భుతంబు ఐళి వీరకరీరమ పౌదు నావుఁడుణా. 153

క. ఆరాముతమ్ముఁ డిట్లను
నోఋషిసుత్రామ! మామకోత్సాహము నిన్
జేరుటకో సమరంబునఁ
బోరుటకో యిపుడు తెలియఁబోయినె నీకున్? 154

సీ. అనఁ గోపమున రాముఁ డనుజన్ము నీక్షించి
యన్న! యీదుర్వినయాతిరేక
మెందుండివచ్చె నీ కతఁడెంత? నీవెంత?
తాపసాక్షేపంబు తగునె యనిన
విని యతం డగ్రజుఁగనుఁగొని స్వామి! యా
నతివింటి నూరకున్నాఁడ ననుచు
మునిఁ జూచి యోతపోధన క్షమింపుము నేను
శ్రీరామునాజ్ఞ యంత్రితుఁడనైతి

గీ. ననుటయును,విని రాముతోననియె మౌని
యాహవవ్యగ్రమగు మదీయాగ్రహంబు
వాయ దీమంచిమాటలఁ "బాముకాటు
చీరఁదుడిచినఁ జనునె, యేసీమనైన?" 155

క. అటుగాక చాటువాచా
నటనం బిటఁ బనికిరాదు, నాయస్త్రంబుల్

చటులాస్త్రములఁ దెమల్పుము,
పటుసమరోచితముగాదె ప్రాయము, నీకుఁ? 156

వ. అదియుఁగాక. 157

గీ, జననుతంబగు రఘువంశమున జనించి
కౌశికు భజించి దివ్యాస్త్రగరిమఁ గాంచి
వెలయు నీ వింక క్షాత్రంబు విడిచితేని
నీకులంబున కపకీర్తి రాకయున్నె? 158

క. అనవుఁడు రఘునందనుఁడ
మ్మునిపతి నీక్షించి ముద్దుమోమున లేన
వ్వెనయఁగ వినయంబున నను
ననఘా! నీమాటనిక్కమగు నూహింపన్. 159

ఉ. వాసికినెక్కినట్టి రఘువంశమునం బ్రభవించి దివ్యబా
ణాసనవిద్యఁ గౌశికుదయం దగఁ గాంచితి నైనఁ దాపసా
గ్రేసర! దీన లోకు లపకీర్తియటన్నను గీర్తి యన్న, నే
భూసురుమీఁద నాయుధముఁబూనుటకై వెఱతున్ మనంబునన్. 160

చ. అనవినిభార్గవుండు సముదగ్రతరాగ్రహుఁడై రఘూద్వహున్
గనుఁగొని యోరిదుర్ముఖుఁడ! కౌశికుభాతి వసిష్ఠరీతి నీ
కనిశము మేలుగావలయునంచు సమాశ్రయణైకవృత్తిచే
నొనరెడువిప్రుఁడే భృగుకులోత్తముఁ డిప్పలుమాట లేటికిన్? 161

క. "ఎటువంటికష్ట మిస్సీ
యిటువలె నుచ్చావచంబు లీక్షత్రియుఁడా
డుట వింటి" మనుచు వెండియుఁ
గటకటపడి కటములదరఁగా నతఁడనియెన్. 162

క. సుతయుతముగ దశరథభూ
పతిఁ ద్రుంచి విదేహకులకబంధస్కంధో
త్పతదస్రలతాకేతు
ప్రతతిం గైసేతుఁ గదనరంగం బెల్లన్. 163

ఉ. నావుఁడు "బూచిబూచియని నన్నహహా! వెఱపింపఁ జూచెదీ
వీవెడమాట లింకవిడు మిట్లయినన్ మముబోటివారికిన్
భావములోన నాగ్రహముపాటిలు" నన్న విభిన్నరోషదా
వావిలవిగ్రహుండగుచు నాముని, రాముని జూచి యిట్లనున్. 164

క. మది నీకాగ్రహ మొదవిన
నౌదవుంగా కీవు సేయనోపినయది యె
య్యది వెడఁగా! 'నీకోపము
పెదవులతీటన నితాంతభీషణఫణితిన్. 165

వ. సావష్టంభంబుగా రఘునందనుఁడు భృగునందనున కిట్లనియె. 166

చ. అరిజయముల్ రణంబున సుదారభవద్భుజతోరణంబుగా
నిరువదియొండు గూర్చి యిపు డిర్వదిరెండవగెల్పుఁ గూర్పఁగా
నరయు మహోగ్రతావకశరాసన చాతురిఁ జూడఁ గోరెదన్
గిరిశ దురాపచాపవినికృష్టి నెదన్ బరితుష్టి చాలమిన్. 167

క. అన విని ముని సంరంభం
బెనయఁగ నేమంటివోరి! యేమంటివిరా?
యని, తద్వీరాలాపము
తనమనమునఁ దలఁచితలఁచి దర్పోద్ధతుఁడై. 168

గీ. మెండుకొని యెల్లదిక్కులనిండుకొనిన
భీషణంబగు మన్మహారోషవహ్ని
కాహుతులు కొన్ని యయ్యె విదేహరఘున్ఫ
పాలకుల మని మఱియు నబ్బార్గవుండు. 169

క. కోపాటోపము సైపఁగ
నోపక యెలుగెత్తి పలుకు నోహో సప్త
ద్వీపాభ్యంతరవర్తిమ
హీపాలకులార! యుండుఁడీ హెచ్చరికన్. 170

మ. జనయిత్రిందలద్రుంచి యెవ్వఁడు మహాక్షత్రాసృగాస్వాద మొం
దిన దోస్సారకుఠారధార ధరణిన్ నిఃక్షత్రియంజేసె, నె
వ్వనిబల్మూపులపుంటిగంటి నిపుడున్ రాలున్ మరాళచ్ఛలం
బునఁ గ్రౌంచాద్రికి నెమ్మి లమ్ముని మదింబూనెన్ బునఃక్రోధమున్. 171

సీ. అన రాముఁ డద్దిరా "యయ్యకుసివమెత్తె"
ననినవ్వి యిట్లను నతనిఁజూచి
"బాలకేళిఁ బురారికేలివిల్లవలీలఁ
జిదిమినబంటనే నెదుటనుండఁ
బటుభాషణములఁ జెంగటలేని రాజుల
వెఱపింపనేల యోవెఱ్ఱితపసి!
కృతవీర్యసుతమహోన్నతభుజాటవి ద్రుంచి
ఫలితార్థమైన నీబాహు వెద్ది

గీ. పోరుఁగా కది నేఁడేమి కూరఁగోయఁ
బోయెనే? యన ముని యోరి తోయజాప్త
వంశపాంసన! హరధనుర్ధ్వంసనంబు
మాటికిని బల్కెదేమిరా యోటలేక? 172

క. కటకటః రాచకనీసపు
మొటికయుఁ గృతవీర్యసుతసమున్నతబాహా
పటలీపాటనపటిమో
ద్భటబాహువు వెదకఁ జూపెదవు పాపవిధీః 173

క. అనుపమకోదండకళా
వినుతుఁడనగు నన్ను వంటివీరున కకటాః
మును వినని వినఁబలసెన్
గననివి కనవలసె నేఁడు కాలముమహిమన్. 174

వ. అనిపలికి. 175

క. మఱియును నుడువుం గైదువ
నెర నది మునుగెల్చితోరి నృపకీటకుః నా
నెఱసింగిణి విలుతెఱఁ గీ
వెఱుఁగుదువెకదా యటంచు నిట్లనిపలికెన్. 176

మ. మొదలన్ మద్గురుహోమధేనువునకై మున్ గార్తవీర్యుండు దాఁ
జమవన్నేర్పె ననేకరాజకవధస్వాధ్యాయ మివ్వింటికిన్;
మదిఁదక్తోగ్రధమహాగ్ని మీయెడఁగడున్ సామాన్యమయ్యెం బదిం
బదగా నేఁడువెలింగెడున్ గురుధనుర్భంగాజ్యధారాహుతిన్. 177

గీ. అనుఁడు రఘుసూతి వినుమోయి చెనటితపసి !
పట్టపసలేక పలువిచ్చి ప్రాతగిలిన
నీదుకీర్తిపతాక వర్ణింపనేల ?
చూపుమా నేఁడు నిలావుఁజూడవలయు. 178

క. అని కినుకపొడమి రాముఁడు
తనతమ్మునజూచి తెమ్ము ధనువన భృగునం

దనుఁ డోరిరాచవడుగా!
తనువెఱుఁగక యెన్నియఱచెదవు ప్రల్లదముల్. 179

ఉ. భావజసంహరుండు బహుభంగులనెక్కిడ వీతసారమై
యావిలు మున్నునొచ్చినది యందుకు నీవునిమిత్తమాత్ర, మీ
కావర మేటికిన్ నృపతిఖండనచండమదీయసాధనం
బీవిలు దైత్యవైరి దిది యెక్కిడుమా భుజదర్పమేర్పడన్! 180

క. పాయక యీవిల్లెక్కిడి
యీయెడ నన్నెదిరితేని నిదెచూడు కుఠా
రాయుధమున్నది హేతి మ
దీయమహాక్షత్రసత్రదీక్షావిధికిన్. 181

సీ. అని రాముచేతికి నమ్మహాకోదండ
మొసఁగినఁ గైకొని బిసరుహాప్త
వంశవతంస మవ్యాచంయమిస్వామిఁ
గాంచి యిచ్చోటు సంగ్రామమునకు
వలనుగా దలసమస్థలమున కేగుద
మనినఁ, గోపంబుసఁజనుచు మౌని
సమధికక్షాత్రతేజంబున బ్రహ్మతే
జమునదర్పించు నోజనములార!

గీ. మీరు నిఖిలాస్త్రశుభకరాశీరవముల
గావుఁ దేతత్కృతారాత్రిగదపి ప్రోవుఁ
దదశరథము నరామంబు నజనకంబుఁ
జేయుచున్నాఁడఁ గినిసి యీక్షితితలంబు. 182

వ. అని భృగునందనుండు రఘునందన సమేతుండై సమరయోగ్యస
మస్థలంబునకుం జనిన యనంతరంబ, 183

ఉ. కన్నియయొర్తు పన్నిదముగల్గునొ యిందుకునంచు ఖిన్నతన్
మిన్నకచూచు సీత ముఖనీరజపాండిమ యాకసంబునన్
వెన్నెలఁగాయఁ, జక్రధరువిల్లరివోసి శరంబుఁగూర్చి వి
చ్ఛిన్నముగాఁగనేసె రఘుసింహుఁడు భార్గవుదివ్యమార్గమున్. 184

గీ. పౌరు లప్పుడుమాంగల్యభాసమాన
వాద్యనినదం బొనర్చుచు వసుమతీసు
తావివాహోత్సవసమన్వితంబుగాఁగ
భార్గవజయోత్సవంబును బాడి రెలమి. 185

క. అటువలె నేసిన పిమ్మటఁ
దటుకున దాశరథి జామదగ్న్యునితోడన్
ఘటితాంజలిపుటుఁడై యు
త్కటవినయధురీణుఁడగుచుఁ దానిటనియెన్. 186

మ. అనికింబిల్చిన వైరికోటి యెడ మా కస్త్రంబు శాస్త్రోక్తమై
చనినన్, విప్రులయం దనాయుధకళాజల్పాకు లిక్ష్వాకు ల
జ్జనసంస్తుత్యుల పావనాన్వయమునన్ జన్మించియు న్నాకు దు
ర్వినయంబిట్లొదవెన్, సహింపుము తపోవిద్యానవద్యవ్రతా! 187

ఉ. నావుఁడు మౌనియిట్లనియె నవ్వుచు నీయెడఁదప్పులేదు వ
త్సా! వివరించెదన్ వినుము, తావకవైష్ణవదివ్యతేజ మే
నీవిధిఁజూడఁగోరి కినియించి తదున్నతిఁగాంచి యద్భుతం
బావహిలంగ నిర్భరుఁడనైతి నొకింత హృదంతరంబునన్. 188

సీ. అన రాముఁ డనయంబు వినయంబుదళుకొత్త
మౌనిగన్గొని యోమహానుభావ!
యిటకువేంచేయుఁ డింకిటకువేంచేయుఁడు
నావుఁడునతఁడు చిన్నారిముద్దు

గడ్డంబుఁబుడుకుచుఁ గారాదు మముబోటి
యారణ్యకులకు నోయన్న! తడవు
జనపదావాసంబు విను మట్లుగావునఁ
బోయిపచ్చెద నుండఁబోలదనిన,

గ. తాటకారాతి వల్కె నోతాపసేంద్ర!
పంక్తిరథుఁడును జనకభూపాలమణియు
యాజ్ఞవల్క్యసమేతులై యల్లవారె
యెదురుచూచుచున్నవా రెదుట మీకు. 189

గీ. అచటికేతెంచి వారిచే నర్ఘ్యపాద్య
ముఖ్యసముచిత సత్కారములను గాంచి
నెమ్మి నిక్ష్వాకుకులమును నిమికులంబు
పావనము సేయుఁ డనిన నప్పారికాంక్షి. 190

వ. రఘునందనుంగనుంగొని యన్నా! సకలజనమాన్యులగు నిట్టి రాజన్యుల యాతిథ్యకార్యం బపరిహార్యం బైనను బైఘానసోచితాచారంబునకు దూరంబగు పుత్త్రప్రచారంబుకతన నిఖిలధర్మాచార్యుం డగు యాజ్ఞపల్క్యమునిపర్యు సన్నిధానంబునకు రా నాన యయ్యేడు నీయెడనయుండి మద్భావంబున నమ్మహానుభావు సేవింతునని పల్కి యుచ్చైస్స్వరంబునం దత్సభాజనంబువిన నిట్లనియె. 191

గీ. అర్థి ధర్మార్థకామమోక్షార్థులైన
చతురు లేయోగిపతిమహాశ్రుతిఁబఠింతు
రట్టి యనవద్యవిద్యావిహారభూమి
యాజ్ఞవల్క్యయతిస్వామి నాశ్రయింతు. 192

వ. అని కృతాభివందనుండగు భృగునందనుంగుఱిచి నృపాస్థానాసనాసీనుండగు నయ్యోగి తుహినభానుం డిట్లనియె. 193

క. ఓయనఘః నీయఘంబున్
గాయత్రీదేవియడఁచు, నానామునిరా
ద్ధేయములగు "పవమానము"
లేయెడ నీతపములకు సమృద్ధియొసఁగున్. 194

గీ. అనుచు దీవింప భార్గవుఁడతని కర్థి
నంజలిఘటించి యోగిశిఖావతంస ః
మిగులలజ్జించియున్నాఁడ మిమ్ముఁజూడ
నాకనుజ్ఞయె యిక నరణ్యమునకనిన. 195

మ. అగు నీకున్ విజయంబు పౌష్కలిలగేహంబుల్ భవద్గేహముల్
సుగుణశ్రీమయమౌళిమాల్యమగు దెచ్చో నీవుమాటోంట్లకున్
జగదుత్పాదనరక్షణప్రహరణేచ్ఛావిహారికిన్ శౌరికిన్
దగనట్లాఅవమూర్తివై భృగుకులాంతర్మూర్తివై తీయెడన్. 196

వ. అనిపల్కి యాజ్ఞవల్క్యుచేత ననుజ్ఞాతుండై భృగువంశకేతుండు లక్ష్మణభ్రాతంబేర్కొని వినీతింజేరు నక్కుమారులంగ్రక్కున నక్కునం జేర్చి యన్నాః రాచమిన్నః విరచితోద్వాహగేహమంగళాచారుండై సీరధ్వజమహీదారుండు నిన్నుఁ బ్రతీక్షించుచున్న వాఁడన్నరేంద్రు నభ్యర్ణంబునకుఁ దూర్ణంబుగఁజనుమని వినిర్గమింపఁ దన్మార్గభాగంబు సోద్వేగంబుగాఁ గొండొకతడవు వీక్షించి యింక నేనును దాతసన్నిధానంబున కరిగెదననుచుఁ జనుచున్న రఘుపుంగవుండు ముంగలనవలోకించి యౌరా మదీయజనకుండును జనకుండును నిచ్చటికే వచ్చుచున్నవారనునంతఁ గొంతయేతెంచి యతనిం గాంచి యారాజన్యులన్యోన్యపరిరంభణంబులాచరించిరపుడమ్మిథిలాధీశ్వరుం డుత్తరకోసలేశ్వరున కిట్లనియె. 197

గీ. జనవరోత్తమ! నీపతి జామదగ్న్య
కరపరశ్వధగర్వనిర్భరనిసర్గ
క్షాత్రతేజంబు గయికొన్నచంద మింక
నాత్మఁజాయునె భువి నైతిహాసికులకు. 198

క. అని యతఁడు నికటసరణిం
జనుదెంచు సుబాహుదైత్యసంవర్తకృతాం
తునిఁజూపి మదిఁ గుతూహల
మెనయఁగ నిట్లనియె దశరథేశ్వరుతోడన్. 199

సీ. జగదేకజీవాతువగు రాజమగటిమి
మగుడనిల్పిన మేటిమగఁడు వాఁడె
భార్గవీయభుజానిసర్గగర్వోద్రేక
మణఁగ రాచిన వీరవరుఁడు వాఁడె
వంశకర్తలలోన వనజాతవనబంధుఁ
గొనలకెక్కించిన ఘనుఁడు వాఁడె
వర్ణాశ్రమాచారనిర్ణేతయై ధాత్రిఁ
బాలింపఁదగు ధర్మపరుఁడు వాఁడె.

గీ. తేవనేతెంచి నేత్రరాజీవయుగళి
నమృతపూరంబుఁజల్లెడు నల్లవాఁడె
యఖిలకల్యాణగుణవైభవాభిరాము
రాము నీక్షించితే పంక్తిరథనృపాల! 200

గీ. అన నతఁడువల్కుమాలక్ష్మణాగ్రజుండు
బాలుఁడయ్యును ధర్మసంశీలుఁ డగుట
శరధి పరివేష్టితాఖండ ధరణిమండ
లాధిపత్యాభిషేకోత్సవార్హుఁ డనఘ! 201

వ. కావున 201

మ. ప్రకటంబైన జరాభరంబున వహింపన్‌రాని వర్ణాశ్రమా
ధికభారం బిక నీకుమారకునియందే నిల్పి యస్మద్దిలీ
ప కులాచారము పేర్మి మైననుభవింపంగోరియున్నాఁడ నే
నొకసిద్ధాశ్రమసీమ మౌనినయి యాయుశ్శేషమున్‌మైథిలా! 202

గీ. అనుఁడుజనకుండు బళి దశస్యందనా ! త్వ
దీయహృదయంబు మిక్కిలి దేశకాల
భాగవిజ్ఞాని గాదె నీపనికి నట్టి
దారి క్రమముగ నడవంగఁదగిన దనఘ! 203

క. అనివా రన్యోన్యము ముద
మెనయఁగ భాషించుతఱిని నిద్ధచరిత్రుం
డనఘుఁడు రఘురాముం డట
చనుదెంచి వినీతి నతులు సల్పెఁ గూర్మిన్. 204

క. వారిరువురు రఘుపుంగవు
రా రమ్మని కౌగిలించి ప్రకటానందాం
భోరాశిఁ దేలి రయ్యెడ
సారమతిం దశరథుండు జనకున కనియెన్. 205

ఉ. ఓ మిథిలేంద్ర! రాముఁ బ్రమదోన్నతిచే నభిషిక్తుఁజేయ శ్రే
యోమహితంబు బార్గవజయోత్సవకాలము నేఁడు యోగ్యమౌ
నే మిట నాలసించుటకు హేతువటంచును బల్కుచో గుణ
స్తోముఁడు లక్ష్మణుండరుగుదెంచి నమస్కృతిఁజేసి యిట్లనున్. 206

గీ. అయ్య ! నేఁ డిదె మామధ్యమాంబ లేఖ
పంపె మంథరచేనంచుఁ బలుకఁ, బంక్తి

రఘుఁడు జనకుండు మదినిబ్బరంబుఁజెంది
యొండొరుల మోమువీక్షించి యుల్లములను 207

శా. ఏమో యంచుఁ దలంచుచుండఁ, బ్రమదంబేపారఁగా రాముఁడో
సౌమిత్రీ ! మనయంబకున్ హితవయస్యాశ్రేణియుక్తంబుగా
క్షేమంబే యని నీకు మంథరయెఱింగించెంగదా ! నాఁవు డా
నామాడ్కిన్ వచియించె, నన్నయెడ నుద్యత్ప్రీతిమై నిట్లనున్. 208

గీ. సిద్ధ మస్మత్ప్రవాస దౌశ్చిత్య్య మంబ
నకట పీడించుననిపల్కునవసరమున
జనకుఁ డాలేఖఁగైకొని జనములెల్ల
నాలకింపుచునుండ నిట్లనుచుఁ జదివె. 209

సీ. "శ్రీమదఖండధాత్రీమహామండలే
శ్వరులైన దశరథేశ్వరులదివ్య
పాదపద్మములకు భక్తిమైఁ గేకయ
విభుతనూభవ సేయువిన్నపంబు,
స్వామి! దేవాసురసంగరభూమి ము
న్నంగీకరించినయట్టివరము
లవిరెండు నిప్పు డేసడిగెద, భరతు న
శేషసామ్రాజ్యాభిషిక్తుఁ జేసి,

గీ. లక్ష్మణునిగూడి జానకీలలనతోడఁ
దాపసాకృతిఁబూని పద్నాలుగేండ్లు
దండకాటవి రఘురామునుండఁబనిచి,
నన్ను మన్నింపుఁ డింతయవిన్నవంబు." 210

వ. అని పఠించి. 211

క. అటిముఱి గుండె బగ్గురన నమ్మిథిలేశుఁడు కంపితాంగుఁడై
కఅచినచిల్వనుంబలెను గమ్మ కడంబడఁ జిమ్మి కన్నులం
దఱచుగ నశ్రుబిందువులుదారొ్కనఁగా నిలు పోపలేక యు
స్సుఱుమని మైఁజెమర్ప గడుశ్రుస్సుకుచు మూర్ఛిలిఁవ్రాలె ధారుణిన్ 212

ఉ. అత్తఱిఁ బత్రికార్థకఠినాశని కర్ణగుహన్ వడింబడన్
జిత్తమృగేంద్ర మిట్టునటు జిందఱవందఱయై చలింపఁగా,
నుత్తరకోసలక్షితిభృదుత్తముఁడున్ నయనాశ్రుసిక్తరుల్
మొత్తముగాఁగఁ బర్వఁబెనుమూర్ఛ ధరాస్థలిఁవ్రాలె నెంతయున్. 213

సీ. చటులహాలాహలచిటచిటాత్కృతి విని
మైమఱచిన ధాతృమఘవులనఁగఁ
గల్పాంతభైరవకహకహాత్కృతి విని
ధరఁ ద్రెళ్లు మేరుమందరములనగఁ
బఱగసాంద్రమాద్గరుత్పటపటాత్కృతి విని
సురిగిన శేషవాసుకులనంగ
నున్నిద్రశరభకంఠోత్థహాహాత్కృతి
విని సొమ్మసిలు రవివిధులనంగ

గీ. నటుల దుర్వార్త వీనులనంటి గెంటి
ప్రకటమూర్ఛాంధకారనిర్మగ్నులైన
జనక దశరథ ధారుణీశ్వరులక్రమము
శైత్యకృత్యంబులను రామచంద్రుఁ డడఁచె. 214

వ. అపు డక్కమ్మ నెమ్మొగమ్మునఁ గనుదమ్ముల నొత్తుక యుత్తమాంగంబు సేర్చికొని యమందానందంబున సుమిత్రానందనుంగనుంగొని యన్నః లక్ష్మణః శుభలక్షణాఢ్యయు నయోనిజన్మయు నస్మదారాధనస బ్రహ్మచారిణియు నగు మీవదినెం దరలించుక గమనోచితోద్యోగంబున

నతివేగంబునఁ బురోభాగంబున వసియించియుండు మని నియోగించిన నతం డొకించుకేనియుఁ బ్రతిసెప్పక యప్పలుకంగీకరించి గుప్పునంజని యె నంత నమ్మిథిలాకాంతుం డెట్టకేలకునిట్టూర్పునిగుడించి కేకయనంద నం దలంచి యిట్లనియె.

సీ. త్రిభువనఖ్యాతకీర్తికలాపుఁడైన కే
కయచక్రవర్తి నీకన్నతండ్రి
యఖిలలోకారాధ్యుఁడై తనర్చిన కైర
వారి నీ శ్వశురాన్వయంబుకర్త
యభియాతినృపసేవితాంఘ్రినసరోజుఁడై
యలరిన యజుఁడు నీ యనుగుమామ
శక్రాభివర్ణితవిక్రమక్రముఁడైన
పంక్తిరథుండు నీ ప్రాణభర్త

గీ. యట్టి నీ కిపు డయ్యయో యద్భుతముగ
సకల రాజపురంధ్రికాజనవిసంద్య
మైన దుస్తరనాథదుఃఖావలోక
దురిత మొడిగట్టె నిటు లేలతోచె నకట. 216

వ. అని సోపాలంభంబుగాఁబలికె నప్పు డప్పంక్తి రథుం డొక్కించు కసేద దేరి హా యని రామునకిట్లనియె. 217

గీ. దారుణావాచ్యదుస్తరదాహమోహ
మయమనోభావవిషయమై మాకుఁ జాలఁ
బ్రాప్తమైనది దుఃఖానుభవము తనయ !
యిట్టిమముఁ బాసిపో నుత్సహింపఁ దగవె; 218

గీ. అనుచుఁ గొండొకతలపోసి యవనిపుత్రిఁ
దలఁచి హా సీత! జానకీ! దనుజకోటి

కాతిథేయిూఘవించుట కకట నేఁడు
నీవు నాయిల్లు సొచ్చితే దైవవశత. 219

క. అన నంత జనకభూపతి
కనలుచు నాకసముఁజూచి కైకేయి ! బళీ
పెనిమిటియనుసరణము నా
తనయుకుఁ గృపసేసి తనుచుఁదానిట్లనియెన్? 220

సీ. ఆప్రదేశములు దశాస్యబాహాదండ
చండవిక్రమమున మండుచుండు
నీరామలక్ష్మణు లిషుచాపపాణులు
కానఁ గయ్యము తమదానె కలుగు
నావనభూములు హర్యక్షశార్దూల
దుర్వారసంచారదుస్తరంబు
లీధరానందన యెంతయు ముద్దరాల్
బాల గావున భయభ్రాంతినొందు

గీ. నకట నీమాట నీయకృత్యంబు సేసి
దశరథుండు నిజాపవాదంబు గడిగి
కొనుచు ముక్తాసుఁడగును నీకులమువారి
యపయశం బింక నేమిట నణఁగునొక్కొ ! 221

వ. అదియునుంగాక. 222

గీ. భరత రాజ్యరమా కర్ణపటుతమాల
కిసలయంబైన నీయపకీర్తి దిక్కు
లందుఁబ్రబలంగ మాకైననరయఁదరమె
యకట తలయెత్తి లోకుల యాననములు. 223

క. అనునంత రాముఁడిట్లను
జనకునితో మద్గురుండు స్వస్థుండై యుం
డె ననుచు నే విను నట్లుగ
ననఘా! నడిపింపవలయు నని యుత్థితుఁడై. 224

ఉ. వారలకుం బ్రదక్షిణము వచ్చి నమస్కృతిఁజేసి సమ్మదో
దారమనస్కుఁడై మహిసుతన్ మఱి లక్ష్మణుఁ గూడి వెంబడిం
బౌరులు మంత్రులున్ హితులు బాంధవులుం దను బాయలేక బల్
గారవమొప్ప నిల్వఁ దనగాఁ నరుదేరఁ బురంబు వెల్వడెన్. 225

ఉ. అంతటలేచి పంక్తిరథుఁ డన్న! రఘూత్తమ! నిన్నుఁబాయలే
నెంతయుఁ బ్రాణముల్ నిలువ వేగతి నోర్చెద నిందురావె నా
చింతలువంతలుం దొలఁగఁజేయవె యంచును బల్ రవంబుతో
నంతిపురంబు సేరె మిథిలాధిపుఁ డూతయి యూరడింపగన్. 226

మ. అణిమాదీశ్వరతార! తారశరనీహారప్రభాకార! కా
రణనిర్ముక్తవిహార! హారదురగప్రాంచద్భుజోదార! దా
రణఘోరాసురమార! మారదహనారంభాతిదుర్వార! వా
రణజిద్దోస్సహకార! కారదమరుప్రధ్వానదీర్ఘాంబరా! 227

క. కాండాఖండపిచండా!
చండాంశుసహస్రధామచణదోర్దండా!
దండాయుధమదఖండా!
ఖండాబ్జయుతోత్తమాంగ గంగాకాండా! 228

మాలిని మథితదనుజగోత్రా! మందరద్రూపగ్యగోత్రా!
విధు రవి శిఖ నేత్రా! విస్ఫురచ్చర్మనేత్రా!
బుధసరసిజమిత్రా! భోగిపర్యంకమిత్రా!
ప్రథితగుణపవిత్రా! పాపవల్లీలవిత్రా! 229

గద్య. ఇది శ్రీమద్రామేశ్వరశాశ్వతకృపాకటాక్షవీక్షణసమాసాదిత సకల
సామ్రాజ్యధౌరేయా శ్రాంతవిశ్రాణనావధీరిత రాధేయ బిజ్జుల
కులకలశనిధానకార్తికీనిశాకళత్ర వెన్నాళగోత్రప
విత్ర కృష్ణరాయమహీధవకుమార సంగరాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాల ప్రణీతంబైన యనర్ఘరాఘ
వంబనుమహాకావ్యంబునందు
తృతీయాశ్వాసము
సంపూర్ణము

# అ న ర్ఘ రా ఘ వ ము

## చ తు ర్థా శ్వా స ము

---

శ్రీరామేశః రమేశాం
భోరుహసంభవ సురేశ ముఖ దివిజమన
స్సారసనివేశః కేశవ
పారాకాశావకాశః ప్రాకటురీశా! 1

వ. అవధరింపు మాసమయంబున జాంబవత్ప్రేషిత పూర్వాయైన, శ్రమణ మిథిలాపురవృత్తాంతం బాద్యంతంబుగా నెఱింగి క్రమ్మఱి యతని పాలికివచ్చి సంభాషించుచు నిట్లనియె. 2

సీ. అంతట జనకధరాధీశు నగరంబు
వెడలి నే మంథరయొడలు విడిచి
పవనతనూజగోపాయితంబైనట్టి
యాత్మదేహము నెప్పటట్లతాల్చి
గంగాతరంగిణిఁ గడచి సత్వరగతి
శృంగిబేరపురంబుఁ జేరియున్న
యంత నావెంటనే యలవారె రాఘవు
లిదె సీత యనువార్త లెల్లదెసలఁ

గీ. తెలఁగ గుహుఁ డంతలోనన్నుఁ జేరవచ్చి
"రామ లక్ష్మణులనఁగ నొప్పు మీర
లెవ్వ రిది నాకు నెఱిఁగింపవే" యటన్న
నించువేడుక నతనితో నిట్టులంటి. 3

చ. ఘనముగ నెమ్మదిన్ సుతులఁగాంచఁగ ముచ్చటనొంది ఋశ్యశృం
గునిఁ దగ వేఁడ, నాతని యనుగ్రహశక్తి రమాధవాంశులన్
దనయుల నల్వురం గనియె ధన్యుఁడు పంక్తిరథుండు, వారిలో
ననఘగుణాభిరాముఁ డితఁ డాద్యుఁ డతండు తృతీయుఁ డెన్నఁగన్. 4

గీ. అనుచు వచియింప నాభల్లుకాధినాథుఁ
డాత్మ నలరుచు మీఁద నేమాయె ననిన.
శ్రమణ యతనికిఁ గర్ణరసాయనముగ
ననుపమోజ్జ్వలఫణితి నిట్లనుచుఁ బలికె. 5

క. కుతుకాగత బాంధవ సం
తతి నుదకాంతముగ ననిచి, దశరథసూనుం
డతిభక్తిఁ గుహుఁడు గొని రా
నతులితగతి నోడయెక్కె హర్షోజ్జ్వలుఁడై. 6

శా. కామారిప్రియమౌళిమాల్యమగు గంగం దాటి యానావికున్
సౌమిత్రిప్రియబంధుతా దరముచే సంప్రీతుఁ గావింపుచున్
వ్యామగ్రాహ్యకుచాలసల్ శబరకాంతల్ వేడ్కమై వెంటరాఁ
బ్రేమం జేరెను జిత్రకూటము మృగాళీలోజ్జ్వలత్కూటమున్. 7

గీ. అనిన విని జాంబవంతుఁ డాహా! యిదెంత
కరుణ మొనఁగూడె నన నందుకతనఁగాదె

దాచి పల్కితి నింగుదీతరుతలమున
జడలు వారలు దాల్చుట నుడువలేక. 8

ఉ. నా నతఁ డక్కుమారుల కనారత దైవబలంబుకల్మి నో
మానినిః మీఁద నంతయుఁ గ్రమంబున మేలగు నంచు బల్కఁగా,
నా నలినాక్షి వల్కె వినయంబు ఘటిల్లఁగ గొన్ని నాళ్ళు నే
నానికటంబునందె గుహునానతి మీఱక యుంటి నెంతయున్. 9

వ. అంతఁ గొంతకాలంబునకు భరతుండు ప్రకృతి పౌర జానపదసహితుండై దశరథస్యందనస్వర్గాధిరోహణవార్త యగ్రజన్మున కెఱింగించి యయోధ్యానగరంబునకుఁ దోడ్తెత్తునని యమ్మార్గంబునఁ జిత్రకూటాచలంబున కేతెంచి· 10

సీ. రఘురాముఁ జూచి నేత్రజలప్రవాహముల్
గుఱియఁ బాదంబుల కెఱగి కొంత
తడవున కయ్యెదంతము గద్గదస్వర
మున నెఱిఁగింప, రాముఁడును శోక
మూర్ఛితుఁడై ధైర్యమున నంతఁ దెలివొంద
నోరఘూత్తమః రాఘవులభరంబు
భరియింప నింక నెవ్వరుదిక్కు మీ రయో
ధ్యకువచ్చి ప్రజల సంతాపభరముఁ

గీ. బాపవలె నని ప్రేమానుబంధ మలర
మాటికినిబల్కు తమ్మునిమమత జూచి,
యలరి 'మాయాన నీకు నేమనిన నింకఁ
దండ్రియానతి జవదాటఁదగునె మాకుః 11

క. కావున నీవును దశరథ
భూవరుచందమునఁ బ్రజలఁబోషింపుచు నెం
తే విభవ మలర నీతిం
గావింపుము రాజ్యపాలకత్వము ననఘా! 12

గీ. అనుచు నూఱడించి యనిపిన భరతుఁడు
జడలు దాల్చి రామచంద్ర విభుని
పాదుకాద్వయంబు భయభక్తి శరభంగ
మునివరుండు వనుప ముదము మీఱ. 13

క. అందుకొని కన్నుఁగవ నా
నందంబున నొత్తుకొనుచు నవ మణిపీఠిం
జెందించి ప్రజలఁబ్రోచుచు
నందిగ్రామమున నుండె నయ మలరంగన్ 14

క. అనిన విని జాంబవంతుఁడు
మనమున సంతసమునొంది మనకోర్కిఫలిం
చెను మీఁదిసుద్ది యేమన
ననుపమ మృదువచనరచన నది యిట్లనియెన్. 15

ఉ: అంత ఖరాదిరాత్రిచరు లాత్మఁ జెలంగి పితృవ్యథాసమా
క్రాంతుఁడు సూతకుండు నగు రాఘవుఁ డస్త్రపరిగ్రహంబు దా
నెంతయుఁ జేయఁ డిట్టితఱి నేపనిఁ బూనిన నౌనటంచు దు
ర్దాంతపరాక్రముం డగు విరాధనిశాచరుఁ బంపి రం చనన్. 16

గీ. కటకటా! బుద్ధిశూన్యులుగాదె దనుజు
లేటి సూతక మొకకార్యమెదిరినపుడు

రాజుల కటంచు భల్లూకరాజు పలికి
యంత నేమాయె ననిన నయ్యలరుఁబోడి, 17

క. అంత విరాధుని రాఘవు
డంతకపురి కనిచి సంభ్రమాతిశయం బా
త్మాంతరమునఁ బెనఁగొన న
త్యంతత్వర నుత్తరక్రియలు దీర్చెఁదగన్. 18

వ. తదనంతరంబ.

సీ. దురవగాహ గభీరతర చతుఃపాథోధి
ముష్టింధయుండయి మొనయు మేటి
విశ్వదురాలోక వింధ్యభూధర చాప
లారంభఘాతియై యలరు దిట్ట
వాతాపిదానవావార్య నిద్రాపూర్ణ
మంగళకలశమై మనినదంట
యంభోజ సంభవ జంభారిముఖ నిర్జ
రస్తుత ప్రతిభచేఁ బ్రబలు జాణ

గీ. యల యగస్త్యతపోనిధితిలక మతని
యాశ్రమంబున నున్నంత యటకు వచ్చి
యకట ధారాధరాఖ్యవాయసవిభుండు
నిబిడ గర్వాంధకారంబు నిండికొనగ 20

చ. కన దసురాభిచారచరు కాంచనకుంభమనంగఁ బొల్చు భూ
తనయకుచంబు ద్రోటికొనఁ దద్దయు జీరలువారఁ జీర న
ప్పనికి సహింప కారఘునృపాలుఁడు వాని నిషీక మేసి నే
ర్పున నయనాంధుఁ జేసె రఘుపుంగవు కాండము రిత్తవోవునే! 21

వ. అనిన జాంబవంతుడు విస్మయాయత్తచిత్తుండై యచ్చలికథ యడుగ, నవ్వరారోహ యిట్లనియె 22

క. క్రమమున సుతీక్ష్ణముఖ్యుల
యమిచంద్రులఁ గాంచి వార లనుప నగస్త్యా
నుమతిన్ రఘురాముఁడు సం
భ్రమమునఁ బంచవటి నుండె మౌనులుచెలగన్. 23

మ. అనినన్ భల్లుకసార్వభౌముడు ప్రహర్షాత్యంతపూర్ణాప్రలో
చనుఁడై యట్లన యేని మేలగు జనస్థానోర్వి కీ ఋశ్యమూ
క నగంబుం దవు లేమ చేతెడె యనన్, గంజాక్షి నీ విప్పుడున్
వినకున్నాడవె యొక్క వార్త యని యెంతే వేడ్కఁదానిట్లనున్. 24

సీ. వినుము జనస్థానమున నుండి యొకనాడు
పాపాత్మయైన శూర్పణఖ యచటి
కేతెంచి రఘురాము నీక్షించి మోహిత
యై మోసపుచ్చెద ననెడు వేడ్క
వర్తింప, నారఘూద్వహుఁ డుపేక్షాబుద్ధి
గనుఁగొన, దాని లక్ష్మణుడెటింగి
ముక్కునుఁ జెవులుఁగెమ్మోవియుఁగోసి యా
హుతులుగాఁ గ్రోధాగ్ని నొనర వేల్చె,

గీ. ననిన విని జాంబవంతుఁ డత్యలఘుభీతి
బాల! యిదిచాల చేటుకు మూల మింత
గాసినొందిన యనుజాత గాంచి యిప్పు
డహహ ఖరదూషణాదు లేమౌదురొక్కొ! 25

క. అనవిని యంగన నవ్వుచు
ననియెన్ రఘు రాముఁ డాహవావని విలుచే

కొని నిలిచిన ఖరదూషణ
దనుజులమా టడుగ నింకఁ దావున్నదియే? 26

మ. అటులైనన్ దివిజేంద్రసూనునకు సాహాయ్యంబుగా వచ్చి యు
ద్భటులై తాము విరాధుత్రోవనె చనం బాల్పడ్డవా రంచు ను
త్కటహర్షంబున భల్లుకుండు నగి యక్కంజాక్షితోఁబల్కె మి
కుటమై రాఘవరావణాదులకుఁ జేకూడున్ విరోధం బికన్. 27

చ. అనవిని యావధూటి దరహాసము మోమున నంకురింపగా
ననియె ఖరాదిదానవులయాపద దా వచియింపఁబోయి శూ
ర్పణఖ మృదూక్తిలంపటఁజపాలుగఁజేయదు కార్య మంతయున్.
దనదు నిరక్షరాస్యమె తుదన్ వినిపించు సురారి కెంతయున్. 28

వ. అనినవిని జాంబవంతుడు మందస్మిత సుందర వదనారవిందుడై యతి
లఘూత్థానం బగు నీయర్థవిధానంబు మనంబునం దలంప నద్భు
తం బయ్యెడు నని మఱియు నావధూటితో నిట్లనియె. 29

మ. అల గాధేయమఖాదిగా నగు నసూయం బూని దేశజ్ఞుడున్
బలవంతుండు త్రిశక్తిసంయుతుడు నున్మత్తుండునై ఖ్యాతి వ
ర్తిలు లంకేశ్వరు డెట్లుసైచునొ ఖరాది చ్ఛేదనాకర్ణనా
కులతన్ శూర్పణఖానికారమును గన్గొన్నైన రోషంబునన్. 30

గీ. మెల్లమెల్లనె కలహంబు మించివచ్చె
గాన నసహాయు డగుచు రాఘవుడు సూర్య
సూనుతో సంధిఁజేయుంగ జూచు నింక
ననిన యాభల్లుకుని జూచి హర్ష మొదవ 31

క. వినుమింకఁ గార్యమొనగూ
డును మత్ప్రియశిష్యపుత్రుడు గుహుం డనువా

దనుఁగుజెలి లక్ష్మణున కా
తనిచే మనకిప్పు డనుచుఁ దరుణి వచింపన్. 32

గీ. జాంబవంతుండు విని దాని చతురవచన
రచన కలరుచు ననియె నోరమణి! నీవు
వనజహిత సూతి పక్షపాతినివి గాక
నతని నిటకిప్పుడనుపుమా యనిన జనియె. 33

వ. అంత జాంబవంతుడు నలుదెసలుం జూచి యోరా సుకృత పరిపాకవర్ధిత చిరాయువగు జటాయువు మత్ప్రాణబంధుండుగావున దక్షిణాశాముఖంబున నిట కేతెంచుచున్నవాడు. గృధ్రంబులు దూరదృష్టులు గావున నొకానొక భంగి నీలంకాద్వీప వృత్తాంతంబుఁ దెలియకుండండేను నచటికిం బోయి యాయుదంతవిశేషంబశేషంబుగాఁ దెలియదు నను నంత నతండు ప్రవేశించి పంచవటిం జేరినట్లు నామనంబున నిశ్చయించితి. గోదావరీతీర తరంగసేక సుకుమారమాంసలపరిసరారణ్యభూములగు జనస్థానసీమలం గనుంగొంటి నని యిట్లనియె. 34

మ. వల నొప్పన్ మధుమత్తకోకిలవధూ వ్యాధూతచూతాంకురో
జ్వలదాకీర్ణ లతాంతరేణు సికతాజాలాతి దుష్ప్రాపక
స్థలులన్ లుబ్ధజసాధ్వసంబున మృగీసంఘంబు లంఘించి త
త్కలితాసార షరాగలుప్త పదవిం దానుండె నిశ్శంకతన్. 35

గీ. అనుచు బలుకుచుండ నట గొంత దవ్వు దా
నేగి యోమహాత్మ! యిప్పు డింత
వేగ మెచటనుండి విచ్చేసినా రన
నతనితో జటాయు వనియె నపుడు. 36

సీ. వింధ్యశైలమునందు విహరించు మాయన్న
సంపాతి ఖగనాథు సంభ్రమమున
దర్శించి వచ్చుచో దశకంఠుఁడిప్పని
నీచుఁడైనట్టి మారీచుఁ గూడి
విహరింప నియ్యది విషమకార్యంబని
ప్రాణబంధువుడైన పంక్తిరథుని
తనయున కెఱిగింపఁ జనుచున్నవాఁడ నే
నటుగాన నిలిచి మాటాడఁగూడ

గీ. దనఘః నామీఁదదయయుంచి యనుపు మనిన
నలరి నేగోరినట్టి కార్యమె యితండు
సేయఁబూనె నటంచు యోజించి యతడు
మమత నాతని ననిపి తా మరలి చనియె. 37

వ. అంతఁ గొంతదూరం బాకసంబునం జనిచని సకలమునిజనాకీర్ణంబగు పంచవటాభ్యర్ణంబుఁ జేరి సవితర్కంబుగా నిట్లనియె. 38

చ. కనకమృగంబు మాడ్కి దశకంఠుని నెచ్చెలి రాము దూరమున్
గొనిచన, లక్ష్మణుండు కడుఁగోపమునన్ వెనువెంట నేగ ని
ద్దనుజ విభుండు భిక్షుక విధంబున భీతిని బర్ణశాలకున్
జని తన తొంటిరూపుననె జానకిచెంగట నిల్చె గొబ్బునన్. 39

క. హానాథః నాథః యనుచున్
దీనతమై గురళివోలె దెగి మొఱవెట్టన్
జానకి రథమున నిడికొని
యీనీచుం డెందుఁబోవ నెద దలచె నొకో! 40

వ. అని యాటోపంబున. 41

మ. అదె యోరోరి దశాస్య! మూఢమతివై యైక్ష్వాకుదేవేరి కి
య్యదనన్నీవు కరాభిమర్శమలినత్వాపాదివై సంతసి
ల్లెదుగా! యాదుర్లలితాపుల స్త్యముఖులన్ లెక్కింపవై తేద్వారన్
మది నయ్యో! యన రావణుండు పలికెం బక్షీంద్రు దాలింపఁగన్. 42

క. భువన విమోహన భాసం
భవయను నామిషము గొన్న మామకకరభాల్
చివుకున ముదిగృధ్రము గొని
దవుఁజనునో యనిసి సతతుఁ పసఁజున కనియెన్. 43

గీ. ఓరియేమంటి వేమంటి వోరి? దాక
వాన్వయాధమ! మిథ్యాట్టహాస ధూమ
ధూసరిత వక్త్రవల్మీక! దుష్ట చరిత!
యదరిపోఁబోకు నిలునిలు మనుచు మఱియు. 44

శా. హౌరా! యోరక బాహుసత్వ పటిమన్ నంధత్వముం జెందుచున్
జోరా! రమ్మనఁ బారిపోయెదవు నీ శూరక్రియల్ గాల్పనా?
క్రూరోదగ్ర నఖాంచలంబులను నీ త్రొమ్మెల్ల వ్రచ్చెన్ మహా
వీరుండైన జటాయు వంచు నవిజద్వేషిన్ పడెన్ దాకగన్. 45

వ. వారి కిట్లురకు బెద్దప్రొద్దు హోరాహోరిం బోరాటంబు జరిగి యందప్పక్షి
రాజు వలన విఘటిత తురంగరథాంగుండును విదారిత వక్షఃఫలకుండు
నునై యారావణుండాగ్రహంబున నిజచంద్రహాసంబున నావృద్ధగృధ్రేశు
పక్షమూలంబు ఛేదించి సీతంగొని వెడలిపోయె. 46

వ. తదనంతరంబ సుమిత్రాసూనుండచటికేతెంచి దుర్వారదారుణ క్రోధశోక
లజ్జాభరంబుల దుస్తరంబగునవస్థ పొడమె నిందునకెద్దిసేయ నుద్యోగిం
చుటకు నుపాయంబు దొరకదని చింతింపుచు రామునాలోకించి తనలో
నిట్లనియె 47

మ. అల లంకాధిపువంచనం బొడము రోషాక్రాంతి ధూమాయితా
నల తుల్యుండయి లీన వర్ణ సరణిం దార్కొన్న యర్ధోక్తులం
బలుకన్ సైపని రాముదృష్టి ఖగరాట్పంచత్వజామర్ష ని
ర్దళితాఘోత్కట జాడ్యయై నిలిచె కోదండంబుపై మిక్కిలిన్. 48

వ. అని మఱియుఁ దదభిముఖంబుగాఁ జని యార్య! మారీచమథన! సమీపంబునకు రమ్ము రమ్ము పడమట వింధ్యవనీవీధులం గనుంగొను మనిన రాముండాకాశభాషణంబుగా నిట్లనియె. 49

చ. భుజబలవంశవిక్రమ తపోమహిమంబుల నీకు నారయన్
విజనులు దీటుగా రటుల వీరుడవై తనరారి, వంచనా
వృజిన విహారివౌట తగవే యిదిశూరులత్రోవయౌనె? య
క్కజముగ నెట్లు నిన్నలమె గాఢతమం బకటా దశాననా! 50

వ. అని యించుక విచారించి సఖేదస్మితంబుగా వెండియు. 51

చ. మనుమడ వైనసీకథలు మాటికి సిద్ధులుఁ దెల్పఁ దాతయై
తనరు పులస్త్యు డొక్కరుడు దక్క, సురర్షులు నవ్వుచుండగా
గసిన విధాత, నాలుఁగు మొగంబులు నొక్కట వంపరామి ద
న్నెనసినలజ్జ న్యూనత వహింపుచు నేమగునో దశాననా! 52

క. అనిరాము డాత్మఁజింతిలి
జనకజ! హా! యనుచు ధైర్యసంపద చేతస్
మనమునఁ గలఁగగ లక్ష్మణు
డనియెన్ మిమువంటివారి కగునే యిటులన్? 53

గీ. దారుణాపత్పరంపర దైవవశత
జెందునప్పుడు శూరుల చిత్తవృత్తి

లతులవజ్రోపమాన ధైర్యములపేరి
జోడు నొనగూర్చుఁ దమకు నస్తోకలీల. 54

చ. అనవిని రాముఁడుస్స్వరని యారసి లక్ష్మణుఁ, డారుధైర్యవ
ర్తనమునఁ జెప్పినట్ల సతతంబు మెలంగ నమర్షశోకముల్
మనమున నిల్పినాడ, నికలజ్జయన న్మతి నన్నుమీఱిపో
యినయది, యేమిసేతు నికనేమని పల్కుదు నన్న! నావుడున్. 55

క. కనుఁగొనుము జటాయువునకు
ఘనశాశ్వత వీరలోక గమనాంచిత సా
ధన సిద్ధక్షేత్రంబగు
వనవాటిక నెదుట రాఘవా! యని మఱియున్. 56

క. ఇట రావణురథ మిదె భూ
తటమునఁ బడియున్న దార్ఢ్యతాతజటాయు
స్ఫుట వజ్రాంకుర తుల్యో
ద్భట నఖచంచూవిలూనబంధన మగుచున్. 57

గీ. అనిన రాముడు కరుణ నిట్లనియె నపుడు
హాధరాపుత్రి! కడుధన్యవైన నీకు
రావణేభ శిరస్సంచరన్మృగేంద్ర
మై తనర్చు జటాయువు నరయ గలిగె. 58

చ. అని తనునూతగాఁగొనుచు ధ్యానముసేయు రఘూద్వహాంగనుం
గొని, మదిలోన లక్ష్మణుఁ డకుంఠితరోషము మానసంబు నొం
దినదయి మీఱె దుఃఖవితతిన్ మఱి కావున నన్యమందు నే
నునిచెద నీ మనీషనని, యూహ యొనర్చుచు నన్న కిట్లనున్. 59

గీ. ప్రబ్బపొద దాకు చప్పుళ్ళ బరగి పుల్గు
రొదల విలసిల్లి మిక్కిలి గదలుచున్న
కాండములచేతఁ దౌర్యత్రిక గుణమికను
బూను వింధ్యకుభృత్కన్యలైన నదులు. 60

వ. అనివిని రాఘవుండు నిట్టూర్పునిగుడించి కనుఁదమ్ములు దెఱచి
యిట్లనియె. 61

చ. కలువగముల్ విశాయగతిగాంచగ మేల్కనియుండు నబ్జముల్
బలువిడి యామికావళి విలాసముసూపగ నీ నగేంద్రక
న్యలు నదు లెంతయుండనరె నౌ మదవారణకర్ణ తాళముల్
చెలగఁగ సారె గేకలిడి లీల నటించు మయూర సంతతిన్. 62

క. అనికొంతదూర మరుగగ
ననుజుఁడు రాఘవునితోడ నపుడిట్లనియెన్
గనుగొను మనఘా! యిదిగో
ఘనతరమగు మాల్యవన్నగంబని మఱియున్. 63

మ. ఎనుఁబోతుల్ కొనగొమ్ములం బొడుప నట్టిట్లైనతాల్ జాఱను
ర్లిన రోహిత్తులగర్భముల్ దటుకునన్ వ్రీలున్ గుహాశ్రేణులం
దనువర్తించు మదాచ్ఛభల్లతతిహిక్కారావ మాలించి భీ
తినిఁ జెంచుంగొమ లస్త్రముల్ విడుతురెంతే యిప్వనాంతంబునన్. 64

వ. అంత రామచంద్రుండునకరుణాస్రంబుగా,

సీ. బర్హిపుంజాకర ప్రతిపరిసరమున
గుఱిగొన్నగండుతుమ్మెదలచేత
ననుభవింపగబడు నతులసౌరభ్య
విభ్రమ విభాసుర కదంబములచేత

ఘనములై కనుపట్టు కటకభాగంబుల
గడుమించు నీలమేఘములచేత
వర్షింపబడు భోగివనితాభినవ గర్భ
ధారణప్రియకారి వారిచేత.

గీ. వివిధశృంగారములచేత వెలయుచున్న
మాల్యవద్ధారణీధర మహిమ గనిన
నాశరీరంబ భారమై నాకుదోచె
నకట లక్ష్మణ యూతయుమ్మనుచు మఱియు, 66

సీ. అలసటచేజాలు నవయవంబులచేత
వసివాడు నెమ్మోము రసిమిచేత
నొదవెడు వేడి నిట్టూర్పు గాడ్పులచేత
నలమినయట్టి జాడ్యంబుచేత
నశ్రునిరుద్ధ సమాలోకనముచేత
గదిసిన కంఠగద్గదికచేత
మదినంతకంతకు మఱపుఁ జెందుటచేత
నల్పమై జాఱు ధైర్యంబుచేత

గీ. గడు వివర్ణతఁ బూను నాగాత్రమందు
సుచిరగతిఁ బక్వ మగుచున్న శోకభావ
మిపుడు కరుణరసస్ఫూర్తి నెనయ దొడరె
ననుచు దమ్మని నూతగా గొనుచు జనుచు. 67

వ. మఱియు నిమీలితలోచనుండై ప్రాణేశ్వరీ! దండకారణ్యవిహార స
బ్రహ్మచారిణీ! యని నిర్లజ్జంబుగా విలపించుచుండ సుమిత్రానందనుం
డమందశోకాక్రాంత మానసుండై తనమనంబున గటకటా! యిక్క
రుణరసం బెట్టిరసాంతరంబున మట్టువడునో యని వితర్కించునెడ
ననతిదూరంబున "నోరిపాపిష్ఠ! కబంధహతక! యిదె ముగిసితని"

యెడు నుడువులు బడిబడి వినంబడిన రాఘవుండు ససంభ్రమంబుగా లక్ష్మణు నాలోకించి దురంతకలుషబంధుం డగుదను కబంధునితో నీసఖుండగు గుహుండు కలహాయమానుండై నట్లు తోచుచున్నయది. దానవు లతికపటోపాయప్రతిష్ఠులు గావున నీవాలసింపక చనవలయు నని తమ్మునిం బనిచి పార్శ్వభాగం బవలోకించి సకరుణంబుగా హాదేవీవామశీలః హాసీరధ్వజరాజనందనిః భవదీయ విశ్వవిస్రంభ విమర్దవేదిని యగు నిచుళనికుంజరేఖ యిదియకదా యని వెండియు. 68

మ. తమి నేకాంతమునందు మన్మథవినోదం బీవు వారింతువే
ని మెయిన్ నేన నఖాంకముంచుక వెసఁగా నీవుంచినావంచు ని
క్కము ప్రౌఢాలులతో వచింతు నని పల్కం భీతి నాచేతలో
ర్చి మనోవాంఛలు దీర్చు నీచెలువు ధాత్రీజా ! తలంతుఁగా మదిన్. 69

వ. అని రామచంద్రుం డాత్మీయచాపం బవలంబనంబుగాఁ గొని లక్ష్మణాగమనంబు నిరీక్షించుచున్న సమయంబునఁ దత్సమేతుండై గుహుండు ప్రవేశించి జయజయ శబ్దపూర్వకంబుగా దాశరథి కిట్లనియె.

ఉ. ఆమిషభుగ్విజేత దివిజాభయదాయి జగత్త్రియాద్భుతో
ద్దామచరిత్రుడై పరగు తావకసోదరు చండసాయక
స్తోమములం గబంధు డలతొల్లిఁటి రాక్షసజన్మకారణాం
హోమలినత్వముం దొరఁగి యుండెడు నాకమునన్ సుఖస్థితిన్. 71

గీ. నావు దద్దశరథనృప నందనుండు
పద్మవనబాంధవోత్తర భాగపథము
లల్లవానికి శుభములై యుల్లసిల్లు
గావుత మటంచు దీవించి కౌతుకమున. 72

సీ. గుహా! మింటిపై మహా కుధరంబుగతి గాన
బడె నప్పు డొక్కటి కడుఁదలంప
నది తత్కబంధప్రహరణమో తెల్పుమా
యనవాడు దుందుభి యనెడుపేరు
గల దానవశ్రేష్ఠ నల వాలి మనుజంపెఁ
దత్కాయ మీసుమిత్రాతనూజు
డెగజిమ్మె గావున నేఁటి వాలికి మన
తోడ వైరము బుట్టు నేడ నినను.

గీ. గనలి లక్ష్మణు డేమి గాఁగలదు దానఁ
బల్కె మన రాముడోవత్స! బలసమగ్రు
డనఘు డాతడు బహుమానమునకు దగును
గాక వేరొకసరణి కేఁరణి దగును! 73

క. అని గుహుని గనుంగొని "యో
జన బాహుం డెచటినుండి చనుదేరఁగ మా
ర్గాని నీ కధ్వనిరోధం
బొనరించెను" దెలుపు మనిన నొగి వాండంతన్. 74

సీ. అభ్రయానమున దశాననుం డతిరయం
బునఁ బోవుచుండఁగ భూమితనయ
యన "రాఘవుఁడు సంశయముతోడనేమగు
నో"యని చింతసేయునెడ గుహుడు
నీయుత్తరీయంబు వాయుసూనుడు మింటి
కెగసి తెచ్చిన దాని నిపుడు నీగు
ణములచే ముదితుఁడా కమలాప్తసుతుడు నేఁ
బరిణామ మరయుట కరిగినపు డు

గీ. పాయనంబుగ నాచేతఁ బంపె నీకు,
దీని గైకొనిరా నిరోధించె నను గ
బంధు డంచు నొసంగినఁ బరమమైత్రి
పొదల రఘువీరుఁ డది యెద నదిమికొనుచు. 75

వ. మఱియుఁ గన్నీరు దొఱుఁగ హాప్రాణేశ్వరీ! జనకజా! యుత్తరీయావశేషపై కానబడితివి గదా యని నిమీలిత లోచనుండై తమ్మునిపై నొరిగిన సతండు నిట్టూర్పు నిగుడించి గుహునింగనుంగొని యోయి ప్రియసఖా! సుగ్రీవునకు క్షేమంబకాదే యనవుడు మహాత్మా! మీరతనివృత్తాంతం బరయుటంజేసి కుశలంబయ్యె నన రాఘవుం డాత్మగతంబున. 76

చ. నను మది రావణుం డెఱిఁగి నాప్రియఁ గైకొనిపోయెఁ బోయెఁబో
మును శివపూజకై తనదు మూర్ధము లెల్లను ద్రుంచె నాక్రియన్
దునుముటకంటె నెవ్వియును దోచ వుపాయము లింక నక్కటా!
యని మొనఁ జంద్రహాసహతకాధ్వమునం జననా మదస్త్రముల్! 77

క. అనివిని యాగుహుఁ డొరా
మన భల్లుకరాజు మంత్రమహిమం బిపుడీ
యనువున ఫలింపలేదే
యని మది నూహించి వేడ్కఁ ననియెన్ మఱియున్. 78

క. దేవ! రఘూత్తమ! యిట్టిటు
రావలయు మతంగమౌని రాజాశ్రమపుం
ద్రోవ యిది యనిన నందఱు
వేవేగమ చనఁగ నతఁడు వెండియుఁ బలికెన్. 79

సీ. బహునవానూపనీపప్రహసనసహ
చర్యానటత్కేకిచయము వలన
లలితఫలావళీపులకితజంబూని
కుంజకూజత్కీరకోటి వలన
శబరపురంధ్రికాసంతోషకరహుంకృ
తస్వనాంచితకపోతములవలన
నిజచంచుపుటద త్తనీరదకణతుష్ట
కామినీయుతచాతకములవలన

గీ. వికచజాతీసుమాసవ నికరపాన
నందదున్మత్తమధుపబృందము లవలన
లోచనోత్సవకారిణు లై చెలంగు
వింధ్యవన రేఖలివి రఘువీర! కంటె? 80

మ. అనినన్ రాముఁడు దిక్కులన్నిఁ గని దీనాస్యాబ్జుఁడై యిట్లనున్
ఘనపంపా లహరీవిలంఘనకళం గన్పట్టు లేగాలి వి
చ్చినయేలాపళితాప నొప్పు విపినక్షేత్రంబువిద్యాధరా
తనయాకోటుల ప్రాయుమన్మతికి హస్తంబిచ్చుఁబోయెంతయున్. 81

వ. అనిన సౌమిత్రి యార్యా! యటవిలోకింపుమని యిట్లనియె. 82

చ. బహులవిభీతినేగుప్రియుఁ బాసిఁ కలంగు కురంగిపక్షిముఁన్
మహితకృపా ప్తిఁ జూచి యిక మానుమటంచును నస్ఫుటోక్తులన్
సహచరి వల్కు మేకొనునిషాదుమనం బపరాధ్ధమయ్యె బ్రా
కృమిహితశరంబు లెన్న నపరాధ్ధములైనవి కావుగా గుణీ! 83

ఉ. నావుడు రాఘవుండు నయనంబుల నశ్రులుగ్రమ్మ హా! ప్రియా
యావిధిఁ దాటకేయమృగయావ్యసనంబున నేనుబోయినన్

రావణుఁ డేగుదెంచిన గరంబును నీ తెలిగన్ను లీకురం
గీవలమానలోచనసఖిత్వమునం గనుపట్టెనోకదా! 84

గీ. అనవుడు సౌమిత్రి మదిన్
ఘనతరమగునట్టియాధి గాసిలునితఁడే
యనువృన ముద మందు నొక్కొ
యనితలఁచెడివేళ మిగుల నాశ్చర్యముగన్. 85

మ. అదె వారెవ్వరు వానరుల్ దెలుపుడీ యస్మద్యశః కామినీ
మదసంచారవిమోద మంజులతరామందాద్రి లీలాకళా
స్పద రక్షోధవ గాత్ర మెవ్వఁడు పడిన్ సన్నద్ధుడై చిమ్మెరా
యదరుం డై యనుపల్కు వీనులఁబడన్ సాశ్చర్యచేతస్కుడై. 86

వ. గుహుండు రామున కిట్లనియె. 87

గీ. కాంచన సహస్రపత్ర వైకక్ష్యకాంతి
దుందుభికళేబరోత్క్షేప దురవగాహ
కోపరాగోదయమునఁ ద్రిగుణపిశంగి
యయినతనువూని యిటు వాలి యరుగుదెంచె. 88

శా. క్రూరోన్మత్తదశాస్యరోధిపటుదోర్మూలక్షణోన్మీలిత
ద్వైరాజ్యంబుగ దేవపత్తనము తేవం జేయు చున్నట్టి యీ
వీరు న్నిచ్చలుఁ జూచు వేడ్కమహిభృద్విద్వేషి యాత్మీయదృ
గ్ద్వారంబుం గనకాబ్జపత్రతతిగా గల్పించి మైనుంచెనో! 89

వ. అని యతని నభివర్ణించి రామున కిట్లనియె. 90

మ. ఇనవంశోత్తమ! ఋశ్యమూకగమనం బీవీరసంవాదగో
ష్ఠిని నొక్కించక విఘ్న మొందునని తోచెం గాన నే ముంగలం

జని మీరాక యెఱుంగఁ జెప్పి సరసీజాతాప్తసూతిజ ముదం
బునఁదేలించి తటాననచ్చెదను మిమ్ముం జేరఁగాఁ గ్రమ్మఱన్. 91

వ. అని యమ్మహాత్మ్మననుజ్ఞ వడసి క్రమ్మఱ నతండు మిత్రకులవర్యః
మిత్రపర్యాయాంతరితంబగు మీదాస్యంబుఁగోరి యున్న వాఁడ నని
కుమారసుగ్రీవుండు దెలుపుకొనిన విన్నపంబున్నదియకదా యనిన సకల
గుణసముద్రుండగు రామభద్రుం డేకాంతంబుగా లక్ష్మణుం జూచి వత్సా
నీసఖుండగు గుహుం డివ్విధంబునఁ బల్కుచున్న వాడిది యుక్తియుక్తం
బకదా వేఱొక్కటి కా దది యెట్లంటేని. 92

క. అనుపమ మంత్రోత్సాహము
లనుశక్తులు గలిగి మెలగు నధికులపైనన్
అనయంబు కార్యసిద్ధులు
ఘనమగు ప్రభుశక్తిగోరు గద చర్చింపన్. 93

గీ. కావునను వాలివధము సుగ్రీవునకు నొ
సంగి తత్కోశవాహినీసమితి బూర్ణ
శక్తి నటమీద నే నెల్ల శాత్రవులను
జెండి పగదీర్తు నన లక్ష్మణుండు నగుచు. 94

గీ. అనఘ యటులైన నిప్పుడేపనికివచ్చు
వాలి విడనాడి సుగ్రీవు నేలికొనుట
వక్రపథమన్న జానకీవరుఁడు నవ్వి
యన్న ! నీవన్న మాట లెస్సైనదైన 95

తలపం బౌలస్త్య ఖర్జూదళన భుజబలోద్దాముఁడై సర్వకార్యం
బులనిస్సాహాయ్యలీలం బొలిచి మనలతో బొం దపేక్షించునా? యీ

బలియుండివ్వాలి పీనిం బటుగతినణతున్ భానుజున్ మిత్రుఁజేతున్ ;
బలవైరిన్ వేడికొందుం బరయువతి భవోత్పా టన స్వల్పఖేదున్. 96

క. అనిన విని సుమిత్రాసుతు
డనఘా ! మీబుద్ధి విమలమైనది యదిగా
క నివృత్తశాపుఁడై య
ద్దనుజుడు దివిజత్వమంది తా జనువేళన్. 97

గీ. గుహుఁడు సెప్పినగతి మీరు కోరి నడుప
నఖిలకార్యంబు లొనగూడు ననుచు మీకు
దెలుపు మని కూర్మి నాతోడ బలికె ననిన
దలఁగి నవ్వుచు నిక్ష్వాకుతిలకుఁ డనియె. 98

క. ఇటువలెనైనన్ మన గుహు
నటకుం బ్రతిదూత్యమునకు నంపగ దగును
త్కటగతి నన లక్ష్మణుఁడం
తట నటనింగని వయస్య ! తపనజుతోడన్ 99

చ. ఇనుడు భవద్గురుం డగుట నెన్నగ మత్కులకర్తయైన య
మ్మనువనురాజు నీకగు విమాతృజుఁ డీగతి జ్ఞాతిధర్మముల్
వసచరవృత్తిఁజూపి శిథిలంబులు సేసితి వేని నీదు వ
ర్తన కగుఁ బూట యావిబుధరాజసుతాస్రవిలోలుపాస్త్రముల్. 100

చ. అనవిని నవ్వి రాముఁడు దశాననుపైఁగలఁకిన్కచేతనే
మనినుఁ దప్పుగాదు విను మర్భకుఁ డీతఁడు నాదు చిత్తమ
జ్జనకసుతావియోగవిలసచ్ఛిఖిసాక్షిగ మిత్రపుత్రునిన్
నెనరున మిత్రుఁ జేసె నన నెయ్యమునం గుహు డాత్త హర్షుడై. 101

క. ఈమాడ్కిఁ దపనతనయుఁడు
మీమన్ననఁ గాంచి వెలిగె మిక్కిలి యనుచున్
మోమునఁ జిఱునవ్వొలయఁగ
రామున కిట్లనియె హాస్యరస సంయుక్తముగన్. 102

చ. దినకరసూతిపై మిగుల దేవర చిత్తము పక్షపాతమై
యొనసిన నాకులాభ మిది నేమి? మహాత్ముఁడు భానుఁ డీయెడన్
దనయున కాధిపత్యము సుఖంబునఁ గల్గుటఁజేసి మిక్కిలిన్
ఘనమగుకాంతిచే నవిరళంబుగ గన్గొన శక్యముగాని వాఁడగున్. 103

గీ. అనిన నవ్వుచు సౌమిత్రి యన్నతోడ
దినతనూభవ రాజ్యకల్పనకు గుహుఁడు
ప్రేమ మనసలను నంగీకరింపఁ జేయు
చున్నవా డని పల్కె రఘూద్వహుండు, 104

చ. తమి నగ పంకులింపఁ దన తమ్ముని గన్గొని వత్స! యేతద
ర్థము ప్రకటంబుగాఁ శపథ మొనరింపదు రామనంబు ని
క్కముపెను మన్నఁ బ్రియాశయము గన్పడుచుండ గుహుండు స్వామి! యో
త్తముల స్వభావ మిట్టిదకదా యెవరింపగ నంచు వెండియున్. 105

గీ. చేయవలసిన కార్యంబు చిత్తములనె
యుంచి యొనరింతు రెంతయు నుంచివార
లర్కుఁ డెవ్వరితోఁదెల్పి యనుదినంబు
కాంతిఘటియించుచున్నాఁడు కమలములకు? 106

వ. అని పల్కు సమయంబున.

ఉ. ఓకపులార! తెల్పుఁ డిపు డుగ్రపు దుందుభికాయ మెవ్వఁడో
యాకస మంటఁ జిమ్మిన మహాపదపూర్ణుఁడు వాఁడు మామకో

త్సేకితబాహుఖర్జు వెడసేయగ శక్తుఁడె యంచు వీఁకమై
నాకరణిన్ వినంబడిన యప్పుడె యాగుహ డాత్మలోపలన్. 108

మ. తను భల్లూకవిభుండు రేపగ మదోద్యద్రోగసంగ స్తదో
ర్జనితామర్షముతోడవాలి యిటకున్ సన్నద్ధుఁడై వచ్చె నే
నును వీరవ్యవహారసౌఖ్యరతిఁ గుందుం గొంతసే పంచు నుం
డినచో వా దరుదెంచి ముందట గనెన్ దేవన్ రఘూత్తంసులన్. 109

వ. కనుఁగొని యీప్రసన్నమూర్తు లెవ్వరొకో! వీరు రక్షఃకళేబ
రోత్క్షేపంబు జేసినవారు కావలయు నని కొండొక విచారించి
తలంచికొని, 110

సీ. తనతండ్రి వెడలింప దండకాటవిఁ జేరి
కందమూలంబు లాకటికి దినుచు
నొక్క దౌర్భాగినేయుండు తమ్మునిగూడి
బాణ బాణాసనపాణి యగుచు
నస్మద్విహారయోగ్యస్థలంబుల నెల్లఁ
బాటచ్చరస్థితిఁ బరగుచుండు
వానిఁ దత్సోదరు పడి నివారంపగాఁ
వలె నీ వటంచును దొలుత నాకు

గీ. హితుఁడు గావున సక్షంచరేశ్వరుండు
చెప్పిపంపిన యావార్త తప్పదిప్పు
డౌను వారలె! వీరంచు నరయుచుండ
మిత్రకులవర్యు దంత సౌమిత్రిఁ జూచి. 111

గీ. వినుము లక్ష్మణ! యిమ్మహావీరవర్యు
దే మొ పలుకుచు నున్నవా డిప్పు డనిన

నటఁ బురోభాగమున కేగి యతడు వాలిఁ
గదిసి వీక్షించి యిదిగొ మే మదిగొ నీవు 112

క. అనుటయు వాసవి యోయీ!
యనుపమమతు లెవ్వ రీర లన నాతనితో
విను మనఘా! రాఘవులము
వనజోదర బాహుజాత వంశుల మనినన్. 113

వ. అతండు వెండియు నోయీ! దీర్ఘాయుష్మంతుండ! యాకారవిశేషంబులు మీజాతివిశేషంబు నెఱింగించుచున్నవి కాని తద్విశేషంబు తెలియఁబలుకు మనిన లక్ష్మణుండు ప్లవంగపుంగవా! రాఘవులమని పలుకలేదే యను టయు నతం డసూయం బోలె వెండియు 114

మ. వివరింపన్ రఘువంశసంభవులుపో వీరంచు నాకిప్డు రా
ఘవశబ్దం బెఱిగించె, క్షత్రియత మీగాత్రంబులే తెల్పె నె
ట్లవుసాంస్కారికనామసంగ్రహ, మపత్యప్రత్యయప్రాప్తి, నా
శ్రవణంబుల్ వినఁగోరె వానికి విశేషం బుండినం దెల్పుమా? 115

వ. అనిన సౌమిత్రి సధైర్యసంభ్రమంబుగా మేము తద్రామలక్ష్మణుల మని పలికిన విని వాలి తనమనంబున. 116

శా. నాతో నీతఁడు సర్వనామపద విన్యాసక్రియం జెప్పి వి
ఖ్యాతిన్ వ్యక్తముఁజేసె నౌనవు పురే! ఖండేందుభృచ్చాపభి
చ్చాతుర్యాతి ధురీణుఁడెవ్వఁడు? మదిం జర్చింప నీయిర్వురం
దాతండే యగు రామభద్రుఁడని తా నంతః ప్రకాశంబుగన్. 117

ఉ. భీకరయుద్ధసాధనగభీరతలున్ మృదుగాత్రవేషముల్
మీ కొకరీతి నున్నయవి మిక్కిలి, యిద్ధరిలోన క్షత్రియా
నీకవిదారణవ్రతవిన్ద్రుని భార్గవు నాహవాహవో
ద్రేకునిఁ జేసినట్టి రఘుశేఖరుఁ డెవ్వడు? చూతు వేడుకన్ 118

మ. అనసౌమిత్రి వినీతిఁ బోలెను మహాత్మా! లక్ష్మణుం డంద్రుడున
న్నన, నాతం డలగాధిసంధనునిచే నస్త్రౌఘసుప్రౌఢి నే
ర్చిన యారాముఁడె యన్న నౌ సస బలాక్షీణప్రవీణుఁడు నా
కనికిం గల్గె నటంచు నాలి మహాహర్షాన్వితుండై పెట్టుగన్ 119

సీ. ఓరఘురామ! యీ మునిద్రైసంధ్యమా
 వసిష్ఠగ జేసినట్టి జాము
దగ్న్యని నిశితాస్త్రశతి గప్పుచునుండ
 క్షత్రియబాణుల గ్రమ్ముఱంగఁ
దెచ్చితి వరమున్న తలియంగవినఁబడె
 నాకు ... మంచిదయ్యె
కక్షోష్మజ స్వేదకణముల నవ్వగే
 ...వెల్గఁ

గీ. బాపి వీరవస్త్రశద్ధఁ బరగు నాదు
బాహుదండంబు, నీ... బరంప
నలరుచున్నది, కన్నులకు నేయు వేడ్క
యున్న దిదె ... మాయె. 120

చ. అనవుఁడు రాముఁ డాతని సహర్షముగాఁ బరికించి, సీతకా!
ఘనుఁడు ప్లవంగరాజ్యకీని కైవసమైన పుష్పకంబు మం
దనవరతంబు రావణభయాతురయైన మహీలలామ నె
మ్మనమునఁ గాంచుచున్నయది మానుగ నూఱట యుంచుఁ బోవగన్. 121

వ. అప్పుడు లక్ష్మణుండు వాలిం గన్గొని యోమహాభాగ! మదగ్ర
జుం డిచ్చోటికిం జేరె, నీవును బ్రవేశింపు మనిన నతండు రా
మునకుఁ గొంత యభిముఖంబుగాఁ జనుదెంచి. 122

చ్చిన లోకత్రయహృద్వ్యథాప్రణగణచ్ఛేదౌషధ త్వత్స్వమి
త్కనదోజంబును గన్గొనం దివురు మద్బాహాయుగం బెప్పుడున్. 128

మ. అనినన్ రాముఁడు లేతన వ్వెసఁగ నాహా! యుద్ధసర్వస్వ దా
యినియై దానవసంపదాహరణయై యెక్కున్పగాఁ బడ్డదై
కనుపట్టెన్ విను మద్ధనుర్లత సదా గానన్ మహావీర!సా
ధన మీవున్ గ్రహియింపు మన్నఁగపియూధస్వామి దా నిట్లనున్. 129

వ. భళిభళీ! యో రాఘవ!ధర్మప థంబుఁదప్పకుండఁ బలికితి వైనను
వేఱొక్కటి గల దది యెట్లంటేని. 130

మ. గురుదోశ్శాలురకాత్మజాత్యనుగుణక్రూరాయుధశ్రేణి సం
గరయోగ్యంబగు నైన వానరులకుం గాలాయసాస్త్రావళిన్
ధరియింపం బనియేమి? ఘోరరిపురాడ్దర్పచ్ఛిదాకేళికై
యఱచేతుల్ పిడికిళ్ళు గోళ్ళు నివి గావా? సాధనవ్రాతముల్. 131

మ. అనినన్ లక్ష్మణుఁ డన్నతోడ నపు"డోయార్యా! మహాభాగుఁ డీ
ప్రణుతప్రాభవశాలి నాలి కడుఁ దిర్యగ్జంతువుల్ సంతతం
బు నిజాంగాస్త్రములంచుఁ బల్కినదె యొప్పుంగా"యనన్ రాఘవుం
డనుఁ గోదండగుణధ్వనిన్ నెరపి కీశాధీశుతో నయ్యెడన్. 132

శా. అవురా! గౌతమశాపసంశమితబాహాపౌరుషుండైన యు
ద్దివిజాధీశుని మేఘనాథుఁ డపకీర్తి స్ఫురించె ము న్నాపరా
భవముల్ గత్తుమహాంధుకర్కటముగాఁ బౌలస్త్యు బంధించి పా
పవె వీరోత్తమ! తాతదుఃఖహరణప్రావీణ్య మొప్పారఁగన్. 133

క. దైవవశంబున నేఁ డా
నీవే లక్ష్యంబ వగుచు నిలిచితివి భళీ!
నావిశిఖంబున కనినం
దేవాధిపసుతుఁడు రోషదీప్తిం బలికెన్. 134

మహాస్రగ్ధర. ఘనమద్దోర్ఘూలకూలంకషవిషమభుజగ్రంధిభంగప్రసంగా
పనతక్రోశత్స్ఫురద్విడ్వరనిహితజగద్వార జై త్రాంకసర్వ
స్వనివేశచ్చౌర్య మూంచున్ సకలఖలఘరీక్షితసాధారణత్వ
మ్మనుమందంబై కుఠారిన్ మొనఁజెఱిచిన నిన్ మొక్కవోఁజేయకున్నే

మ. కినుకం జంక బిగింపఁ బిక్కటిలి కైకీ ఘ్నాడి కూవెటుచున్
దనుజేంద్రుం డిడఁగా జగత్త్రయజయోద్యత్ఖ్యాతిసర్వస్వ మొం
దిన నాశౌర్యము కార్తవీర్యనృపదోస్తేజోనిభం బౌటచే
తను వే యూన్చును నన్నుభార్గవమదధ్వంసిన్ నినుం గెల్వఁగన్. 136

వ. కావున విమర్దార్హం బగు మహీభాగంబున కవతరింప వలయు నని వాలి యసమసమరసముత్సాహ విజృంభమాణుండై రాముం గూడి యేగు నెడ గుహుం డాత్మగతంబున నేఁడు దైవవశంబున నామనోరథపరం పరలు ఫలించె నని విచారించుచుండ సుమిత్రాతనయుఁడు దత్సమ రాభిముఖంబుగా నిరీక్షించి ససంభ్రముండై నిషాదనాయకున కిట్లనియె. 137

చ. వనచరు లిద్ద ఱిప్పు డనివార్యపరాక్రముఁడైన యాద్యునిన్
వెనుకొనుచున్న వా రిపిగొ వేగమె వింటికి నారిఁగూర్తు నే
ననిన గుహుండు నిల్వు మహిజాధిపుపై ననురక్తి నింద్ర నం
దనుషయిఁ గిన్క నర్కజుఁడు దార్కొనె మూదవశక్తి రెట్టిగాన్. 138

సీ. అనిన సౌమిత్రి యాయర్కజుం డీతండ
కాని యారెండవవానరేంద్రుఁ
డెవ్వఁడో? యన గుహుం డెలమి నాతసితోడ
నితఁడు కిష్కింధాధిపతి దకైక
వీరుండు వాయుభట్టారకునకుఁబర
మానినీజాత కుమారకుండు

పరమసూర్యాచార్యు భక్తుండు హనుమంతుఁ
డనిన నియనఘుఁ డాహాభళారె !

గీ. యనుపమ బ్రహ్మలోక పట్టాభిషేక
శాశ్వతైశ్వర్యమును నూసనంబునందు
నాసపడినవాఁ డీతఁ డెయా ! యటంచు
మాటిమాటికి నుతియించి మఱియు ననియె. 139

గీ. ఇతఁడె కద ! భూమిసురశాపప్రతనిజప్ర
తాపవిజ్ఞానబద్ధుడై ధరణి నితర
వీరులు రహింపఁ జూచును నూరకుండె ;
నటులఁ గాకున్న భువి నసాధ్యంబు గలదె 140

క. ఇతఁ డన్నదీయహృదయు
స్థితశల్యము వేగఁ దొలఁగఁ జేయు నటంచున్
మతి నఖ్ఛయించి సంగర
కుతుకాన్వితు నన్నుఁ జూచి, గుహుఁ డనియెన్. 141

వ. ఇత్తఱిఁ బరస్పరగౌరవ లాఘవ జ్ఞాపకం బైన ద్వంద్వయుద్ధంబు మన
యారువురకు వాలికిం బ్రవర్తిల్లినయది నిరుద్విజయలక్ష్మీ పరిగ్రహ
యౌతకంబైన కీర్తికి నేను నీవు రవిసుతుండును మొదలుగా నెవ్వరము
భాగాధికారులము గామైతి మని పలుకునెడ గుహుండు ససంభ్రమంబుగా
నిట్లనియె. 142

క. కనుగొనుఁ! రాఘవుఁడేసిన
పెను దూపిదె వాలి యురుస్సు పెకలించిన యా
ఘనసప్తసాల సంతతిఁ
దునిమి, యతని దూరి, మగుడి తూణముఁ జొచ్చెన్. 143

మ. హరిదుద్ధర్షణకీర్తిసింధుగిరియౌ నవ్వాలిప్రాణాలితో
నరయన్ గాంచనపద్మదామకముచే నాతిథ్యమున్ జానకీ
తరుణీభర్తకుఁ జేసి, వీరశయనద్రాఘిష్ఠనిద్రాసమా
దరుఁడై యుండె నటన్న లక్ష్మణుఁడు ఖేదం బంది తా నిట్లనున్. 144

క. హా! వాసవ! యిటువంటి మ
హావీరశ్రేష్ఠుఁడైన యాత్మజు నయ్యో!
నీ వింక నెందు జూచెద
వో వేగన్నులకుఁ బండువుగ నని పలుకన్. 145

వ. ఆ సమయంబున గుహుండు తదభిముఖంగా నిరీక్షించి సమంచితానంద
కందళిత హృదయారవిందుఁడై సుమిత్రానందనున కిట్లనియె. 146

సీ. మంథానకుధరనిర్మథితాబ్ధిఘుమఘుమ
స్వనసఖదుందుభిధ్వనులు మ్రోయ
నానాజనౌఘకర్ణరసాయనప్రాయ
మాంగల్యసంగీతమహిమ చెలఁగ
నిగ్రహానుగ్రహోదగ్రవిప్రవ్రాత
కృతమహాశీర్వచోరీతి దనర
నిర్భరానందసందర్భగర్భితకీశ
భటకోటిజయజయార్భటులు నిగుడ

గీ. నీలుఁడాచార్యభల్లూకనేతృమంత్రి
తోరుహాటకమయకుంభవారిచేత
రవిజు నభిషిక్తుఁగావింప రాఘవుండు
తద్గళంబున పొందమ్మి దండవైచె. 147

వ. అనుటయు నాలక్ష్మణుండు వయస్యా! యీయర్థంబు మాకుఁ బ్రియం
బని యభినందించుసమయంబున. 148

సీ. వినరోయి భల్లూకవీర ప్లవంగగో
లాంగూలయూథపులార! మిమ్ము
నేఁడు సుగ్రీవుండు నియమించుచున్నాఁడు,
యౌవరాజ్యంబున కేవితగునొ
యావస్తువులు గూర్పుఁడవనిఁ నరయంగ
నేను నమ్మారుతసూనుఁ బంపి
యౌర్ధ్వమౌహూర్తికహారిలగ్నంబున
నంగదు నభిషేక మలరఁ జేతు,

గీ. నిఖిలదివిజపరంపరా నిరుపమాన
మకుటమాణిక్య కాంతిశుంభత్పదార
విందుఁడైన మహేంద్రుండు వేడ్కఁ సెంద,
ననిన నమ్మాట విని సుమిత్రాత్మజుండు. 149

గీ. ఉల్లమునఁ బొంగి మాకు నీయుత్సవంబు
నిబిడసంతోషకారియై నెగడె నైన
వాలినాశంబు నిర్జరేశ్వరునిచిత్త
మెంతయడలించునో! యను నంతలోన. 150

వ. అంతరిక్షంబునం దమందమిళన్మిళిందబృందానందసందోహ సంధాయిమకరందబిందునిష్యందిమందార కుసుమవిసర వృష్టి గురిసె ననంతరంబ జయజయ! రామభద్ర, జగత్పతి! యని మఱియును. 151

శా. వాలిప్రాణవినాశన ప్రశమిత ద్వైరాజ్యవైరాగ్య ల
క్ష్మీలీలాప్తి దినేశజుండెసఁగెఁ గిష్కింధాలయైకక్రమా
ఖేలద్దైవతమై సహస్రనయ నీఖేదాశ్రుముక్తామణీ
జాలుండై హరి వొల్చె నప్త యువరాజఖ్యాతిచే మించఁగన్. 152

గీ. అనుచు వినవైన లక్ష్మణుఁడత్యభీష్ట
కరము మన కిది కావునఁ దరలిపోద
మేతమత్స్వవ భాగమింపెనయ నిపుడు
గాంచుకొఱకని గుహుతోడఁ గదలెనంత. 153

వ. అక్కడ లంకాపురంబునందు. 154

మ. అలుకన్ వాయుతనూభవుండు నిజవాలాగ్రంబు నుదగ్రంబుగాఁ
జలియింపంగనె క్షణంబున శిఖిజ్వాలాచ్ఛటాయోగ సం
కలనన్ బంగరు మేడలన్నియు నుదగ్రప్రక్రియం గాలి, పూ
దెలచందంబున నిల్చె రావణపురోదేశంబు నందెల్లడన్. 155

చ. కొలఁదికి మీఱు నాత్మరుచి గుంటయు మిట్టయు రూపుఁ గర్మమున్
దెలియఁగ రాక యొప్పు మణి నిర్మిత దివ్యగృహంబులందు వ
ర్తిలఁగ హుతాశ నామిత పరీత శిఖాళి నెఱుంగ లేరు మే
నులు చుఱు కన్నదాకను జనుల్ మదినెంతయు నూహచేసినన్. 156

శా. శ్రీమద్బాహువశంవద త్రిభువనశ్రీగర్వసర్వంకష
స్థేముం డప్రతిమప్రతాపుఁడు దిశాధీశానుజుం డద్రిజా
రామక్ష్మాధరభేది యుండ సురదుర్వారాఢ్యయౌ లంకకే
మేమో దుర్దశ కోతిసేయుటివి సుమ్మీ దైవికావశ్యముల్. 157

క. ఇదియెంత రావణుని దు
ర్మదవృత్తికి నంచు ఖిన్న మానసుఁడగుచున్
జదలం జూడ్కులు నిడి దశ
వదనుని భావించి మాల్యవంతుఁడు వల్కెన్. 158

చ. అల పదునాల్గువిద్యలు నిజాస్యచతుష్టయినుండఁ జోటులే
కలజడినొందఁ గన్గొనుచు నంబుజసూతి ప్రణష్టవైన నీ

వలసనె యుండుఁగాక యని సక్రమములం బది నీకొనర్చె నాఁ
డెలమిని నిట్లు నీవు జడవృత్తి వహించుట యెట్లు రావణా! 159

గీ. అని ముహూర్తంబు నిలిచి, యాహా! నుదీయ
వంశ మీగతి నష్టమైవచ్చె ననుచు
మాల్యవంతుండు దుఃఖార్తిమగ్నుఁ డగుచుఁ
దద్విధంబెల్ల మదిలోనఁ దా గణించె. 160

క. రాముఁడు ఖరాదియోధుల
నామంబడఁగించె, పంజరానుతుఁ డతున్
భూమికిఁ బలియిడె, రక్షో
గ్రామణి తా వెతలఁ గ్రాఁచె ఘను ననుజన్మున్. 161

క. గతమగు దుష్కార్యమునకు
వెతఁబడఁ బనిలేదు, రామవిభుఁ డుత్తరసిం
ధుతటినిఁ బాలెము డిగి యే
స్థితిచే నున్నాఁడొ! మనకుఁ దెలియఁబడమగా. 162

వ. అని వితర్కించుచుఁ బురోభాగంబు నిరీక్షించి యౌరా మున్ను రాఘవచరిత్రం బశేషంబుగాఁ దెలియ ననుపంబడిన శుకసార ణులలో సారణుం డరుగుదెంచుచున్నవాఁ డిట కనునంత నతండ రుగుదెంచి ప్రణమిల్లిన. 163

చ. ఘనుఁడగు మాల్యవంతుఁ డతికౌతుక మావహిలంగ సారణుం
గనుఁగొని, వాన రేంద్రుకటకంబుననుండియె వచ్చు టంచుఁ బ
ల్కిన, నతఁ డట్లయౌ ననిన, లేశము దాచక కార్యభాగ మొ
య్యన వివరింపు మన్న వినయాన్వితుఁడై పలికెన్ గ్రమంబునన్. 164

సీ. విను తాత! నాచేత వనచరానీకంబు
పేరులు సంఖ్యయుఁ బెక్కుమార్లు
తెలిసినాఁడవ యింకఁ దెలుపంగఁబట్టదు
వినుపింతు నిక నొక్కవింతసుద్ది
సేతువు గట్టంగ సేనలెల్లను గూడ
నందు వానరవేష మమరఁ దాల్చి
ప్రజలలో నేఁ జరింపఁగ "మహారాజవి
భీషణుఁ"డని యంత భీతినొంద,

గీ. మాల్యవంతుండు సాకూతమతి చెలంగ
"నలవిభీషణుఁడభిషిక్తుఁడయ్యె" నే య
టంచు నడుగంగ నతఁ డందు కనుమతింప
మ్రానువడి ముందువెనుకయుఁ గానకుండి. 165

గీ. ఒయ్యనొయ్యన తెలివొంది యుస్సురనుచు
వత్స! భయమేల? యచ్చటివార్తలెల్ల
తేటపడఁ బల్కుమనిన యమ్మాట కలరి
సారణుఁడు బల్కె మాధురీసాధురీతి. 166

క. ఘనుఁడు కుమారవిభీషణుఁ
డనఘా! నన్నెఱిఁగి పాళయంత్రితునింగా
ననువువడఁ జేసి రఘురా
మునియెదుటన్ నిలుప, నతఁడు ముదమలరంగన్. 167

గీ. తనప్రధానులకన్నను ఘనముగాఁగ
నాకు బహుమాన మొనరించి నాదువలని
నేరముల నాత్మఁదలపక గారవమునఁ
బోయిరమ్మని యనిచె నో పుణ్యచరిత! 168

గీ. అనిన సంతోషమంది యాయనఘుఁ డనియె
నోయిసారణ! విజిగీషువుల యుదాత్త
తా గుణంబులు ద్రవ్య మెందాకనిలుచు
నంతతడ వుండు, నందులో ననఘుఁడితఁడు 169

చ. కుముద సుషేణవీరులఁ దనకుక్షిగతంబుగ వృంగపంక్తులన్,
విమతములైన పద్మములపీడొక్కని వచ్చు శిలీముఖావళిన్
సమముగజూచుఁ వైఖరిని, సజ్జనుఁడున్ దనవారి నన్యులన్
బ్రమదమునొందఁజేయు నిరుపాధికసౌహృదవృత్తి నెంతయున్. 170

గీ. అనుచు వచియించి శుకునిమాటడుగ నతఁడు
వానరులలోన వాని నే గాన ననుచు
సారణుఁడు బల్క మిగుల నాశ్చర్యమొంది
మాల్యవంతుండు వానితో మగుడ ననియె. 171

క. విను వత్స! మనవిభీషణుఁ
డినకులపతిఁ జేరినపుడె యిక మనవంశం
బున కెల్లవిధుల హానియె
యని నామదిఁ దోచుచున్నయది యేవేళన్. 172

సీ. అనిపల్క సారణుఁ డనియె నోయిమహాత్మ!
సత్కులప్రభవుండు శాంతహృదయుఁ
డనుపమధర్మవర్తనుఁడు బాలుఁడు విభీ
షణుఁ డెట్లు తనయగ్రజన్ము విడిచెఁ!
బ్రతిపక్షుఁడగు రాముపజ్జ కేఁగె? నటన్న
నుమ్మలికంబున నుస్సు రనుచు
నోవెఱ్ఱిసారణ! రావణు నకుగు నీ
పటుగానిచో విధినైన నడుగు

గీ. మనుచుఁ జింతాభరక్లాంతి నభినయించు
మాల్యవంతుని నొకకొంత మట్టుపఱచి
యింతవాచఁగ నీకు నే వింతవాఁడ
నైతినే? యను వానితో ననియె నిట్లు. 173

చ. పవనసుతుం డశోకవనపాళి సమస్తము గొట్టఁ గైకశీ
భవుఁడొకనాఁడు చూచి మఱి పాయక కిన్కఁ జవుల్ కొనంగఁ దా
నవరజుఁ గాంచి పల్కె నహహా! మనుజార్భకు లిర్వు రాతగా
శివమున గోతిపుర్వు తనచేటుదలంపక త్రుళ్లెఁ జూచితే ? 174

వ. అనిన నతం డిట్లనియె. 175

ఉ. రావణ! మర్త్యజాతి నవరంబని చూడకు కార్తవీర్యునిన్
భావమునందలంచి, కపినాథులశౌర్యము వాలి దెల్పెఁడే?
నీవు మహాగ్నిహోత్రివి వినీతుఁడవై యికనైన జానకీ
దేవిని నప్పగించి యలదేవతలన్ జెఱవాపు మెంతయున్. 176

వ. అని తద్వృత్తాంతంబు మాతామహుండానతిచ్చు నవసరంబున
సారణుండు మహాత్మా! మీరు ప్రసంగవశంబున వాలి నుగ్గడిం
చుట నొక్కవిశేషంబు నామనంబునకుఁ దోచుచున్నయది విను
మని యిట్లనియె. 177

చ. సురగిరితోడి మత్సరముసొంపున వింధ్యధరాధరంబు ని
ర్భరమ్మదుతం బెరుంగు శిఖరంబుల నైపగఁజాల దేకపీ
శ్వరపటలంబు వారలభుజాబల మెన్నఁదరంబె? సేతుభూ
ధరఖరశృంగఘట్టనలఁ దాల్చెఁ గిణాశిఁ బ్రకోష్ఠపాళికల్. 178

క. సారణుఁ డీగతి వానర
వీరులఁ గొనియాడి మీఁదివృత్తాంతం బే

తీరున నడిచెనొ యన నని
వారితమతిశాలి మాల్యవంతుఁడు పలికెన్. 179

గీ. అనినఁ దమ్ముని మాటల నాదరమున
వినుచు రోషాంధమానసవిహ్వాలుఁడయి,
యాదరానట్టి దుర్భాషలాడి యతని
వెడలఁ ద్రోయించె ఘనమదోద్వృత్తుఁ డగుచు. 180

వ. అనిన సారణుం డాకాశంబునఁ జూడ్కు లిడి హా! పౌలస్త్యనంద
నః నీవనియెడు వైధర్మ్యదృష్టాంతంబుచే ననుమానంబు వలన
మూలచ్ఛేదనిమిత్తంబులయందు మనుష్యజాతంబు భీతంబయ్యె
డుఁగదా యని కొండొకవిచారించి మాల్యవంతునితో నిట్లనియె. 181

క. అరిషట్కమె తన కాఱగు
చరణములుగ భ్రమరి యైన సంపత్కాంతన్
బఱఁగఁగ నందుల మొదటిది
జెలుపుచు నిఁకఁ గుంటిదానిఁ జేయుము తండ్రీః 182

గీ. వినుము తాతః రావణునిచేతఁ నా సీత
యెపుడు పట్టువడియె నపుడె యింక
నలవిభీషణుండ యస్మదీయాన్వయ
తంతు వనుచు మదిఁ దలంతు నెపుడు. 183

చ. అన విని మాల్యవంతుఁడుహృదబ్జము జల్లుమనంగ సారణుం
గనుఁగొని యిట్లు రెండుకటకంబుల తత్వము నీవెఱుంగుచొ
ప్పునఁ దెలియంగ నెవ్వరికిఁబోలద యిందుల కింక కార్య మే
యనువునఁ జక్కనౌ ననిన నాత్మఁ జెలంగి మృదూక్తి నిట్లనున్. 184

సీ. వినుము నామదికిఁ దోచినదారి వినుపింతు
నమవుగా నొకకార్య మనఘచరిత!
యంగదుం దర్భకుం డామహాపాత్రము రీతి
నెటులఁ జెప్పిన నట్ల యెలమిఁ జేయుఁ
గావునఁ "బితృవైరులై విలసిల్లెడు
రామసుగ్రీవులనామ మడఁచి
పఱఁగఁ గిష్కింధకుఁ బట్టంబు నిను గట్టి
వాలి మాకొనరించు మేలునకును
గీ. ఋణము దీర్పంగఁదలచినా మిప్పు" డనుచుఁ
బ్రణిధిముఖమున రావణప్రభు నిదేశ
మచటఁ బలికింప, నిజమని యక్కపీంద్రుఁ
డాసపడి యుండు సుగ్రీవుఁబాసి వచ్చు. 185

గీ. వాఁ డొకఁడు చీలినంతనె వానరేంద్రుఁ
డాత్మగృహ మింక నహిభయావాప్త మౌ న
టంచు రాఘవుపొందు చాలించఁ దలచు
ననుచుఁ గడుసూక్ష్మదృష్టి వాఁ డతని కనిన. 186

చ. పలికెను మాల్యవంతుఁడు కృపామధురంబగుచూడ్కి వానిపై
నెలకొన "నీవుచెప్పినది నిక్కమ యౌ నటులైన బాల్యచా
పలమున యౌవరాజ్యపరిపాలనభోగము లందుచుండి యిం
దుల కిఁక సమ్మతింపఁ డని తోచుచునున్నది నామనంబునన్. 187

చ. అది యటులుండె వాలిసుతునాప్తజనుల్ మఱి సూర్యసూతికిన్
మొదలనె యాప్తు లట్లగుట ముందఱగానక హైన్యవృత్తి నం
గదుఁ డిది సమ్మతించినను గాదనిరిప్పుడు; రింతెకాని దు
ర్మదులయి యిట్టికార్యములమాటకు సమ్మతిసేయ రెంతయున్. 188

వ. అనిన విని సారణుం డిట్లనియె. 189

గీ. ఎద్ది సమ్మత మది సేయుఁ డిపుడు మీరు
దినము లున్నవెః దండనీతిప్రయోగ
మునకుఁ; జిచ్చైనవేళ నెవ్వనితరంబు
కావిఁద్రవ్వంగ నని పల్కి వాఁడు మఱియు. 190

చ. చెలగుచు వానరాగ్రణులు సేతువుగట్టఁగ నెప్పుడాత్మలోఁ
దలచిరొ యప్పుడేరఘునిధానము వారిధిఁ దాటివచ్చి వి
చ్చలవిడి నీసువేలధరచంచదుపత్యకలందుఁ జాళెముల్
నిలిపినవాఁడ కా తెలియు నెమ్మది నీ వన విస్మితాత్ముఁడై. 191

గీ. వినుము సారణః నీవు పల్కిన తెఱంగు
నన మనుష్యుండొకండె యర్ణవము దాటె
నేని దశకంఠువిక్రమం బెలమిభువన
పటలిచే నింక దాటంగఁబడు నిజంబు. 192

మ. అలలంకాధిపుపాదపద్మయుగళం బాదిత్యదైత్యేంద్రమౌ
ళుల నిర్మాల్యము సేయు నారఘునృపాలుం డబ్ధికిం సేతువు
జ్జ్వలవృత్తిన్ ఘటియింప, భానుఁడు సరోజంబున్ సమున్నిద్రుఁడై
చెలగించెన్ రుచిచే, సురాళి భుజియించెన్ సాంద్రచంద్రద్యుతిన్. 193

సీ. అని పల్కి మఱియు నయ్యనఘాత్ముఁ డతని కే
ర్పడ వాలివధశుద్ధపార్ష్ణియును న
నేక వానర బలానీక నాయకుఁ డుప
కృతుఁడు హితుఁడును నహీనచరితుఁ
డగు భానుపుత్రుచే నమితపక్షుండయి
పవనసుత వ్యక్త భావితాస్మ

దీయచరిత్రుండు దీపితసకలాభి
యాస్యత్ప్రయోజనుండైన రఘున్న

గీ. పాగ్రణికి నెన్నిభంగుల నరసిచూడ
నిదియె యభియోగసమయమై మదికి నాకు
దోఁచుచున్నది యనినఁ దుందుడుకు చెంది
యతని గన్గొని సారణుం డనియెనిట్లు. 194

గీ. ఆర్య! మీ రానతిచ్చిన యర్థమెల్ల
తలప నిక్క మె, విను మాత్మధనబలిష్ఠు
లైన విజిగీషువులు కీర్తికాకరంబు 195
లగుట కిదాశరథి యుదాహరణ మరయ.

వ. అనిన మాల్యవంతుండు నిశ్చేష్టితుండై కొండొక విచారించి
యిట్లనియె. 196

మ. అని నవ్వాలి యడంగె, మాబలములు నశ్యద్వృత్తిచే నున్నదా
తనితోవారమె యందు కేమి, భుజసత్త్వస్థేమ కెన్నం గణిం
ప నజేయంబగుదుర్గమైన జమశుంభద్ధాముఁ డారాముఁ డీ
వననిధిం దాటును నూఱుయోజనములన్ వాడిల్లు నింతేకదా. 197

వ. అని వెచ్చనూర్చి తనకుహూతుం డలంచి. 198

మ. పెదవుల్ మాటికి నాల్కలుం దడువుచున్ బిట్టార్తిమైఁ గూయ నె
న్మిడి; రెంటన్ జనుద్రావు నాడశముఖిం దీపించు ఖాస్వద్గుణా
స్పదుండౌ పట్టికి నిట్టిచెట్ట యిక సంప్రాప్తించి బాధింపఁ జూ
చెదవో కైకసి! విశ్వ వీరజననీ సీమంతముక్తామణీ! 199

గీ. అనుచు దుఃఖాబ్ధిమగ్నుఁడౌ నతనిఁ జూచి
సారణుం డిట్టిపాపంబు శాంతినొందుఁ

గాత, బంధుజనంబు లీకరణి మది న
సర్థశంకల నూహింతు రనుచు మఱియు. 200

చ. పనుపడ నింక నే నొకటిఁ బల్కెదఁ బాహువిహంగికావలం
బనము ఘటిల్లఁగా గుణసమాజనిబంధనమూన్చి రాజ్య మీ
యనువునఁ దాస పంక్తిముఖునంతటివాఁడు భరింప జారిపో
యిన, నది దాసిశీల మనుటింతియ కాక తలంపనేటికిన్? 201

చ. అనవిని మాల్యవంతుఁడు ఘనాశ్రుజలంబులు కంఠభాగమం
దనువుగ నిల్పి, మే మిపు డపాగతభాగ్యులమౌట నిక్కమై
నను, మది నట్లుగాఁ దలప న్యాయముగా దలవిశ్రవస్తపో
ధనమహిమన్ మదీయకులతంతు వొకండటు నిల్చియుండినన్. 202

క. అనునంతలోన సంభ్రమ
మున శుకుఁ దేతెంచి వినయమునఁ దాతఁ గనుం
గొని మ్రొక్కి నిలిచి యిట్లని
వినిపింపఁ దొడంగె నచటి వృత్తాంతంబున్. 203

చ. అరిబలజైత్రులైతగు ప్రహస్త మహోదర ధూమనేత్రులన్
వరమతులం జమూపతులఁ బట్టి వధించి నిశాచరాధిరా
ట్పురి నటు చుట్టుముట్టి రఘుపుంగవుఁడిప్పుడు వానరైకబం
ధురజలరాశిఁ జేయుచు మనోహరవృత్తి నటించుచుండెడున్. 204

క. అన నన్య దేశ కాలము
లను జెందుప్రమేయచయములం గన నర్థం
బనఁ దనరు వృద్ధమతి గా
వున నర్థంబెల్ల మున్న పొడమదె బుద్ధిన్. 205

గీ. అనుచు మాల్యవంతుఁ డంబర మీక్షించి
మేలు! రామభద్ర! మేలు మేలు!
ధర జయంబు గోరు ధన్యుల కతిశీఘ్ర
కారితయె యవశ్య కార్యసిద్ధి. 206

చ. అనునెడ సారణుండు తన యాప్తసఖున్ శుకుఁ జూచి యిప్పుడా
దనుజవరేణ్యుఁ డెట్టి విధానము పూనినవాఁడొ చెప్పుమా?
యని యడుగంగ, నాతనికి నత్తఱిఁ దెల్పఁ దొడంగె నద్దశా
ననచరితంబు లచ్చటిజనంబు వినన్ వివిధోక్తి చాతురిన్. 207

మ. అలరాముండు సువేలఁజేరె ననుమాటాలించియున్, గొన్నిచే
తుల దేవారి ధనుర్గుణధ్వని దిశల్ దూలించుఁ, గొన్నింటిచే
జళిపించుం గరవాలముల్, పటమునన్ సాధించు సీతాకుచాం
చలకాశ్మీరమనోజ్ఞచిత్రరచనాచాతుర్యముం గొన్నిటన్. 208

గీ. అనిన సారణ! కంటె? దశాస్యుహృదయ
చంచలత యిపుడేనియు సడల దనుచు
నంత శుకుఁజూచి యమ్మాల్యవంతుఁ డనియె
నెగులు దిగులును మదిలోన బుగులుకొనఁగ. 209

ఉ. గోపురశాల్కి కాధిపుఁ డకుంఠితవిక్రముఁడా నరాంతకుం
డేపరిపాటినుండె! నన నెప్పుడు పాయక ద్వారభూమియం
దేపున నుండె, నైన నిఁకనేమన నంగదు చేత నంచువాఁ
డాపయిమాటఁబల్కుటకునై మనసొగ్గక యూరకుండినన్. 210

గీ. మాల్యవంతుఁ డంత మది గుభిల్లుమనంగ
హాదశాస్యపుత్ర! హాకుమార!
యిట్టిపాటుఁజూడ నెట్టు మాకుఁ జిరాయు
వఁజుఁ డొనర్చె ననుచు నడలుచుండ. 211

వ. ఆసమయంబున నోమహాపార్శ్వాదిదానవవీరులారా ! యూరక వానరకటక సమాలోకిత చరమాంగు లగుచు వెరచి పఱచెద రేలంచు మరియును. 212

చ. తెరలక నిల్వఁ డస్త్రమయదేవియుపాస్తి యొనర్చి యుద్ధతిన్
మెఱయుచు మేఘనాదుఁడు సుమిత్రసుతుం బరిమార్తు నంచుఁ దాఁ
గరమునఁ గట్టెఁ గంకణము, ఖడ్గముఁగైకొనెఁ గుంభకర్ణుఁడున్
వెఱవకుఁ డేమిశంక రఘువీరునిచే ననుచున్ వినంబడన్. 213

ఉ. అందుకు సారణుండు మది హర్షమునొందుచు సావలంబమ
య్యెం దగఁ గార్య మిప్పుడు సమిద్ధభుజుం డలకుంభకర్ణుఁడం
తం దననిద్రఁ దేఱి రణధాత్రికి వేగమె చేరవచ్చె సం
క్రందన జైత్రుఁ గూడుకొని గాఢపరాక్రమ మేపుఁ జూపఁగన్. 214

గీ. అనిన నమ్మాల్యవంతుఁ డిట్లనియె నపుడు
రామలక్ష్మణు లనురాగరసముఁబొదలఁ
గలనఁ గూల్తురు మనకుంభకర్ణ మేఘ
నాదు లనుమాన మిఁకనేల నయచరిత్ర!. 215

వ. అని యిట్లు మాల్యవంతుండు పలుక సవిషాదమనస్కుండై శుకుం డాత్మగతంబున నక్కటకటా యవిశిష్టకర్తృకర్మభావంబుగా ముదిమది దప్పిపలికె నిమ్ముదుసలి నేమియన విధివిపాకం బప రిహార్యంబనునంత నతండు. 216

గీ. శిశువులార ! వినుఁడు చెప్పెద.శోకవార్త
రాక్షసాధిరాజ రాజ్యలక్ష్మి
యెన్నివిధులనైన నిక్కుంభకర్ణుని
వలన మన్నదనుచుఁ బలికి మఱియు. 217

క. అన్నయగు రావణునికో
పిన్నయగు విభీషణునకొ ప్రియమలరగఁ దా
నున్నను జన్నను రాజ్యము
మన్నించు నెఱుంగలేము మదినూహింపన్. 21?

వ. అనునాసమయంబున 2?

సీ. దిగులొందనేల పన్నగ కూర్మపతులార
యరయ విశిష్టభూధర మొకింత
యిపుడు లేదని పక్షికులపనుఁ డాజ్ఞాపించు
చున్నవాఁ డురుకృపాయుతమతీశ,
యనునంతలో శుకుం డలరుచు మనవార
లెక్కుడుగరిమచే నుక్కుమీఱ
రన మాల్యవంతుఁ డత్యవధానమతి విను
చుండ, నచ్చో మఱియొక్కవార్త

గీ. వినఁబడియె, బాహుగిరులు వేర్వేఱ నఱికి
తల యెగురఁగొట్టినట్టి యాదశరథాత్మ
భవునిచేఁ జుల్కనయి మహాహవ ధరిత్రి
వ్రాలె ఘనకుంభకర్ణకబంధ మిదిగొ ! ?2?

చ. అన విని మూర్ఛనొందిపడి హా శిశురత్నమ కుంభకర్ణ! యే
యనువున నేలఁగూలితి వటన్న శుకుండును సారణుండు నొ
య్యన దను నూరడింప నయనాంబుకణంబులురాల వారలం
గనుఁగొని మాల్యవంతుఁ డటఁ గ్రమ్మఱఁబల్కె విషాద మేర్పడన్. 22?

మ. భువనైకాద్భుతధైర్యసంపదలచేఁ బొల్పొందు నిక్ష్వాకుభూ
ధవునిన్ వంచనఁజేసి సీతఁగొనిరా దా నెంచితిన్ మున్నుగా

వివిధోపాయములన్ వివేకమున నే వేతే మతింకేటికిన్
నవదుఃఖోదయ శాంతు లన్న శుకుఁడంతన్ దుఃఖ మేపారఁగన్. 222

చ. కటకట యిట్టివార్త దశకంఠుఁడు దాఁ బ్రకటింపనేల ను
త్కటముగ నన్నుఁ బాత విని దానవనాయకునాజ్ఞ సాగ ది
వ్పటికిఁ గపీంద్రులొండొరులు పక్ష్మముఖుం గడు గేలిసేయుచున్
దిటముగఁ బల్కినా రనుచుఁ దేఁపడన్ వినిపింప నాతఁడున్ 223

గీ. ఎంతలే యిట్టికోతులగంతులకును
శౌర్య మొండిక విజయమే చాలుఁ దెలుప,
నింద్రజిత్తునిఁ గెలుసకే యిపుడుతాము
గేలియొనరించి వెలపించుజోలి యేమి? 224

వ. అని పలుకు నవసరంబున. 225

సీ. వినుఁ డహో వానరవీరపుంగవులార!
త్రుంపుఁడీ పట్టణతోరణములు
హరిచాపయుత దేవశరవృష్టి కేయవ
గ్రహ మంతరాయమై కదలుకొనియె
నన మాల్యవంతుఁ డత్యంతశోకోద్రేక
మున నెట్టిమాటలు వినఁగబడునొ!
యని కర్ణములు మూసికొనియున్న నంతలోఁ
బెనువార్త వచ్చె నాభీలవృత్తి

గీ. సారశస్త్రాస్త్రుఁడయ్యును వీరయజ్వ
యును నగుచు నిష్టియొకటి చేసిన సుమిత్ర
పట్టిచే రణశాల నాపక్ష్మకంతు
నాత్మజుం డిష్ట శమితుఁడై యరిగె, ననుచు 226

గీ. అట్టి దుర్వార్త వీనుల నంట నతఁడు
దుఃఖపరిపూర్ణుఁ డెంతు నిర్దుఃఖుఁడగును
గాని యీచెట్టి యామూలఘాతియగుచుఁ
గదియ నియ్యెడ నే నెట్లు గాంతు సుఖము. 227

వ. అనిన శుకుం డూర్ధ్వభాగంబు నాలోకించి యిట్లనియె. 228

మ. దివిజాధీశవిమానపంక్తు లదిగో దిఙ్మండలిన్ మెండుగాఁ
గవిసెం, గానఁ దలంతు దారుణరసక్రాంతప్రణాపజ్వల
న్నవపావకేంధన పీయమానసహసానశ్వద్వ్యాధావాహిని
ధవుఁడై పఙ్క్తిముఖుండు రామజయసంధానేచ్ఛ సంధిల్లుటన్. 229

వ. రణాంగంబునకు వచ్చెంగావలయు ననిపలికిన, మాల్యవంతుండు జరాపిశాచీసంపర్కదూషితం బగు మద్దేహంబు రామభద్రని ర్ణిద్రశరాసారతీర్థసేకంబునఁ బరిశుద్ధిగావింతుఁ నని లేచి వారలతోఁ గదలె; ననంతరంబ గగనంబున విమానారూఢులైవచ్చు గంధర్వకుమారులలో రత్నచూడుండనువాఁడు హేమాంగదాభిధానున కిట్లనియె. 230

క. చెలి హేమాంగద! నేఁ డీ
జలధరమార్గమున మనకుఁ జరియింపంగాఁ
గలిగె విమానముల నిర
ర్గళగతి నని క్రింది వలను గని యిట్లనియెన్. 231

మ. సురనాథోపనివేద్య నందనవనీ సూనావళీ తోరణ
స్ఫురిత క్రవ్యభుగీశ విక్రమసఖీ ప్రోద్భాసి లంకాపురీ
వరరథ్యాళి సమిద్విలోకన ముదావాప్తాప్సరోజాల కే
శ రథాచ్ఛాదిత యౌట నయ్యెఁ జదలన్ లేఖావకాశచ్యుతుల్. 232

మ. అనఘా! కంటె? సురాధినాయక సహస్రాక్షి ప్రవద్వారిపూ
ర నదీమాతృక కేళికావనులచే రంజిల్లు నీవీట మున్
మనుజాలి ప్రతిజాతిదూషణ కథామంద స్వరడ్డింభకుల్
గినుకం దేవసమూజయాను కృతిచేఁ గ్రీడింతు రత్యున్నతిన్. 233

వ. అనిన రత్నచూడునకు హేమాంగదుం డిట్లనియె. 234

క. నర దేవాసుర భీకర
కరరాజన్మండలాగ్ర ఖండిత రిపురా
ట్కాదివరుఁడై దశకంధరుఁ
డిరవందెను వానిమహిమ మేమనవచ్చున్. 225

మ. తతదోశ్శక్తిః కథా ప్రశస్తిరచనోద్దామాక్షరాకారదృ
క్తతి సంశోభిత గోత్రభిన్మయజయస్తంభాంక పూర్వారుఁ డీ
దితిజాధీశుఁడు వీని జోడగు మహాధీరుండు లేఁ డీజగ
త్త్రితయాపత్కర విక్రమక్రమ పరిక్రీడాప్రభావోన్నతిన్. 236

క. అన రత్నచూడుఁ డనియెన్
విను హేమాంగద! దశాస్యువీటను దనుజుల్
ఘనతర నినదము లెసగఁగ
మునుకొని పటహములు బెడిదముగ ప్రయోగింపన్. 237

సీ. ధారాళదిగ్దంతిదంత మౌక్తికమయ
ద్వారతోరణదామ హారి యైన
హరిపద ఘటిత భీకర శృంఖలోన్మృష్ట
పరబందికా శోకభారమైన
శైశవోపార్జిత శౌర్యలక్ష్మీ సహ
పాంసుకేళీ సుహృన్మాత్రయమైన
పంక్తికంధరవధూ బంధుతా శౌండీర
దానవీగణ సముద్భాసియైన

గీ. యసమ సురతరువికసిత కుసుమవిసర
సరస పరిమళ సురభిల శయనశయిత
సమద దితిసుత పరిచరదమరయువతి
యయిన గృహసంఘ మీయెడ నడఁచుండె. 238

వ. అనిన విని నగుచు హేమాంగదుం డిట్లనియె 239

చ. దనుజవనీ దవానలుని దాశరథిన్ మిథిలేశనందినీ
జనితమహానురాగుని నిజప్రియునిం బరికించి యెంతయున్
మనమున నాత్మపక్షజనసనాశము లిత్తఱిఁ గోరుచున్ రయం
బున నిటు లంతరాళమునఁ బొక్కెడు నమ్మయుపుత్రిఁ జూచితే! 240

చ. అన విని రత్నశేఖరుఁ డుదంచిత హాసదయారసంబుగా
ననియె, నమర్త్యనాయక జయక్రమవిక్రమహృష్ట చిత్తజీ
వనరుహ సంభవారచితవాసవజిద్ఘన నామశేషనం
దన బహుశోకమగ్న నరినాయిక నీగతిఁ బల్కఁజెల్లునే? 241

వ. అని వెండియు. 242

క. ముందటఁ గను గొని దక్షిణ
మందుం గనుఁగొంటె? యిమ్మహాజన మదె రెం ·
డందమ్ము లయ్యె నంచును
జెందిన భయకౌతుకములఁ జెలి కిట్లనియెన్. 243

మ సమద క్రూరవిలోక హల్లక కృతాశాతోరణస్రజ్ముఖ
క్రముఁడై ఖడ్గవరైకమానసవివల్గ ద్వేగపద్యోత్సుకా
సమ దోస్సంవృత రోదసీకుఁడయి విస్ఫారాంఘ్రి భారానతో
న్నమమర్త్యస్థలుఁడై దశాస్యుఁ డరిసేనం దా నేతెంచెడిన్.క 244

క. నావుఁడు మును గన్గొన్నదె
రావణ సంగ్రామ భీమరభసం బైనన్
భావములోఁ దలచిన నా
కీవేళది వోలె భీతి హేతుక మయ్యెన్. 245

మ. శతమన్యుస్వరుఘట్టనక్షణకృతశ్వేల్పాకవక్షస్సమా
హృతధారాధరమార్గుఁడై సమరభూహేలాభిభూతామర
చ్యుతలక్ష్మీకరిణీవిహారపదబాహల్యాద్దామకాంతారుఁడై
ప్రతిభన్ మించిన యద్దశాస్యుఁడిపు డేపాటొందె నూహింపుమా. 246

గీ. అనిన విని రత్నశేఖరుం డనియె సహహ
యేమి యనవచ్చు భీమసంగ్రామ విక్ర
మాఢ్యులగువారిలోన పేరైనవాని
ప్రణుతసిధినాధ సఖుని నీ పఙ్క్తిముఖుని. 247

మ. అమరాధీశుఁడు సంతతం బసుకర వ్యాజా మరక్ష్మాజని
స్సముభూషావళిచే దశాననునిఁ బూజల్ సేయు స్కంధోపనే
యమణుల్ దుర్భరదండనీతి నిడి యాయంభోధియున్ దన్నిమి
త్తమ యన్వేషమొనర్పు శూన్యఖనులర్ దద్వైభవం బేమనన్. 248

వ. అని పల్కునెడ నసమసమర పరమసంతోష భీషణహేషమాణక్షణ వనా
యుజవాజిరాజి సంపాదిత సముద్దండదండధర చండసైరిభ కర్ణజ్వరభ
ర సముత్తుంగం బగు రయవచ్ఛుతాంగంబు నెక్కి దుర్ధర్షామర్ష బంధు
రుండగుపంక్తికంధరుం డరుగుదెంచినం గాంచి సభయాద్భుతంబుగా
మఱియు నిట్లనియె. 249

మ. ప్రళయార్కప్రభసన్నిభాస్యుడయి మర్త్యద్వంద్వయుద్ధకండూతిజో
జ్వలకండూతిభుజార్గళేక్షణభవద్వైలక్ష్యలక్ష్యాత్ముఁడై

యలఘిష్ఠామరగోష్ఠిగర్వనికషుం డాకైకసేయుండు భూ
స్థలి కాత్మారిబలాస్త్రసంతతిఁ దిరోధానంబుఁగల్పించెడిన్. 250

క. అనినన్ విని హేమాంగదుఁ
దనియెం గౌతుకముతోడ నదె కనుఁగొంచే
యనుఁగుంజెలి దక్షిణమునఁ
దనరెడి కపిసైనికులను దనుజాధీశున్. 251

మ. ఘనశాఖామృగసేన శీర్షపరిసంఖ్యాజ్ఞాత పౌలస్త్యద
ర్శనకాంక్షాగతయై వెఱన్ బఱచె నౌరా కుంభసంభూతశా
సనసద్యశ్శమితోచ్చ్రితాఘటితవైషమ్యంబు సేతుప్రబం
ధనశీర్షోజ్ఝితవింధ్యశృంగచయమున్ ధాత్రింబడన్వైచుచున్ 252

వ. అనిపల్కిన సహాసంబుగా రత్నచూడుం డిట్లనియె. 253

చ. హరివరయూథశస్త్రితజవాపతదున్నతచందనద్రుమో
త్కరముల వేడ్కచే నెదురుగాఁజని గైకొనుదానవాళికిన్
గురుతరతస్నివాసఫణికోటి ఘటించు ముహూర్తమాత్ర మే
ర్పఱుపఁబడం గరంబులకుఁ బాశనిబంధనదుఃఖవేగమున్. 254

చ. అనవుఁడు హాటకాంగదుఁడు హావెలి నీపదె చూడు వేడ్కతో
దను దితిజస్వయంవరవిడంబ పరాఙ్ముఖ దేవసుందరీ
జనసుమవృష్టి లేకయె విశంకటవానరశస్త్రితద్రుమ
ట్టన దనుజుండుఁగూలె నిచటన్ మెయిఁ దత్కుసుమాళి నిండగన్. 255

వ అనిన రత్నచూడుఁడు కొండొకవిచారించి హేమాంగదున కిట్లనియె. 256

గీ. ఎఱుపు మైచాయచేఁ బగ లెక్కుడైన
రీతిఁ గనవచ్చు దివి నెవ్వరితనువు లధి
కతిమిరము జించుఁ దత్కపికతినవహ్ని
కదను దద్దైత్యులను ధూమ మదరె నిపుడు. 257

వ. అనిన హేమాంగదుం డిట్లనియె. 258

చ. పరిపతదామిషాశివరపఙ్క్తి వియుక్తనభోంతరస్థలీ
భరణికలందుఁ గ్రిక్కిఱియుఁ బఙ్క్తిశిరోధియశంబు లేక్రియన్
వఱలుచు దిక్తటాశివలనన్ ఘనపాదపశస్త్రపాణులై
యరుదుగఁ జేసి రాత్రియ వనాటులు నిక్క మవాచ్యకర్మముల్. 259

క. అనిన విని రత్నచూడుం
డనియె ససంభ్రమముగాఁగ నసుగుంజెలిఁ క
న్గొను మిదె దారుణకర్మము
పనివడి యిచ్చోట నిపు డుపస్థితమయ్యెన్. 260

మ. గురుదైత్యాధిప నీరదంబు వికటక్రోధాట్టహాసాగ్నిబం
ధురవిద్యుత్తతియై నిశాచరచమూస్తోమాతిసంఘృష్టవా
నరముక్తాచలచూర్ణపూరితనిజాంతర్భాగధారాపత
చ్ఛరవర్షంబులచే నొనర్చె నహహా సాంద్రాంధకారంబిలన్. 261

గీ. అనిన విని హాటకాంగదుఁ డసురవిభుని
క్షణము వర్ణించి యిట్లను సఖునితో న
నేకులైనట్టి క్షుద్రులకేని యొక్క
ఘనుని వెతఁ బెట్టు టది దొడ్డగాదు వినుము. 262

మ. హరిదీశోన్మదనాగదానజలవర్షావగ్రహక్రూరదృ
క్షరతారాంకునిఁ బఙ్క్తికంధరుని నుత్కంఠాన్వితుం జేయ వా
నరవీరుల్ పరిబద్ధసేత్వధికసంత్యక్తాద్రికూటౌఘని
ర్భరశస్త్రంబులు పూనినిండిరి యమర్షస్ఫూర్తిచే నిప్పురిన్. 263

వ. అనిన విని రత్నశేఖరుండు సవిషాదంబుగా సఖున కిట్లను న
క్కటా మిక్కుటంబైన విషమంబు సంప్రాప్తంబైన తెఱంగునఁ
గానవచ్చుచున్నయది దయారహితప్రచండతరమండలాగ్రఖండి
తారిమండలాఖండవక్షఃకవాటవితతకంటక వికృతకపోలభిత్తు ల
గు మత్తదైత్యలోకమ్ము మొత్తంబుగా నిరంతర గళనికరరుధిరధా
రాప్రకల్పితానల్పవీరపానగోష్ఠీవినోదంబుల మిక్కిలి యుక్కు
మిగిలి ప్లవంగపుంగవుల నుఱిమి తఱిమికొని చనిరనిన విని హే
మాంగదుండు వయస్యా! విచారంబేల విను మని యిట్లనియె. 264

ఉ. రావణు డేయు నిష్ఠురశరంబుల కోర్వఁగలేక విచ్చు మొ
గ్గై వెఱఁ దోక లెత్తుక రయంబునఁ బాఱెడు వానరాళి సు
గ్రీవుఁడు పోకు పోకుఁడని క్రేవ మరల్చి దురంబొనర్పఁగా
నావుఁడుఁ దత్సఖుండును ఘనంబగు నద్భుతఖేదయుక్తుఁడై. 265

మ. అవురా! మున్ను నిగుడ్చు భూమిరుహశస్త్రాసీకముల్ కైకసీ
భవవక్షస్థలఘట్టనానలముచే భస్మంబులై పోవఁ గీ
శవితుం డంత గిరీంద్రశృంగముల ముంచం దత్కరశ్రేణిచే
నవియుం బిష్టములై స్వకుంజరఖురసీరాప్తిన్ గనెన్ బంకతన్. 266

వ. నావుఁడు హేమాంగదుండు బలధురంధరుండగు నిప్పఙ్క్తికంధ
రున కిపు డెంతయుఁ బ్బురం బది యెట్లందివేని. 267

శా. ఢాకన్ పేఁడుతటాన మున్ మొదలుముట్టన్ భూమియంటూడఁగా
నాకైలాసము నెత్తఁగాన శిథిలంబై నేఁటికిన్ భర్గ సం
ధ్యాకాలోద్ధతనృత్యయోగమునఁ దాంతంబై చలించున్ వయ
స్యా! కళ్యాణధరాధరప్రముఖగోత్రాధీశ సంఘంబులోన్. 268

చ. హరిబలనాథ శస్త్రిత మహాతరురాజము దైత్యనాథుపే
రురమునఁ గోమలాంబుజబిసోపమ మై పడఁ దత్సుమంబులన్
సరసిజసాయకుం డిపుడు క్ష్మాతనయా ఘనమోహపీడితాం
తరుఁ డగు వీనిదేహమున నాటఁగనేసె నటంచు దోఁచెడున్. 269

గీ. అనుఁడు వినిరత్నశేఖరుం డరసి నవ్వి
యేమనఁగవచ్చు నోచెలి! యీ నిశాట
పట్టభద్రుండు సత్వసంపన్నుఁ డందు
నెన్న మొదలింటివా డిది యెట్టులనిన. 270

మ. త్వరగా మూర్ధము లుత్తరించి శిఖి వేల్వన్ ఫాలముల్ పెట్టున
త్తఱిఁ బైట్టంబడ దేవతాలిపులు సీతాభర్తచే నౌషధన్
బరిశీలించి యచంచలాత్మధృతిచే బ్రహ్మన్ భజించెన్ గడుం
దర మే మానధనాఢ్యుఁ డీతనివిరోధం బోర్వ నెవ్వారికిన్? 271

వ. నావుఁడు హేమాంగదుం డిట్లనియె 272

మ. ఖరనారాచపరంపరా శకలిత గ్రావోపలస్తోములై
తరుచూర్ణీకృత శక్తితోమరగదాదండాశుగవ్రాతులై
హరిదైత్యేంద్రు లటం దలాతలి రణాహంకారసాంకర్యవి
స్ఫురణన్ మించి భయానకాద్భుతగతిం జూపట్టి రీక్షించితే? 273

చ. ఉడుగని యార్పుచాల్పులుప నుబ్బుగళంబున హారముల్ దెగం
బడి మణికోటిభార ఫణభంగభయం బొనరింప శేషుఁడి
ప్పుడు కపియోధశౌర్యభరభగ్నతనుండయి పీను లుండమిన్
గడుఁ దల లొక్కటన్ గదియఁగా ధర మోచుచునుండగావలెన్. 274

చ. అని మఱియున్ విషాదమున నాతనితో నకటా! దశాననుం
డినసుతునిన్ భుజంబుల నహీనధృతింబిగియించి సంగరో
ర్విని కని యుద్ధలాఘవపరిశ్రమ "కీశ! మదీయదోర్వనం
బనియెడు డోల నూగుచు ఫలాప్తివహించి సుఖింపరా"యనెన్. 275

గీ. అనిన విని రత్నచూళుఁడు దనదుసఖుని
తోడ నిట్లను భానుసుతుండు హస్త
కౌశలంబున విడిపించుక దశకంఠుఁ
దనిన దుర్వచనంబుల కలిగి పలికె. 276

సీ. ఓరోరి దశకంఠ! యొకమాటె యాకర్ష
ణచ్ఛేదములఁ బ్రవీణతఁ దనర్చు
వింశతిబాహుల వెస దశమ శిరంబు
ద్రెంపక పలికి తత్క్రమమున
ము న్నెవ్వి నీచేత భిన్నంబులయ్యెనో
ప్రార్థితభూతాధిపంబులైన
తన్మస్తకంబులఁ దక్కినదాని నా
పదిగోళ్ల ద్రుంచి శంభుత్సుఖాప్తి

గీ. నలువ వహియించి త్వద్వ్యధనాట్యసూత్ర
ధారుడఁగు రాఘవునితోడి పారిపార్శ్వ
వృత్తిచేఁ బ్రకరణఫలబీజభావు
కుల సుధాంధుల నే బ్రహృష్టుల నొనర్తు. 277

వ. అని యిట్లుపల్కి సుగ్రీవుండు కుప్పించి యుప్పరంబెగసి పజ్క్తిశిరోధిం గప్పున నడచిన నతం డానొప్పిన జతదప్పి దర్పితవిరోధి రాజమండల కేతువగు కేతుదండం బవలంబనంబుగా నాఁగిగి యెట్టకేలకుఁ దెప్పిఱిలె నని యంతదిగంతంబులఁ బరికించి సాస్రంబుగా వయస్యా! చూడుమని యిట్లనియె. 278

మ. సరు లేమౌళికిఁ గట్టి రాలిపడు నా సంతానకంబుల్ సురే
శ్వరకేళాంతరవామ మయ్యెఁ దలపన్ స్వర్మాల్యకృత్సృష్టిఁ ద
న్నరభుజ్నాధశిరోనవవ్యధను సందర్శించి యీవేళ ప్రమో
సిరి వైమానికు లాత్తహర్షభరవిచ్ఛిన్నాతిభీతస్థితిన్. 269

చ. అనుటయు హాటకాంగదుఁడు హాఃయని ఖేదమునొంది యీఱటన్
గనిన దశాస్యముష్టిహతి గాసిలి పడ్డ దినేశసూనునిన్
మన మడలంగ నీల హనుమంతులు దగ్గరి సేద దేర్చుచున్
గొని కడ కేగి రంచుఁ దనకూర్మివయస్యునితోడఁబల్కినన్. 280

చ. అపు డలరత్నచూడుఁడు వయస్యున కిట్లను సంగరాదియం
దపరిమితప్రతాపులకు నొఁగిడ యోటమి గెల్పుఁ బెక్కుమా
ర్లిపుడు విషాద మొందఁ బనియేమి యనం గనకాంగదుండుతో
రపుముదవాప్తిఁ బొంగెడపు ప్రాణసఖా! యటువంకఁ జూడుమా. 281

సీ. కౌశికదత్త దివ్యాశుగాగమ వేది
భార్గవాహంకార భంజనుండు
వీరసంగరసీమ భూరిదోర్బలశాలి
వనజాతబాంధవవంశ కేతు
వంగీకృతమదాఖియాతికర్మవిహారి
వనరాశిసేతుబంధన చణుండు

లంకానిరోధనిశ్శంకసైన్యవినోది
దానవీ వైధవ్య దాయకుండు

గీ. రాముఁ డుద్దండమౌర్వీవిరావ భిన్న
గగనదిక్కాండకోదండకలితుఁ డగుచు
పఙ్క్తికంధరహరణసంభ్రమఖరాతి
కుటిలదృక్కాంతివెలుగంగ నిటకు వచ్చె. 282

క. అని పలుక రత్నచూడుఁడు
విని హర్షముతోడ రాము వీక్షించి దశా
నను నితఁ డేమో పలికెను,
గనలున్ ముదమెనయ ననుచుఁ గడు నిట్లనియెన్. 283

శా. ఓరీరావణ! శంభుచాపహతిజాతోత్సేకుఁడై బాహుశౌ
ర్యారూఢోష్మఁ జెమర్పఁజేయుచును బాల్యంబందె యాక్షత్రసం
హారిన్ భార్గవుఁ జక్కఁజేసిన మహీజాధ్యక్షుచే నీ కగున్
దారాభర్తృసమానకర్తృకిపథోత్కర్షాత్తభర్తృత్వమున్. 284

వ. అనిపల్కి ననుసముఖంబున హేమాంగదుండు వయస్యా! స
ద్దుసేయక నిలుసలు రాక్షసుం డేమియో యనుచున్నవాఁడు
విందమని చెవియొగ్గి వినునెడఁ బౌలస్త్యుండు కాకుత్స్థవల్లభున
కిట్లనియె. 285

మ. భళిరా క్షత్రియడింభ! రౌప్యగిరినుత్పాటించి, వే నాటి, వ
త్రిలు నాబాహువిలాస మద్భరణిప్రౌఢిం గోరి యీశానచా
ప లతన్ ద్రుంపక మానె కాని సురరాజన్యద్వేషదానాంబుని
శ్చలదౌర్జన్యభిదుగ్రజాగరమదప్రౌఢి నిన్నోర్చునే? 286

వ. అనిపలికిన. 287

మ. విని హేమాంగదుఁ డంత విస్మయముతో వీక్షించి యాదానవేం
ద్రునహంకారము పేరి గ్రంధి యిపుడున్ దుర్వారమై ముజ్జగం
బును నిస్సారముఁజేయుచున్న దన నాప్తుం డోచెలీ! యిందుకెం
తని యాశ్చర్యమునొందెదీవు మది నీ కారీతి నేఁ దెల్పెదన్. 288

శా. మానాధ్మాతుఁడు రావణుండు నిజశుంభన్మూర్ధముల్ ద్రెంచి ధై
ర్యానూనస్థితి నేకమస్తకముతో నర్ధాంగమందుండు నా
చానన్ వంచనఁజేసి మ్రొక్కి ముదమెచ్చన్ శంకరై కాంఘ్రికిన్
వానింబోలిన వీరుఁడేడి జగతిన్ వర్ణింపఁగా నెచ్చలీ! 289

గీ. అనుచు గగనంబుఁగని కొంతయభినుతించి
నవ్వి యోచెలి! యిదె పురందరునిరథము
పొలె నొక్కటి దశరథపుత్రు చెంత
కరుగుచున్నది యనిన హేమాంగదుండు. 290

ఉ. అప్పుడు హర్షముప్పతిల నాత్మసఖుంగని పల్కె వీఁడుగో!
తప్పకచూడు నేత్రతులితంబులు చంద్రకసన్నిభంబులై
యొప్పు సహస్రరంధ్రములయుక్తినెసంగెడు జోడు దోప నీ
చొప్పునవచ్చె నింద్రరథచోదకుఁ డంచు నుతించి నవ్వుచున్. 291

మ. హరి నానావిధరత్నదీధితిసమూహప్రస్ఫుటాకారితా
మరకోదండ సహస్రయుక్తరథసీమఁ నిల్చి చాపంబుసం
గరరంగస్థలి గంటినంచుఁ జెవియొగ్గం బల్కెనవ్వేళ వి
స్ఫురణన్ మాతలితోడ దైత్యకుల రాట్పూతుండు కోపోద్ధతిన్. 292

శా. కాలాభీలసురాసురాధిపభుజాకాండోరుకండూవిష
జ్వాలా జాంగలికుండు రావణుఁడు నీగర్వంబు వారింపఁడే

యౌలే యీరఘుడింభుఁ జేర్చితిగదా యాయింద్రు మైమర్వుఁ దే
రేలా గాతని కీక్షణంబె యివి యెంతేవింతలై కూలినన్. 293

క. అనునంత రత్నచూళుఁడు
గని నెచ్చలిః రాముఁడేమొఘనముగఁ బలికెన్
వినుమను నెడ నిట్లనియెను
జనకజవిభుఁ డసురవరుని సారథితోడన్. 294

గీ. ఆవుర నీ వనుపల్కు సత్యంబు లోక
మందు నేలిక యెట్టివాఁ డట్టివార
లై నిజస్వామిఁ జెడ దుర్ణయంబుచేత
నాత్మ నుతిసేసి పొంగుదు రల్పమతులు. 295

క. అని పల్కు నవసరంబునఁ
గనకాంగదుఁ డాత్మసఖునిఁ గనుగొని యేమో
దనుజవిభుఁ డాడుచున్నాఁ
డనునెడ వాఁ డసియె రఘుకులాంబుధి శశికిన్. 296

మ. తతకోపామిత సంజ్వలన్మఘవనేత్రశ్రేణి తద్దైన్యభా
ష్పతరంగంబులచేత వెంటనె వడింజల్లార్చు నస్మజ్జగ
త్త్రితయానేక జయాంకవిస్ఫుట భుజాబృందంబు లాహా సమ
ర్థత నొప్పంగద నిత్యనీతివిధి నిర్వాహంబునం దెల్లెడన్ 297

క. అనునంత రత్న శేఖరుఁ
డనఘుఁడుదాశరథి యేమియనుచున్నాఁడో
వినియెద నని యాలింపఁగ
దనుజాగ్రణితోడ నతడుఁ దగ నిట్లనియెన్. 298

ఉ. తొమ్మిదిమస్తకంబు లలధూర్జటిపూజకుఁ ద్రుంచి యేమి నీ
విమ్మనియంటి వాతని నహీనభుజార్గళపాళికింద్రిలో
కమ్ములగెల్పు నైజము జగంబుసృజించు విధాత కెన్నఁగా
ముమ్మనుమండవౌట హతమూర్ధపునస్థ్సితినీకు జిత్రమే. 299

వ. కావున నీవు వివేకహీనుండ వింతియకాక మాటిమాటి కిచ్చో టనీభుజాపాటవంబు పాటించెదు నేటి కది తేటపడియెడు ని ట్లాడనేలనన విని హాటకాంగదుం డందుకునిశాటపతి యేమి యుత్తరంబిచ్చునోయనియాకర్ణింప నిలింపాహితవల్లభుండు ర ఘుతల్లజున కిట్లనియె. 300

గీ. ఓరి రాజన్యడింభ! నాయురుభుజప్ర
తాపము భవత్పురాణపితామహుఁ డన
రణ్యుఁడు నెఱుఁగు నెంతయు రఘుమ్మనేఁడు
నీవుతెలిసెదవంచు దానిలిచి పలుక. 301

క. విని రత్నచూడుఁ డపు డిం
దునకేమనునొక్కొ దశరథునిపుత్రకుఁ డం
చునుఁ జెవియొగ్గిన నత్తఱి
నినకులవల్లభుఁడు దానవేంద్రుని కనియెన్. 302

మ. వినరా రావణ! రాక్షసకుల! భవద్విధ్వంసితుండైన మా
యనుఁడు జ్యాఖ్యుఁడ తేఁ దపింప, నని శౌర్యాఢ్యుఁడ జయంబున్ ప్రతిం
గనుటల్ నైజము, యార్తి హైహయుని పక్షాణించు బందీకృతున్
నిను భైక్షంబుగ నప్పులస్త్యుఁ డడిగెన నే నందుకై కుందెదన్. 303

క. అనినన్ విని హేమాంగదుఁ
డనియెన్ దశకంఠు డిందుకై యేమనునో

యనునవసరమున వా౽ డా
యినకుల శేఖరునితోడ నిట్లనిపలికెన్. 304

గీ. భళిర యోరోరి క్షత్రియ బ్రహ్మచారి !
భూరివాచాట ! నే౽డీ వపూర్వశిల్పి
వలె దశాననసత్కీర్తివారిజారి
యెడ కళంకంబు వ్రాసెద వౌడలు మఱచి. 305

వ. కావున నీ వింక లేవనితలంచుకొమ్మనిన విని హాటకాంగదుం
డు ససంభ్రమంబుగా సఖునకిట్లనియె. 306

మ. మహితాస్త్రప్రకరంబుచేత నిదుగో! మందోదరీభర్త యి
మ్మహి దౌర్దిన్యమునొంద౽ జేసెనన, నమ్మాణిక్యచూళుండు ని
మ్మహిజానాథు౽డు నట్లనేయొనరిచెన్ మాన్యా! విలోకింప దు
స్సహమైయున్నది యంచు నవ్వి మఱి వాచారూఢిచే నిట్లనెన్. 307

గీ. రాఘవవిఖండి తాసురరాట్సు రాశి
ఫలసమన్వితపూర్వార్ధములును చిత్ర
సముదయప్రోతపశ్చిమార్ధములు నవని౽
బడుచు నున్నవి గురులఘుభావములను. 308

క. అక్షధ్వజదండ తురం
గక్షత్తలచుట్టుం౽బారి క్రవ్యాశికులా
ధ్యక్షునిరథము౽న క్రీడా
దక్షత రఘురాము౽బాణతతులు మెలంగెన్. 309

వ. నావు౽డు కనకాంగదుం౽డు కటకటంబడుచు తదవుసనుంగొని
విస్మయంబుగా రత్నశేఖరు నాలోకింపుమని యిట్లనియె. 310

చ. క్షితితనయాకుచస్తబకచిత్రితకుంకుమపత్రలోపదు
ర్గతిజనితాఘయుక్త మగు రావణవక్షము గాడ నేసె ను
ద్ధతి రఘువీరుఁ డొక్కనిశితప్రదరంబున నైంద్రవారణా
యతదశనాహతిక్షతసమగ్రచతుర్వ్రణమధ్యవర్తిగన్ 323

చ. అనినను విస్మయంబు మది నావహిలం గనకాంగదుండు వ
ల్కెను, జెలి! రావణుం డెడమ కేలను నాటినయమ్ముఁ బీకుచున్
గినుక నదేమొ పల్కెఁ జుమి నీవు వినందగు నాఁగ నంత న
ద్దనుజవరేణ్యుఁ డిట్లనియె దాశరథింగని యాగ్రహంబునన్. 324

మ. భళిరా! మానుషడింభ! దానవచమూప్రాణాళివిద్యాసమా
ప్తి లిపీభూత మురారిచక్ర మిట మద్భీమోరువక్షంబునన్
దళితారవ్రజకాంతిలేశరజతోద్యద్భూషణం బయ్యె నా
కలితోరస్థలి నెట్టిసేసితివి వక్కాణింతు నీసత్వమున్. 325

వ. అనిన నాకర్ణించి రత్నచూళుండు సువర్ణాంగదున కిట్లనియె. 326

చ. గురుమద శాత్రవోక్తిభవకోపసమన్విత రాఘవాశుగో
త్కరము రయంబునన్ బడియె గంటివె యోచెలి! స్వప్రయుక్తసు
స్థిరతరచంద్రహాసనియతివ్రణజాతకిణాళి లెక్కగాఁ
బరివిహితాచ్ఛహారచయపఙ్క్తిశిరోధి శిరోధిపీఠికన్. 327

మ. సమదారాతికఠోరవాక్పరుషరోషప్రజ్వలద్భూమిజా
రమణాస్త్రప్రకరంబు స్వప్రహితజాగ్రచ్చంద్రహాసవ్రణ
క్రమసంజ్ఞాతకిణచ్ఛటావలయరేఖాధిక్కృతైకావళీ
రమణీయం బగు పఙ్క్తికంధరగళవ్రాతంబునన్ వ్రాలెడిన్. 328

సీ. అన హాటకాంగదుం డాప్తునిఁ గనుఁగొని
కడుఁ జమత్కారంబుగాఁగ ననియె
ననురూపవీరమహాహవసంతోష
పాటవద్విగుణితబాహుగర్వ
మంథాననిర్మథ్యమానలోకత్రయ
జలరాశి యగు నిశాచరవిభుండు
కుండలితాత్మకోదండచండోన్ముక్త
కాండపంజరమధ్యకలితుఁ డగుచు

గీ. వర్తిలుచునున్న జానకీవరునిఁ గేళి
కావిహంగంబుగతి నెంచి కౌతుకమునఁ
బొదలుచున్నాఁడు చూడు మిప్పుడు వయస్య ,
యనుచు నొక్కింతచింతించి యంత మఱియు. 329

చ. ధర యెగయంగఁ గ్రుంగ వివృతప్రవిలీనఫణామణీతటీ
ద్భరమున మాటికిన్ భుజగధామతమం బణగించు శేషుఁడ
య్యురుభుజకేళివల్గదసురోత్తమపాదభరంబుచేఁ గడున్
నెరవుగ నూర్పుఁబుచ్చు నిదినిశ్చయ మంచువచించునత్తఱిన్. 330

వ. రత్నచూడుండు వయస్యాసీపలుకు నిజంబని సభయంబుగా మఱియు
నిట్లనియె. 331

మ. దితిజక్షోభమహారయోచ్చలితవార్ధిన్ వ్యక్తమౌ నాగన
క్రతతిన్ మార్కొనదిగ్గజాళి విడునన్ క్ష్మాభార మాశేషుడం
గతతిం దాగెడు నంగకంబుల పెఱల్ గన్పట్టు ఖర్వత్వపీ
నతలుం గల్గినమేనిచే ఫణపరీణామంబు బోఁదాల్చెడిన్. 332

మ. అనుచుంబల్కి చదల్గనుంగొని వయస్యా చేరనేతెంచె నా
య్యన వైమానికకోటిఁ జూడుమనఁ గల్యాణాంగదుం డప్పు డి
ట్లనుఁ జాతుర్యముతోడ నోయిచెలి వీరాగ్రేసరుల్ వీరిచే
నొనరింపంబడులోకభీకరమహాయుద్ధంబు వీక్షింపుమా. 333

గీ. గాధిసుతదత్తఘనదివ్యకాండమంత్ర
సంస్మరణ రామభద్రుండు సలుపునెపుడు
దితిజపతియును బ్రహ్మోపదిష్టవివిధ
శస్త్రవిద్యానుసంధానచణత మెఱయు 334

క. కావున మనమున డగ్గఱఁ
బోవలయునటంచుఁ గదలిపోయెడువేళం
దా వెండియు ననె భువికి మ
హావస్థ ఘటిల్లెనిప్పు డరయుముదీనిన్. 335

వ. అనిచూపుచుఁ దామిద్రసము ఖానవీయంబునఁ దచ్చరంబు రా
హవీయంబునఁ దత్సాయకంబు వైష్ణవంబునఁ దచ్ఛిలీముఖంబు
బౌష్ప కేతవంబునఁ దత్ప్రదరంబుఁ బాశుపతంబున నొండొంటి
మింటనంటిగెంటక తుంటలు సేయుచున్న పౌలస్త్య కాకుత్స్థవీరులకు
నిరంకుశసంకులసమరం బయ్యెనన విని రత్నశేఖరుం డిట్లనియె 336

చ. ఇరువురకృత్యముల్ సమము లేమనవచ్చు జయేచ్ఛ రాముఁడున్
మఱి వధియింతు నే ననెడుమత్సరితన్ దశకంఠుడున్ వడిం
బఱపిన సర్వశస్త్రము లభంగగతిం వగనైనఁ దన్ముఖ
స్ఫురితసమస్త దేవతలు బొందిరి యప్పటుత్వ మెట్లనన్. 337

చ. దనుజవరాశుగాగ్రయుత దైవతముల్ రఘువీరుఁ దాకు నా
నెనరున మెల్లనే యతనినిష్ఠురబాణముఖస్థ దేవతల్
ఘనతరభీతి వానిమెయి గాసియొనర్పఁగ నోడి రీగతిన్
దనరు మహాద్భుతంబు లివి తప్పకకన్గొనుమంచుఁబల్కఁగన్. 838

వ. అప్పు డనతిదూరంబున. 839

చ. ధరణిసుతామనోహరుఁడు దారుణశస్త్రములన్ దశాస్యుపెన్
శిరములు గొన్నిద్రుంచినను జిక్కనమస్తకముల్ దదంశవి
స్ఫురణ సిరుల్ దొలంకుఁ గరముల్ మఱికొన్నిటిఁద్రుంప నిల్చునా
కరములు తత్పరాక్రమముఁగైకొని కత్తులుఁబూని యెందుగన్. 840

సీ. అని వినవైన వా రాలించి యిర్వురు
హర్షరోమాంచయుతాంగులగుచు
శబ్దోపలంభనసంప్రవర్తనక్రియ
నెవ్వఁడౌకో భువనేంద్రియముల
నొగిఁదృప్తిఁబొందించుచున్న వాఁడనుచును
బల్కుచో మఱియు నప్పట్టునందుఁ
గలకలంబొకటి యాక్షణమె పుట్టిన దాని
విని భయాద్భుతసమన్వితులు నగుచుఁ
గీ. గపటకంఠీరవాకుంఠకంఠకఠిన
కహకహారావఘోరమై కడలుముట్టి
గాఢనిర్ఘోష మహహ యకాలమందె
పగులఁజేసెను బ్రహ్మాండభాండమెల్ల. 841

వ. అనివెండియు. 842

గీ. కాలకూటానలోపదిగ్ధంబులైన
ధ్వనుల భువనాళి మూర్ఛనొందంగఁజేయు

భైరవుఁదలంచునో దీన భ్రాంతిఁజెంది
బ్రహ్మ నేఁడన మఱియు నప్పట్టునందు. 843

మ. జగదాపత్కరదివ్యసాయకములన్ జన్యంబు గావించి పై
కెగయంగొట్టినమస్తకంబుల నభంబేకాదశార్కాప్తి నొం
దఁగ రామాశుగయోగపీఠవిహితోద్యబ్రహ్మశక్తి క్షతిన్
దెగి దైత్యేంద్రకబంధ మిత్తఱిని జెందెన్ వీరశయ్యాస్థలిన్. 844

వ. అని వినంబడియె నప్పలుకు లయ్యిరువురు నాకర్ణించి సాశ్రు
సంభ్రమంబుగా నూర్ధ్వభాగం బవలోకించి యాశ్చర్యంబు
నొంది యీ ప్రళయకాలాభీలకరాళానలజ్వాలికాపుంజపింజ
రంబులైన పౌలస్త్యమస్తకంబు లవలోకింపుమని యొకరి
నొకరు హెచ్చరించుచు సమీపంబునకుంబోయి క్రిందుగాఁ
బరికించి రయ్యెడ హేమాంగదుండిట్లనియె. 845

మ. దళితైరావణకుంభి కుంభయుగళీ ధారాళముక్తాకృతా
ఖిలలోకాతిజయ ప్రశస్తిరచనాక్షీణాక్షరక్షోణివై
కలితాదిత్యవధూ కపోల విలసత్కాశ్మీరపత్రావళీ
కులనిర్వాపణదోర్విభూతివగు నీకున్ మ్రొక్కెదన్ రావణా! 846

వ. అని యతనికభివాదనంబుసేసి సఖున కిట్లనియె. 847

మ. గురుదైత్యేశకబంధ భారమునఁ దాఁ గ్రుంగంగ వేలాధరా
ధర మత్యున్నమితాంగరాగ భుజగేంద్రస్వామిదుర్వ్యాహ్యయో
ధరణిం దాలుచు నర్ధకుండలిత గాత్రన్యస్త శాంతస్ఫటో
త్కరుఁడై నావుఁడు రత్నచూళుఁ డనియెఁ ధారాళవాచార్భటిన్. 848

క. ఓమిత్రాగ్రణి! యిత్తఱి
నీమాటనిజంబె దైత్యనేతశరీరం

బేమందును మున్ను మహో
ద్దామతఁ దనరుననదిగాదె తగ నెట్లనినన్. 349

మ. బలసంక్షోభిత లోకదారుణ కకుప్సంచారవేళా చలా
చలధాత్రీధరమూల నిష్ఠురశిలాసంఘృష్ట మాణిక్యసం
కుల జల్పాత్పణపఙ్క్తిచే నిజచమూకోటీ సమావేష్టితా
కులగాత్రుండయి భోగిభర్త నిబిడక్షోణిన్ ధరింపంగదా. 350

వ. అని వెండియు నీదైత్యాధిపదేహబంధ ముత్క్రాంతప్రాణా
నిలంబైనది గావున నిప్పుడు మిగులదుస్సహంబయ్యె ననవుఁడుఁ
గనకాంగదుం డంత వేఱొక్కదిక్కుఁబరికించి వయస్యా
చూడుమని యిట్లనియె. 351

సీ. తనుఁజూచి సారెకుఁ దరుచరుల్ చపలత
ననుసరించుచుఁ జెరలాడుచుండ
నూఱడింపుచు దైత్యనారులు ద్రెవ్వ లోఁ
గుములుచుఁ దోచు నూకుళ్లతోడ
మదిలోననిల్వక మట్టుమీఱిన యట్టి
ఘనతర శోకవైక్లబ్య మూని
కాకుప్రకారమై కడలు కాతరరావ
మునఁ బల్కుచును బెట్టు మోదికొనుచు

గీ. వేగ మందోదరీసతి వీరపత్ని
యాశరాన్వయవర కబంధాభిముఖము
గాఁగఁ జనుదెంచి తనమోము కాంతుమేని
మీఁదఁ జేరిచి విలపింపఁగాఁ దొణంగె. 352

చ. చెలువుఁడ భర్త వీవగుటచే సతియయ్యును బెక్కుమోములన్
బలుమఱు జుంబనక్రియలు మాటి కనేక భుజోపగూహనా

కలనయు గన్న యిమ్మ యునికన్య కిభాసను నెత్తిముత్తియ
మ్ముల సరు లిత్తునన్ శపథమున్ గడతేర్పక నిద్రఁజెందితే? 353

చ. అని విలపింపఁజూచి యతఁడాతని గన్గొని శాత్రవాళికై
నను బగదీర్చునంతటి ఘనంబగు నీతెగవారి దుఃఖముల్
గన వినఁగా నశక్యములు గ్రక్కున మానసమర్మకుంతనం
బొనరుచు హా! యసాధ్యమన నున్నదె! కాలునకంచు వెండియున్. 354

క. వందనకృద్బృందీకృత
బృందారక మౌళిమాల్య బృందాసవమున్
మందోదరి కర్కశతం
బొందించుఁ బదాబ్జరేణు పుంజముచేతన్. 355

గీ. అట్టి మయుపట్టి జగజెట్టియైనయట్టి
దిట్టరాకాసిరాచెట్ట బట్టి యిట్టి
చెట్ట నిట్టయ్యె నక్కటా రట్టిదైన
గట్టువిలుబట్టుదొర కోర్కె నెట్టువడునె. 356

వ. అని విచారించుచు. 357

సీ. మందారభూరుహబృందముల్ వనదేవ
తలు చేర్చి రిపుడు నందనవనంబు
వల్లభపాలుండు వాసవాశ్వంబును
బొందించె నాత్మీయ మందుర కడ
నలవిభీషణ వయస్యావళి యమరులఁ
బనివడి వెడలించెఁ బందిగంబు
తజ్జనంబులఁ జూచి తలపంచికొని చాల
జంభారి యొందె లజ్జాభరంబు

గీ. ననిన విని రత్నచూళుండు హర్షమొదవ
నసురనాయక కారాగృహాధివాస
చిరతరవియుక్త బాంధవశ్రేణి నరయఁ
బోవుద మటంచుఁ జెలిఁగూడి పోవునంత. 358

క. ఒకరొకరిని గనుఁగొను మని
యకలుషకౌతూహలమున నలరుచు వారల్
ప్రకటిత జయుఁడగు రఘునా
యకునిన్ వీక్షించి పలికి రాశలుపొంగన్. 359

సీ. ప్రహరణ విహ్వల ప్లవగాది సంవర్గ
ణ వ్యగ్ర సుగ్రీవ భవ్యుఁడగుచు
సౌమిత్రి ఘనభుజాస్తంభ విన్యస్త ప్ర
చండతరాత్మకోదండుఁ డగుచు
ప్రాంత వినీతినితాంతనమ్ర విభీష
ణాంసక స్థాపితహస్తుఁ డగుచు
పరవిజయేందిరా పరిణయ కౌతూహ
లాతిప్రకాశమానాంగుఁడగుచు

గీ. ధరణితనయా ముఖాంభోజ దర్శనైక
లాలసాలోల మత్తరోలంబుఁ డగుచు
నతిశయిల్లుచునున్న వాఁ డనుచు మఱియు
నవ్విమాన చరాగ్రణు లనిరి ప్రీతి. 360

మ. దితిజాధీశ్వర శక్తిజవ్రణకిణాప్తిం బొల్చు సౌమిత్రి యా
యతవక్షస్థలి గాంచి నాన యటి సీతాంభోజపత్రేక్షణా
తతనిర్ముక్తసుమాభిషిక్తుఁ డయి సీతానేత యొప్పెం బుల
స్త్యతపస్వి ప్రియకృద్విభీషణ మహాసామ్రాజ్యసంధాతయై. 361

వ. అని వర్ణించి హేమాంగద రత్నచూళు లాత్మీయలోకంబునకు
నిర్గమించి రంత. 362

మ. స్ఫుటికాక్షస్ఫుటకాయ కాయజనన ప్రాణాపహారిచ్ఛిట
చ్ఛిటదీక్షాగ్నిసహాయ హాయనపరిచ్ఛేదాత్మచాపప్రమో
త్కటసంవత్సరసాయ సాయకితమాకాంతాధిపోన్మాలితో
ద్భటరక్షస్సమవాయ వాయసదృశాభంగప్రదారాధితా ! 363

క. సంకల్ప సూత్ర కల్పిత
పంకేజభవాండ భాండ పరిపోషణ ని
శ్శంకిత మహిమ హిమాచల
జాంకితవామాంగ మంగళాంచితభక్తా. 364

భుజంగ ప్రయాతము :

కరాంచత్కురంగా సగంగోత్తమాంగా
యురస్సద్భుజంగా మహోక్షేట్తురంగా
నిరస్తద్విడంగా ధునీరాణ్నిషంగా
ధరిత్రీశతాంగా కృతవ్యాళభంగా ! 365

గద్య. ఇది శ్రీమద్రామేశ్వరశాశ్వతకృపాకటాక్షవీక్షణాసాదిత సకల
సామ్రాజ్యధౌరేయా క్రాంతవిశ్రాణనావధీరితరాధేయ బిజ్జులకుల
కలశనిధానకార్తికీనిశాకళత్ర వెన్నెళగోత్రపవిత్ర
కృష్ణ రాయమహీధవకుమార సంగ రాంగ
ణకుమార దయాగుణగోపాల తిమ్మభూ
పాలప్రణీతంబైన యనర్ఘ రాఘ
వంబనుమహాకావ్యంబునందు
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

# అనర్ఘ రాఘవము

## పంచమాశ్వాసము

---

శ్రీకృష్ణా కల్లోల వ
తీ కపటా ఖాపగా భృతిస్ఫురిత జటా
శీ కల్పక లతికారా
జీకుసుమత్తారకేశ శ్రీరామేశా ! 1

వ. అవధరింపుము 2

మ. గరిమం జీకటిచేత సొమ్మసిలు లోకశ్రేణికిన్ వైద్యు లౌ
కరముల్ గల్గి కకుత్స్థవంశపతియై కన్పట్టుభానుండు ది
గ్వరులంగూడి పురస్థుడైచనఁ గారాగారస్థితిం జెందు నిం
ద రహిం బాయఁగ నగ్నిఁ జొచ్చి వెడలెన్ ధాత్రీజ శుద్ధాత్మయై. 3

మ. సురవైరివ్రజమస్తముల్ దనదు తేజోవహ్నిలో మున్గు వి
స్ఫురణన్ వేలిచి కైక సేయశిరముల్ బూర్ణాహుతింజేసి యా
చరితస్వస్త్యయనుండునై పిదప నైక్ష్వాకుండు బందీకృతన్
ధరణీజంగని శోకహర్షముల నానంజెందె జాడ్యస్థితిన్. 4

వ. అప్పుడు. 5

చ. క్రమమున రాఘవుండు కపిరాజ విభీషణు లంటికొల్వగా
బ్రమదముతోడఁ దమ్ముఁడును భార్యయుఁ బార్శ్వయుగంబునిండఁగా
నమరవిరోధిమందిర సమాహృత పుష్పకరాజ మెక్కి య
ర్యమకులవృత్తమేధ్యయగునట్టి యయోధ్యకుఁ బోఁ దలంపగన్. 6

వ. అయ్యవసరంబునసుగ్రీవుండు రామునకిట్లనియె. 7

మ. వివరింపం దశకంఠ విక్రమకథా బీజాంకురక్షోణి భృ
త్యవరీభూతపయోధిసేచితగృహోద్యానంబు నౌలంకయం
దు విపన్నాసురరాడ్గళాస్యములలో నూర్వ్యురునొక్కొక్కటిన్
దివిజేంద్రాక్షిసహస్ర మొందె ముదము న్నిచే రఘూత్తంసకా! 8

గీ. అనినరాముఁడు జానకి నరసి దయిత !
భూరిరుచిమించు లంకకుఁ బూర్వభాగ
మున సువేలకుఁబశ్చిమంబునను బరగు
మహిని వీక్షింపుమా యని మఱియు ననియె. 9

శా. నీకై కూలిన దైత్యదానవ వరానీకంబుదేహాళి స
స్తోకోగ్రత్వముఁజెంది యిద్ధరణి యిచ్చున్భీతి నిప్పంటికిన్
వీకం గూడెను రక్తసింధుతతులన్ వేయింటి నిం దబ్ధియున్,
నాకస్త్రీలును జెంది రిందుఁ బతులన్ నల్వంద వేలక్షలన్. 10

ఉ. ఇందుల మేఘనాథుని యహీనత మోమఁగు బాణరాజి గ
ప్పం దనుదృశ్యమానఫణిపంక్తి ఫణామణిరాజమాత్రయౌ
చందనపాళి నస్త్రవరసంతతిగా గొని వానరుల్ సభం
బందుక జ్యోతిరింగణమయంబుగ జేసిరి దాని జానకీ ! 11

గీ. అనినవిని సీత యోస్వామి యార్యపుత్ర !
పన్నగాభీలతర పాశబంధ దుఃఖ
మకట నాకయి మీచేత ననుభవింప
బడియెగద ! యన నౌనంచుఁ బలికి మఱియు. 12

క. ఉరగముల నమిలి మ్రింగుచు
గరిమన్ దర్భోగమణుల ఖనియని యుమియున్

వెరవార నిట్లు ఖగకుల
వరుడా యహిబంధ పారవశ్యము మాన్చెన్. 13

వ. అని కొండొకవిచారించి సంస్మరణంబురా నక్కటా విషధరజాతి
యెంతవిషమంబని యిట్లనియె. 14

సీ. అఖిలరసంబుల నాస్వాదన మొనర్ప
సవరించుకొనె రసజ్ఞాయుగంబు
శబ్దము రూపంబు సొరెకు నాలింప
నీక్షింపఁ గనె నొక్క యింద్రియంబు
పాదముల్ గూఢతఁబాటిలఁ గావించి
గమనంబు సల్ప వక్షస్థలమున
సకలసమీరణప్రకరంబులుఁడగా
భక్షించు సలజగత్ప్రాణవితతి

గీ. తల్లికద్రువ వినుము నీతనయకోటి
యిట్టికొడుకులఁ గంటివే యింతమీద
కాంచవే యిట్టివారిని గ్రమ్మఱంగ
నీవె కనియెదవేయని తేవఁ బలుక. 15

చ. అనవిని యంవరున్నగిరి; యయ్యెడ జానకి సానురాగయై
యనఘునిలక్ష్మణుంగని తదగ్రజుగూఁజేచి ప్రాణనాథ! నీ
యనుజునికి త్రికంధశచయప్రభవ స్థలియెద్ది తెల్పవే
యన రఘు రాముఁడిట్లనియె హర్షముతోఁ బులకాంకితాంగుడై 16

మ. చెలువా! యల్లదెచూడు దక్షిణమునం జేతెంట రామాసురేం
ద్రుల సైన్యంబులలోన మిక్కిలి ప్రవీణుల్ లక్ష్మణాంభోదనా
దులు వారిర్వురి ద్వంద్వయుద్ధమున కస్తోకైకసాక్షిస్థితిన్
వెలయంగన్న సువేలపాదము మ్మగాభీలస్వనో ద్భేదమున్ 17

గీ. అనినవిని సీత యోనాథ! దనుజకాంత
యొకతె యనురాగజనిత రోమోద్గమప్రశ్ర
మాంబుదీపిత శమిత ప్రియచిత వహ్ని
నను మృతింబొందుచున్నది; యనిన నతఁడు. 18

మ. సరసిజేక్షణ! యౌను, లక్ష్మణుని భాస్వద్వీరలక్ష్మీస్వయం
వర హర్షాయతనంబిదే యిచట దుర్వారత్వరన్ ద్రోణభూ
ధరముందెచ్చి మరుత్కుమారకుఁడు మున్ దచ్ఛల్యముంబాపి యు
ద్ధరతన్ లోకచయంబు నెంతయును సంతోషింపగాఁజేయదే? 19

వ. అనిన జానకి మనంబునఁ బవనతనూజుం దలంచి రఘూద్వహున
కిట్లనియె. 20

సీ. నిబిడప్రతాప నిర్ణిద్ర వానర రాజ
బంధుర సేనా ధురంధరుండు
ప్రథిత రాఘవకుటుంబ ప్రాప్తదుర్వార
తర విపద్వారాశి తారకుండు
కరిసతమగ్రాహ కమఠ పాఠీన యు
గ్లవణ పాథోధిసంలంఘనుండు
దారుణవాలాగ్రదహన కీలాజాల
భస్మీకృతాసుర పట్టణుండు

గీ. సాక్ష రక్షఃకులాధ్యక్ష శిక్షణాతి
దక్షరూక్షేక్షణాక్షయలక్షణాఢ్యు
డైన జగదేకవీరు డయ్యాంజనేయు
డెచటనున్నాడొ! యన రాముఁడింతికనియె. 21

చ. అమరవిరోధిభర్త హతుడైపడ మజ్జనకుండు సూర్యబిం
బమున దనంత గానరయి మక్కువనాజ్ఞయొసంగ, బట్ట బం

ధమునకు నర్హవస్తువు లుదారతఁగూర్చుటకై యయోధ్యకుం
బ్రమదముతోడ మున్నుగనె పావనిఁ బంపితి మంచుఁ బల్కఁగన్. 22

క. అంత రయంబున జలనిధి
పొంతకుఁ బుష్పకముచేరఁబోయిన నతఁడా
యింతికి వెండియు ననుఁ, భగ
వంతున కివ్వార్థికీవు వందన మిడుమా. 23

ఉ. ఈవనరాశిపుత్రి సిరి యెత్తఁటి శౌరియెదన్వసించియున్
దా విహరించు వీరభుజదండములన్; మఱిపుత్రుఁడైన రా
జీవవిరోధియన్న హరశీర్షవతంసకమయ్యె లోకభూ
షావరమై తనర్చు; నని జానకితో సవిమర్శనంబుగన్. 24

గీ. తరుణి! యీవార్ధివారి సుధాప్రకృతి య
గుట మహాశ్చర్యమా? కాదు; కువలయాష్ట
కౌస్తుభ శ్రీ సురద్రు ముఖంబులెల్ల
జలవివర్తములగుట యాశ్చర్యమిడియె ! 25

మ. గురునాభీవనజాత దృష్టముఖుఁడై గూఢేతరాంగాళియై
నిరతం బంబుజసూతి బుత్తతిని పర్ణింపంగ, నీవార్ధియం
దు రహిన్ భోగిపశయ్యమీద భగవంతుండైన నారాయణుం
డిరవందన్ శయనించియుండు సుఖియై యిందీవరాలోకనా! 26

క. అనవుఁడు జానకి వనధికి
ననఘమతి న్నతియొనర్చె, నయ్యెడ నన్నం
గని లక్ష్మణుఁ డార్యా! ధ
ర్మనిరతుల తపోబలంబు మహి నెక్కుడుగా. 27

సీ. విలయకాలంబున విశ్వప్రపంచంబు
గాసిల్ల నాశంబు సేసె నేని

తనుడాయవచ్చిన ధారాధర వ్రాత
ములకుఁబూర్తియొసంగి వెలసెనేని
బాడబముఖ ఘోరపావక జ్వాలలఁ
దరలక సమ్మతిఁదాల్చె నేని
యమృతాశనం బిడి యఖిల బర్హిర్ముఖ
శ్రేణిని గరుణఁ బోషించె నేని

గీ. యాకృతిస్థితిఁదా నెఁతయధికుఁ డేని
యీపయోనిధి కుంభజతాపసేంద్రు
నాగ్రహంబున కొక గ్రుక్కెఁ డయ్యెఁ గానఁ
దపములకునెల్ల సాష్టాంగదండ మిదిగొ ! 28

వ. అనుటయు రఘుపుంగవుఁడు సబహుమానంబుగాఁ దమ్మున
కిట్లనియె. 29

గీ. సమధికాంభోధిఁ జుళుకమాత్రముగఁ జేయు
విపులగాంభీర్యమున నలవింధ్యశిఖరిఁ
దగ్గుపరచిన యుత్తుంగతం జెలంగు
కుంభజు గణింప మనబోంట్లకొలఁది యగునె ? 30

క.. ఈవనధిఁ జుళుకమాత్రము
గావించిన కలశభవుని గాంభీర్యగుణం
బావింధ్యాద్రి నడంచిన
కేవలధృతియును పంశంబె కీర్తింపంగన్ ? 31

ఉ. ఇంతియకాదు వత్స ! వినుమెక్కువ లార్యులచర్యలెన్న గ
ల్పాంతదినంబునన్ రవి సహస్రకరంబుల నీపయోధి య
త్యంతము పక్వమౌట ఘనమై కడు సైంధవరాశియయ్యెఁదా
నంతనె కాలరుద్రభయదాగ్ని చటచ్చట మించ రూపఱెన్. 32

గీ. అనిన జానకి ప్రాణేశ ! వనధిమధ్య
మున వసించిన లంకాఖ్యపోతమునకుఁ
గరము నేరెడుదీవితోఁగట్టినట్టి
శృంఖలయనంగ నొప్పె నిదేమి ? యనుఁడు. 33

గీ. ముదిత ! పతితపఙ్క్తిముఖ కేతుదండాను
కారియగుచు మించి, సౌరవంశ
తతవిపద్విభాగదాయాద సుగ్రీవ
చిరయశఃపటంబు, సేతు విదియె. 34

గీ. అనిన విని, సీత విగళిత ప్రాణనాథ
దర్శనాశాలతాంకురోత్పత్తి హేతు
భూత మగు మహౌషధిఁబోలు సేతు
బంధ మిదియని మ్రొక్కి నప్పార్థివుండు. 35

ఉ. దూరమునందుఁ జూచు సురతోయజగంధులనేత్రపఙ్క్తిక
వ్వారిధి హారలక్ష్మిగతి వర్తిలి బల్విటికంపుసొంపు బం
గారపుగట్టురాతుదలఁ గట్టిన సేతు వెసంగె నాయకో
దారత దీనిఁజేయునెడ నైన యొకానొక వార్త దెల్పెదన్. 36

గీ. అద్రిసంవేశమునను నత్యధికమైన
వితతకల్లోల రాశిచేఁ బ్రతిహతంబు
లగుచుఁగ్రమ్మఱ నగముల నందినట్టి
నదుల కంభోధి యయ్యె జన్మస్థలంబు. 37

వ. అనిపలికి రఘునాయకుండు కపినాయకున కిట్లనియె. 38

చ. తతసేతుగ్రథనస్పృహోత్క కపియూథక్షిప్త ధాత్రీధర
స్థితిచేఁ బొంగి ముహూర్తమాత్రము నదీశ్రేణీప్రవాహోనుసం

గతమై పాటితతన్మహాకుహరసంఘాతప్రపూర్తిక్రియా
చ్యుతదర్పోన్నత మయ్యె వార్ధి యది నీయుల్లంబునందున్నదే? 39

క. అనవుఁడు సుగ్రీవుండో
యనఘా ! భవదీయచరిత్రమనియెడి చిత్రం
బునకు ఫలకంబగు నా
మనమున వ్రాయనిది కలదె మఱి, యది గాకన్. 40

శా. సేతూద్యోగమునందు భూమిధరవిక్షేపోజ్వలద్వారిసం
ఘాతంబై కడుశూన్యమైన జలధిన్ గాఢంబుగా నిమ్నగా
వ్రాతంబప్పుడె సైంధవాస్యమధురస్వాదానుసంధాయితం
బ్రీతిం దత్తిమికోటికై యొసఁగి చేరెన్ భూరివేగంబునన్. 41

వ. అనికపీంద్రుండు పలికిన విని విభీషణుండు మనువంశమౌక్తికం
బున కిట్లనియె. 42

చ. జలధి దరీముఖంబునను జయ్యనఁగ్రోలి చిరంబుఁజూడమిం
జలిమలపట్టిపై మమతజాల్కొను నద్రుల రెట్టియైన ని
ర్మలఝురవారి నింపుచును రాత్రుల సేతుగిరుల్ మహౌషధీ
విలసనలీల నాటి మనవేలమునుం దలపించె మిక్కిలిన్. 43

గీ. అనిన జానకి నగవుతో ననఘచరిత!
యీశ్వరికిఁ దండ్రియైన గిరీంద్రుని యువ
రాజు వారధిఁ జేరి పక్షహతిఁ బాసి
స్థావరమె యయ్యె నన రామచంద్రుఁ డపుడు. 44

గీ. ఔఁగదా తనతండ్రి యైనట్టి హిమగి
రీంద్రుడు సుతుఁడైనక్రౌంచాద్రి నెడసి వార్ధి

మగ్నుఁడై తనతెక్కలు మనిచికొనియెఁ
గాక యెవ్వరిఁ బ్రోచె మైనాకుఁ డనిన. 45

క. విని జానకి లేనగ వా
ననమునఁ గడుఁ గందళింప నయవినయంబుల్
పెనుఁగొనఁగ విమానంబుం
గనుఁగొని తా నిట్లుపలికె ఘనమధురోక్తిన్. 46

గీ. ఘనవిమానాధిరాజ! యాకాశసంగ
మప్రమోదసముత్ఫుల్లమానసాబ్జ
నైతి నెగయుము నీవన, నదియు నట్ల
యెగయ, సతిc జూడుమని రాముఁడిట్టులనియె. 47

క. ఈపుష్పక మంబరమున
కేపగిదిన యెగురుచున్న దెన్నికపడి యా
టోపంబునఁ గడు మిక్కిలి
నాపగిదినె దిశలు వెనుక యయ్యెడుc దోడ్తోన్. 58

క. విను మింతయ కాదంబర
వననిధియాదంబులైన వనదము లర్కా
ప్తినొకించుక యెండినవై
మనపుష్పక మొఱసి తడిసె మానిని కంటే! 49

చ. గురుతరభీతిద స్తనితఘూర్ణితమై జననేత్రపఙ్క్తికిన్
సరగున రూపసంగ్రహణశక్తి నిరోధము సేయుచున్ బయో
ధరతతి మీదఁగప్పు నెలతావులచేత నబాధ చంద్రికో
త్కరతిమిరాళి చిత్రముగc గన్పడఁజేసె నభంబు నంగనా! 50

క. అని పల్కి భానుసూనుఁడు
ఘనముగఁదాఁగ్రిందుసూచి, కౌతుకమున రా
ముని గాంచి దేవ! వీనిం
గనుఁగొనుమని యిట్టు లనియె గంభీరోక్తిన్. 51

గీ. పొడవగుటఁజేసి పొదకట్టఁబడని మిట్టు
పల్లములు గల్గి తమతమ వరములనె
యడఁగిన పదార్థముంచేత జడనిధి వృత
యైన ధర చిత్రకుట్టిమం బనఁగఁ బరఁగె. 52

గీ. అబ్ధిభుజగేంద్ర వలయిత మగుధరిత్రి
యనుఫణా మండలంబు లోకాచ్ఛరత్న
మై తనర్చిన నినువంటి యనఘమతిని
గూడి గర్వించుచుండుఁ గాకుత్స్థతిలక ! 53

చ. అనవిని జానకీరమణి యగ్రవిశంగని చూపుచున్ యుగాం
త నిబిడ వహ్ని హేతిపరితప్తపయోనిధి ఫేనరాశి బా
గున గగనంబుతో నొరయు కూటసహస్రముచేఁదనర్చుచున్
గననగు గట్టిదేమి ? యనఁగ్రవ్యభుగీశ్వరుఁ డప్పుడిట్లనున్. 54

క. జనకాత్మజ ! యీముందర
గనసైనది మంచుఁగొండ, కంతుని కొరకిం
దు నగాత్మజ మృతసంజీ
వని యైన మహౌషధివలె వడి జనియించెన్. 55

క. నావుఁడు జానకి కౌతుక
మావహిలఁగ నడిగె; నిచట నబ్బగవంతుం
డావనజాస్త్రుఁడు హరదృ
క్పావకశిఖ కాహుతి యయి కఱఁగె నదేలా ? 56

వ. ఆనియడిగిన విభీషణుం డోయమ్మా ! యోనని మఱియు ధరాకు
మారి కిట్లనియె. 57

ఉ. ఈయగము త్తరంబున రతీశమృతిస్థితిసాక్షియైన య
త్యాయతదేవదారువనమందుఁ బురారి ఫాలలోచనత్రయం
బేయఁడు తుల్యరోష మగునేనియు నొక్కెడి మండుచుండఁగా
నాయురుధూమపీన నిసుమంతయు నోరువ వన్యనేత్రముల్. 58

వ. అనిపలికిన విని రఘుకులుం డిట్లనియె 59

క. హరునిటలాంచన్నయనాం
తరమున నొకవహ్ని కుసుమధనురింధనని
ర్భరరక్షితమై భువనో
త్కరనాశపహేతురీతిఁ దసరుచు నుండున్. 60

చ. అనవుఁడు సీత వల్లభుని నారసి యప్పుడు శంబరాహితున్
ఘనతర ఫాలవహ్ని శిఖఁ గాలిచి నిర్దయుఁడైన యుగ్రుఁడే
యనువున గిన్కమాని కుధరాత్మజ సింపునఁ బెండ్లియాడె నం
చనిన రఘూద్వహుండు జనకాధిపనందనతోడ సిట్లనున్. 61

గీ. అతనుపరిభూతి నిస్పృహాయాతిదీర్ఘ
ము లగు తపములఁ శివుఁ డాత్మమూర్తియందె
తనముచేత ద్వితీయుఁడై తనరుచుండఁ
బార్వతి దనర్చె మిక్కిలి భవ్యలీల 62

వ. అనిన విభీషణుండు సపరిహాసంబుగా నిట్లనియె 63

గీ. ధరణిభృద్వరకన్యక తడవు దపము
సలిపి గోప కపాల భుజంగ పతుతె
ధనముగాఁగల్గు రుద్రునితనువు సగము
దాత సగము దాతవ్యమై తగ నొనర్చె. 64

మ. అనినన్ జానకి నవ్వి మోదమున దైత్యాగ్రేసరుం జూచి యో
యనఘా! యెయ్యది సర్వమంగళ వివాహం బైనదేశం బనన్
వినయం బొప్పనతండు పల్కె విను దేవీ! యోషధిప్రస్థమన్
ఘననీహారగిరీంద్రపట్టణముఁ వేడ్కం జెల్వగున్ ముందటన్. 65

గీ. త్రిపురహరుఁ డిచ్చట మహౌషధీమయుఁ డగు
భూమిధర శేఖరుఁడు ధారవోయ గూఢ
వలయఫణిభీతిఁ బాసిన చెలువ నగజ
నపుడు పరిణయమయ్యె భవ్యంబుగాఁగ. 66

మ. అనుఁడున్ రాముఁడు పల్కె నౌ నది నిజంబా గౌరి తాఁదండ్రియై
న నగేంద్రుండు స్వకీయభూరి హిమసంతానంబుచేతన్ రచిం
చిన హేమంతముకల్మి నప్డు విషనిశ్శ్వాసాహిభూషాళిఁ దా
ల్చిన భూతేశునిచెట్ట నిర్భయముగాఁ జేపట్టె ధాత్రీసుతా! 67

గీ. అనిన జానకి నవ్వి యోయధిప! యిచట
దగ్ధమదన పునస్సృష్టిఁ దలఁచియు శివ
మగుడఁ బొలియించు నంచు నమ్మక, నిజాంగ
మననె ఘటియించెఁ బ్రాణేశ్వరుని నిజంబు. 68

వ. అనిన దశస్యందననందనుండు మందస్మిత కందళ సుందరముఖార
విందుండై యిట్లనియె. 69

గీ. తనసగంబునఁ బ్రియసగంబున నిటునటు
నభవుఁ డర్ధనారీశ్వరుం డైనఁ, గడమ
యర్ధముల నటునిటుకూర్చి యగజచెలులు
మఱియు నొకయర్ధనారి నమర్చి, నగిరి 70

మ: తమిచే నే మిథునంబు దర్పణమునన్ దర్శింప వ్యత్యస్తమై
యమరన్ శంభుఁడు మాంచు శైలసుత సవ్యాంగస్థితిచ్ఛాపర
త్వము, సంభోగరసాభశుంభదనుభావస్ఫూర్తియుగ్విప్రలం
భముచే మించి మిథస్సమేతమగు నాభవ్యాకృతిం గొల్చెదన్. 71

వ. అనిపల్కునవసరంబున విభీషణుండు ధరాకుమారి కిట్లనియె. 72

సీ. ఉభయాభిలషితమై యుబ్బుమీరిన యొంటి
సిబ్బెంపుఁజనుఁగుబ్బచెలువు గలిగి
యుభయభాగంబుల నుదుటువెన్నెలఁగాయు
రేఁగొమ్మ చుంట్టంపు రేక గలిగి
యుభయపక్షంబుల శుభలీల వలగొని
తగు పాపరా జన్నిదంబు గలిగి
యుభయపార్శ్వంబుల విభజింపరాక యే
కత విరాజిల్లెడు కౌనుగలిగి

గీ. యఖిలదాహోజ్జ్వలజ్యోతి యర్ధమందు,
నర్ధమందుఁ గృపాబాష్పమదరి; యొండొ
రు నణగింపంగ సిమసిమధ్వని గడంగు
నుదుటికసుగల్గు మిధున మూన్చుత శుభంబు. 73

గీ. ఘర్మజలసిక్త వామభాగస్తనాచ్ఛ
[illegible]

బరగు స్త్రీపున్నపుంసకపద పరప్ర
కృతినిడగు శంభుమేన్ సిరు లిచ్చుఁగాత. 74

వ. అనివేరొకదిక్కుఁజూపుచు మఱియు నిట్లనియె. 75

మ. స్ఫురదాధారతఁ గూర్మపృష్ఠకషణక్షుణ్ణాత్మమూలంబు మం
దరశైలంబు సురారిసూదన భుజోదారాంగదన్యస్త భా
స్వర వజ్రాంకుర ఘర్షణాంక వశిసంసక్తాంగకశ్రేణిచేఁ
బరమామోదముః గూర్చుచున్నయది యంబా! ఖర్వమైయీయెడన్ 76

క. కేవల మీ మందరగిరి
యావిధి మథితంబుగాక యటమున్న మహా
త్యావాప్తిం గడుఁగన్నది
నావుఁడు రఘునాయకుండు నగి యిట్లనియెన్ 77

మ. విను, రూఢోరుగరుచ్ఛిదాప్రణముహుర్వ్యేథవ్యథా హేతులో
చనకర్ణాధిపరజ్జుకర్షణముఁ దా సైరించి యీదుష్టమం
థనగం బాకలుషాత్మయౌసిరి సముత్పాదించి లోకం బహో
యనిశం బీశ్వర దుర్గత వ్యపహృతి వ్యస్తంబుగాఁ జేయదేః 78

గీ. అనిన జానకి వేగ యీయద్రి మంద
శేషిత పయోబ్ధియందు శశిని జనింపఁ
జేసి విప్రయు క్తేశ్వరస్త్రీలయెడల
నారభటిఁ జూపుచున్నది యనుచుఁ బలుక! 79

మ. విని వారందరు నవ్వ, దైత్యపతి యావేళన్ రఘూత్తంసుఁ డా
డినమాటల్ బరికించి యిట్లుపలుకున్ డెందంబులో, నీ రమన్
వసధిన్ గ్రమ్మఱ వేయఁజూతు, నయినన్ దన్మగ్నుఁడై నిప్పులున్
జననం బందెడు చంద్రుఁగాంచి, వెఱ నంతన్ మానితిన్ ద్రోయకన్. 80

వ. అనివిచారించి మరియు నిట్లనియె. 81

మ. రమ! యేమో కపటంబుఁగోరి, రమణోరః పీఠిదీర్ఘాసిక
త్వముచే మించిన నీకుఁ బ్రొక్కి యిపుడే చింతుఁ గోపంబుచే
యమి నిక్కంబగునేని, బద్మమిష విద్యాగేహమందుండి ని
త్యము నీచాధికనీచసర్పణము నీరాచార్యుచేఁ గంటివో. 82

వ. అనిన నమ్మాటలకు నవ్వి సౌమిత్రి యిట్లనియె. 83

సీ. నిర్జరాసుర మల్లనివహారభటికా వి
జయతూర్యతాళలాసిక యనంగ
శాశ్వతవిశ్వవిశ్వంభరాధీశ్వర
వారదౌర్జన్యఖర్జూర యనఁగ
కైటభాసురభేది కాలజీమూత వి
లాసోరుచంచలాలత యనంగ
సాహసికానేకశస్త్రాస్త్రమయతమో
వ్యూహ విహార ఖద్యోతి యనఁగ

గీ. పఱఁగి గణవత్సమాజోచ్చపదవి గోరి
వీఁక గౌక్షేయకశ్రితవృత్తిఁ గాంచి
ఖడ్గధారావ్రతనిరూఢి గరిమఁ గాంచు
సిరి నుపాలంభనం బిట్లు సేయ నగునె? 84

వ. అనిన విని యమ్మిథిలాధిపతనూభవ యభ్యసూయనుం బోలె
నిజపూర్వకర్మదుర్విపాకవిచారభారాలసంబైన యాలోకం బనా
రతంబు ముకుందహృదయారవింద మందిర యగు నిందిరపైన
మందదుర్య శోగీతంబులు పాడుచున్నది యనిపురోభాగం బవ
లోకించి చూపుచు దివస రాశీకృత సాంద్ర చంద్రికాసంకాశంబై

ప్రకాశించు నిద్ధరాధరంబు నభిధానం బెయ్యది? యని యడిగిన విభీషణుఁ డిట్లనియె. 85

మ. సతతస్ఫాటికభూ జ్వలద్ద్యుతిచయచ్ఛన్న ద్రుమచ్ఛాయత
త్ప్రతిబింబంబులఁ గల్గఁ జేయఁదగుచున్ భ్రాంతస్ఫురద్భానుహ
స్త తతాంభోరుహ మర్ధమీలనము గాంచంజేయు భర్గోత్తమాం
గతచేందుస్ఫుటదీప్తి నొప్పు నిది యాకైలాస ముర్వీసుతా! 86

గీ. అనిన రాఘవుఁ డబ్బురం బంది, యీగి
రీంద్రము బహువిధంబుల దృశ్యమాన
మయ్యెఁ గన్నులపండువై యలరుచున్న
దనుచుఁ బలుకుచు మఱియు నిట్లనియె నపుడు. 87

మ. బలవద్రావణ బాహుభూషణమణి ప్రాగ్భార సంఘర్షణో
జ్వలరేఖా మకరాంకముద్రిత శిలాసంశోభియౌ నిగ్గిరిన్
బలుమారున్ వసియించి యక్షపతి విస్ఫారార్కసర్వాంగని
ర్మలమౌటన్ గనుచుండు భోగిపతిపూర్వ్యాపార మెంతేనియున్. 88

ఉ. భీమ దశాస్య బాహుదృఢపీడనగాఢనిగూఢ మేఖలా
స్తోమములందుఁ దత్తటుల సుస్ఫుటకాంతులు నిండుచుండఁగా
భీముని కిద్ధరాధరము ప్రేమనొసంగును వారియంత్రగే
హామితవేదికాసుఖము నంచన దైత్యవిభుండు సీతతోన్. 89

శా. ఏత చ్ఛైలతటిన్ ద్రుమోత్కరము భూతేశోత్తమాంగేందు భా
సాతిస్పంద విధూపలవ్రజ పరిష్యందస్నదీమాతృకా
స్ఫీతంబై గిరిజాతచే గుణమునంబెంపొంది ధాత్రేయక
భ్రాతృస్నేహములన్ ఫలించు గుహడింభ క్రీడ సైరించుచున్. 90

వ. అనిమఱియును. 91

చ. అలరి సహస్రనేత్రకలితాంగకుఁడై నతిసల్పు వజ్రి బల్
కలువలదండయై యెసటఁగన్పడ, వేగమ దానిగై కొనన్
వలె ననుచున్ గణానుగత వర్తను షణ్ముఖుఁ జూచి, మాటికిం
గలకలనవ్వు నేతయగు కాలగళుండిడు మీకు సౌఖ్యముల్. 92

మ. ఘననాట్యభ్రమఘూర్ణమానమహాచక్ర వ్యూఢగాఢభ్రమ
త్కనకక్షోణిధరంబు పార్శ్వసిసిన స్నక్తండవాచిత్రమై
తన వేవేలు తమస్తటిత్తులుప్రభాసౌదామనుల్ గల్గఁ జే
సిన కల్పాధ్వరయజ్ఞ శంభుఁడు మిముంజేయుం బవిత్రాత్ములన్. 93

వ. అని దీవించిన విని లక్ష్మణుం డిట్లనియె. 94

గీ. కుంజరారినఖాంకుర కుటిలయైన
భీమ మకుటార్ధశశిరేఖ భీతి హరిణ
మచటఁ జేరక యుండిన నవగళాంక
యైప్రకాశించునన సీత హాస మెసఁగ 95

చ. పునుకల పేరు జిల్వగమి పుత్తియు దాలిచి యాస్మశానసీ
మను విహరించు రుద్రునకు మౌళివిభూషణమై కళంకి య
య్యెను శశిగాని, కానఁ నహీనతపం బొనరించు లేడి చే
సిన యపరాధమేమి యనఁ జిర్నగ నొప్ప విభీషణుండనున్. 96

చ. అనుచరమైన భూతనిచయంబునకుం దగ నామరూపక
ల్పనకయి యాశివుండు సిరి భాసిలఁ జేయఁదలంచి, మౌళిసీ
మను శశిరేఖ నుంచుకొనె మానక యెన్నఁగపాలి గోరునేః
మినుకు లటన్న నందఱును మిక్కిలి నవ్వగ రాముఁడిట్లనున్. 97

మ. కరముల్ మోడ్చి కపర్ద బంధన సమగ్రక్లాంత కాకోదరే
శ్వర దుష్టంబయి బింబపూర్తి కొఱుకున్ సందంశికం బట్టియు
ద్ధురఫాలానల కీలజాలముల యందుం ద్రిప్పుచుం గాచువై
ఖరిఁగన్పట్టు హరోత్తమాంగక పరిష్కారైణభృద్రేఖకున్. 98

వ. అనియంతఁ బుష్పకంబు నాలోకించి విమానరాజమూఁ యించు
క పైకెగయు మిమ్ముగుడ సుమేరుశృంగంబుల నాలోకింపఁ గు
తూహలాయత్తచిత్తయై యున్న దనవుడు నడయు నట్లచేయ వి
భీషణుం డద్దేవి కిట్లనియె. 99

మ. ప్రతిమాసామర పీయమానకళ తారానాథ బింబాంతరో
ద్గత సంచారికళంకశంబర రదాంత చ్ఛిన్న దర్భాంకుర
ప్రతతి న్మించి యథశ్చరద్గ్రహాంశు సంప్రాప్తోపరిచ్ఛాయక
ల్పతరు వ్రాతముచే ముదం బొసఁగు నీధర్మాచలాధిత్యకల్. 100

మ. కనకక్షోణులఁబుట్టుటన్ రుచిరమై కన్పట్టు వృక్షాళి మిం
చిన గాంగేయధరాధరేంద్రతటికిన్ సీమంతమౌ వీధిపైఁ
జను నర్కాతపతప్త కాంచనశిలాజంబాలనిర్మగ్నకో
కనదాప్తోరు శతాంగనేమిఁ బెరుకన్ గంఖాణముల్ బల్మిచేన్. 101

మ. అన సౌమిత్రి మహీజతో ననియె సంబాఁ చూడు మీహేమశై
ల నితంబంబులఁ గల్పభూరుహవనుల్ మధ్యందినంబందు నై
నను బార్శ్వస్థిత భానుబింబమహిమన్ దైర్ఘ్యాంచితచ్ఛాయఁ గో
కనదోల్లోచమనోహరంబులయి వేడ్కం జేయు నెంతేనియున్. 102

గీ. అని నిరూపించి హర్షస్మితాస్యుఁ డగుచుఁ
బలికెఁ బుష్కలావర్తకాభ్రముల కుపరి

భాగమునఁ గ్రీడసల్పు శుభ్రద్వీపంబు
నల్లదిగో! చూడుమని చూపి యంత మఱియు. 103

మ. గురుదోర్మాత్రసహాయుఁడైన దశవక్త్రుం డాజి నాత్మీయపు
ర్బురహస్తావళిచేతఁజిమ్మ ముద మొప్పం బట్టఁ గూపెట్టు నే
సురభద్రేభము నాగజంబు విహరించున్ నేఁడు నిశ్శంక ని
ర్జరకాంతాపరిభుక్తకల్పకుసుమప్రస్యంద నాకస్థలిన్. 104

క. అన విని సుగ్రీవుం డి
ట్లను నిజ మీయర్థ మెల్ల నల దశముఖు శౌ
ర్య నిరూఢ క్రీడితములు
ప్రణుతింపఁగ వాగగోచరంబులు కావే? 105

మ. అని నేకైక సమర్థులుంద్రు మఱియున్ హా యేమనన్వారి నై
నను వీరస్థలియయ్యె శ్మా దశముఖుం దాఁబూని యవ్వాలి యీ
ఘనునే యాహ్వయమానుఁజేసి యధికం గావించె నీవేడుకన్?
వినఁగన్గో శ్రుతు లక్షు లిచ్చెవిధి వర్ణింపంగ శక్తుండనే! 106

వ. అనిన సబహుమానంబుగా రాముం డిట్లనియె. 107

చ. ఘనభుజవజ్ర మూలమున గాఢముగా దశకంఠుఁజేర్చి యు
ర్వనధుల సాంధ్యకృత్యములు వారక సల్పిన వాలిశౌర్యమే
మన నగుఁ దత్కృతోపకరణావగతంబయినిల్చె ధాత్రి నె
వ్వనిదమనంబు నట్టి సురవైరి దశాననునెన్న శక్యమే? 108

చ. అనవుఁడు సీత యాత్మవిభు నారసి వల్లభ! కప్పురంపుబల్
తునియలగుత్తికై వడి గనుంగొన నయ్యెడు మిన్న దేమనన్
విని దనుజేంద్రుడవ్వు పృథివీసుతతో నను దేవి! పుష్పకం
బెనసెను జంద్రలోకమున కెంతయు దగ్గఱఁ జూడుమీతనిన్. 109

మ. లలిఁ బ్రాక్ప్రత్యగవాగుదక్కులను పేర్లన్ దిక్కులం గూర్చుచున్
దశకున్ వెన్నెలజాలుచే ఘనతమోధ్వాంతచ్ఛటల్ వాపుచున్
జెలువై లోకవిలోకబీజమగు ప్రాచీనాద్రిపైఁ దోచు కం
దళమై యొప్పు శశింగసన్ జనము ప్రాణంబుల్ ధరింపుం జుమీ! 110

మ. స్మరవిద్వేషిజటాశికుట్టిమ పరిష్కారప్రదీపప్రభాం
కురమున్ గాఢమహాతమఃపటలికాకుక్షింభరిన్ స్వీకరు
గ్వరముక్తాకృతయోపతోత్సవపు వాగ్గాడ్విట్సుధాపాకమం
దిరపౌరోగవు సత్పలాప్తు నుదయాద్రిం గంటి మేలొందెడున్. . 111

సీ. తోయజముసకిఁ బ్రాణాయామకలనోప
దేశంబొసంగెడు దేశికుండు
నవయౌవనోద్భవోన్మాదలీలాగోష్ఠి
మహిమ కెల్లను బీఠమర్దకుండు
లోకత్రయాంగనాలోకపచనక్రి
యాయుతంబగు మధురాంగ రాజి
యమితశృంగార రథాద్వైతమత సము
ద్ధరణదీక్ష వహించు ధన్యమూర్తి

గీ. మానసాయ కాయుష్టోమ సోమయాజి
శమితకైరవిణీప్రియాజాత జాత
మానసమ్రదతఁ దనరు శుంభద్విలాసి
యగుచు జంద్రుండు విలసిల్లె నభవీధి. 112

వ. అనిన విని లక్ష్మణుండు సకౌతుకంబుగా విలోకించి యిట్లనియె. 113

మ. శ్రవణోత్తంస యవాంకురాశిఁ గరసంజాతంబులం బట్టి నా
కవధూరత్నము లొండొరుల్ నగుచు వేడ్కన్ గొల్లునం బిల్వ ను

ద్దవిడిం జిహ్నమృగంబు గ్రాసమునకై తారాగఁ బోగా శ్లథం
బవు నాయిందుకళాఖ్యకంథ యిక నేమౌనో కదా యక్కటా! 114

మ. చిరరోమంథ చలోష్ఠసంపుట సుఖాసీనంబు లత్యైత్రి ము
ద్ధురకౌతూహల సిద్ధకామినులు చేతుల్ మాటికిం దట్టఁ బెన్
వెఱచేతం బ్రతిమానసవ్యఘటనానిస్సంధిబంధ క్షపా
కర గాత్రం బురుశల్కరీతిఁ జౌరఁ ద్రొక్కంగానిలున్ వాఁడౌగిన్. 115

గీ. మృడుఁడు ప్రతిమాసమును జేపఁబడుచు నుస్న
యీ సుధాకరకళ నొందు నెలమి వర్ణ
నిశ్చయశకలమై ఖరి నిరత మూను
ననిన రాముండు సాదరుం డగుచు మ్రొక్కి. 116

మ. సతతం బీవు సుధాశనాళికి సుధాశ్రాద్ధంబు లోకైకజీ
వితసంశోభిభవత్ప్రభాతతి మహాపీరుచ్ఛటాధాత్రి మ
స్తతటిన్ నిన్ని దకెవ్వఁ డాగరళమం చామ్రింగి తద్వ్యాజని
ర్మితకంఠస్థితకాలపాశుఁ డగుచున్ మృత్యుంజయుం డౌ శశీ! 117

సీ. నిఖిలలోకానీక నేత్రపఙ్క్తికి నెల్ల
మధుపర్కసత్రసామ్యంబు వాల్చి
గంభీరవారాశి ఘనత రాంగమునకు
మేదస్కరస్ఫూర్తి మిగులగాంచి
కామినీకాముక కామితశృంగార
మునకు రసాయనం బనఁ దనర్చి
వివిధసుధాశన నివహంబులకు సుధా
గంజాగృహత్వంబుఁ గడిమిఁ బూని

గీ. హరశిరోభాగరత్నవిఖ్యాతిఁ దనరి
కలశపాథోధిశుక్తి ముక్తాఫలంబు

నైన తారేశు నెంతని యభినుతింతు
మనిన విని భూమిసుత నవ్వి యనియె నిట్లు. 118

చ. సమకులరూపయౌవనల జాల సపత్నుల కెత్తిఁద్రొక్కి దు
ర్దమమదవృత్తి నున్నయది దక్షకుమారిక యోర్తు గానఁ ద
త్కముదహితుండు రోహిణికిఁ గూర్మివిభుండని యెన్నఁగాఁబడెన్
క్షమపయి నన్న, రాఘవుఁడు జానకి కిట్లను నవ్వు దొల్కగన్. 119

గీ. అరయ నాస ప్రవిశంతి యైన తార
లకుఁ బ్రియానుభవంబు తుల్యంబె యైన
విభునితోడ నొకానొక సుభగభావ
గరిమ రోహిణి గననోచెఁ గాకయనుచు. 121

వ. స్పర్శంబు నిరూపించి వెండియు. 121

మ. దళితేందీవర కుట్మలోష్మజచికిత్సాధూతచాకోరని
ర్మల చంద్రాతపపాన జాడ్యములు, చంద్రగ్రావనిష్యందవా
ర్విలసన్నిర్ఝరబింబితంబు, లభిసారీ మూకదూతీవ్రజ
ములు, చంద్రాంశువు లాత్మసౌఖ్యదములై పొల్పొందెడుంజూచితే? 122

గీ. భ్రమరకలకంఠతాళముల్ బరగ గుముద
ముకుళముల నంగహారముల్ మొనయఁజేసి
దృప్తముఖర చకోరికాతృష్ణఁ దీర్చి
శశి తృతీయాక్షియై మించెఁజగతి కతివ 123

చ. ఘననిపుణాభిసారికల కన్నుల కంజనమో! త్రిలోకలో
చననిబిడాంధపట్టములచాలో? యనఁదగు నిర్గ నిండియుం
డిన ధరఁ గాంతిపుంజమును నీటన క్షాళన మొప్పఁజేయుచున్
జనకజ! శర్వరీవిభుఁడు చల్లనిరా జుదయించెఁ దూర్పునన్. 124

గీ. అనుటయు విని యాప్రియవా
దిని నీవాక్యములు సుధకు దీటై మృగలాం
ఛనరుచికన్నను నాకుం
బెనువేడుకఁజేసె నన విభీషణుఁ డనియెన్. 125

మ. శ్రవణాభావ నిరస్తకుండలగణారావంబుగా నమ్మహా
హి వరేణ్యుండు శిరంబు లూవుచు మహీభృన్మూలసంఘర్షణో
ద్భవచూడామణికాంతిపీతబహుల ధ్వాంతచ్ఛటంబైన భో
గివరావాసమునందుఁ దావకమహాకీర్తిన్ వినున్ రాఘవా! 126

వ. అని నవ్వి మఱియు నిట్లనియె. 127

ఉ. పన్నగభర్త భోగినులపాటల నీఘనకీర్తి రెండువే
ల్కన్నులఁగల్గియుండి వినఁగా శ్రవణద్వయఖిన్నుఁడౌచు వే
గన్నులవేల్పు దాను సుఖకారణదృక్శ్రుతిగాకయుండుటన్.
గిన్నరకామినీమణుల గీతములన్ విను దాని నెట్లుగాన్. 128

క. అన రాముఁడు హ్రీస్మితములు
పెనఁగొన వదనాబ్జమున విభీషణుపల్కుల్
నెనరునఁ గైకొని, తాఁగో
కనదారిన్ సీతమోముఁ గని యిట్లనియెన్. 129

మ. దయితాస్యప్రతిమల్లుఁడై తనరఁగాఁ దన్ జేయుచున్నంతలో
రయమొప్పన్ సమజన్మకాలమిళితప్రాంచన్మయూఖావళిం
బయి వర్షింప నవాంబురుణ్మకుళనప్రాప్తాతిదుఃఖస్థితుం
డయి వర్తిల్లెడు బ్రహ్మనేర్పు గనె నవ్యాకోచతన్ మిక్కిలిన్. 130

వ. అని సీత నవలోకించి యిట్లనియె. 131

క. సతి ! తావకవదనతులా
ధృతుఁడగు కమలారి కొదవ దీర్చుటకొఱకా
ప్రతిమానఖండములనన్
వితతరుచిం దసరె గగనవీథిం దారల్. 132

సీ. దేనిగోత్రమునందు దివిజపూజితుఁడైన
భగవంతుఁ డుదయించెఁ బద్మయోని
దేనివికాసంబు దినదినంబును నిరం
తరముదం బిచ్చుఁ బంభరవితతికి
దేనిభక్తిసమగ్రదీప్తి లోకారాధ్యుఁ
డైన భాస్కరుఁ డందుఁ గాన నయ్యె
దేనిబిసావళి పూని యంచల కెల్ల
మృదులాన్నరీతి నామెత లొసంగు

గీ. అట్టికంజ పుంజము తన్మహత్వకలిత
మౌటఁదావక వదన సామ్యము వహించు
ననిన జానకి సస్మితావనతవదన
యగుచు రఘువంశతిలకున కనియె నపుడు 133

గీ. స్వామి ! భగవంతుఁడైనట్టి శంకరుండు
విమలపరిపూర్ణ శశిని దా విడిచి యొంటి
కళను జూడాపతంసంబుగాగ నెట్లు
తాల్చె నన నవ్వి రాముండు తరుణి కనియె. 134

గీ. సకలలోకోపజీవ్యుఁడౌ శశిని బూర్ణ
కళుని రుద్రుండు మౌళి నిక్కముగ నిడిన,
నతఁడు శంకరనిర్మాల్య మయి యపు డుప
భోగమున కర్హుఁడే కాకపోవుఁదరుణి! 135

క. అన నందఱు నొక్కట న
ర్విన రాముఁడు జనకసుతకు వెండియు ననియెన్
వనితా! మాసప్రమితా
బ్జున కేతత్సంపదాప్తి చోద్యమె తలపన్. 136

సీ. లోకత్రయీచారు లోచనోత్పలపాళి
కసము పీయూషధారాగ్రయణము
అధ్వనీనోన్మాది హస్తవాహోచ్ఛ్రల
దాలాతనిబిడ లేఖాంచలంబు
ప్రకటతమఃపుంజ ముకుళితవిష్టపో
ద్ఘాటనపాటవోదగ్రకుంచి
జగము లొక్కట గెల్వఁజాలు వీరుఁలలోన
కమలసాయకు నాద్యగణితరేఖ

గీ. సతత వికసన జాగ్రన్మసారకచభ
రాముఖాంబుజశ్రీ ప్రతిరాజ బీజ
మనుపమానందకల్పద్రుమాంకురంబు
నిందుఖండంబుఁ గనుఁగొంటె యిందువదన! 137

మ. అనినన్ జానకి మోదమంది హృదయేశా! ధాత్రి నెందైనఁ గ
న్గొన సంపూర్ణగుణుల్ ప్రకాశమును గైకొంద్రన్య లేవంవిధం
బునఁ జూపట్టరు శంభుమస్త కనదబ్జుం డిందు కెన్నన్ నిద
ర్శన మన్న న్నగి రాముఁ డోవిదుషి! యో సత్యం బటం చిట్లనున్. 138

శా. సేతూపక్రమ కౌతుకాహృత గిరిక్షేపాతివేగోచ్ఛల
త్ఖ్యాతాశేష పయస్స్ఫుటోదరదరీగాంభీర్య మంభోధి మున్
బ్రీతిన్ గోష్పదరీతిదాటిన ఘనున్ భీతాత్ముఁ జేసె న్మరు
త్ప్రాతి న్నాల్పసమృద్ధికన్న దర మిచ్చున్ దుచ్ఛదౌర్లంఘ్యమే. 139

సీ. ప్రాచీన విశ్వంభరాధరైందవకాంత
దేదీప్యమానపాద్యోదకంబు
నిజవపుర్విన్యాసనిభతార నిర్వ్యూఢ
కలితార్ఘ్యలాజ కాంజలిపుటంబు
నూతనాంకుర శిఖాఘాతవైభావరి
కప్రగాఢ ధ్వాంతకందళంబు
స్వచ్ఛతరాభితఃసాంద్ర తమాంతరా
శ్రపౌఢిమారూఢ లాంఛనంబు

గీ. సకలలోకైకకౌతుకాస్పదము నైన
యీమహాభాగు తేజ ముద్దాముబింబ
నిర్గతంబయి జగమెల్ల నిండి దండి
మెండుకొని యుండు సమదవేదండగమన! 140

గీ. హరినఖాభ పలాశ జాలావతంస
లతిప లతిభీతి సంకుచదంకహరిణ
మౌట విప్పయి యొప్పు నీయబ్జబింబ
మివ్విధంబునఁ జూచెద రెపుడుఁ దరుణి! 141

క. అనిన విభీషణుఁ డిట్లని
యెను హరుఁ డబ్జైక కళ గ్రహించి జటావా
టి నిడినవాఁడగు నచ్చో
టనిశంబుఁ గళంక మయ్యె ననుచున్ నగుచున్. 142

గీ. మఱియు రాముని కనియె నాశరవిభుండు
రోదసీకూప భేక మీరోహిణీప్రి
యుండు స్వల్పప్రకాశుఁ డయ్యును భవద్య
శంబుతోడను బ్రతిగర్జ సలుపు దేవ! 143

గీ. అనిన మహిజాత నవ్వి 'యౌనౌ' నెఱుఁగుదు,
నీమహాత్మ్యయశఃకాంతి నెదిరి యోడి
పాఱి భగవంతుఁ డగు శీతభానుఁ డంత
రమున నిడిగోః కళంకకాళిమ వహించె. 144

క. అన నందఱు నవ్విన నా
జనకక్షితిపాలతనయ సాద్భుతహృదయం
బునఁ గనుంగొని రామునితో
ననియెను మృదువచనరచన యతిశయిలంగన్. 145

సీ. హారఘనసారవిస్పష్టమందరఘూర్ణితసుధాబ్ధి
భంగగర్వప్రభాస్ఫూర్తి యగుచు
బహులపక్షాంతరాత్రిశశ్వద్విదపఃశా
జాలకోద్గారసచ్ఛాత్ర మగుచు
హరశిరఃశశిఖండదర్పకస్వర్గాంగ
కైరవశ్రీప్రియంకరణ మగుచు
శిశిరావహప్రపుష్పితసౌరభూరుహ
వాటికాగర్భపేట మగుచు

గీ. భారతీసారకర్పూరభాగురోజ
మౌక్తికసరైక పాణింధమంబు నగుచుఁ
దనరు సీరఘుసింహుని ధవళయశము
నెవ్వరేనియు వినుతింపరే? ధరిత్రి. 146

వ. అనిన నట్టియెడ భగవంతుండగు వసిష్ఠమునిశ్రేష్ఠుం డనుగ్ర
హించిన గరిష్ఠంబగు మంగళాభిషేక ముహూర్తం బాసన్నం
బయ్యెనను నుడువు వినంబడిన దశరథనందనుండు విని యమం

దానందకందళిత హృదయారవిందుం డయి వీఁడె స్వామి కార్య నిర్వహణ ధూర్వహతాగభీరుండగు మనిసమీరకుమారుండు సాకేతనగరంబున కతివేగంబునం జని మగుడి మనల దీవరించు చున్నవాఁడనిన నాకర్ణించి యకించిదామోదకంచుకితాంతరంగయై సీతాకురంగనయన యంజనానందన వచనానుగుణంబుగా మహనీయ మహిమాసమానంబగు సద్దివ్యవిమానంబుఁగాంచిపుష్పకంబ యించు కవనతంబవగుము మేదినీసన్నిహిత మార్గంబునం జనుదమని యథఃప్రదేశంబు పరికించి రాము నవలోకించి యిట్లనియె. 147

క. స్వామి ! నవాంబుద మేచక
యామహి నలకైటభారి యాతతవక్ష
స్సీమఁ దగుకౌస్తుభము సిత
దామము వలెఁ గాననగుచుఁ దనరునదేమో ! 148

చ. అనినరఘూద్వహుండు దనుజాధిపుతో ననఘాత్మ! తర్కుటం
కన లిఖితార్కమండల నిగాఢతరోత్థకణౌఘభాసియై
తనరెడు విశ్వకర్మ సముదంచితశిల్పనికేతనంబు దా
రిని గననయ్యెఁ గంటె మృగతృష్ణ యనా నదె! నావు దయ్యెడన్. 149

క. వనజాప్త వంశనాథున
కనియె విభీషణుఁడు రోహణాచలరాజం
బనఘాత్మా ! యిది యేత
ద్ఘనమహిమ మగోచరంబు కనుగొన నచటన్. 150

స్రగ్ధర. జేష్ఠామూలీయయాత్రోర్జితజవకరభీశ్రేణికామ్యోల్లసద్బ్రం
హిష్ఠారణ్యాధ్వతం దృగ్విభ దవులఁ గొనున్ విరస్ఫుజ్జాంగలశ్రీ

నిష్ఠంబై గాడ్పు విష్వఙ్నిహితశశికళానిస్నువానేందుకాంత
శ్రేష్ఠంబుల్ నుర్వ్వగట్టున్ సెగనుడికిరవాచ్చిన్నవార్చుద్బుదాప్తిన్. 151

చ. అనుఁడువిమాన మందఱును నయ్యేఁడ డిగ్గిన నన్ని దిక్కులుం
గని మహిజాతకుం దనుజకాంతుఁడు వల్కెను దేవి! సింహళా
ఖ్య నెసఁగు దీవి వారినిధి కల్వ, మణీనగ కేసరచ్ఛటాం
చసరుచిరంబు దీనిఁ గను సమ్మతి నన్న మహీజ యిట్లనున్. 152

క. శరతులిత మగస్త్యమునీ
శ్వరహంసం బిటఁ జరించు సతతం బన, దా
శరథి యనుఁ గుంభభవుఁడి
గ్గిరిమీదనెకా ద్వితీయగేహ మొనర్చెన్. 153

మ. ఘన పాత్రైకనివేశ్యభూరిజలమౌ కంధిం బిచండాంతరం
బున నీషత్పరిపాన మట్లనుచు నీపుణ్యాత్ము వింధ్యాద్రిశృం
గనవోన్మేషవిశోషణాంచదగదంకారున్ సమర్చించి య
య్యినుఁ డాశ్వీనముగాగ నెక్కె చనుఁ గాదే యాకసం బెప్పుడున్. 154

మ. పుడమిన్ నార్థి నితండు గ్రోల నణమోడ్పున్ రెక్కలన్ యత్నమే
ర్పడ నిట్టట్టును మాటికి న్నెగయుచున్ వ్యత్యస్తపాదంబులై
కడుఁ గౌశీరదరీతతుల్ కుధరసంఘంబుల్ వడిన్ దూరి క
న్పడు నొక్కించుకసేపు కాన నతనిన్ వర్ణింపగా శక్యమే? 155

గీ. ఇంతమాత్రంబె యననేల యిన్నగేంద్ర
సీమ శృంగారరససార్వభౌముఁడైన
యంగసంభవు రత్నసింహాసన మగు
సింహలద్వీపమున సంజచివురుసౌరు. 156

ఉ. అని యుదేష్యదైందవకళాంశుకణార్ద్ర విధూపఽస్థలా
నూనపథంబు లంఘ్రులకు నొత్తిన లత్తుకద్రవాలు పూని, యు
డ్డీనచకోరపాళికిఁ గడిందిభయంబిడి మాటిమాటికిం
జానలు గిన్కచే మగుడుజాడలు దెల్పెడు నేడుఁ గంటివే? 157

ఉ. వెఱొకదిక్కుఁజూపి రఘువీరుఁడు వల్కెను మౌక్తికోదకా
ధారము తామ్రపర్ణి తదుదంచితసంతతియైన యుల్లస
ద్వారికణాళి శుక్తిపుటవాసితఁ బూదియగట్టి యంగనా
వారవిభూషణాకృతుల వాటిలుఁ గంఠములందు నెల్లెడన్. 158

గీ. యువతికుచభోగమహిమఁ జెన్నొంది శుక్తి
గర్భభృత్తామ్రపర్ణ్యుదకములు దిరము
లైన కరకలభాతిచే నతిశయిల్లు
చుండుసన సీత పలికె రఘూద్వహునకు. 159

మ. తన భార్యామణులందుఁ బెద్దయనుచున్ దాక్షిణ్యమాత్రంబె యం
బునిధానంబున కల్లగంగపయి, సంపూర్ణానురాగంబునన్
ఘనమై రంజిలు నెప్పుడున్ సహజముక్తాభూషణోద్యత్సమ
స్తనిజాంగోజ్వల తామ్రపర్ణియెడలన్, దర్శింప నట్లోఁగదా. 160

చ. అనవిని నవ్వి రాముఁడు దిగంతర పూరయఁజేయుచుం బ్రియుం
డు నిరపరాధియయ్యును గడున్ మృషలాడు సఖీజనంబుచే
త నలుగుబోంట్లకున్ సుకరతన్ ముదమూన్చు పటీరశైలమొ
య్య నుపనతానిలాప్తి మనకందఱకున్ ఘటియించు హర్షమున్. 161

మ. అనినన్ ముందరఁజూపి లక్ష్మణుఁడనున్ హస్తాంతరాలోలతా
కనదుత్తాన జలంబునందుఁ దనకుం గన్పట్టు క్లిశ్యత్తిమిం

ద్రనికాయంబులమీదికూర్మి మగుడన్ వారాశి వేగ్రాసి యొ
ప్పిన కుంభోద్భవు నాశ్రమాంతరము దీపించుం గనుంగొంటిరే? 162

గీ. మఱియు వార్ధిచతుష్టయీ మహితపాన
చేష్ట దృష్టాతితృష్ణుఁడై చెలఁగు నిమ్మ
నీంద్రు డుదయింప నాడప్పి యెల్లఁ దీర్ప
ననువు పడుఁ దానె యన నచ్ఛమయ్యె జలము. 163

క. అన సుగ్రీవుఁడు నగి యి
ట్లను సప్తాంభోధి మౌని యాపోశనముం
గొనినన్ సప్తభువన మో
దనముగఁదనుఁ జేయునొక్కొః తానని వడఁకెన్. 164

మ. నలుదిక్కుల్ పరికించి సాద్భుతమహానందంబుగా వెండియుం
బలికెన్ నేడిదె యిన్నినాళ్లకును ధర్మస్థాపనాచార్యతా
చలుఁడై రాముఁ డశేషలోకపరిరక్షా దక్షుఁడై యుంటఁజె
న్నలరెం దండకఁ గాననస్థ మునిగార్హస్థ్యైకసంరంభముల్. 165

క. అనుడు సలజ్జాస్మితుఁడై
యనఘుఁడు రాఘవుఁడు పుష్పకాతిత్వరచే
కొని చూచి కనకమృగఖే
లన పదములమీద నిదె మెలంగెద మనినన్. 166

మ. వరమారీచశరీరమే యుపదగాఁ బాటించి దర్శించు నా
శరలోకేశ్వరు దంభమాస్కరిక వేషప్రౌఢినూడంబర
స్థిరమర్మంబు లెఱుంగుపంచవటి గాదే? యీప్రదేశంబటం
చురహింబల్కెను సోపహాసముగ నాసుగ్రీవుఁ డత్యాదృతిన్. 167

మ. రవివంశాగ్రణి రెండు మార్లు ధను గారంభంబు గావించె దా
నవులం దెవ్వనిమీదఁ జిత్రతనుసౌందర్యంబునన్ వల్లభా
స్యవలద్భూమిసుతాక్షులన్ మలపె నేశౌర్యాఢ్యుఁ డాగాధిసం
భవ యాగారికిఁ దాటకేయునకు నేఁబల్మారునున్ మ్రొక్కెదన్. 168

క. నావిని జనకాత్మజ ల
జ్జావనతముఖాబ్జయైన, నతివకు రామ
క్ష్మావిభుఁడును బ్రస్రవణ
గ్రావేంద్రముఁ జూపి సూక్ష్మగతిఁ జెపిదండన్. 169

మ. కలికీ! రాతిరి రత్నదీధితి కనత్కాకోల కోలాహలా
విలసత్కౌశికభుక్త కందరతమో విస్ఫారమౌ నిమ్మహా
చలమం దేఁ దమి నీదుపయ్యెద గ్రహించం బర్ణముల్ కోయునీ
కు లతాచ్ఛాదనమూన్చి రీవెఱుఁగుదే కూర్మిఁ వనీదేవతల్. 170

మ. అనినం జోద్యమునొంది జానకి తగన్ హస్తాబ్జముల్ మోడ్చియో
వనికాదేవతలార మీ కుచిత సేవాతత్పరస్వాంత సీ
త నతుల్ చేసెడు నన్ను నొందుదెస నంతంజూపుచున్ రాముఁ డి
ట్లను గోదావరి ప్రేయసీ! యిదిగో! జోహారూన్పు మీయమ్మకున్. 171

శా. భామా! యీపులినైక కుంజకుటికం బాలాశకోశస్ఫుర
ద్ధామంబుల్ నఖరక్షతానహకుచద్వంద్వాంచితోరస్థలిం
బ్రేమ న్నేనిడి నవ్వి నేరములు గావింపంగ నీమోము దాఁ
గౌమారవ్రతభంగ రోషితమునై కాంచెం గదా నవ్వనన్. 172

గీ. సత్రపాస్మితవదనంబు జనకతనయ
వంచి, గోదావరికి భక్తి వందనం బొ
నర్చిన, రఘూద్వహుండు నంతటను దిరిగి
చూచి ఖిన్నాత్ముఁడై తనసుదతి కనియె. 173

మ. చెలి! యీమాల్యవదద్రినెత్తముపయిం జీమూతసంరంభణం
బులు వర్షింపకయే మదశ్రుజలవిస్ఫూర్తి ప్రదానంబులై
చెలఁగన్ నన్గని నీవువెంచిన తరుశ్రేణుల్ ప్రవాళాప్తి రం
జిలవయ్యేంగద కేకిలోకము విసర్జించెంగదా గానమున్. 174

చ. అనవుడు దైన్యగద్గదగళారవయై మహిజాత పుష్పకం
బునకు విమానరాజ! కృపఁబూనుము నాహృదయం బధైర్యభా
జనమయి ప్రీలెడున్ మిగుల సత్వరవృత్తిని దాటు దండకా
వనము నటన్న రాఘవుఁడు వామవిలోచన తోడ నిట్లనున్. 175

గీ. అదె! పురోభాగమున గాననయ్యెనీల
కచ! మహారాష్ట్రమండలైకప్రమండ
నమగు కుండిననగరంబు నర్మదా త
రంగ నిజహేమకేతు సంరంభమిందు. 176

చ. అనితరదుర్లభస్ఫురణమై మలయాచలసంభవంబునౌ
ననిలము సూనబాణ మక రాత్యసుభూత ఘనశ్రమాంబులన్
దనిసి విదర్భదేశవనితా జనతాంగములం బ్రియోపగూ
హనమున నిమ్మడించు పులకాళి ఘటించు నటంచు వెండియున్. 177

క. బలు దవ్వులనుండియును మి
క్కిలి వాసన గుబియు కైశికీవృత్తిని రం
జిలు నిచటికావ్యరీతిం
బలుమరు గవి మండలం బుపాసన సేయున్. 178

గీ. నావుడు విభీషణుడు దక్షిణంబుసూపి
తెలియ నిట్లను నిదె యాంధ్రదేశలక్ష్మి

పూను గోదావరీహారమునకు నాయ
కంబు భీమేశలింగంబు గానసయ్యె. 179

మ. అలకాలంబునఁ బుట్టి బిట్టడరు నత్యంతార్భటీధాటిభీ
తిలి వామార్థము జార నేఁచరణాప్తిన్ భైరవంబైన మే
నలరన్ శేషకళేబరంబును సమంబౌనట్టుగాఁ గీకసా
హులసొమ్మూని లయాంత యాజ్ఞికతచే నొప్పారుసీతం డిలన్. 180

వ. అనిన విని పరమానందకందళిత హృదయారవిందుడై రఘునం
దనుండు కృతాంజలియై యిట్లనియె. 181

మ. భ్రమదాశానిచయంబుఁ జూచుచు జటాభ్యర్ణాహిరాణ్ముఖ్యులో
క్కఁ మొగిన్ మూర్ఛితవక్త్రులై యులసినం గానీ నిషన్నమ్మరై
రి మదిం దన్నటనస్త్రసద్గిరిసుతా రిక్తార్ధసంపూర్తికై
భ్రమిఁగావించితి వట్టి నీకుఁ ద్రిజగత్పాలా! నతుల్ సేసెదన్. 182

క. గళముఁ బ్రళయాంధతిమిరము
గిళనం బొనరింప వేఱ గిరికొని నృత్యం
బులు సలుపు కబంధశిరం
బులు గనుఁగొని కాళరాత్రి పొందెన్ భీతిన్. 183

గీ. అనుఁడు నందఱు నగ లక్ష్మణాగ్రజన్ము
డవల నొకదిక్కుఁ జూపుచు ద్రవిడమండ
లీ శిరోరత్నగుచ్ఛైకలీల నలరు
కాంచికాపురి మరున కేకాంతగృహము. 184

చ. అని మహిజాత కేకతమ యారఘువీరుఁడవల్కుఁ నిందు నూ
రిన చెమటల్ దొరంగెడు శరీరములం బిగిదప్పు దంపతుల్

మొనసినకౌఁగలింతలను మొత్తముగాఁబులకాంకురాళ్ళు గు
చ్చినగతి నిండి పిక్కటిలఁ జేయునటంచుఁదలంచి వెండియున్. 185

క. ఇం దభిముఖ నిపతచ్ఛ్రమ
బిందుకము విధూతపత్త్రబృందము కాంతా
సుందర కపోలభాగము
నందము పుంభావసూచియై తగు ననినన్. 186

గీ. సూర్యతనయుండు డాపలఁజూచి యిదియె
కనుఁడు శృంగారదేవతా గర్భగృహము
నివ్వటిలుచుండు నుజ్జయినీపురంబు
మహిత మాళవసీమంత మౌక్తికంబు 187

క. ఇం దిందుధవళ రాత్రుల
యందెగిరి చనుక్రియ నున్న యభిసారికయౌ
సుందర గౌరాంగముగల
చందనగంధీ జనాళి చాయ లెసంగున్. 188

మ. ఇటసౌధాధరసీమ నైందవకరాభిష్టాశనప్రోల్లస
త్పటిమన్ వెన్నెల సిద్దెఁట్లు గననౌ భాస్వచ్చకోరాళి వి
స్ఫుట చంచూపుటులందుఁ జూడ్కులిడి పూఁబోణుల్ వినశ్యత్తమః
పటలంబుల్ విశదంబులౌనుదరముల్ భావించి కన్గొంద్రొగిన్. 189

క. ఇంతియ కాదిచటంగల
కాంతల ముఖకాంతిఁదనిసి కడుపునిమిరికొం
చెంతయు శశిరుచిఁ దినితిన
కంతఃపురచర చకోరమట శయనించున్. 190

గీ. అన విభీషణుఁ డనియె ధనాధినాథ
కటకశాఖానగరమనఁ గలుగు నిందుఁ
ద్రిపురహరణప్రతిష్ఠకుఁ దీవియగుచు
నాట్యమాడు మహాకాళనాథుఁ డెపుడు. 191

మ. వరనాట్యభ్రమి వేగవిస్తృతజటావల్లీప్రణాళీపత
త్సురగంగాజలవేణికాపటలికాస్తోకస్ఫురత్పంజరాం
తరసంభ్రామ్యదభంగదోర్నికరపత్రం బీశహంసంబు దు
స్తరలోకవ్యయ నాటికానటము విశ్వత్రాణముం జేయుతన్. 192

మ. అనినన్ రాముఁడు గేలుమోడ్చి యనుఁ గల్పాంతాహుతీభూతవి
శ్వనిటాలేక్షణకీలి తత్ప్రసవమున్ బంధించెనా మీనకే
తుని హోమంబొనరించు యజ్వకు సుధాంధోమౌళిమాణిక్యమం
డనకింజల్కితపాదపద్మునకు వేడ్కన్ నీకు నేమ్రొక్కెదన్. 193

ఉ. ఓహర! నీనిటాలమున నుద్భవమొందిన వీతిహోత్రుడ
మ్మోహనశస్త్రహస్తుఁడయి మూగిన కంతునిఁ జెంతఁజూచి లో
స్వాహాఁదలంచియో మిగుల జాడ్యముచే నొకకొంతసేపు త
ద్దాహ మొనర్పఁడయ్యెఁ బరతంత్రుల వర్తన మిట్టిదే కదా! 194

గీ. అనుఁడు నవనిజవల్కెఁ బూజార్హుఁ డైన
హరుఁడు సర్వజగద్గిలనాప్తివలనఁ
దనదు పేరాకటిని బాపుకొనియుఁ గంతు
నకట మ్రింగెనె? యన నవ్వి రందఱపుడు. 195

మ. సవిమర్శంబుగ రాముఁడిట్లనియె నీచాయన్ శరీభూతమా
ధవధృత్యాశను బర్వు వెట్టు విహగాధ్యక్షుండు తద్వహ్ని రా

యవడిన్ ద్రుక్కుచుఁబో నతోన్నతఫణిజ్యాకృష్టకోదండదం
దవిముక్తాశుగుఁ డాపురారి పటుసంధానక్రమం బొప్పెడున్. 196

గీ. అనుచు వేఱొక దెసఁ జూపి యదిగొ! ఖలచు
కీరసాఖండలైకసాధారణాగ్ర
మహిషి మాహిష్మతీపురి మహితచేది
మండలాఖండమండన మాల్యమిందు. 197

మ. తరుణశ్రేణికిఁగెల్పునోటములఁ గందర్పుండు గాఢోల్లస
త్పరిరంభాధరచుంబనైకసురతోత్సాహాదికేళీ దురో
దరవిద్యాపణలగ్నకుండునయి యుద్యద్భోగముందానయై
మఱియున్ నిచ్చలు తన్మనంబులు జయింపంగోరెడిన్ మిక్కిలిన్. 198

వ. అనిపలుకునవసరంబున దివిజసమాజకృతవివిధపూజంబగు వి
మానరాజంబు వేగోత్తేజంబుగాఁ జన నవక్ర విక్రమాభి
రాముండగు రాముండు చండతరదుష్కృత దమనుఁడగు యము
నం జూచి నిట్లనియె. 199

సీ. సర్వసర్వంసహాజలజాతనేత్రకు
మహితకస్తూరికామండనంబు
దివ్యకల్లోలినీ దేవతామణితోడు
నీడయౌ సహచారిణీలలామ
భువనసరోవరంబునఁ బాఱుదేర ద
ట్టంబుగానిగుడు కాదంబపంక్తి
సత్కవిసమితికి సారస్వతటాక
కమనీయసాంద్ర శృంగారకుల్య

గీ. యైనయీనది తనతటి నధివసించు
జనులఁగూరిమిచేఁబోలెఁ దనకునన్న
యైన జముచేతివారల నస్త్రబాధ
ముగ గురుండగుభాను సమ్ముఖముఁజేర్చు. 200

చ. అనిన సుమిత్రపట్టి దనయంగుళిఁ జూపుచుఁబల్కెఁ మారభి
ద్ఘనమకుటైకఖేలల జగంబులుదన్పి సుధాంశు బాలమి
త్రనవపయశ్ఛటాప్తి సగరప్రజ వేఁబరిపూతఁజేసినీ
రనిధికిఁ బత్నియై యిడిగో రంజిలుగంగ యఘాపహస్థితిన్. 201

గీ. అనినరాముఁడు ప్రీతుఁడై యనియె శైల
జా విభజ్యమానార్ధమై సంకుచితము
నైన హరుమూర్ధమున రెట్టియగు గభీర
తగల భాగీరథీ! నీకు దండమమ్మ! 202

సీ. అంభోజసంభవు నాలయం బెడఁబాసి
కడిమిమై నాకలోకంబుఁజేరి
యంతఁబ్రాలేయాచలాధిత్యక వసించి
యెనుకభూమండలంబునకుడిగ్గి
జహ్నుతపోధనాశ్రమమున వెసఁబాఱి
పిదప సముద్రునిఁ బ్రేమఁజెంది
యహిలోకవాసుల యఘమెల్లఁదొలఁగించి
త్రిపథగా సంజ్ఞచేఁ దేజరిల్లి

గీ. కడుఁ బ్రవాహప్రతీపముల్ గాగ నిచట
కాయములు వై చిలేచిన ఘనుల బ్రహ్మ
పదముసేర్చు ప్రవాహజవంబు మిగిలి
యెసఁగు భాగీరథికి మ్రొక్కు మిందువదన! 203

క. అన సీత కృతాంజలియై
యనియెను నైజప్రవాహ మనియెడు నిగళం
బున ముజ్జగములు సంధిం
చిన మందాకిని! జోహారు చేసెద నీకున్. 204

ఉ. అంతట నందఱున్ వినతులైన, సుమిత్రతనూజుఁడిట్లనుం
బ్రాంతమునందుఁజూపి, యిదె రాజవరప్రణయానురోధ సి
ద్ధాంతిత రాజతక్షితిధరాధిప మందిరుఁ డప్పురారి క
ల్పాంత కపాలపాణి యనయంబు వసించు పురంబు కాశినాన్. 205

గీ. రాఘవుండిట్టులను సహర్షముగఁ జూచి
చాలఁ దరిఁగనరాని సంసారజలధిఁ
గడకు నీదెడు జనత యీ కాశికాంత
రీపమున విశ్రమించి తరించు మఱియు. 206

సీ. గళకాంతిపీతాహిగణఫణామాణిక్య
వారమాత్రంబైన హారమరసి
భయమేది శైలజాబాహులతాద్వయి
గాటంబుగా మెడఁ గౌగిలింప
సర్వగాత్రవిరామ ఖర్వేతరైక స్వ
రమున సామంబు గానములొనర్చ
పంకేజసూతి కపాలంపు హరివాణ
మొక్క కేల్దామరనొప్పుచూప

గీ. నిందు భగవంతుండైన యయ్యిందుమౌళి
నెమ్మి నిత్యనివాసియై నిఖిలభువన
హర్షదాయకుఁడగుగాక యనుచు నొండు
దెస విలోకింపుమని తన దేవికనియె. 207

చ. ఘననవశింజినీకిణితకార్ముకిఁ జూచి దయాప్రవృత్తిమైఁ
దనరెడునీదుపాణి బలితంబగు పీడన మూన్పనాకరం
బనిశకృతార్థమయ్యె నెట, నట్టి భవత్కులవృద్ధు లేలుచు
న్న, నగర మస్మదీయనయనంబుల నాకగొనెం గృశోదరీ! 208

వ. అనిన విని జనక రాజతనయ సవిస్మయానురాగంబుగా సాచీకృ
త తారకయై రఘు కులోత్తారకు వారక వీక్షించి యకించి దా
నందంబూని దానింగుఱించి యోయమ్మ! విరించి కృతనిర్మాణ
నై పుణీధురీణ శిథిల! మిథిల! నీకిదె వందనంబు సలిపెద నస్మ
ద్విషయైకవత్సలతాధనమ్ములగు గురుజనమ్ములకు నాయభివాదన
మ్ములు విన్నవింపుమనునెడ నిర్హేతుక కృపాభిరాముండగు రా
ముండు విభీషణ సుగ్రీవులంజూచి యిట్లనియె. 209

క. అనుగుఁజెలులార! యీసీ
తను గడుపారంగఁ గన్నతల్లికి ధరకి
జ్జనకపుర మరిష్టగృహం
బన, వారలు గౌతుకాప్తి ననిరి కడంకన్. 210

చ. నిజముగ నిం దుమారమణ నిష్ఠురకార్ముక శిష్యులైనయా
యజగవ భార్గవుల్ మదమ*డంగిరి నీదుకతానఁ గాన న
క్కజముగ నాటి కేళి సహకారిణియై తగు వీరలక్ష్మియే
రజనిచరాన్వయాధిప తిరస్కృతిఁ బ్రౌఢిమ గాంచెగా యనన్. 211

మ. విని కాకుత్స్థుడు నాన నవ్వెనయఁగా వేఁతౌక్కెడంజూపి యి
ట్లను కంటే యదె చంపనాఁ దనరు నల్లాచాయ గౌడాంగనా

*యతిభంగము ప్రామాదికము.

జన శృంగార వినీతివిభ్రమ విలాసశ్రీల సన్మత్స్యలాం
ఛన కౌమార ఘనవ్రతోద్భట తపస్యావాటి యా పీఁడిలన్. 212

మ. అని యేకాంతముగాగ సీత కను. నిందన్నుల్ గగుర్పొంది పొం
గిన గాత్రంబులఁ బిక్కటిల్లు బిగికౌగిళ్ళం దమింబుచ్చి మం
తనపున్నేర్పులు దెల్పి సప్తు దివియల్ నశ్యద్దశంబుల్ వెలుం
గనిచో బొక్కటిబంటి చీకటు లొగిం గప్పన్ నివాసంబులన్. 213

మ. అన నాముందటఁ జూపి లక్ష్మణుఁడు ధన్యంబౌ ప్రయాగంబు తూ
ర్పునఁ గృష్ణాగురుచందనద్రవము లింపుల్ మీఱఁగా నొండొరుల్
దనుభాగంబులయం దలందెదరు నాఁ దార్కొన్న యీభానుమ
త్తనుజన్ జాహ్నవిఁ గంటిరే యనుచు నుద్యత్ప్రీతిమై వెండియున్. 214

గీ. హిమవదద్రివరోత్సంగ మెపుడు వాయ
కునికి జడయయి యొందె పాండిమను గంగ;
దంద్రియగు చండకరు సంకతలమునందు
నుండి నిండారుకాళిమ నొందె యమున. 215

సీ. సౌరహీరకిరీటశాఖకోత్తేజిత
బలిభిత్పదనఖాంశు పటలిచేత
నహిరాట్ప్రభామేడితాభవ చూడాబ్జ
విమతమరీచికా వితతిచేత
చంద్రకాంతోపలస్థలనిస్సరత్తుషా
రక్షమాధర నిర్ఝరములచేత
మార్గశారదరజోమహితభగీరథ
రమణీయ కీర్తిపూరంబుచేత

గీ. సత్వసంపదఁ జెన్నొందు జహ్ను మౌని
సరస కరుణాకటాక్ష వీక్షణముచేత

నీ సురాపగ ప్రతిపదం బెక్కుడైన
కాంతిచే వృద్ధిఁబొందుచుఁ గాననయ్యె! 216

క. ఇంతయె కాదటఁ బెద్ద ల
నంతం గల తీర్థములఁ బ్రయాగము ఘనమం
చెంతు రిట నున్నవారు ని
తాంతము సంసార వనధి దరిఁ గాంతురొగిన్. 217

గీ. అనిన రాముఁడు సాదరుం డగుచుఁ బలికె
గంగ యమునయుఁ బార్శ్వభాగముల నెసఁగు
దగు ప్రయాగంబు ముక్తికి ద్వారమగును
నిక్కమిది దీనిమహిమ వర్ణింపఁ దరమె? 218

గీ. అని మహీసుతఁ గూర్చి యో యంబుజాక్షి!
సాద్భుతచరిత్ర మిదియె చూ శ్యామవటము;
దీనినీడ వసించిన ధీరవర్యు
లాపరంజ్యోతిఁ గని భక్తి నాశ్రయింత్రు. 219

క. అన నందఱు మ్రొక్కిన న
య్యినకులుఁడు విమానవేగ మెసఁగం జనుచున్
గనుఁగొని ముదమున వారికిఁ
బ్రణుతసుధామధురవచన ఫణితిం బలికెన్. 220

మ. ఘన యూపాంకురదంతురాత్మతటరేఖారూపసంఖ్యాతత
న్మనుసంతానకసప్త తంతు సరయుం దర్శింపుఁడత్యాదరం
బున నీసింధుమతల్లి మేదినికిఁ గూర్పున్ భానుమద్వంశరా
డ్జన దేవీపదపట్టబంధ సుషమాసౌభాగ్య భాగ్యోన్నతిన్. 221

వ. అనిపలికి యిదె పురోభాగంబున విరోధిమహీధ్రవాసాధ్య యగు మన యయోధ్య గగనపద్యాగతాస్మదవలోక కౌతుకోత్తాన పృథుల నిష్పంద పత్త్రంబులగు జన నేత్త్రంబులకు న్నాళశస్థల కువలయవనంబుడంబునఁ గనంబడియెడు ననునెడ నందఱు నానం దితహృదయారవిందులై వందనంబాచరించి రందు సుగ్రీవ దశ గ్రీవానుజు లుదగ్రకుతూహలంబునం బ్రశంసించి యిట్లనిరి. 222

చ. సవనసహస్రసంభవ విశాల ఫలోత్కర వృంతముల్ బలెం
దవిలిన యూపజాలములఁ దద్దయునొప్పు నయోధ్యఁగాంచి యిం
దవితథశక్తిఁ బుట్టిన నృపావలి సిద్ధివిశేష మెంచినన్
దివిని శచీసహాయుఁ డగు దేవుఁడు మాకు రుచింపఁడెంతయున్. 223

వ. అనిన వారలఁ గుఱించి రఘువరుండిట్లనియె. 224

క. ఓబంధులార ! యిట్టి మ
హాబలులగు రాజు లేతదన్వయ భవులై
ప్రాఁబడు టస్మద్గురు నైం
ద్రాబార్హస్పత్య చరువర ప్రతిభఁ గదా. 225

గీ. అని పురోభాగ మీక్షించి యతఁడె మద్గు
రుఁడు వసిష్ఠుండు సంభృతారూఢ మదభి
షేకసంభారుఁడై ప్రతీక్షించు వాఁడు
భరతశత్రుఘ్నులను గూడి పరమకృపను. 226

క. అని పుష్పకంబుఁ గని యి
ట్లనియె విమానావతంసమా! యీకాకు

త్థసనృపోపకార్య కడ డిగు
మనవుడు నటుసేయ డిగ్గిరందఱు దానిన్. 227

గీ. అంత భరతుండు శత్రుఘ్నుఁడఱుత రా వ
సిష్ఠ ముష్టింపచాన్వయ శ్రేష్ఠుఁడంతి
కమున కేతెంచి రఘుకులోత్తమునిఁ జూపి
వారి కిట్లని పలికె గంభీర ఫణితి. 228

మ. ఘనలంకాధిప దోర్వనీ మథన జాగ్రద్బాహు దండంబుచే
వినుఁ డీపాపడు ముజ్జగంబులకు నుద్వేలప్రమోదంబుఁ గూ
ర్చిన దాశ్చర్యము గాదు; పిన్నపుడె చేసెన్ బిప్పిగా జామద
గ్న్యుని విస్రస్త మహాతపఃప్రబల తేజోవీర్య నిర్యాసమున్. 229

వ. అనివెండియు సహర్షంబుగా నిట్లనియె. 230

మ. శరవిచ్ఛిన్న దశాస్యకంఠపదవీ సంక్షిప్త దోర్విక్రమో
ద్ధుర భూయస్తమ కర్మకాండుఁడయి, పాథోనాథదర్పైక సం
హరణుండీ రఘుసత్తముండు త్రిజగన్మాంగల్యకృత్కీర్తిఁ గ్ర
మ్మఱ రా నాకును జూడఁ గల్గెఁ బరికింపన్ భాగ్యమేమంచనన్. 231

సీ. అప్పు డైక్ష్వాకుండు హర్షంబుతో వసి
ష్ఠుని పాదములు మౌళిసోక నెఱఁగి
యారఘుబ్రహ్మక్రియాచార్యునకుఁ బురా
ణబ్రహ్మవాదికి నవ్యమతికి
బ్రహ్మర్షివరునకు రాఘవుఁడిదె నీకు
వందనంబులు సల్పు వాఁడటంచు
మ్రొక్కఁ గ్రక్కుననెత్తి యక్కునఁ గీలించి
శిరము మూర్కొని మునిశ్రేష్ఠుఁ డతని

దివిజపోషక! యాశీర్వదింతు నిన్ను
నేనటంచు సుధా మాధురీ నితాంత
కాంత వాచా చమత్కార గౌరవంబు
పరిఢవిల్లంగ నిట్లని పలికె నపుడు. 232

అరుల యశః పరంపర లజాండపు మూషిక సంఘటించి సు
స్థిర నిజదోఃప్రతాపశిఖిచే నెడఁద్రెవ్వక యూదియూది ని
ష్ఠుర పుటపాకశోధితము చొప్పున దేర్చి గుణోత్కరంబునై
తరలని గట్టిగట్టి రజతం బగు కీర్తి వహించి తీవిలన్. 233

సకల భువనైకలంఘన జాంఘికంబు
లైన భవదీయ కీర్తుల నాదిధరణి
కాంత యశములు గంగోదకములచేత
నితర నదులట్లు కడుఁ బవిత్రితము లయ్యె. 234

ఇన రవీందుల గతి భువ
నానీకాలోక ధుర్యులగు గోత్రత్రా
ణానూనుల నిర్వురఁ గను
సూనుల నిజభుజము లటుల శోభిలువారిన్. 235

అనిన జానకి మ్రొక్కిన నతఁడు పలికె
జనక వంశసువాసిని! సాధ్వి! నీదు
ధవున కిప్పుడె యుభయసాధారణముగ
దీవన లొసంగితి మటన్న దేవి మదిని. 236

చెలఁగి కులగురుఁడైన వసిష్ఠమౌని
యసదృశాశీర్వచస్ఫూర్తి యరయ రామ

భర్త్రుదు గృహిణీపదం బసపత్నముగ (దె
లిపెడు నాకన సౌమిత్రి యపుడు గదిసి. 237

గీ. సగరగోత్రైకదేశిక నిగమమర్మ
శౌండ ! మైత్రావరుణి! లక్ష్మణుండ నేను
మ్రొక్కెద నటంచు నతిసల్ప, ముని వరేణ్యు(
డిట్టులనిపల్కె వాత్సల్య మెసక మెస(గ. 238

ఉ. బాలక ! యెల్లదీవనలపై కడ వర్తిలె దెట్లటన్న నీ
వాలమునందు నింద్రజిదహంకృతి మాయ(గ(జేసి, దేవతా
పాలక పాలనప్రతిభ( బాటిలినాడవు గాన నైన ను
ద్వేల మహావిభూతి జగతీతల మేలుచు మీర లందఱున్. 239

క. ఒక రొక రిద్దర నిద్దర
సుకుమారుల( గను(డు దాన శోభిలు మీయా
ద్య కువలయాధిప వంశం
బకుటిల రూఢాష్టశాఖమై యివ్వసుధన్. 240

మ. అనునంతన్ రఘుభర్త హర్షమున హస్తాంభోజముల్ మోడ్చి యి
ట్లను నోదేశికసార్వభౌమ! యిపు డీయిక్ష్వాకువంశంబు భా
జన మయ్యెం గద మీయనుగ్రహవిశేషశ్రీకి నిక్కం బటం
చన(గా నాభరతుండు రామునకు నెయ్యంబొప్ప( దానిట్లనున్. 241

గీ. ఆర్య! రాఘవ! శూన్యగృహ ప్రకోష్ఠ
రక్షణైక పదాతి భరతు(డు మీకు
వినతి యొనరించుచున్నవా డనుచు మ్రొక్క(,
గడు ముదంబంది రాముండు గౌ(గిలించి. 242

ఉ. అంబుజ శాత్రవాంశు కలనానిళమేదుర చంద్రకాంతవుం
గంబము వోలె ఖాసిలెడు కాయము నాయెదc జేర్చుదాన సౌ
ఖ్యంబువహించు నట్లవు నిజానుజసంగ సుఖాసికాప్తి ని
త్యం బెడcబాయునే చపలయై రమ శౌరి సకౌస్తుభోరమున్. 243

క. అన నట్లచేసి యంతట
జనకజ కభివాదనంబు సలిపిన నయ్యం
గన యన్న! భరత! రవికర
ఘనచుంబిత కంజపుంజగతి వికసిలుమా. 244

చ. అనునెడ లక్ష్మణుండు భరతాంఘ్రులకున్ నతిసల్ప నాతcడి
ట్లనియెను వత్స! నన్నుc దడవారcగc గౌcగిటc జేర్పు; భక్తిచేc
దనరెడి భ్రాతయంగములు దద్దయు నూతనగంధసారమం
దును ఘనసారమం దరుచినూల్కొనc జేయునటంచు, దమ్మునిన్. 245

మ. అతిగాఢంబుగc గౌగిcలించి యవురా! యైక్ష్వాకవ స్వచ్ఛకీ
ర్తితటాకాంచిత యూపదండముక్రియం దీపించు సౌమిత్రియా
యతబాహాద్వయిచే నిగూహనము నాకబ్బెన్ గదా నేటి కీ
గతి నెన్నాళ్లకొ నేను శీతలతరాంగశ్రీ విరాజల్లితిన్. 246

క. ఇంతియకా దైందవకర
సంతతి సాంద్రముగc జేర్చి సమకూర్చిన య
త్యెంతయుcదగు తమ్మునిభుజ
మంతస్సంతాపభరము నటc దలcగించున్. 247

చ. అన శత్రుఘ్నుcడు రాఘవుంగుఱిచి యార్యా! పాదుకాభృత్యభృ
త్య నమస్కార మనుగ్రహింపుc డని జోహారూన్స నారాముడా

యన నిండారఁగ గౌఁగలించి యవురా! యాకార సంపత్తిఁ జూ
చిన సౌమిత్రియ పో యితండనుచుఁదో చెన్మాకు నిక్కంబుగన్ 248

మ. అని ధాత్రీజకుఁ జూపి పల్కి నతఁడేకాంతంబుగా జూచితే
వనితా! యీముఖ మక్షతాబ్జరిపుసంవాదంబు సౌమిత్రి యా
ననమేపో! యివి పూర్వ దిక్కరటి శుండాదండ పాండిత్యమం
డనముల్ లక్ష్మణబాహుదండములపో! నన్ గౌగిలించెం దగన్. 249

వ. అను నవసరంబున శత్రుఘ్నుండు మ్రొక్కిన నన్నా! వినయైక సంపన్నా! సకలలోక శంకూద్ధరణ ధౌరంధరీ పాత్రంబులగు చరిత్రంబుల లక్ష్మణ తుల్యుండవు గమ్మని సుధారసంబు గ్రమ్మ నెమ్మిం దీవించి, గురుజనం బెచ్చట నున్నయది నావుడు నతం డిదె కృతమంగళాచారయై నిరంతర కరుణావలంబ యగు నంబ నిన్నెదురు చూచుచున్నయది యని యెఱింగించి నిజాగ్రజు డాయంబోయి నమస్కరించిన నతండు సహర్షంబుగా నాలింగనంబు సేసి దీర్ఘాయుష్మంతుండవు గమ్మని నీవు దీప్యమానుండవై యుండనుండ నన్నన్ భరతుని నొంటిగా విడిచి పోయిన వారముగదా! యనునంత రాఘవుఁడతినిష్ఠాగరిష్ఠుండగు వసిష్ఠ నరయించి యిట్లనియె. 250

గీ. ఏఁపుమైలంకఁ గిష్కింధ నేలునాథు
లిదె విభీషణ సుగ్రీవు లిపుడు మీకు
మ్రొక్కెద రటన్న నమ్మునిముఖ్యుఁ డపుడు
మధురసోదార మధురస మధుర ఫణితి. 251

క. లలిత పులస్త్య వికర్తన
కుల కీర్తిప్రసవమాల్య గుంభ స్తంభం

బులరై తడవు సుఖించుచు
నలరెద రన రాఘవుండు హర్ష మెలర్పన్. 252

గీ. భరత శత్రుఘ్నులనుఁజూచి పలికెనపుడు
వీరె సుమ్ము పౌలస్త్య సావిత్రులు నతి
సలుపుఁ దనవుఁడు వారు వారల యథోచి
తముగ సౌహార్దము లొనర్చి రమల మతిని. 253

చ. పలికె వసిష్ఠుఁ డత్తఱినిఁ బ్రాక్తన భాగ్యవశంబునం జనం
బలరెడు నట్లుగా దశరథావనిపాల కుటుంబ మద్భుతా
కలనఁ జతుర్దశాబ్దములఁ గ్రమ్మఱఁ బుట్టిన యట్లు తోచె నం
చలఘుమతిం గణించి దరహాస వికాస ముఖారవిందుఁడై 254

సీ. తారభూధర సముద్ధరణప్రచండిమో
ద్దండపాండితి మించె దశముఖుండు
వానిజయించె రేవాబంధ బంధుర
బాహుసహస్రుండు హైహయుండు
వానిఁగీటడఁచె సర్వంసహాఖర్వోగ్ర
పార్థివ మథనుండు భార్గవుండు
వానిసారమునొంచె వడిఁ గాకపక్షాభి
రాముడై మున్నె యీరాఘవుండు

గీ తత్ప్రపూరిత మేతత్కథ యిది బాల
చరితమున కూర్ధ్వమగుదాని సంఘటించు
నిక్కవిత తత్క్రియాగౌరవేతర మగు
నైన భువన శివంకరంబై చెలంగు. 255

మ. అని కాకుత్స్థుఁగుఱించి మౌనియను నన్నా ! రామ ! యేతెంచె గ్ర
క్కన నిర్దోషశుభాంశ మాంగళిక లగ్నం బీవు సీతాన్వితిన్
మనుసింహోన్నత సింహపీఠిక రహింపం జేయు దానన్ జగ
జ్జనగీతోత్తరకోసలంబులిక రాజన్వత్త చే నొప్పుతన్. 256

మ. అనినన్ రాఘవుఁడట్లుచేయ మహనీయైంద్రాభిషేకంబు దా
మనుపూర్వంబుగఁజేసె దేశికుఁడు సంభావించుచున్ దక్కవా
రును నానాగతులం దదుత్సవము కూర్మిల్ మీఱఁ గావించి తో
డన పంచాంగి ధరిత్రి మోయఁగడువేడ్కన్ మ్రొక్కిరొక్కుమ్మడిన్

గీ. నవ్యమంగళగీతికానాందికాద్య
హృద్యవాద్యంబు లప్పు డెంతేని మొరయ
రఘుకులాచార్యుఁ డగు మునిప్రవరుఁ డనియె
గాంగలహరీఘుమంఘుమాభంగఫణితి. 258

మ. అకలుండౌ పరమాత్మువల్ల నలజీవాత్మల్ బలెన్నీ విభీ
షిక లాశాపతులై దిశాష్టకమునం జెల్వొంది రాచంద్రతా
రక మట్లొప నవోద్య దుద్వ్యదురు ధర్మస్కంధ భారంబు మి
న్నక నీపూనఁ గ నిందు నందును బ్రజల్ న్యక్కారముల్ గాంతురే 259

వ. అనిన సద్గుణ సముద్రుండగు రామభద్రుండు వ్రీడావనతవదనుండై యూఱకుండునెడ విభీషణుండు కృతాంజలియై యతని కిట్లనియె. 260

చ. అరిధర లంక పుష్పకము నగ్రజుఁడౌ నిధిభర్త వైన నా
శరపతి బల్మిఁ గైకొనియె సత్కృప నిచ్చితి రందు నాకు ని
త్తఱి నొకదాని; రెండవది తావక శాసనమైన నమ్మహే
శ్వరసఖుఁ జేరునన్న విని సంయమినాథుఁడు సమ్మతింపఁగన్. 261

వ అప్పు డసమానంబగు విమానంబు గుఱించి రాఘవుం డోపుష్పకంబః నీ ప్రథమస్వామియగు పౌలస్త్యాగ్రజుంజేరు మనిన నదియట్లు చేసె

ననంతరంబున నఖిల మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుండు భరతజ్యేష్ఠున
కిట్లనియె. 262

క. వినుమన్న రామ ! నేనీ
కొనరించు ప్రియంబు లేమి యున్నవి ? నీవ
త్యనుపమిత ధర్మచరితుఁడ
వనినం గాకుత్థ్సతిలకుఁ డసదృశ ఫణితిన్. 263

సీ. త్రిదివేంద్రరణ జయప్రదుఁడైన తండ్రి యా
జ్ఞామౌక్తికంబు మస్తమునఁదాల్చి
యాదివరాహ దంష్ట్రాంకురద్వ్యంధ్య భూ
ధరపత్రశబరి నిద్ధరణిఁగాంచి
దక్షిణ పశ్చి మోదధులకు మేర యే
ర్పడునట్లు సేతు నిబంధ మూన్చి
కల్పాంత సమవధికంబుగా భువనమం
డల మరావణమయి యలరఁజేసి

గీ. రహివహించుట మీయనుగ్రహమ కాదె ?
యింతకన్నను మాకు మీ రెట్టిహితము
సేయవలయు నటంచు వసిష్ఠమునికి
వందన మొనర్చి పలికె వానందగరిమ. 264

సీ. కవులు వచోగుచ్ఛక మరందధారల
శ్రుతుల మజ్జన మొనర్చుదురు గాత
జనులు వాగ్బ్రహ్మవాసన లానకయ కవి
సూక్తిదోషము లెంచకుంద్రుఁ గాత
త్రిపథగ యగుచు ధాతృకమండలుజలంబు
పూతత్రిలోకయై పొలుచుఁగాత
వీరయశస్సుధాసార నిష్యందముల్
శ్రవణాగ్రగుణములై ప్రబలుగాత.

గీ. ధర్మదేవత నాల్గుపాదముల నిలువ
బహుల సస్య సమృద్ధిచేఁ బ్రజ యెసంగ
వితత రాజన్వతీసంజ్ఞ వెలసి ధరణి
తనరుఁగావుత మాచంద్రతారకముగ. 265

శా. తూణీభూతసముద్ర! ముద్రభససంస్తుత్యుల్లసద్భక్త గీ
ర్వాణౌఘార్చితభద్ర! భద్రవిలసద్వ్యాహార్భటీధాటికా
రీణాహిప్రభునిద్ర! నిద్రవిణపప్రేయః పదప్రస్ఫుర
ద్వాణీకౌశలముద్ర! ముద్రదగజాపక్షోజకస్తూరికా! 266

క. సారంగధర! ధరాధ్యక్షు
మూరీపర! వరయతీంద్ర మానసపథసం
చారా! చరణానతసుర
వారా! వారాన్నిధానపరతూణీరా! 267



పంచచామరము. ధరాధరాధిరాట్సుతానితాంతకాంత హృత్సరో
పరాంతరాళ రాజహంస! వాజిరాజదుష్టపా
నరాసు రామ రార్చనీయ నవ్యభవ్యవాక్పరం
పరాభిరాధనానిశాప్త భావనీయ యక్షపా! 269

గద్య. ఇది శ్రీమద్రామేశ్వర శాశ్వతకృపాకటాక్ష వీక్షణాసాదిత సకల
సామ్రాజ్యధౌరేయ అశ్రాంతవిశ్రాణనావధీరితరాధేయ బిజ్జలకుల
కలశనిధాన కార్తికీనిశాకళత్ర వెన్నూళగోత్రపవిత్ర
కృష్ణరాయ మహీధవ కుమార సంగరాంగణకుమార
దయాగుణగోపాల తిమ్మభూపాల
ప్రణీతంబైన యనర్ఘ రాఘవంబను
మహాకావ్యంబునందు
పంచమాశ్వాసము
సర్వము సంపూర్ణము.
రామేశ్వరార్పణమస్తు.

—o—